# అమృత వాహిని

## మహాపురుషుల సుభాషితాలు





mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట, రాజమహేంద్రవరం - 533101.

mohanpublications.com
granthanidhi.blogspot.in

# అమృతవాహిని

(౫౦౦ మహాపురుషుల సుభాషితములు)



ప్రకాశకులు

సర్వోదయాశ్రమం

సర్వేలు

1959

# విజ్ఞప్తి

పూర్వమునుండి నేటివరకు గల ఋషులు, రాజులు, యోగులు, మహాత్ములు, సాధువులు, సంతులు మున్నగు మహనీయులు వారి వారి అనుభవములను తరుచుగా తమ శిష్యులకు సందర్భవశముగా బోధించిన దివ్యసూక్తులను ఈ యాశ్రమ సభ్యులలో నొకరు సేకరించిరి.

అట్టి సూక్తులు ఇంతవరకు నొక గ్రంథరూపమున నొకచోట తెలుగులో ప్రచురింపబడలేదు. ఆ దివ్యసూక్తులు జిజ్ఞాసువులకు మార్గదర్శకములగునని విశ్వసించి, సంగ్రహించి ప్రత్యేక శ్రద్ధతో వానికి గ్రంథరూపము నొసగు చున్నాము.

ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ, తెలుగు మున్నగు భాషలలో వేర్వేరు గ్రంథములలో నచ్చటచ్చట సందర్భానుసారముగా లభించిన భక్తి, నీతి, జ్ఞాన, వైరాగ్య, ధర్మబోధకములును, అమూల్యములునైన సుభాషిత ములు చేర్చబడుటచే గ్రంథముయొక్క ఉపయోగము ద్విగుణీకృతమగు ననుట నిస్సంశయము.

ఈ సూక్తులను కూర్చుటలో దేశ కాల వ్యక్తి మతభేదములను పాటించలేదు. ఏ కాలమువారైనను, యే దేశమువారైనను, యే భాషా పరులైనను, గ్రహించదగిన సత్యవిషయ మొకటియే, బోధించిన బోధ యొకటే యనియు భావించి యిట్లు చేసితిమి.

ఇందలి భాష క్లిష్టత లేకుండ, సామాన్యముగను, సరళముగను నుండు నట్లు ప్రయత్నముచేయబడినది. అయినను పొరబాట్లుండుట సహజముగాన, సహృదయులగు పాఠకులు ఇందలి మంచిని గ్రహించి దోసగులను మన్నించ

గలరని ప్రార్థన. లోపము లేమైనను సూచించుచో ముందు కూర్పులో సవరించుకొన సంసిద్ధులము.

ఈ పుస్తక ముద్రణమునందు శ్రద్ధతో పరిశీలించి, సవరణలు సూచించి తోడ్పడిన శ్రీయుతులు కవిశేఖర "దాశరథి", పులిజాల హనుమంతరావు, పైడిమర్రి వెంకటసుబ్బారావు, అనంతశాస్త్రి గార్లకును, "యువ" ముద్రణాధికార్లకును కృతజ్ఞులము.

ఆంధ్రకుటీర్
హనుమాన్ టేక్రి
హైదరాబాదు
4—4—1959

ఇట్లు, విధేయుడు
హనుమంతరావు
(మాడపాటి హనుమంతరావు)
సర్వోదయాశ్రమము (సర్వేలు) ట్రస్టుబోర్డు తరపున

~~~
~~~

# తొలి పలుకు

ఈ గ్రంథము రత్నపేటిక కూర్పరి ఒక వజ్రాలవర్తకుడు. సముద్ర మదనకాలములో శ్రీనారాయణమూర్తి తనకు లభించిన అమూల్య మణులను అందరకు పంచినట్లు ఈ కూర్పరికూడా, అనేక కాలములలో, అనేక దేశములలో, అనేక వాతావరుణములలో, అనేక భాషలలో, సేకరింపబడి గ్రంథస్థము చేయబడిన హెలేని సూక్తులను అన్వేషించి అందులో మిక్కిలి సారవంతములైన వానిని ఇందులో పొందుపరచిరి. పాఠకలోకము ఆద్యంతముగా ఈ గ్రంథమును అవలోకించి తత్సారమును గ్రహించినఎడల శ్రేష్ఠమైన అధ్యాత్మిక ఆహారము, అమృతతుల్యమైనది వారికి దొరుకును.

ఈ గ్రంథము చూచినవారికి ఒక సత్యము పొడగట్టగలదు. దేశములు వేరైనా భాషలు వేరైనా, శతాబ్దములు భిన్నములైనా, అందరు భక్తులు వివిధవాక్యములలో అయినప్పటికి, సామాన్య సత్యములను ప్రకటించి యున్నారు. వారి నిస్సందేహ అనుభవములే ఈ సత్యములకు రుజువులై వరలుచున్నవి. దైవము ఒక్కడే యనియు, వైరాగ్యము అతనిని సమీపించుటకు సందర్శించుటకు శ్రేష్ఠమైన మార్గమని వారందురు ఏక గ్రీవముగా ప్రబోధించియున్నారు. బోధలు తరుగైన పిమ్మట అనుష్ఠానము లోపించుటచేతనే ఇంతకాలము ఈ లోకములో సైతాను యొక్కయు, మన్మధుని యొక్కయు, మారుని యొక్కయు ప్రభావము ప్రబలియున్నది. ఈ గ్రంథావలోకనమున మరియొక అంశము ద్యోతకము అగుచున్నది. సృష్టికర్త ఎంత దయామయుడో ప్రేమస్వరూపుడో, మానవకోటియందు ఆయనకు వాత్సల్యమెంతో తరతరముల అన్ని దేశముల అన్ని స్థాయిలలో గల జనులకు ఉపకరించునట్లు ఆయన ఆప్తులైన జ్ఞానులను మనకు ఉపదేశించుటకు పంపియున్నారు.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో అర్జునునకు తెలిపినట్లు ప్రతి మానవుని మేలుకొలుపుటకు పరమాత్మ ఒకమహాత్ముని తోడునీడగా నిలపెట్టి

యున్నాడు. అట్టివారు బోధించుదానిని పెడచెవినిబెట్టి మనము ఆ బోధకులకు కృతజ్ఞత తెలుపక వారిని హింసించుచున్నాము. ఏసునాధుడు చెప్పినమాట మనము జ్ఞాపకముంచుకొనవలెను. ఏ ప్రవక్తలను మనతరము వారు రాళ్లురువ్వి చంపుచున్నారో, వారికే వీరితరువాత తరమువారు, గుళ్లుకట్టి పూజలు సల్పుచున్నారు. ఉత్తమ బోధలను చేయువారు సమకాలికుల సానుభూతిని పొందలేకున్నను వారు దైవసంకల్పమును నిర్వహించి, దైవములో లీనమగుచున్నారు.

గుళ్లుకట్టినవారును గుళ్లేకట్టెదరు. కాని, వారిబోధలను అనుష్ఠించరు. ఆ బోధకుడు సజీవుడై మనకండ్లఎదుట కనబడి మన దురాచారములను ఖండించి, పరితాపము కలిగించడు, కనుక ఆయన గ్రంథముల చదువుటయు ఆయన బోధలను వినుటయు సామాన్య ఆచారమైనది.

అందుకనియే, దేవుడు బైటనున్న బోధకునికంటె అంతరాత్మలో, అసలైన బోధకుని ప్రతిష్ఠించియున్నాడు. కాని ఏమి దురదృష్ఠమొ అంతరాత్మ స్ఫురణనుకూడా మనము నిర్లక్ష్యము చేయుదుము. సునిశితమైన అంతరాత్మ, తానే ఆత్మయనియు, తానే పరమాత్మయనియు ఐక్యానుభూతి పొందగలుగునని కొందరు మహాపురుషులు కనిపెట్టియున్నారు, అదియే చిట్టచివరి తరుణోపాయము.

ఈ గ్రంథ పాఠకులు ఇందులో ఉదహరించబడిన ప్రముఖులు సజీవులై తమతో సంభాషించుచున్నట్లు సంబోధించుచున్నట్లు ఎంచి బోధనామృతముల గ్రోలుదురుగాక.

ఈ గ్రంథము ఇపుడు ఆంధ్రభాషలో ప్రచురింపబడుచున్నది. ఆంధ్ర లోకమంతయు దీనివల్ల మేలుపొందునట్లు దైవము అనుగ్రహించుగాక.

సర్వేలు సర్వోదయ ఆశ్రమము తరపున దీనిని ప్రకటించుట ముదావహము.

వినయాశ్రమం
౨౧-౧౨-౫౮

ఇట్లు,
స్వామి సీతారామ్

# పరిచయము

మానవత్వము ధన్యతగాంచుటకు తగు మార్గములను సకల దేశముల లోని మహానుభావులన్వేషించి, యనుష్ఠించిరి. అనుష్ఠించు చున్నారుకూడా. ఇట్టి కృషి చరిత్రకందని కాలమునుండి నేటివరకును సాగుచునే యున్నది. ఇకముందును సాగుచునే యుండగలదు.

భారతదేశమును గుఱించి యిక చెప్పనక్కరయే లేదు. వేదకాలము నుండియు నేటివరకు ఆధ్యాత్మిక సాహిత్య సంపద వికసించుచు వచ్చినదన్న విషయము నెరుఁగని వారుండరు.

ఉపనిషత్తులలో ఋషులకును, ఋషిపత్నులకును, వారి శిష్యులకును ప్రశ్నోత్తరముల రూపముగా ఆధ్యాత్మిక చర్చలు జరిగి సత్య సిద్ధాంత మును స్పష్టము చేయఁబడినట్లు కలదు.

ఉపనిషత్తులలో ప్రార్థనలుగాను, బోధనలుగాను, ఆధ్యాత్మికతత్త్వము భక్తిజ్ఞాన వైరాగ్య సముచ్చయముగా ఉపదేశింపబడినది.

"ఓ అగ్నీ ! (పరమాత్మా !) ఓ దేవా ! సకల కర్మములను, ప్రజ్ఞాన ములను ఎఱింగినవారినిగా మమ్ము కర్మఫల భోగము నిమిత్తము మంచి మార్గమునందు ప్రవేశించునట్లు అనుగ్రహింపుము. మా యొక్క క్రూర పాపములను నాశముచేయుము. మీకు మేము అనేక నమస్కారము లొనర్చెదము.

"సృష్టిలోని సకల పదార్థములందు పరమాత్మ వ్యాపించియున్నాడు. కావున ఆ పదార్థములన్నియు అతనివి వాటిని పరధనము అని తలంచి వాని కొరకు ప్రాకులాడకుము. త్యాగబుద్ధితో వానిని అనుభవింపుము."

"ఇహలోకమున నిష్కామబుద్ధితో సత్కర్మలనేచేయుచు నూరేండ్ల వరకు జీవించుటకు కోరుము. అది ఆ నిష్కామ కర్మోపాసకుని అంటదు."

"ఎవడు ఆత్మయందు సకల భూతములను సకల భూతములయందు ఆత్మను చూచునో, లేక సమస్త భూతములు తానని తెలిసికొని ఏకమని చూచునతనికి ఆశయు, శోకము, జుగుప్స అనునవి అంటవు"

"ఎట్లు ప్రవహించు నదులు నామరూపములు విసర్జించి సముద్రమును చేరుచున్నవో, అటులే జ్ఞాని మోక్షకాలమునందు నామరూప వివర్జితుడై పరాత్పరుఁడగు దివ్యపురుషుని (పరమాత్మను) పొందుచున్నాఁడు."

ఇటువంటి ఉపనిషత్తులలోని బోధనల ప్రకారము, ప్రవృత్తిమార్గము నివృత్తిమార్గము అను రెండు మార్గములలో దేనినైనను అనుసరించి మానవుడు తన యోగ్యతకొలది పారలౌకిక సాధనములు చేయవలెను. ఇట్టి విజ్ఞానమే 'బ్రహ్మవిద్య', 'ఆత్మజ్ఞానము' అను పేరులతో చెప్పబడుచున్నది.

ఈ 'ఆత్మజ్ఞానము'ను, 'బ్రహ్మవిద్య'ను పొందుటకు పూర్వకాలమున తగిన గురువును వెదకికొనుటకు పెక్కుశ్రమలు పడవలసియుండెడిది. యోగ్యుడైన గురువు లభించినను, గురువు సంతోషపడునట్లుగా శుశ్రూష చేసి గురుదక్షిణ సమర్పింపవలసి యుండెను. గురువు ప్రసన్నుడైనప్పుడు గాని, రహస్యముగా నుంచబడిన యీ 'బ్రహ్మవిద్య' శిష్యునకుపదేశింపబడకుండెడిది.

నేఁటికాలమున విజ్ఞానాభివృద్ధి యెంతయో అగుచున్నది. సౌకర్యములకు కొరతలేదు. ఒక తమ భాషలోనేకాదు, ప్రపంచములోని పలుభాషలలోని గూఢాతి గూఢముగాగల గ్రంథములు సయితము వారి వారి భాషలలోనికి అనువదించుకొని అచ్చువేయించి, అందలి విజ్ఞానముతో లాభము పొందుటకు అవకాశము కలుగజేయఁబడి యున్నది. చాలావరకు గురు సహాయముమీద ఆధారపడవలసిన నిమిత్తము లేకుండుటకుగాను ప్రయత్నము చేయబడుచున్నది. మహాత్ముల గ్రంథములనే గురువులుగా తీసికొని ఉపయోగించుకొను చున్నారు.

పూర్వకాలమున మాత్రము ఉపదేశ గురువులనే కాకుండా పంచభూతములను పశుపక్ష్యాదులను కూడా గురువులుగా తీసికొని వాటి నుండి ఉపదేశము గాంచినట్లు కలదు. ఇంతటి విజ్ఞానధనులు, అవధూతలు అరుదుగా గలరు.

ఉపనిషత్తులు మొదలగు పెక్కు ప్రాచీన వేదాంత గ్రంథములనుండి నేఁటి అరవిందఘోష్, రమణ మహర్షి మున్నగు మహాత్ములవరకు రచించిన

వేదాంత గ్రంథములన్నియు లభించుచున్నవి. అవిగాకను ఇంగ్లీషు, పారసీ, అరబ్బీ, లాటిన్, గ్రీకుగాగల విదేశీయ ఆధ్యాత్మిక గ్రంథములు సయితము ఆయా భాషలలో అనువదితములై జిజ్ఞాసువులకు విజ్ఞానమూలధనముగా లభించుచున్నవి.

హిందీకల్యాణ్ (గోరఖ్ పూర్) మాసపత్రికా కార్యాలయమువారు 'సంత్ వాణీ' అను పుస్తకమును ప్రకటించిరి. తదుపరి 'సంత్ వాణి అంక్' అనుపేర నొక ఉత్కృష్టమైన సంచికను 1954 క్రీ. శ. మున ప్రకటించిరి. అందు మహాత్ముల పెక్కు ఆధ్యాత్మిక సూక్తులు ప్రకటితమైనవి. ఆంగ్లము లోను యీ తరగతికి చెందిన గ్రంథములు పెక్కులు గలవు. కాని తెలుఁగు భాషలో నా యెరగినవరకు వందలకొలఁదిగా మహాత్ముల ఆధ్యాత్మిక, నైతిక లౌకిక బోధలు గ్రంథస్థముచేసి ప్రకటింపబడి యున్నట్లులేదు. సర్వేలు సర్వోదయ సంఘ సభ్యులగు మహనీయులొకరు గాంధీతత్వమును బాగుగా అనుష్ఠించువారు; మాకు సుపరిచిత మిత్రులు; సద్భక్తులు, తమ నామ ధేయము బయల్పఱచుకొన నిచ్చగించని నిరాడంబరులగువారు దాదాపు అయిదునూర్ల మహాత్ముల ఉపదేశములను గ్రంథస్థములైనవానిని కొన్నిటిని సంగ్రహించియు, ఇతర భాషలగు హిందీ, ఉర్దూ మున్నగు భాషలలోగల కొన్నిఁటిని అనువదించియు, మఱికొన్నిటిని మహాత్ముల ముఖతః గ్రహించి వాటిని లిపిబద్ధముచేసియు పెక్కు సంవత్సరములుగా కృషిచేసి సంపాదించిన అమృతవాహిని ఒక గొప్ప ఆధ్యాత్మిక జ్ఞానభాండాగారము. ఈ గొప్ప అమూల్యమైన గ్రంథమును ప్రకటించి సర్వేలు సర్వోదయ సంఘమువారు ఆంధ్రభాషీయులగు జిజ్ఞాసువులకెంతో ఉపకారము చేసినారు.

ఈ గ్రంథమును చాలవరకు చదివినాను. కొన్నికొన్ని సూక్తులు హృదయములోనికి సూటిగా జొచ్చుకొనిపోయి యెంతయో మానసిక క్రాంతిని గలిగించునంతటి ప్రభావవంతముగా నున్నవి. ఈ సూక్తులలో, కులము, మతము. దేశము, కాలము అను వాని విచక్షణలేకుండా, పృథ్వి యందు వసించు సర్వమానవులకు ఒక ఆధ్యాత్మిక జ్ఞానసిద్ధికి సాధనములగు వానిని వివరించుటయేకాక, లౌకిక జీవితమునకు కావలసిన ఉత్కృష్టమైన అనుభవసిద్ధమైన నీతులుకూడా కలవు. వీటివలన ఇహము, పరము రెండును సాధించుటకు వీలగుచున్నది.

ఈ గ్రంథమున ఇంతకు మిక్కిలిగా నొక విశేషముకూడా గోచరము కాగలదు. అదేమనగా పైన వివరింపబడిన ఉపనిషత్తులలోని దివ్యసత్యములనే ఏ మహాత్ముడుకూడా చెప్పినాడు. దేశములు వేరైనను, రంగులు వేరైనను, కాలములు వేరైనను, మతములు వేరైనను సాంప్రదాయములు వేరైనను మహనీయు లందఱికిని లక్ష్య మొకటే. అనుభవమున గ్రహించినదియు నొకటే. కాని నేడు మానవులకు, మానవులకు మధ్యన యే ఉక్కుగోడలు నిర్మింపబడి పరస్పర విద్వేషములు పురికొల్పబడుచున్నవో, అవి యన్నియు స్వార్థపరుల నాటకములే కాని సత్యమైన విషయము కాదని బుద్ధిమంతులకు తేటపడగలదు. సత్యమైన అపురూపమగు దివ్యానుభవమును తెలిసికొని లాభపడువారికి భేదభావమునకు తావే లేదు. అన్ని భేదములు సమసి ఒకే ఒక సత్యమును గాంచుటే లక్ష్యసిద్ధిగా గల జిజ్ఞాసువులు తప్పక యీ గ్రంథ మును చదివి లాభపడగలరని ఆశించుచున్నాను.

ఈ గ్రంథ మహత్త్వమునుగూర్చి యెంత చెప్పినను తక్కువే. ఈ మహోత్కృష్ట గ్రంథమునకు పీఠిక వ్రాయుటకు నే నెంతయును అర్హుఁడను కాను. వాత్సల్యముతో గ్రంథకర్తగారు కోరుటచేతను, ఈ గ్రంథములోని విశేషముల ప్రభావముచేతను సాహసించితిని.

ఈ గ్రంథమును మిక్కిలి ఓపికతో వ్రాసి జిజ్ఞాసువులకు మేలుచేసిన ఆధ్యాత్మిక జ్ఞానధనులగు గ్రంథకర్తగారును, ఈ గ్రంథ ప్రచురణకు పూను కొనిన సర్వేలు సర్వోదయ సంఘమువారును అభినందనీయులు. సర్వోదయ నామముగల యీ సంస్థ బహుముఖముల మానవాభ్యుదయమునకు ఇతోధి కముగా తోడ్పడుగాతమనియు, ఈ గ్రంథకర్తగారు ఇంకను మహోత్కృష్ట గ్రంథములనువ్రాసి ఆంధ్రలోకమునకు సేవచేయుటకు వలయు శక్తిని ప్రసాదించుగాతమనియు ఆ పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

నల్లగొండ
3-2-1959.

ఇట్లు,
బుధ జన విధేయుడు
(పైడిమఱ్ఱి వేంకట సుబ్బారావు)

# అనుక్రమణిక

ఓం

ఓం సహనావవతు । సహనౌ భునక్తు ।
సహవీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు ।
మావిద్విషావహై ॥
ఓం శాంతిః । శాంతిః । శాంతిః ॥

ఆ పరమాత్మ మనతోకూడ నుండి మనలను రక్షించుగాక !
ఆ పరమాత్మ మనతోకూడ నుండియే మనకు సుఖమును
కలిగించు గాక ! మన విద్యకు (అధీతి బోధలకు)
బలము కలుగునట్లుగా మనము కలసి ప్రయత్నిం
తము. మన అధ్యాయనము ఆచరణప్రచారములు
కలుగునది అగుగాక ! మనము ద్వేష
భావము లేనివారమై ఉందుము గాక !

ఓం శాంతి । శాంతిః । శాంతిః ॥

# అమృతవాహిని

## ౧ బ్రహ్మ

౧. ప్రపంచము భ్రమ; అది బ్రహ్మయొక్క రూపమే. బ్రహ్మ యను సముద్రమందు, వ్యక్తి యొక బుడగ. ప్రపంచమంతయు నొక పెద్ద కల; అది పూర్తిగా అసత్యము, బ్రహ్మము మాత్రమే సత్యము.

౨. ఒకవ్యక్తియొక్క స్వప్నములో వివిధములగు వస్తువులు ఎట్లు సృష్టింపబడుచున్నవో అట్లే ప్రపంచ సృష్టి కూడా అఖండచైతన్య మందలి యొక స్వప్నమే. ప్రపంచము దృశ్యమాత్రము. మూడు లోకములు బ్రహ్మమే, ప్రపంచమంతయు స్వప్నము వంటిదే.

౩. సత్తుయొక్క అంతిమస్థితి, అనంతమౌనము. దానిని మోక్ష మందురు, లేక నిర్వాణమందురు.

౪. అధికమైన ధ్యానముతో మననము జేసినచో భ్రమను జయించవచ్చును. మోక్షమును స్వరూపజ్ఞానము ద్వారా తప్ప ఇతర మార్గములద్వారా పొందలేము.

౫. స్వప్నమందు చూడబడిన స్త్రీవలె ప్రపంచము అసత్యము. ఆయేక బ్రహ్మమే కల్పితమైన ప్రత్యేకజీవుడుగా కనిపించుచున్నాడు.

౬. నిద్ర స్వప్నముగా ఎట్లు మారునో అట్లే బ్రహ్మము ప్రపంచమువలె కనుపించును.

౭. ప్రపంచమందలి యావత్తు ధనముయొక్క విలువకంటె, జీవితమందొక నిమిషము చాలా విలువగలది. అట్టికాలమందు జీవిత మును అనర్థకముచేసిన వానినేరము క్షమింపదగినదికాదు.

౮. సంసార దుఃఖములవల్ల, ఓటమి, అవమానము, మరియు వివిధములైన ఇతరబాధలవల్ల, కృశించి మిక్కిలి దుఃఖములో మునిగి ప్రతివిషయమందు రోతపుట్టినను, సంసారమును త్యజించవా? విచారించుకొనుము.

## ౨ శ్రీమన్ మహావిష్ణు

౧. పరుల అన్నమును తినకుము, కానుకలు తీసుకోకుము, ఇతరులను పీడించకుము, ఇతరుల దోషముల నెన్నకుము.

౨. పగలు నిద్రపోరాదు, సంధ్యాకాలమున తినకూడదు.

౩. ప్రపంచమునకు హితము కోరువాడు, ఇతరుల దోషములను చూడడు. ఈర్ష్యలేనివాడు, ఇహ పరలోకములలో పూజ్యుడే.

## ౩ మహేశ్వరుడు

౧. జీవన్ముక్తునకు చేయవలసినదేది యుండదు. చేయవలసిన దుండినచో, అతడు తత్త్వవేత్తయు జీవన్ముక్తుడును కానేకాడు.

౨. నడుచుచు, నిలుచుచు, శయనించుచు, పనియందుండియు ధ్యానము చేయుటవలన సంసారబంధమునుండి ముక్తుడగును.

౩. ఉత్తములు తమ క్షణభంగురమగు జీవనమును బలియిచ్చి యైనా ఇతరజీవులను రక్షించెదరు.

౪. ఎవడు సమస్త జీవులను ప్రేమించునో వానిని సర్వాత్మ యగు భగవానుడు ప్రేమించును.

## ౪ యమధర్మరాజు

౧. మనుష్యుడు ఏకార్యము కొరకు నియుక్తము చేయ బడెనో, ఆ కార్యము చేయక సోమరిగానుండునో వాడు పాపాత్ముడే సుమా. దేవుడు నిన్ను ఎందుకొరకు సృష్టించినాడో ఆపని చేయక వ్యర్థములైన పనులుచేయుట మహానరకము, జాగ్రత.

౨. ఏ యితర స్త్రీవైపు చెడ్డదృష్టితో చూచిన, లేక, మనస్సులో కాంక్షించిననుగాని, నరకమే. వెంటనే పాపముకలుగును.

౩. ధనసంగ్రహము మహాపాపము. అడిగినవారికి లేదనకుండా ఇచ్చుచుండుము. స్వార్థములేకుండా దానమిమ్ము. ఫలకాంక్షనువీడుము.

౪. నిన్ను ద్వేషించినవారిని ప్రేమించుము, రాగద్వేషములను వీడుము. ఇతరుల మనస్సును నొప్పించకుము.

## ౫ ఇంద్రునకు బ్రహ్మదేవుని యుపదేశము

౧. ఓ ఇంద్రా! యీ శరీరము నశించుట నిశ్చయము. కాన, నశించనట్టి పరమపదమునకై, ఆలసించక ఈశ్వరధ్యానము చేయుము. శరీర రహితుడగు ముక్తజీవుడు బ్రహ్మయందుండును.

## ౬ శ్రీ సనత్కుమారుడు

౧. ఏ కార్యములలో దుఃఖశోకములు లేవో, ఆ కార్యముల చేయుడు. అది ఇహపరలోకములలో కూడా, భయకారణము కాజాలదు సుమా.

౨. ఏది అనుమానముగా, కొద్దిగా తెలిసి తెలియనట్లు తెలియునో అది ఇంద్రియాతీతమైన, అవ్యక్తవస్తువని తెలుసుకొనుము.

౩. సంసారసంబంధములైన ఏ వస్తువులందు చింతచేయరాదు. మానవశరీరము జన్మరాహిత్యానికై వచ్చినది, విషయభోగములకై రాలేదు.

౪. ఇహలోకములోని క్షణికసుఖములు, పరలోకములో దుఃఖములకు కారణములు.

౫. యజ్ఞములచే ద్రవ్యత్యాగము, వ్రతములచే విషయభోగముల త్యాగము, తపస్సుచే దైహిక సుఖత్యాగము చేయవలయును.

౬. చెట్టుపై ఆసక్తిలేనట్టిపక్షి, వృక్షమునువిడిచి ఎట్లెగిరిపోవునో అట్లేశరీరముపై ఆసక్తిలేని జీవుడు, శరీరమును సంతోషముగా విడిచి ముక్తినిపొందును.

౭. స్త్రీ, పుత్ర, ధన, సంపత్తి స్నేహపాశములలో చిక్కి అనేక దుఃఖములపాలై, క్షణిక మోహముల కాంక్షించి నశించకుము.

౮. ఈ శరీరముండగనే బ్రహ్మను తెలిసికొనుము. లేనిచో హానికలుగును.

౯. ఆహారశుద్ధిచే అంతఃకరణశుద్ధి కలుగును; అంతఃకరణశుద్ధివల్ల, నిశ్చలస్మృతికలుగును; ఈ స్మృతివల్ల అజ్ఞానము నశించి ఆత్మజ్ఞానము కలుగును.

౧౦. పాపకర్మములు చేయకుము. సాధుసత్పురుషుల ఆజ్ఞ ప్రకారము వర్తించుము; ఉత్తమ సదాచారము నాచరించుము; సదాపుణ్య కర్మలనే చేయుచుండుము.

౧౧. మానవుడవై విషయాసక్తుడవగుట చాలాపాపము.

## ౭ శ్రీ సనకదేవుడు

౧. సత్యమే తపస్సు, రాగమే దుఃఖము, త్యాగమే సుఖము. పాపకార్యములు చేయక సదాపుణ్యకార్యములు చేయుచు, సదాచారముతో వర్తించుచు, సాధుపురుషులవలె ఆచరించుము.

౨. మానవశరీరము దుఃఖభాజనము. విషయభోగములనుకోరి, భోగించితివా, నరకప్రాప్తి కలుగును.

౩. ఇతరులకు హితములయ్యే మాటలనే మాట్లాడుము.

౪. సంకల్పములనువిడిచి, దేనియందుకోరిక లేక కామవాసనలు నశించి,వస్తుసంగ్రహముచేయుకోరికను విడిచినవాడే ముక్తినిబొందును, కావున, సమస్త విషయభోగములను త్యజించుడు.

౫. అప్రియవస్తు సంయోగము, ప్రియవస్తు వియోగము వల్లనే దుఃఖప్రాప్తి కలుగును. ఏవస్తువులనుకోరక యుంటివా, ముక్తుడవే.

౬. జరిగిపోయినదానికై యాలోచించకుము,దానివల్లయింకా దోషములు కలుగును. భవిష్యత్తునకై విచారించకుము.

౭. ప్రారబ్ధవశాత్తు వచ్చినకష్టములకై దుఃఖపడక సంతోషముగా అనుభవింపుము.

౮. ధనము దుఃఖమునకు మూలము. కాన, ధననష్టమునకై విచారపడకుము.

౯. ఏకాదశ ఇంద్రియములద్వారా పాపములు చేయుచున్నాముకదా ! అందుకే ఏకాదశీవ్రతము.

౧౦. పది ఇంద్రియములు మనస్సుమొత్తము వీని నిరోధించిన ఆత్మసుఖము దొరుకును.

౧౧. పదకొండింద్రియములను నీవశములోనుంచుట కొరకే వ్రతదీక్షనడుపుము అనే అర్థముకాన, అన్ని ఇంద్రియములను దండించుము.

౧౨. పన్నెండవది బుద్ధి. అనగా ద్వాదశిపారణము. ద్వాదశియే బుద్ధి. దానికి తృప్తికలుగును, అదే ద్వాదశి ఉదయమున భోజనము చేయుటయగును.

౧౩. జీవుడు పరాధీనుడు, కాన జీవుడుచేసినకర్మఫలము పరాధీనము కావున, నిష్కామకర్మచేయుము, ఫలమును కోరకుము, ఫలమునుకోరినను, నీ ఇష్టానుసారము దొరకదు. వృథాశ్రమ ఏల? కోరి దుఃఖమొందనేల? ఏది దొరకవలసినదో అది తప్పకదొరుకును; విచారపడకుము.

## ౮ దేవర్షి నారదుడు

౧. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, నిష్కపటము, ఇవి మానసిక వ్రతములు. మానవుడొంటిపూట భోజనము, రాత్రియుపవాసముచేయుచు ఏదికోరక, ఏదిఎపుడు అడుగక ప్రాప్తించిన, దానినే, తినుట, శరీరతపస్సు, అనబడును. సత్యమే మానసికతపస్సు.

౨. మనుష్యునియొక్క హక్కు కేవలము కడుపునిండుటకు సరిపోయే ధనముపైననే యుండును. దీనికన్న అధికసంపత్తిని ఎవడు నాది అనుకొనునో వాడు, దొంగయే, వానికి శిక్షతప్పదు, సకలజీవులను తన పుత్రుల సమానముగనే చూడవలయును.

౩. ఈ శరీరము ఎపుడో నశించి పురుగుల పాలయ్యేదేకదా, గృహస్థుడు జాగ్రతగనుండి ప్రారబ్ధమువలన ప్రాప్తమైన దానిని పంచయజ్ఞములుచేయగ మిగిలిన అన్నమును, స్వీకరించుచు తక్కిన దానిని త్యాగముచేయవలయును. అపుడే మహాత్ముల పదవిదొరుకును.

౪. సంకల్ప పరిత్యాగముచే కామమును, కామముయొక్క పరిత్యాగముచే క్రోధమును, అర్ధమును, అనర్ధమని తలంచి లోభమును తత్వవిచారముచే భయమును, జయించుడు. ఆధ్యాత్మికవిద్యచే శోక మోహములను, మౌనముచే యోగవిఘ్నములను, నిద్రను సాత్విక ఆహారముతో జయించుడు.

౫. బ్రహ్మమొకటే, కాని పంచేంద్రియములు, వస్తువులను, అనేకవిధములుగా మార్చుచున్నవి. ఇంద్రియ వ్యాపారములను, వదులుకొనిన వ్యక్తి కేవలబ్రహ్మనే పొందగలడు. అట్టివాడే మూడులోకములందు నిజమైన సాధువు.

౬. తన సర్వస్వమును, భగవంతుని కర్పించినవాడు, సమస్త సంపదలు మరియు, ఆచారాది సంఘమర్యాదలు లోపించినను చింత పడడు. ప్రాపంచిక కష్టములు ఒక లెక్కలోనివికావు. భగవానుని మరచుటే గొప్పకష్టము.

## ౭ శ్రీ వ్యాసభగవానుడు

౧. వేదశాస్త్రముల సారము, రెండుమాటలే. పరుల కుపకారము చేసిన పుణ్యము, పరుల బాధించిన పాపముకలుగును.

౨. హానికరములగు వస్తువులనడంచి, ఆహ్లాదకరములగు సామగ్రిని, ఇతరులకు పంచిఇచ్చుటే పరోపకారము.

౩. ఎవనికడుపు ఎంత యిమిడించకలుగునో అంతవరకే హక్కు అతనికిలను, అంతకంటెమించి ఆశించి దాచెనా, అతడేదొంగ. శిక్షార్హుడతడు.

౪. అధికారాదర సత్కారముల కాంక్షించకుము. దానితో అహంకార ముత్పన్నమై నీవు నాశనమవుదువు. కీర్తికాంక్షించకుము.

౫. భోజన ప్రియుడు, తిండికై ఆతురపడువాడు, పాపియే సుమా.

౬. ఇతరులను నిందించకుము,ఇతరులదోషములను చూడకుము, ఏ జీవికిని ఏలాటి హానిచేయకుము, రాగద్వేషముల వీడుము.

## ౧౦ బ్రహ్మర్షి వశిష్ఠుడు

౧. నాది, నేను, అనే అహంకారమును వదలితిరా ముక్తులే.

౨. మానవుడు, ఎట్లెట్లు ప్రతిగ్రహమును త్యాగముచేయునో, అట్లట్లు అతనిలో బ్రహ్మతేజస్సు వృద్ధికాగలదు. నాది, నేను, అనేది వుండరాదు.

౩. సత్కర్మ చేయనివాడు, వ్యర్థభాషణుడు,వడ్డీతీసికొనువాడు, శ్రద్ధలేనివాడు, యజ్ఞములను చేయనివాడు, వీరు దొంగలు, పాపులు, వీరిని అంటకుడు.

౪. మోక్షమునకు నాలుగు సాధనములు. శమము, విచారము, సంతోషము, సత్సంగము, ఈ నాల్గింటిని పాలించుచు ముక్తిని బడయుడు.

౫. పాపములు సుకృతములచే నశించును. అపుడేచిత్తశుద్ధి కలిగి జ్ఞానోదయమునకు హేతువగును.

౬. కప్పలవలె బురదలోను, పురుగులవలె పేడలోను, పాముల వలె చీకటి బిలములోను, సుఖముగ జీవింపవచ్చును, గాని మానవుడై యుండి యుక్తాయుక్త జ్ఞానములేక జీవించుట మహాదుఃఖకరము.

౭. విషము విషముకాదు, విషయ సుఖాపేక్షయే, నిజమైన విషము. విషము ఇప్పటి శరీరమునే, నశింపజేయను కాని, విషయ సుఖాపేక్ష రాబోవు జీవితమునందుకూడ హానిజేయును,

## ౧౧ శ్రీ అష్టావక్ర మహాముని

౧. ఓ మానవులారా! మీకు ముక్తి వలయుచో, విషయ వాంఛలను విడువుడు.

౨. విషయనులను విషములతో సమానముగ త్యజించి క్షమను, సరళతను, దయను, పవిత్రతను, సత్యమును అమృతముగా స్వీకరించుము. అహంకారమువల్ల నేను గొప్పవాడ ననుకోకుము, ఆత్మోల్లంఘనము చేయకుము.

౩. మోహము జ్ఞానమునకు బద్ధశత్రువని తెలిసియు, శుష్కించి అంత్యకాలము సమీపించు ముందుకూడా, కామ సౌఖ్యముల వెంట పరుగిడుట ఆశ్చర్యము, నరకము తప్పదు.

౪. సర్వసంగ పరిత్యాగమువల్ల కలుగు శాంతి, యొక్క కౌపీనము గలిగియున్నను గలుగదు. కాబట్టి పరిగ్రహమును విడిచి సుఖముగా నుండుడు.

౫. దేహాభిమానము త్యజించుము, నేనే ఆత్మనని నమ్ముము, దేహాభిమానమె దుఃఖము, నరకము, ఆత్మాభిమానమె, సుఖము, మోక్షము.

౬. ఓ బిడ్డా! చాలాకాలమునుండి యీ శరీరమే నేనను విశ్వాస రజ్జువుతో కట్టబడియున్నావు, దీనిని జ్ఞానమనే కత్తిచే నరికి, సుఖింపుము.

## ౧౨ శ్రీ మృకండ మహాముని

౧. ఇతరులకు ద్వేషము క్రోధము వచ్చు ఏ కార్యమైనను చేయరాదు. సదా కల్యాణకార్యమే చేయుచుండుము.

౨. సమస్త పాపములు నశించినప్పుడే, బుద్ధివికాసమగును, నేను, నాది అనేది పాపము, బంధము,

౩. ఇహలోక పరలోక భోగములను త్యజించినవాడే ముక్తుడగును.

## ౧౩ శ్రీ లోమశ మహాముని

౧. ముఖ్యమైనది దానమేసుమా! రెండునాళ్ళ ఈ శరీరమునకు, ఆడంబరములేల? అన్నిటిని త్యజించుము. భావశుద్ధి అన్నిటికంటె ముఖ్యమైనది.

౨. మౌన మవలంబించి ధ్యానమగ్నుండవగుము. నీ ఆత్మ, లేక శాస్త్రము చెప్పినట్లాచరించితివా, మోక్షము తప్పదు.

౩. ప్రాప్తించిన పదార్థములను, పరమాత్మయొక్క కార్యములలో నుపయోగించుటే సదుపయోగము.

౪. అనిచ్ఛా, పరేచ్ఛలవలన సంభవించిన సుఖ దుఃఖములను సమముగా చూచుచు సంతోషించుచుండుము.

౫. నీవు స్వతఃశక్తిశాలివి అయికూడా, నశించే బాహ్యావస్తువులకై పరుగులిడుట ఎంత వెఱ్ఱితనము! వాటివెంట నీవు దాసుడవై తిరుగుట మహా అవివేకము. నీశక్తిచే తలించితే వచ్చేవికదా, వానికై నీవు చింతించుటెందులకు.

## ౧౪ శ్రీ కండు మహాముని

౧. మనస్సు ప్రబలమైనది, జాగ్రత! జన్మ జన్మాంతరములనుండి వాసనలు చిత్తములో అణగియున్నవి. ఎపుడు ఏ సమయములో అవి నిన్ను ఆక్రమించునో ఎవరికెరుక? మనలో వెదకినను మనకు తెలియకుండా ఎన్నో దోషములుండును. అవి సమయముచూచి, నిన్ను మోహితుని చేయును. కాన, జాగ్రతతో మెలంగుచు భగవంతుని విశ్వసించి సదా ధ్యానించుచుండుము.

౨. ఇంద్రియములకు దాసులు కాకుడు, మనస్సును వశములో నుంచుకొనుడు, విషయవాసనలచే బంధింపబడి నశించకుడు.

౩. ఈ సంసారము సారహీనమైనది, నరకకూపము, అనిత్యమైన దానిని చేపట్టి చెడిపోకుడు. నిత్యశుద్ధమైన ఆత్మ చెప్పినట్లు ఆచరించుచు భగవంతుని ధ్యానించుచుండుడు.

౪. సాధకుడు, ఏకాంతములో, స్త్రీనిగాని, స్త్రీ చిత్రమును గాని చూడరాదు. మనసులో తలంచరాదు. ఏలాటి సంబంధము వుంచ రాదు.

## ౧౫ శ్రీ సారస్వతముని

౧. కామము, క్రోధము, మోహము, మదము, మాయ, మాత్సర్యము, నింద, అవివేకము, అహంకారము, చపలత, లోలుపత, ద్రోహము, ప్రమాదము, దుర్జన సహవాసము, సోమరితనము, పరి గ్రహము, అసత్యము, అత్యధికాహారము, వ్యభిచారము, చోరత్వము, మొదలగు దోషములను త్యజించి ఎవడు తనఇంట్లో సదాచారముగా నుండునో వాడే యీ జగత్తులో యీ ప్రదేశములో, మహాపూజ్యుడు, మానవ శ్రేష్ఠుడు, మహాత్ముడే.

౨. ఎవడు దానము చేయడో, వాడే దరిద్రుడు, రోగి; మూర్ఖుడు. ఇతరులకు దాసుడై దుఃఖములనే అనుభవించగలడు.

౩. ఎవడు ధనవంతుడైకూడా, దానము చేయడో, ఎవడు దరిద్రుడైకూడా కష్టములను సహించక, భయపడి పారిపోవునో, వీరిద్దరు లోకనాశకులే సుమా!

౪. గోవు, బ్రాహ్మణుడు, వేదము, పతివ్రత, సత్యవాది, లోభ హీనుడు, దానశీలుడు, యీ ఏడుగురివల్లనే యీ భూమండలము నిలిచియున్నది.

## ౧౬ శ్రీ శుకదేవమహాముని

౧. భూమిపై పరుండినా, నిద్రపట్టును, ఫలములుతిన్నా ఆకలి తీరునుకదా, దానికై యేల ప్రయాసపడెదరు? ఈ నశించునట్టి

వస్తువులకై ప్రయాసపడుటకంటే, ముక్తికై ప్రయాసపడుట ముఖ్యము.

౨. సముద్రమును యింకింప వచ్చునుగాని, పరిగ్రహముల్ల సుఖమును సంపాదించలేరు.

౩. కామము, విషయభోగములచే నుపశమింపదు. విషయ భోగవాంఛ వీడితేనేగాని అదిపోవును.

౪. మోక్షమునకు రెండే సాధనములు ముఖ్యమైనవి. ౧ ఇతరుల వలన నేదియు కోరకుండుట, ౨. సర్వప్రయత్నములను మానుట.

౫. సదా ఆత్మాలోచన చేయుచు శుచివై ఆత్మను పవిత్ర ముగనుంచి, ఆత్మచెప్పిన ప్రకారము నడుచుచు, ఎల్లపుడు ప్రార్థన చేయుచుండుము. "ఓం సోహం!" జపించుచుండుము.

౬. సంగ్రహమువల్ల సుఖములేదు, లాభమువల్ల లోభము కలుగును, పాపము సంభవించును.

## ౧౭ శ్రీ సనత్సుజాతముని

౧. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, అసంతోషము, నిర్దయ, అసూయ, అభిమానము, ఈర్ష్య, నింద మొదలగునవి, మానవుల లోనుండు దోషములు. వీనిని వెంటనే త్యజించుట శ్రేష్ఠము.

౨. ఓ నరశ్రేష్ఠుడా! ఎట్లు వేటకాడు మృగములవేటకై పొంచివుండి వేటాడునో, అట్లే నీలోనుండు దోషములు, నీ అజాగ్రతను నీలోపములను చూచి, నిన్నాక్రమించి నశింపజేయును. కాన, జాగ రూకుడవై నీలోని ప్రతి దోషమును కనిపెట్టి వానిని నిర్మూలించుము.

౩. తన్ను తాపొగుడుకొనువాడు, లోలుప్తుడు, అహంకారము గలవాడు, క్రోధముగలవాడు, చంచలుడు, ఇతరులను కాపాడనివాడు, స్వార్థపరుడు, యీ ఆరుగురు పాపాత్ములే.

౪. ఎన్ని ఆపదలు, సంకటములు వచ్చినను భయపడక, సమస్త పాపములను ధ్వంసముచేసి, నిశ్చలుడవై భగవద్ధ్యానము చేయు చుండుము.

## ౧౮ మహర్షి యాజ్ఞవల్క్యుడు

౧. సత్యమేచెప్పుము, యోగ్యమైన శీలముకలిగియుండుము.

౨. నిన్నునీవెట్లు ప్రేమించుదువో,ఇతరులనట్లే ప్రేమించుము.

౩. నీకున్నదానిని ఇతరులతో భాగించుకొని యనుభవింపుము, ఇతరులమనస్సు నొప్పింపకుము.

౪. మనోవృత్తులను ఉద్రేకములను అదుపులో నుంచుకొనుము.

౫. నిర్మలప్రేమ అన్ని బంధములను విడగొట్టును, భేదముల నశింపజేయును.

౬. పవిత్రమైన ప్రేమతో నిండిన హృదయము గలవారికి, మనస్సాక్షి, ఈశ్వరవాక్కును సర్వదాచెప్పుచుండును. అతడు పరుల బాధల నుపశమింపజేయును, స్వార్థమును వీడును.

౭. సత్యముచెప్పుము, కాని, ఇతరుల రహస్యములను వెల్లడించకుము.

౮. ఇతరులను ప్రేమించుము, కాని, వారునిన్ను తేలికభావము తోను తిరస్కారముతోను చూచుటకవకాశమొసంగి విచారించు కొనుము.

## ౧౯ మహర్షి మైత్రేయి

౧. నాకు అమృతత్వము ప్రసాదించని, మీధనమును తీసుకొని నేనేమిచేయను !

౨. నిష్కామ భావముచే ధర్మాచరణవల్ల భగవత్కృప కలుగును. దేహాభిమానముండరాదు, సమస్తసంసార సంబంధములను త్యజించి భగవంతుని స్మరించుచుండవలెను.

## ౨౦ మహర్షి కశ్యపుడు

౧. ధనసంగ్రహము అనర్థకము, ధనసంపత్తి మోహబద్ధులను చేసి నశింపచేయును, ఈ మోహమే నరకములో బడద్రోయును. కల్యాణము కోరువాడు, ధనమును దూరమునుండే త్యజించవలెను. ఎవరికి ధర్మముకొరకై ధనసంగ్రహేచ్ఛ కలదో వారు ఆ యిచ్ఛను త్యజించుటే శ్రేష్ఠము. అడుసుత్రొక్కి నేల కాలుకడుగనేల, కాన, దానిని దూరమునుంచే త్యజించవలెను.

౨. ధనముద్వారా చేయబడు ధర్మము, క్షయము కాగలదు, ధనమును సంగ్రహము చేయకుండుటే యుత్తమ ధర్మము.

## ౨౧ మహర్షి అత్రి

౧. నీకు ప్రాప్తించిన ధనము ఇహలోక సౌఖ్యమునకే అక్కరకొచ్చును. మరణము తరువాత అదే నిన్ను చాలాకష్టపెట్టి నరకప్రాప్తి కలిగించును. ఎవడుముక్తిని కోరునో, వాడు ఇహసుఖమును ధనమును, కోరరాదు.

౨. శత్రు మిత్ర భేదముండరాదు. శత్రువులను ప్రేమించుము. రాగద్వేషములే నీజన్మకు కారణములు, కాన సమస్త కోరికలను త్యజించుము.

## ౨౨ మహర్షి జమదగ్ని

౧. ఇతరుల సొత్తును స్వీకరించకుము. ప్రతిగ్రహమువల్ల బ్రహ్మప్రాప్తి కలుగదు.

౨. ఎవడు తిండిలేకున్నప్పటికైనను, ఇతరులను యాచించడో, వాడు సనాతన లోకమును పొందును.

౩. దేనినికోరక, భగవంతుని స్మరించుచుంటివా, భగవద్దర్శనమగును.

## ౨౩ మహర్షి విశ్వామిత్రుడు

౧. కామమును త్యజించుము, లేనిచో అది నిన్ను దుఃఖముల పాలు చేయును.

౨. సత్యమే జయము, అదే ఈశ్వరుడు. కాన సత్యమును మరువకుము. వేయి అశ్వమేధ యజ్ఞములైనను, ఒక సత్యముతో సరితూగవు.

౩. ధనవృద్ధివల్ల తృష్ణవృద్ధి చెందును. ధనమే నిన్ను నరకములో బడద్రోయును, కాన జాగ్రత.

౪. సమస్త సాంసారిక పరిస్థితులను త్యజించి, సదా భగవంతుని స్మరించుచుండుము.

## ౨౪ మహర్షి భరద్వాజుడు

౧. తృష్ణ నిన్ను నాశనము చేయును. ఆశ, ధనము పెరిగిన కొలది పాపములు పెరుగును. కాన వీనిని వదులుము, చెడిపోకుము.

౨. సమస్త ఇంద్రియములు జీర్ణించిపోవును. తుదకు నీ శరీరము నశించును. ఆలసించకుము, నీకర్తవ్యమును వెంటనే నెరవేర్చుకొనుము. సంసారాశలోపడి నశించకుము. కాలము సమీపించుచున్నది జాగ్రత.

## ౨౫ మహర్షి గౌతముడు

౧. సుఖము కోరువాడు సదా సంతోషముతో నుండవలెను. లోభి కాకూడదు. ఇంద్రియములను జయించి వానికి యజమానుడు కావలెను.

౨. ఏదిచేసినా ఆలోచించియే చేయవలెను. అవసరములేనిదే ఏపనిని చేయరాదు. కోరికలే దుఃఖములకు కారణములు, పరాధీనులు కారాదు.

## ౨౬ మహర్షి ఋత్తంబరుడు

౧. ఎవడైతే గడ్డిమేసే పశువులను, గడ్డి తినకుండా వెళ్ల గొట్టునో, వాడు పాపఫల మనుభవించగలడు.

౨. ఎవడు మూగపశువులకు మేలుకలుగజేయునో వాడు పరలోకము చేరును. ఏ జీవికిని హానిచేయకుడు.

## ౨౭ మహర్షి ఆపస్తంభుడు

౧. ఎవడు స్వయముగా, నిరంతరము, సుఖభోగములను అనుభవించ కోరునో, వాడు పాపులలోకల్లా మహాపాపి.

౨. నీ సుఖములను ఇతరులకిచ్చి వారి దుఃఖములను నీవు తీసుకొనుము. దీనిచే ముక్తిదొరుకును.

౩. నీ యొద్దనున్న సర్వసంపదను, శక్తి సామర్థ్యములన్నియు బీదలకు, దుఃఖార్తులకు వినియోగించుము, దుఃఖితులను చూచి ఎవనిహృదయము ద్రవించదో, వాడు మానవుడుకాడు, రాక్షసుడే. సమర్థుడైకూడా, దుఃఖార్తుల దుఃఖములను తీర్చనివాడు అనేక పాపము లనుభవింపక తప్పదు.

## ౨౮ మహర్షి ఔరవుడు

౧. మనస్సును స్వాధీనములో నుంచుకొనువాడు, దోష యుక్తములైన సమస్త వర్తనలను త్యాగము చేయగలుగును.

౨. ఎవరి మనస్సులను నొప్పించకుము, నిన్ను ద్వేషించిన వారిని ప్రేమించుము. కామక్రోధ లోభాదులకు వశ్యుడవు కాకుము.

౩. ఎవని అంతఃకరణము ప్రేమలో ద్రవీభూతమందునో, ముక్తి వాని వశములో నుండును.

## ౨౯ మహర్షి అగస్త్యుడు

౧. మానసిక మలినమును నాశనము చేసినవాడే మహాత్ముడు. ఎవడు తన ఇంద్రియములను తనవశము చేసుకోగలుగునో వాడే సమస్తమును జయించినవాడు.

౨. ఎవడు ప్రతిగ్రహము చేయడో, ఇతరుల సొత్తును ముట్టడో, ఉన్నదానితో సంతోషించునో, వాడు ముక్తిని బడయును.

౩. స్వల్పాహారి, ఇంద్రియ నిగ్రహుడు, అన్ని ఆసక్తులను త్యాగము చేయగలుగును.

## ౩౦ మహర్షి శౌనకుడు

౧. ధనము, యౌవనము, కీర్తి, రాజ్యము, అన్నియును అనిత్యములేకాన, బుద్ధిగలవాడు, సంగ్రహమ్మును, పరిగ్రహమును, త్యాగము చేయవలెను. లేనిచో, నాశనమగును జాగ్రత! ఆలసించకుడు. ఆశ మహా చెడ్డది. తృష్ణగలవాడు పాపులలో మహాపాపి.

౨. మనస్సునకు శాంతియుండిన, శరీరముకూడా ఆరోగ్యముగ నుండును. మనోవ్యాధికి కారణము మమత, మోహమే.

౩. పుణ్యకార్యములు చేయుటకై ధనము సంపాదించు కోరిక యుండరాదు. విరాగమునే సంపాదించ ప్రయత్నించుడు. మురికి ముట్టుకొని తరువాత చేతులు కడుగుకొనుటకంటె నట్టి మురికి ముట్టుకొనకుండుటయే మంచిది. కాన, ధనాశను విడువుడు.

## ౩౧ మహర్షి పరాశరుడు

౧. నిన్ను నీవెట్లు ప్రేమించుకొందువో, ఇతరులనట్లే ప్రేమించుము. ఇతరులను ద్వేషించితివా, అదే ద్వేషము, ద్విగుణీకృతమై నిన్ను దుఃఖపెట్టును.

౨. ప్రపంచములోని ఏవస్తువులలోను సుఖదుఃఖములు లేవు. నీమనస్సులోని వికారములే సుఖదుఃఖములుగా భాసించుచుండును.

౩. ఎవని కర్మలు వానికే దుఃఖములు కలిగించును. నీ జన్మకు నీ కర్మలే కారణముకాన, ఇతరులను దోషులుగా భావించకుము.

౪. కోరికలను, క్రోధమును, ద్వేషమును వీడుము.

## ౩౨ మహర్షి జైమిని

౧. ఎవడు శిశువులకు, అతిథులకు భోజనము పెట్టక, ప్ర ప్రథమమునవే తాను తినునో, వాడు మహా పాపి. ఆ తిండి అపవిత్రమైనది.

౨. సంతోషముతో దానము చేయుము, ఫలితము కోరకుము. పగలు నిద్రించకుము. ఇతరులకు అనుకూలముగా వర్తించుము.

౩. శ్రద్ధవల్ల సంసారసాగరమును దాటవచ్చును, శ్రద్ధవల్ల ధర్మ చింతన కలుగును. దీనివల్ల భక్తి కుదురును.

౪. ధనసంగ్రహము మహాపాపము. నరకము ప్రాప్తించును కాన, ధనసంపత్తులను త్యజించుము. ఆశను వీడుము.

౫. సుఖభోగములకు లోబడి ధర్మమును, మానవమర్యాదలను విడచినవాడు నరకకూపముల బడును.

౬. ఇతరుల నిందించకుము. ఇతరులదోషములను చూడకుము. ఏ జీవికిని ఏలాటిహాని చేయకుము.

## ౩౩ మహర్షి వైశంపాయనుడు

౧. ధనరాసులు, యౌవనము, సౌందర్యము, దారా పుత్రాదులు, ప్రియజనులయొక్క సహవాసము, అన్నియు నశించును. కాన వివేకము గలవాడు ఇందులో ఆసక్తుడు కారాదు.

౨. ధర్మమునకై ధనమును కోరుట బురద అంటించుకొని కడుగుకొనునట్లుకాన, పాపిష్టిధనమును సంగ్రహించి దాని నివారణకై ధర్మము చేయుటకంటే ధనమును సంపాదించు సంకల్పము చేయకుండుట మేలు.

౩. క్రోధము, అసూయ, ఈర్ష్య, లేనివాడు శాంతిని పొందును.

## ౩౪ మహర్షి బకుడు

౧. ఇతరులను ఆశ్రయించక, స్వతః కష్టించి సంపాదించిన గంజినైన అతిధులకు పెట్టి శేషమును తినువాడే శ్రేష్ఠుడు. పరద్రవ్యము మహాపాపము.

౨. ప్రపంచమున చాలాకాలము జీవించువారికి అసభ్యత గల పరిస్థితులతో సంబంధమున్నూ, ప్రియమయినవారు నశించుటయున్ను కలిగి దుఃఖము కలుగును. కలయుట, వెంటనే విడిపోవుట సంభవించును కాన, ప్రపంచమందలి మమతను వీడుడు.

## ౩౫ మహర్షి ధధీచి

[వీరిని, దేవతలు యాచించగానే ఈ శరీరము ఎన్నడో యొకనాడు నశించునదేయని పరోపకారమునకై ఉపయోగించితే మంచిదని తన శరీరమునుంచి వెన్నెముకను తీసి దేవతలకు సంతోషముగా యిచ్చినవారు.]

౧. వృక్షములు సైతము పరోపకారము చేయుచుండునుకదా! మానవుడు జడములకంటె హీనుడు కారాదు.

౨. నీ ప్రాణములను అడ్డుపెట్టియైనా ఇతరుల దుఃఖములను నివారింపుము. సమస్త పదార్థములు నశించునవే. వాటికై ఆశించి, నశించకుము.

## ౩౬ మహర్షి ఋభుడు

[ఈయన మహా క్షమాశీలుడు. శిష్యుడు భుజములపైన ఎక్కితే సంతోషించువాడు. తనకొరకై గుడిసెకూడా లేకుండెను. దేనిని కోరువాడుకాడు.

మల విక్షేప ఆవరణ రహితుడై, నిరాడంబరముగా తిరిగేవాడు, శరీరముతప్ప; వేరే ఏలాటివస్తువు లేకుండెను.]

౧. మానవుని జీవనోద్దేశ్యము, ఆత్మజ్ఞానప్రాప్తియే. నమ్రుడై అందరికి దాసుడై సేవచేయుటే ముఖ్యము.

## ౩౭ మహర్షి శాండిల్యుడు

౧. భక్తివినా, ముక్తి దొరుకదు, భగవంతుని శరణు పొందుడు.

౨. ఉపాధినాశనమైతేగాని, భ్రమ నివృత్తి కాజాలదు. ఈ ఉపాధినాశనమునకై భక్తియే ప్రధానము. బ్రహ్మభావమును పొందుటకు కూడా భక్తియేముఖ్యము, భక్తిమినహా జ్ఞానముకలుగదు.

## ౩౮ మహర్షి ముద్గలుడు

[వీరు ఉంఛవృత్తితో పదిహేనుదినములకు, అనగా పూర్ణిమ, అమవాస్య రోజుమాత్రమే, అందరు భుజించిన తర్వాతనే భుజించేవారు. ఒకసారి మూడుమాసాలవరకు నిరాహారిగావున్నారు. వైకుంఠము నుంచి విమానమువచ్చినను ఎవరికిలేనిది నాకు అక్కరలేదని దానిని త్యజించినాడు.]

౧. ఇతరులను దోషులనిభావించకుము,మనస్సును ఇంద్రియములను నీవశములో నుంచుకొని, శుద్ధమనస్కుడవై, స్వతఃగా కష్టించి సంపాదించిన ధనాన్ని లేనివారికి పంచిపెట్టుము. నీకైయుంచ బోకుము, దేనిని కోరకుము, నిస్సంగుడవుకమ్ము, ఆలసించకుము.

## ౩౯ మహర్షి పతంజలి

౧. అహింసాప్రకాశభాసురుడగు వానితో, నెల్లభూతములు వైరమును వీడును.

౨. సకలభూతముల సుఖదుఃఖములను తనవిగా జూచుకొను వాడె భగవంతునికి ప్రియుడు.

౩. ఈ విశ్వమందు మృదుమధుర వచనముకంటె, ప్రియమైన దేదియులేదు. కటుభాషణముచే, నుపకారముచేసినను, నది ప్రేమ భాజనము కాజాలదు.

## ౪౦ మహర్షి కపిలుడు

౧. పరమాత్మయే పురుషోత్తముడు, అతడే బ్రహ్మము, వానినే శుద్ధచైతన్యమందురు అట్టి చైతన్యము మనకు కనపడదు. ఈ దృశ్యవస్తువుల ద్వారా తెలిసికొనగలము, యోగులు కోరునట్టి అంతిమ ధ్యేయమేమన, కనబడువిషయములతో పూర్తిగా సంబంధము వదులుకొని, ఉపాసనవల్ల అంతిమ ధ్యేయమగు ఆ పరమాత్మతో సంబంధము కలుపుకొనుటయే. నిర్గుణబ్రహ్మమని పిలువబడునది; ఆ చైతన్య స్వరూపమే, కాని, భ్రమవలన వ్యతిరిక్తముగా పనిచేయు ఇంద్రియములద్వారా చైతన్యము, ధ్వని మొదలగు ఇతరగుణములు కలదిగా జీవునకు కనుపించును.

౨. స్వధర్మము నాచరింపుము, అధర్మమును విడువుము. దైవవశమున లభించినదానికి సంతోషించుము. ఆత్మ విధుల నర్చించుము, మోక్ష ధర్మాసక్తుడవుగమ్ము, మితము, శుద్ధమునగు నాహారము భుజించుము.

౩. అహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము, తపస్సు మౌనము మొదలగునవి ఆచరించుము.

## ౪౧ మహర్షి పర్ణాదుడు

౧. మనస్సు సర్వ పదార్థములయందలి, అనురాగమును విడిచి, ద్వేషమును విడిచి, లోలోన ఆత్మదర్శనము చేయునేని అదియే ముక్తి, మోక్షము.

## ౪౨ మహర్షి మార్కండేయుడు

౧. అన్ని ప్రాణులను నీప్రాణతుల్యముగా చూడుము, నేను అందరికంటె గొప్పవాడనని, అహంకారపడకుము, అందరికిదాసుడనని తలంచుము.

౨. ఇతరులను దోషులుగా భావించకుము, అందరియెడ వినయము చూపుము, సమస్త జీవులను ప్రేమించి సేవచేయుము.

౩. అన్నదానము చేయుచుండుము, జ్ఞానదానమే శ్రేష్ఠము, నీకు తెలిసినదానిని ఆచరించుచు, ఇతరులకు బోధించుచుండుము, ఇంద్రియ నిగ్రహముచేయుము, అధర్మమును త్యజించి ధర్మమును ఆచరించుము.

## ౪౩ మహర్షి వాల్మీకి

౧. శాంతము, సమదర్శనము మరియు సమస్తజీవుల యెడ హితము, ప్రేమగలిగి సదా భగవద్ధ్యానము గలవాడే నిజమైన భక్తుడు.

౨. ఎవడు అహంకార శూన్యుడో, ఎవనికి ప్రియాప్రియము లందు రాగద్వేషములుండవో, ఎవనికి మట్టియందు బంగారమందు సమానదృష్టిగలదో, వానిహృదయమందు భగవంతుడు నివసించును.

౩. ఎవడు ఈ ప్రపంచమును, మాయగా దలంచి సమస్త కర్మ లను భగవంతునికర్పించునో, వాడె భగవంతునికి ప్రియుడు.

౪. సమస్తజీవులయందు భగవానుని చూచువాని చిత్తమే భగవానుని నిజగృహము.

౫. క్షుధ, తృష్ణ, సుఖదుఃఖములు, భయము మొదలగునవి, ప్రాణ మనో బుద్ధి వికారములనియే భావించుచు, సంసార వికారముల నుండి విముక్తుడైన వాడే, జీవన్ముక్తుడు.

## ౪౪ మహర్షి భృగువు

౧. ధర్మాధర్మములను వివేకముచే విచారించి వేదోక్తమార్గము ననుసరించుచు, సమస్తజీవుల హితమును కోరువాడే నిజమైన మానవుడు.

౨. సమస్త జగత్తును విష్ణుస్వరూపముగా చూచువాడే భక్తుడు, భేదబుద్ధిలేనివాడే ముక్తుడు, శత్రు మిత్రుల పట్ల సమతగలవాడే భగవత్ప్రియుడు.

౩. సంపూర్ణేంద్రియములను వశపరచుకొనువాడే, జగత్తును జయించినవాడు. విధివశమున దొరికినదానితో, సంతోషించువాడే శాంతుడు.

౪. సమస్తసంసార విషయవాసనలయందలి మమతను త్యజించిన, వాడే ముక్తిలభించును.

౫. నాది, నేను, అనేభావముండరాదు, నీకొరకై ఎవరిని, దేనిని అడుగకుము, సమస్తకోరికలను వీడుము.

## ౪౫ మహర్షి పులస్త్యుడు

౧. ఎవని సమస్తేంద్రియములు, సంయమమున నుండునో, వానిమనస్సు జయించబడును.

౨. ప్రతిగ్రహించకుము, ఎవరిని ఏదియు కోరకుము, ఇచ్చినా తీసుకోకుము, ప్రారబ్ధవశమునదొరికిన దానితోనే సంతోషించుము.

౩. అభిమానము, క్రోధము, మోహము, లోభము, మొదలగు నవన్నియు త్యజించి సత్యవ్రతుడవై జీవయాత్రగడుపుము.

౪. సమస్త జీవులలో ఈశ్వరుడు గలడని భావించి ప్రేమించి సేవించుము, ఇదే నిజమైన పూజగా దలంచుము.

## ౪౯. రాజర్షి ఖట్వాంగుడు

౧. మనుష్య శరీరము మళ్లీదొరుకుట దుర్లభము, ఈ శరీరముతోనే భవసాగరమును దాటకపోయితివా, ముందుపడయే నీచయోనులందుపుట్టవలసివచ్చునో, ఏగతిపొందుదువో ఎవరికెరుక.

౨. దేవతలు కూడా ఇంద్రియములకు వశులై సుఖభోగాసక్తులైయుందురు. వారిని సేవించి స్వర్గమును కోరుటచే లాభమేమి?

౩. ఈ నిస్సారమైన సంసారసుఖభోగములలో పడినశించకుము, విషయవాసనలను త్యజించుము.

౪. ఎవడు మృత్యువుకు భయపడడో, వానికి సంసారములో దేనితోను భయముండదు, కోరికలే భయమునకు కారణములు.

౫. ఒకక్షణమాత్రమైనను,సమస్తమును విడచి నిశ్చలచిత్తుడవై భగవద్ధ్యానములో నిమగ్నుడవైతివా, నీజన్మతరించును.

## ౫౦ శ్రీ సూతుడు

౧. ఈ సారహీనమైన సంసారములో, ఆసక్తియను దురాశలో పడి, నశించునట్టి మానవులారా, ఒక్కక్షణమైనను, ఆలసించక అసత్యమైనవానిని త్యజించి, నిత్యమైన భగవత్ భక్తిని చేకొనుడు.

౨. భగవంతుడు విధించిన ప్రకారము ఆచరించితివా భగవంతుడు సంతోషించును, సకల ప్రపంచముచే పూజింపబడుదువు.

౩. సమస్తము బ్రహ్మమయమే, భేదభావముండరాదు, సమస్త జీవులను ప్రేమించి సేవించుము.

౪. మొదలు నీవు ఆచరించి తదుపరి ఇతరులకు చెప్పుము, వినిన దానిని, తెలిసికొనిన దానిని ఆచరించకపోవుట; సంగ్రహాదోషము.

అదియు పాపమే సుమా! మనోవాక్కాయ కర్మలు ఏకరూపమైనపుడే అంతశ్శుద్ధికలుగును. దానిచే భక్తికుదురును, భక్తిచేముక్తి దొరుకును.

## ౪౦ ఋషిగణము

౧. సంసారములో నిందచేయు వారితో సమానులగు మిత్రులు వేరేలేరు, ఎందుకన, వీరు పాపములను పంచుకొని, పుణ్యములనిత్తురు, కాన నిన్ను నిందించువారిని, నీవు దీవించుము, సంతోషించుము.

౨. ఏది నీకు ప్రతికూలమనుపించునో, దానిని ఇతరులకై వినియోగించకుము, పరస్త్రీని మాతవలె పరద్రవ్యమును మట్టిపెల్లవలె సర్వభూతములను తనవలె చూచువాడు, ముక్తిని పొందును.

## ౪౧ ముని ఉదంకుడు

౧. సజ్జనులు పాపులను దండించరు, వారిపాపములను నశింప జేయ ప్రయత్నింతురు.

౨. నిన్ను నీ శత్రువులు, తిట్టినా, కొట్టినా, వారిని క్షమించి, ప్రేమించి, సేవించుము.

౩. ఏ జీవికిని హానిచేయకుము. సంసారములో శత్రువులు లేకుండా ఆచరించుటే, మానవునియొక్క ముఖ్యధర్మము.

౪. భార్యా, పుత్ర, పరివారముయొక్క మోహములోబడి, తెలిసియుండియు, పాపకార్యములు చేయుట మూర్ఖత్వము. ముందు నీగతి ఏమగునో విచారించుకొనుము. ఎవడు ఇతరుల ధనమును అపహరించి తన కుటుంబ సంరక్షణ చేయునో, వాడు ఒకరోజు సమస్తమును విడచి, ఒంటరిగా నరకకూపములో బడవలసి వచ్చును. అప్పుడు నీకు దిక్కెవరుండరు, నీవైపు ఎవరూ చూడరు.

౫. ఓ మానవులారా, మానవ జీవనము పాపసంచయనమునకై దొరుకలేదు. జన్మరాహిత్యమునకే దొరికినదని మరువకుడు. కావున సమస్త విషయ వాసనలను వదలి, భగవంతుని ధ్యానించు చుండుడు.

## ౫౦ ఉద్దాలక మహాముని

౧. సంకల్పములను విడచినచో, శాంతి కలుగును. స్వర్గ భోగములనుకూడా పరిత్యజించుము.

౨. సంస్కారములు క్రమక్రమముగా క్షీణింప ఆరంభించునేని అపుడు ఆ మనస్సు మోక్షమునకు ప్రయత్నించు చున్నదని తెలిసి కొనుము.

౩. ముముక్షులు వాసనాక్షయమునకై ప్రయత్నింపవలెను. మనస్సుచే సర్వమును విడచి, నేను, నాది, అను తలంపును విడుము.

## ౫౧ గాధిమహాముని

౧. ప్రపంచమంతయు మనస్సులోనే యున్నది. వెలుపలలేదు. ప్రపంచమునకు మనస్సే ఆధారము.

౨. ఆత్మ ఏకరూపుడు, అతనికంటే భిన్నముగా, కాన వచ్చునది, అంతయు అసత్యమే, భ్రమయే కావున, ఆత్మ విచారముచే సంకల్పములను, ఆశలను విడుము.

## ౫౨ వీతహావ్య మహాముని

౧. అగ్నిహోత్రుని జ్వాలలు కట్టెలున్నంతవరకు చలించు చుండి, అవి కాలిపోగానే శాంతించునట్లు, ఆశలు నశించగానే మనస్సు శాంతించును.

౨. మద్యపానము చేసినవాడు, శుద్ధ చైతన్యాత్మకమగు తన స్వరూపమును మరచి, తనను, తానే అన్యునిగా భావించునట్లు మానవుడు, సంసారముయొక్క మమతలోబడి భ్రాంతిచేత, తనను తాను గుర్తించక, దేహమే నేనను భావముతో మెలగు చుండును.

౩. ఒకమారు చూడబడినట్టివి గాని, చూడబడనట్టివి గాని, ఏ పదార్థములైనను, నీ మనస్సులో వచ్చెనేని తక్షణమే వాటిని బ్రహ్మకు భిన్నముగానెరింగి పరిత్యజించుము. తలంపునకురానివ్వకుము,

౪. సమస్త పదార్థములు అనిత్యములు, కావున భోగవాంఛలను వదిలివేయుము. వైరాగ్యముకంటె శ్రేష్ఠమైన ఉపాయమేరొకటి లేదు. ముముక్షుడగువాడు, ఆత్మవిచారము చేయుచునే యుండవలెను. దృశ్యపదార్థములను తనకంటె భిన్నముగా దలంచి, నేనెవడను, ఈ ప్రపంచమనగా నేమి, ఇది ఏమిగానుండును, అని ఆలోచించవలెను.

౫. అభిమానమే సమస్త దోషములకు కారణము, ఆశ సంసారమునకు కారణము. కాన, సమస్త పదార్థములయందలి ఆశను అభిమానమును వదులుము.

౬. సంగరహితుడవు కమ్ము, అనగా పదార్థముల యందలి ఇచ్ఛయే సంగము. సుఖదుఃఖములకు లోనుగాక సమభావముతో, దైన్యమును విడచి, రాగద్వేషములు వదలి, ఆత్మవిచారుడవై మెలింగితివా, ముక్తి దొరుకును.

౭. గడచినదానికై విచారించక, రాబోవుదానికై ఊహింపక ఏ కోరికలులేక, నిశ్చలుడవై, ధ్యానించుచుండుము.

## ౫౩ మహర్షి శుక్రాచార్యులు

౧. జన్మలు కలుగుటకు సంకల్పములే కారణములు, కావున, ప్రపంచమునకు ఉత్పత్తిలేదు, సంకల్పములవలననే కలుగుచుండును.

౨. మానవుడు, అంతర్ముఖుడై తత్వవిచారము చేయునేని, బాహ్యావృత్తు లణుగును. అపుడే సంకల్పములు తొలుగును, సుఖదుఃఖము లుండనేరవు. వైరాగ్యము కలుగును.

౩. నే నెవడను, ఈ ప్రపంచ మెట్లు పుట్టినది, అని సర్వదా విచారించు చుండుము.

౪. సంసార సముద్రమును తరింప దలచువారికి, మనోజయమను తరణికన్న ఇతరమగు, పదార్థము ముల్లోకము అందునూ లేదు.

ఇతర అవయవములను నిరోధించి యైనను, చేతనైనన్ని ఉపాయములతో, మొట్టమొదట మనస్సును జయింపుము. యోగముచే, వివేకముచే పరతత్త్వమును నిర్ణయించి ఇంద్రియములను అణచి సంసారమును తరింపుము.

## ౨౪. శ్రీ కచుడు

౧. లోపలను, వెలుపలను, సర్వము ఆత్మయే, నాయందు లేని పదార్థము ఎందునూ లేదు. నేనులేని పదార్థముకూడా ఎందునూ లేదు, ఇట్లు సర్వము ఆత్మరూపమై యుండగా, నేను, ఇక దేనిని కోరుదును.

౨. సంసారము, అనిత్యమను విషయమును దృఢముగ నిశ్చయించి, నే నెవడను, ఇది ఏమిటని విచారించుము.

౩. మృత్యువును అవమానించకుము. అదినీకు గురువు, సుమా, దాని భయముచేత నైనా పాపకార్యములు చేయవు, అది నీ మంచికే.

౪. చిత్తమే సర్వము, చిత్తము నశ్లేయుంచి ఇతరముల విడచినను, పరిపూర్ణత్యాగము, కానేరదు. చిత్తమనగా, అహంకారము. నేను, నేను అనునదే అహంకారము. దీనినే విడువవలెను. దీనిని విడుచుటకు సర్వదా భగవద్ధ్యానమే సాధనము.

౫. దేహాభిమానము వల్లనే, నీకు నాశనము, కావున, నేను దేహమును కాను, ఆత్మను, అని నిశ్చయించితివా, మోక్షమే.

## ౨౫. కాకభూషండుడు

౧. ఏది శాశ్వతమైనదో దానినే విచారించి తెలిసికొంటివా, అదియే దుఃఖములను నశింపజేయును.

౨. ప్రాణచింతనచేయుడు వచ్చుచు పోవుచున్న ప్రాణముల యందు ధ్యానముంచుడు, చిత్తమును బాహ్యావ్యాపారములనుంచి మరలించి ప్రాణములను విచారించుచుండు స్థలము హృదయకమలమే.

సుఖ దుఃఖములను సరకుగొనక, ఆశలను విడచి సర్వజనులకు మిత్రుడవై ఆత్మచింతన జేయుము. కలిమిలేముల తలంపులు బొత్తిగా విడువుము.

౩. ప్రతి మనుష్యుడు సర్వభోగములను పరిత్యజింప వలయును. ఆత్మచింతనచే మనస్సును అణచవలయును.

## ౫౬ కపిలమాత, దేవహూతి

౧. మానవశరీరము భోగవిలాసములకై పుట్టలేదు, ఆత్మ సాక్షాత్కార నిమిత్తమే దొరికినది. భాగవతము (౩) మూడవ స్కంధములోని ౨౧ అధ్యాయమునుంచి ౩౨ అధ్యాయమువరకు ప్రతి మానవుడు పఠించుట చాలా మంచిది.

౨. మానవజన్మమెత్తి ఆత్మకల్యాణమునకై పాటుబడనివాడు తన చేతనే, తనను నశింప చేసుకొనును.

౩. మోక్షమును గురించి లభించిన శరీరమును విషయ భోగములకై వినియోగించు వారు, అమృతమునిచ్చి విషమును గ్రహించి నట్లేకదా!

౪. సంసార బంధములనుండి విడబడి భగవద్ధ్యానము చేయు చుండుట శ్రేష్ఠము.

## ౫౭ మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూరు

౧. యీ లోకములో, మానవులు, సర్వసాధారణముగా సుఖ భోగములతో సరససల్లాపములతో, నిద్రాహారములతో, కాలమును వృథాపుచ్చు చుందురు; ఎంత విచారకరము, ఆలోచించుడు, మీ కర్తవ్యమును మరువకుడు.

౨. దేశజనులకు కల్యాణ మొనర్చుటకు, ఒకే ఉపాయము. అది ధర్మజ్ఞానముతో గూడిన విద్య నొసంగుటయే సుమా? ౧౦ కాను;

మీరు మొదలు ధర్మమును ఆచరించి తదుపరి ఇతరులకు ధర్మోపదేశము చేయుడు.

౩. పలాటి కోరికలు, ఆశలు, రాగ ద్వేషములుండరాదు. లభించిన దానితోనే సంతోషించు చుండుము.

౪. ఏ జీవికిని హాని చేయకుము దుఃఖితుల బాధలను బాపుటకు వారికి ప్రేమతో సేవచేయుము, న్యాయశీలుడవుగమ్ము.

౫. ఎవరినైనా, ఇతరులను తిరస్కరించినచో నీవు వారిని ఓదార్చి సంతోష పెట్టుము, ఎవరెట్టి యాపద పడుచున్నను, వాని విమోచనముకై నీ యావచ్ఛక్తిని ప్రయోగింపుము, లోభివి కాకుము.

౬. ధర్మపిపాసుడవై తత్త్వానుసంధానము చేయుచుండుము. అహోరాత్రములు శ్రద్ధతో సేవా తత్పరుడవుకమ్ము; కఠోర సాధనలచే ముక్తిని సాధించుము.

౭. చిన్నా, పెద్ద, బీద, ధనిక, మొదలగు వారినందరిని, భేదములేకుండా వాదించకుము ఆదరించుము. అహంకారము పడకుము. నీకంటె అందరు గొప్పవారనే తలంచుము.

౮. నీలో తప్పులుంటే, తెలుసుకొని, సరిదిద్దుకొనుము.

౯. సంసారివికమ్ము, కాని సంసారములో బంధింప బడకుము. నీవు సంసారములో ఉండినను సంసారము నీతో వుండనీయకుము, దేని యందునూ, మమత, మోహము వుండరాదు. కోరికలే బంధమునకు కారణము.

౧౦. నిరాడంబర జీవితమును గడుపుము, నీకై అధికముగా వ్యయము పెట్టకుము, ఎవరికీ లేని సౌకర్యములు నీకుండరాదు. ఋణ బాధితుడవు కాకుము.

౧౧. మీరేమి చేసినను, పరమాత్మను మాత్రము మరువకుడు; సదా స్మరించుచు ధ్యానించు చుండుడు.

౧౨. త్యాగివి, ఉదారుడవు కమ్ము; ఏకాంతవాసము, మౌనము, అవలంబించుము; నిర్లిప్తుడవుకమ్ము.

౧౩. శత్రువును, అనిష్టుని, హింసకుని, నిందించువానిని కూడా ప్రేమించి సేవించుము; స్వార్థరహితుడవుకమ్ము.

౧౪. అందరికి నిర్విచారముగ, నిస్సందేహముగ, ధర్మ విషయములను, తత్త్వవిషయములను, బోధించు చుండుము.

## ౨౮. రమణమహర్షి

౧. తన చుట్టుప్రక్కల ప్రజలు ఎట్లు జీవించుచుందురో, ఏమి తిందురో, మానవుడైనవాడు, అట్లే జీవించవలయును. అట్లే తినవలెను. ఎన్ని రుచికర పదార్థములు ముందరికివచ్చినను, వాటిని తినక, ఇతరులకు పంచిపెట్టవలెను. ఇతరులకులేని సౌకర్యము నాకెందులకని, ఆ సౌకర్యములను ఇతరులకే కలిగించవలెను.

౨. నిస్వార్థ కర్మాచరణము చిత్తశుద్ధిని కలిగించును, ధ్యానముతో స్థిరపడడానికి మనస్సునకు సహాయపడును.

౩. నే నెవ్వడను, ఎక్కడున్నాను, అని ఆత్మాలోచన చేసితివా, నీలోనే వున్నానని తెలుసుకుందువు.

౪. భగవంతుడు వారి వారి కర్మానుసారము జీవుల నాడించును, జరుగకూడనిది ఎవరెంత యత్నించినను జరుగదు. జరుగునది ఎవరెంత అడ్డుపెట్టినను జరుగనే జరుగును. ఇది సత్యము. కనుక మౌనముగా నుండుటే ఉత్తమము.

౫. ఎన్నడును నిన్ను నీవు మరువవద్దు. ప్రమాదపడిన అదియే మృత్యువు. ఆత్మను మరచిపోయినయెడల అధోగతి చెందుదువు, నిన్ను నీ వుద్ధరించుకొనుము.

౬. ఆత్మసాధనమునకు మూడు మార్గములు. (౧) ఆత్మాలోచనము (౨) ధ్యానము (౩) ప్రాణ నిరోధనము.

౭. దేహము నశ్వరమని ఎవడు తలంచునో, వాడు ఆత్మ విచారమునకు అధికారి. సత్యజీవనము గోరుచో ఈ జీవనమును పోగొట్టుకొనవలెను సుమా!

౮. ఇది భగవంతుని రాజ్యము, మనమందు అతిథిప్రాయులమే కాని, వానికి హానిచేయు అధికారము మనకు లేదు.

౯. ఏవి నశ్వరములో, అసద్వస్తువులో, వానిని మనస్సుచేత, నిరాకరింపగా, నేదిపోదో, నిలిచియుండునో, అదే జ్ఞానము.

౧౦. కామము, ప్రేమ, రెండింటికి, ఎంతదూరము? ఒకటి స్వర్గము, ఒకటి నరకము, ఈ రెండిటి భేదము నెంచకపోయినవారు నాశనమగుదురు.

౧౧. సర్వచింతలనువిడిచి, ఆత్మను వెదకుటయందే కాలము గడుపుడు. సర్వవిషయములను విడవవలెను. విషయములతో విష యేచ్ఛలు పోవును.

౧౨. నీకు ప్రపంచములో ఏది, నాదనేది వుండరాదు.

౧౩. వైరాగ్యము, విషయేచ్ఛా నివృత్తి ఈ గుణములు సంపాదించకముందు, ఆముష్మిక విచారములు వ్యర్థములు.

౧౪. ఆత్మవిచారమువల్లనే, వైరాగ్యముకలుగును. మనస్సులో తలంపులు కలుగుచున్నంతవరకు విచారము చేయుచుండుము.

౧౫. విషయములన్నిటిని, నిరసించి ఆత్మను జూడుడు. మరణ భయమును విడువుడు. ఆహారచింతనమును వదలుడు.

౧౬. నీకున్నది బీదలకు, దుఃఖితులకీయుము, నీ కొరకు ఇతరులను కష్టపెట్టకుము, నిన్నెవరెంత బాధపెట్టినను వారిపై కోప పడకుము.

౧౭. భగవంతునియందు విశ్వాసముంచుము, నీవు ఆయన కింకరుండవు. కర్త ఆయన, నిష్కామకర్మ చేయుచు ఫలముల కోరక, నిశ్చింతగా వుండుము.

౧౮. పరలోకము కావలెనన్న, ఈ లోకముమీద ఆశలువిడిచి, నీలోవున్న ఆత్మ చెప్పినట్లు నడుచుకుంటివా, మోక్షము. రెండిటిమీద ఆశవుండి వర్తించితివా, నరకము. రెండింటికి చెడినవాడ వగుదువు, ఇది సత్యము.

౧౯. విచారమెంతవరకుచెయ్యవలెను ? మనస్సులో వాసన లుండి తలంపులు కలుగుచున్నంతవరకు, శత్రువులు కోటలో నున్నంత వరకు. ఒక్కొక్కడు బయటికిరాగానే, వానిని జంపివేయుచు, చివ రకు కోటను బట్టుకొనవచ్చును. అట్లే తలంపులను ముట్టడించి, ఒకొక్కటి పైకిరాగానే విచారముచే నాశనముచేయుము. తలంపు లను సమూలముగ నాశనముచేయుటకే వైరాగ్యమని పేరు కనుక ఆత్మానుభూతి లభించునంతవరకు విచారమావశ్యకమే. ఆత్మ సద్వస్తు వను తలంపు, నిరతమై నిరంతరమగువరకు నుండవలయును.

౨౦. నియమములన్నిటిలో గొప్పదియగు, మితసాత్వికాహార నియమముచే మనస్సుయొక్క సత్వగుణము పెంపొంది ఆత్మ విచార మునకు, సహాయపడును.

౨౧. ఆత్మచింతనముతప్ప ఇతరచింతలు పుట్టుటకు కొంచ మైనను చోటీయక. ఆత్మ నిష్ఠాపరుడైయుండుటయే తన్ను ఈశ్వరు నకు అర్పించుకొనుట.

౨౨. సుఖమనునది ఆత్మ స్వరూపమే. సుఖమును, ఆత్మ స్వరూపమును వేరుకావు. ఆత్మసుఖమొక్కటే సత్యము. ప్రపంచ వస్తువులయందొక దానియందైనను, సుఖమనునది లేదు. వాటినుండి సుఖము కలుగుచున్నదని, మన అవివేకమువలన దలంచుచున్నాము.

౨౩. తలంపే మనస్సుయొక్క స్వరూపము. తలంపును వదిలి, జగంబను ఒక వస్తువు అన్యముగలేదు. నిద్రయందు తలంపులు లేవు. జగత్తులేదు. జాగ్రత్స్వప్నములందు తలంపులుగలవు, జగత్తు గలదు. కాబట్టి; జగము తోచునపుడు స్వరూపము తోచదు. స్వరూ

పము ప్రకాశించునపుడు జగము తోచదు ఈ శరీరమునందు నేను అని తోచునది ఏదియో అదియే మనస్సు. మనస్సులేనిది ప్రపంచమే లేదు. మనస్సువల్ల తలంపులు పుట్టుచున్నవి. వెంటనే నే నెవడను, అను విచారముచేతనే మనస్సు అణుగును. ఎన్ని తలంపులు పుట్టిననేమి, జాగ్రతగ నొకొక్క తలంపును, పుట్టినతోడనే, ఇది ఎవరికి కలిగినది అని విచారించినట్లయితే నాకనితోచును. నే నెవడనని ప్రశ్నించుకొనుచో, మనస్సు తనపుట్టుచోటుకు మరులును. అనగా పుట్టినతలంపు అణగిపోవును. ఈ విధముగా అభ్యాసము కానుకాను మనస్సు స్థాయిగ నిలుచును.తలంపులులేనపుడు మనస్సు ఆనంద మనుభవించుచుండును. ఆత్మ సుఖమొకటే సత్యము. ప్రపంచమును స్వప్నమువలె తలంచుము.

౨౪. ఈశ్వరునిపై భారము మోపక, ఇట్లుచేయవలెను, అట్లు చేయవలెను అని, సదా చింతించుటేల? రైలుబండి, భారములన్నియు మోసుకొని పోవుట తెలిసియుండియు, దానియం దెక్కిపొయ్యేడు మనము మన చిన్నమూటను, అందుపడవైచి సుఖముగా నుండక దానిని మన శిరముపై నుంచుకొని ఏల కష్టపడవలెను.

౨౫. సమస్త ప్రపంచ ఆశలను వదలి, నీ మనస్సును స్వచ్ఛము చేసుక, ఇంక ఏమైన మైల లోన వున్నదా, అని విచారించి, పరిశుద్ధ ఆత్మ గలవాడవై, పిమ్మట భగవంతునిపై పూర్తిగ భారమువేసి నిష్కామకర్మ చేయుచు, ధ్యానించు చుండుము.

౨౬. నిష్కామ మానవసేవగాని, సంఘసేవగాని, శాంతికి తోడుపడును, సంఘ ఋణము తీర్పక, కేవలము జపముచేతనే ముక్తి దొరకదు.

౨౭. నిన్ను నీవు మరువకుము. మరచితివా, పశువై పోయెదవు.

[రమణమహర్షి, తిరువన్నామల చేరిన మొదటి రోజే, ఈ దేహమునకు మిఠాయీలు మధుర పదార్థములు పెట్టవలయునా అని

దగ్గరనున్న మిఠాయిని పారవేసెను. వస్త్రమును చీరి ఒక పేలికను, కౌపీనము పెట్టి, మిగిలిన బట్టను మరియు ౩½ రూపాయిలను పారవేసెను. ఆరోజునుంచి ధనమును తాకలేదు.

ఒకరోజు ఆశ్రమములోకి చోరులు వచ్చి వీరిని కొట్టితె, వారినిచూచి "నాయనా మీకు తృప్తికాకపోతే యీవైపుకూడా కొట్టుడు" అని రెండోభాగము చూపిరి. దీనికై ఆశ్రమవాసులు విచారించగ, నాయనా! మన నాలుకను, ఒకపుడు మన పండ్లే కోరుకును కదా, అపుడు ఆ పండ్లను, శిక్షింతుమా, కాన, వారిని క్షమించుటే, ధర్మము.]

## ౩౮ భగవాన్ సత్యానంద మహర్షి

౧. ఇతరులకు అహితమైనటువంటి, ఏ కార్యములను చేయకుము.

౨. నీ ప్రతిపనిని, నీవే చేసుకొనుము. ఇతరులతో సేవ చేయించుకోకుము.

౩. లాభనష్టములందు, సమానదృష్టి గలవాడవై సహించి, అనుభవించుము; కష్టములయందు సుఖమును, నష్టములయందు లాభమును చూడుము.

౪. తనకు లాభము లేకపోయినను, ఇతరుల సత్కార్యములను పాడొనర్చువాడు నరాధముడు.

౫. దేహాభిమానమును వీడితివా, సమస్త సంసార సంబంధములు నశించును. నేనే గొప్పవాడనని, అహంకారపడి చెడిపోకుము.

౬. జిహ్వేంద్రియమును, నీవశములో వుంచుకొనుము; దానికి తినుట, తిట్టుట, రెండు శక్తులున్నవి. వీటిచే ముక్తుడవు కావచ్చు లేక బంధింపబడవచ్చు. కాన చాలా జాగ్రతగ నిగ్రహించుము. మిత భాషివికమ్ము, సాత్విక మితాహారమునే తినుము. రుచికై దేనిని తినకుము, నియమబద్ధమైన జీవితమే మానవునియొక్క ధర్మము.

౭. సమస్త సంపదలను త్యజించి, ఇంద్రియములను జయించి, సర్వసంగ పరిత్యాగివి కమ్ము; మనస్సును వశపరచుకొనుటకు ధ్యాన మార్గమే ముఖ్యము.

౮. ఎవరిని ఏదికోరకుము, పరాధీనుడవు కాకుము, లోభివి కాకుము, లేనివారి కిచ్చుచుండుము; ధనసంపత్తులను సంగ్రహించకుము. దుర్గుణాలను విడువుము; పరుల దోషములను జూడకుము. పదవులకు కీర్తి, ప్రతిష్ఠలకు, ఆశ పడకుము.

౯. ప్రతిరోజు శారీరక కష్టము చేయుచు, ఆరోగ్యవంతుడవు గమ్ము; ఇతరుల సొత్తు తినకుము, కష్టించే తినుము.

౧౦. మనస్సుతో భగవత్స్మరణ చేతులతో లోక సేవ చేయుడు; అమూల్యమైన కాలమును వ్యర్థముగా పాడుచేయకుడు.

౧౧. పాలలో తోడువేసి, యొకేస్థలములో నుంచిన, పేరు కొని ఎట్లు, దధియగునో అట్లే సాధకుడు ఒకేస్థలమున నివసించి, ధ్యాన క్రమము ననుసరించినచో, సిద్ధి బడయును; లేనిచో, ఎన్నాళ్లు చేసినా వృధానే.

## ౭౦ మహారాజు మనువు

౧. ధర్మరతుణకు ఒక్కపిల్లవాడు చాలును, ఎక్కువ బిడ్డల కనినయెడ, కామజులే సుమా.

౨. ధర్మమువల్ల కష్టపడుచుకూడా, అధర్మమునైన పనులకు పూనుకోరాదు. ధర్మమే జయమగును, పరాధీనతకంటె స్వాధీనతయే శ్రేష్ఠము.

౩. అధికభోజనము, ఆరోగ్యమును, ఆయువును, పుణ్యమును నాశనముచేసి లోకనిందకు దారితీయును. కాన అధికభోజనమును త్యజించుము.

౪. అన్యాయార్జితమైన ద్రవ్యమును అనుభవింపకుము. అది మహాపాపమైనది. ప్రియముగా సత్యముగా వర్తింపుము.

# ౬౧ మహారాజు ఇక్ష్వాకుడు

౧. ఇంద్రియములను ఆదరింపకూడదు. తిరస్కరించకూడదు. ఇంద్రియములతో పనివుండరాదు, వాటిపని అవిచేసుకొనును. నీవు సాక్షిగానుండుము, దేహమే నేనను బుద్ధి ఒక్కటే ఈ సంసారమునకు మూలమై వున్నది. కాన భ్రాంతిని విడిచి పరమాత్మను ధ్యానించుము.

౨. ఈ దృశ్య పదార్థమునకు నీవు సాక్షివే కాని, నిన్ను దీనిలో ఒకటియు తెలుసుకొననేరదు. బాగుగా విచారించిన, ఇంద్రియములకు అగోచరుడ వగుటచేత, నీవు అదృశ్యుడవే, కాని దృశ్యుడవు కావు. పరమేశ్వరుడు తన స్వరూపమేయై యుండగా, ఆయనకై వెదుకుట కంటె వెఱ్ఱితనము వేరే కలదా! అజ్ఞానమువల్ల జనులు అట్లే చేయుచున్నారు. కాన జ్ఞానముతో విచారింపుము.

౩. జలము గాలిచేత, అలలు బుద్బుధములు మొదలగు రూపములతో నెట్లు గానవచ్చు చున్నదో, అట్లే ఆత్మయును మనఃసంకల్పములచేత ప్రపంచాది రూపములతో గానవచ్చుచున్నది. కాన నీవు చిత్తమును మొట్టమొదట సంకల్ప శూన్యము గావించి, పరబ్రహ్మను తెలిసికొని, సర్వసందేహ వర్జితుండవై యుండుము. మనస్సుచేయు వ్యవహారములకును, నీకును సంబంధములేదు. వ్యవహారమందు దానికి చాంచల్యము కలిగినను, అది ఆత్మకు కలిగెనని దుఃఖింపకుము, అంతా భ్రాంతియే, నిశ్చలుండవుకమ్ము. సర్వపదార్థములను సమదృష్టితో చూడగలిగితివా, దుఃఖము పుట్టదు. భేదభావమే దుఃఖమునకు కారణము.

౪. ఇదినాది, నేను దీనివాడను, అను భ్రాంతి విడువనిచో, అధోగతికి పోవుదువు. ఏక్షణమందు సర్వవ్యాపకమగు చైతన్యము తెలిసికొనబడునో, ఆక్షణమే సర్వమువర్జించి పరమేశ్వరుడ వయ్యెదవు.

౫. జ్ఞానమునకు ౭ మెట్లు.

(1) శాస్త్రవిచారము సత్పురుష సమాగమము, చేతనబుద్ధిని అభివృద్ధి చేసుకొనుట.

(2) శాస్త్రాదుల వలన తత్వమును విచారించుట.

(3) నేను సర్వసాక్షిని నాకు ప్రపంచముతో పనిలేదు అని తలంచుచు సంకల్పమును దృఢము చేసుకొనుట.

(4) ఏ సంకల్పములు లేక సర్వవాసనలను నాశనమొనరించుట.

(5) శుద్ధబ్రహ్మానందమును సమాధినుండి అనుభవించుట.

(6) నిదిరించువానివలె సంకల్ప శూన్యమై వుండుట.

(7) శాంతిస్వరూపము, తురీయావస్థ, ఇదియే జీవన్ముక్తి.

ఇందు నాల్గవ యవస్థ వచ్చునంత వరకే, ప్రయత్నము తరువాత తక్కిన అవస్థలు అభ్యాస బలముచేత, స్వయముగనే, వచ్చును.. సమ భాగము కలుగుచే ముక్తి యనుట, నిస్సంశయము.

౬. ఎవనికి ఏపదార్థములు అనుభవ కాలమందు సుఖము కలిగించునో, వానికా పదార్థముల యొక్క వినాశకాలమునందు దుఃఖము కలిగించును. ఏ పదార్థము నందు సుఖదుఃఖము లేదు, మన భ్రాంతి, కల్పనలే, సుమా. కర్మలెప్పటికిని పురుషుని, బంధించునవి కావు! ఊరక ఇవి నన్ను బంధించుచున్నవని భ్రాంతి జెందుటయే. మరేమియు లేదు.

౭. విషయేచ్ఛ ఎంతవరకుండునో, అంతవరకే ఆత్మకు, జీవనామ ముండును. బాగుగా విచారించిన, ఆ యిచ్ఛ అజ్ఞాన కల్పితమే కాని స్వాభావికము కాదు. కాన, జ్ఞానోదయముచేత ఆ యిచ్ఛ ఎన్నడు నశించునో, అప్పుడే జీవుడు తన జీవత్వమును వదలి, నిర్వికారుడై బ్రహ్మత్వమును జెందును.

౮. సర్వకర్మ ఫలములను, పరిత్యజించిన వానికి పుణ్యముతో గాని పాపముతోగాని సంబంధ ముండనేరదు,

౯. అహంకారమే మనస్సు. అదియే బంధమునకు కారణము. కాన, అహమును విడువుము.

౧౦. పురుషుడు తా నేపదార్థమును చూచినను, దానియందు కామము లేకపోయెనేని, ముక్తుడే యగును. కామము కలదేని, బంధము నొందును. నీ మనస్సునకు నచ్చిన పదార్థ మేదైన నుండు నేని, నీవు బంధమున జిక్కిన వాడవే. కాన తృణము మొదలు, బ్రహ్మ వరకు గల సర్వ పదార్థముల యందును నీకు ఏదియును రుచింప కుండునుగాక. అభిమానము ఆశయుండ కుండునుగాక. ఆసక్తి లేక పోయె నేని, ముక్తుడవే.

౧౧. జీవునకు ౩ రూపములు కలవు. దేహాభిమానము వలన, స్థూలసూక్ష్మములు రెండు వచ్చినవి. స్థూలదేహ మభిమానించి స్థూల మును, సూక్ష్మదేహ మభిమానించి సూక్ష్మమును, ఇవిగాక జీవునికి, స్వాభావికమగు, పరమేశ్వరరూప మొకటి గలదు. ఈ మూడవ రూపమే సత్యము, తక్కినవి నశించునవే. కాన, వాటిని విడువుడు.

(1) కాళ్ళు చేతులు మొదలగు వానితోగూడి సుఖభోగముల కొరకై పరుగులిడుచున్న స్థూలమే, అభిమానముచేత జీవునకు స్థూలదేహము.

(2) సంకల్పమే ఆకారముగా గలిగి దుఃఖములపాలుచేయు, మనస్సే ఆ జీవునకు సూక్ష్మదేహము. అదే ఇంద్రియములకురాజు.

(3) సంకల్ప వికల్పరహితమగు, బ్రహ్మయే జీవునకు స్వాభావిక రూపము, ఇదియే సత్యము.

౧౨. మనస్సునకు ౩ రూపము కలవు. (1) ఘోరము, (2) శాంతము, (3) మూఢము.

(1) జాగ్రదవస్థ యందున్న చిత్తము, ఘోరమని చెప్పబడును. అందుగల సుఖదుఃఖ భారము అమితమై మృతినొందు వరకు బాధించు చుండును.

(2) స్వప్నావస్థ యందున్న చిత్తము శాంత మనబడును. అపుడు సుఖదుఃఖములున్నను, తక్షణమే జాగ్రత్తతో అసత్యభావము కలుగుటచేత అది నశించును. కాన దుఃఖము వెంటనేపోవును.

(3) సుషుప్త్యవస్థయందున్న చిత్తము, మూఢమనబడును. అప్పుడు దానికేమి తెలియదుగదా, అదే గాఢనిద్ర.

౧౩. రామచంద్రా! నేను హస్తములను పైకెత్తి, సత్యమైన మాట యొకటి చెప్పెద, నమ్ముము. ఇదినాకు కావలయునను సంకల్పమేది కలదో అదియే సంసారము. ఆ సంకల్ప నాశనమే మోక్షము. కాన ఇచ్ఛను జయించితివేని ముక్తితథ్యము. ఇచ్ఛజనించె నేని తక్షణమే ఖండించుము. ఇచ్ఛయున్నంత కాలము జీవునికి సుఖము లేదు. దైన్యముపోదు.

౧౪. ఇతర పదార్థములను విడిచి, ఆ బ్రహ్మమునే ఏకాగ్ర చిత్తముతో స్మరించుటే కర్మత్యాగమన బడును. కాని కర్మలను పరిత్య జించుట కాదు, నిష్కామకర్మ చేయవలెను.

౧౫. నీమనస్సు లోకోపకారము చేయుట కభిలాష కలదై యుండునేని, అపుడు నీవు చేయవలసిన పని విద్యాదానమే. ఇతర దానము ఏదియు దీనివలె లోకము నుద్ధరింప నేరదు.

౧౬. నీమనో నేత్రము గుడ్డిదై దుఃఖములనేల చూచుచున్నది! నీవు దాని కాధారముగా జ్ఞానమను చేతికర్రై నూనుకొనుము. అపుడు నేత్రము గుడ్డిదైనను సన్మార్గము దొరుకును.

౧౭. ప్రపంచముతో నాకు సంబంధములేదు, నేను సాక్షిని, సుఖదుఃఖములు ఇంద్రియములవే, నావికావు, అని దృఢభావము గలవాడవై నిశ్చలుండవై నిలిచి వేడుకగా సంసార నాటకమును చూచుచుండుము.

౧౮. వైరాగ్యముకంటె, ఐశ్వర్యములేదు. సంసారముకంటే శత్రువులేదు. కాన నిష్కామివి గమ్ము.

## ౬౨ మహారాజు భగీరథుడు

౧. రోజుచేసినదే చేయుట అనుభవించినదే అనుభవించుటలో, లోకులు సిగ్గుపడుటలేదు. పిల్లవాండ్ల ఆటలవలెనున్న ఈసంసారము చూచి సిగ్గుపడనివాని బ్రతుకేల! విచారించుడు, మరువకుడు.

౨. తన యెదుటనున్న పదార్థములకు తానేసాక్షి యనుట ఎవనికి తెలియదు?

౩. ఈ దేహమనే పంజరము లజ్జా, దయ, శంక, ఇచ్ఛ, విసుగు కులము, శీలము, జాతి అను ఈ (౮) పాశములచేత నిర్మింపబడినది. కాన జ్ఞానముచేత వీటిని నశింపచేయును, ముక్తిదొరుకును.

[భగీరథుడు వైరాగ్యముబూని రాజ్యమువదిలి ధనసంపదలను పంచిపెట్టిరాజ్యమునుశత్రువులకిచ్చి అహంకారమును అభిమానమును వదిలి దారాపుత్రాదులను పరిత్యజించి,ఎవరును తన్ను గుర్తించని స్థలమునకు బోయి ఏకాంత నివాసము చేసెను.]

## ౬౩ శ్రీ రఘు మహారాజు

౧. ధనము సంపాదించుట దానము కొరకే, మితభాషణము; సత్యము కొరకె, యుద్ధము చేయుట నిష్కామ విజయము కొరకె, గృహస్థుడై యుండుట ధర్మసంతానము కొరకే, జీవించుట పరోపకారము చేయుటకొరకే.

౨. నీయొద్ద లేకున్నను నీ తనువును తాకట్టుపెట్టియైనా దీనులను కాపాడుము. నిన్నడిగిన వారికి లేదనకుండా ఇచ్చుచుండుము.

౩. ధనము, భూమి, జారిణిస్త్రీ మృత్యువు ఈ నాలుగు మూఢ మానవుని చూచి పరిహసించును. ఎట్లన 1. ధనము వాని కర్మాను సారముగా వచ్చుచుండును. వీరు చేయునదేమిలేదు. మరియు దీనికి ఆ తహతహ అట్టిలోభ మెందులకు? రేపటికని దాచియుంచుట నాది నాదని అనుకొనుట పిచ్చితనమే కదా; కనుకనే ఆధనము నవ్వును.

౪. భూమియు అట్లేకదా నాది, నాదనుకొనుచు, ఎందరో రాజులు వచ్చిపోయిరి. ప్రతివాడు నాది, నాదనుకుంటు చచ్చువాడే కదా? వీనికి ఏల ఈ పిచ్చిఅని, భూమినవ్వును.

౫. జారిణి స్త్రీ భర్త, తనను, తన బిడ్డను, ప్రేమించుటచూచి, తనమనస్సులో, పరహాసించును.

౬. మృత్యువు, రణరంగములో ప్రవేశించి, చావుకు భయపడి వెనుతిరిగిన వానిని, చూచి, పరిహాసించును. ఎందుకన, ఎపుడో ఒక సారిమృత్యువు తప్పదుకదా దీనికై అధర్మముగా వర్తించుట, పాపము కాదా.

## ౬౪ మహారాజా ముచుకుందుడు

౧. ఓ భగవానుడా! మహా ఉత్కృష్టమైన మానవ జన్మలభించి జన్మరాహిత్యమునకై ఎన్నోసదుపాయములు ప్రాప్తించినప్పటికిని అవివేకులై, నశించునట్టి మాయా సంసారమునకు ఆసక్తులై తుచ్ఛసుఖ భోగములకు దాసులై నరకకూపములో బడి నశించుచుందురు. ఇట్టి వారు నరపశువులుగాక మరేమగుదురు.

౨. ఓదేవుడా! నేనురాజునని గర్వించి, రాజ్యలక్ష్మి మదమువల్ల మోహబద్ధుడనై,యీ నశించునట్టి శరీరమునే, ఆత్మగా, శాశ్వతముగా భావించి, పుత్ర, మిత్ర, కళత్ర, ధన, సంపదల, మోహములోబడి, రథ, గజ, తురంగ, కాల్బలంబులచే, పరివేష్టుండనై సింహాసనాధిష్ఠుండనై యుక్తాయుక్తములను విచారించక, ఎన్నో పాపకార్యములు చేయుచు, కాలమంతయు వ్యర్థముగా పాడుచేసుకొంటిని.

౩. ఎవడు, ముందుబంగారు రథముపై నెక్కి తిరుగుచు, రాజు మహారాజు అనే బిరుదునుపొంది యుండెనో, వానిశరీరము కాల మృత్యువునకు, జిక్కి మృతినొందగానే బైటపారవేయగా, పశులు పీక్కొని తినును. భూమిలో పూడ్చినచో, కుళ్ళి పురుగులు పడును, అగ్నిలో దహనముచేసినచో, బూడిదరాసులగును,

౪. ప్రభూ! ఎవడు సమస్తదేశములను జయించిన, మహావీరుడో, గొప్పశూరుడో, ఎవనికి సమస్త రాజులు కప్పములర్పించి, దాసోహమనిరో, అట్టిపురుషుడే, విషయసుఖభోగము లనుభవించుటకు ఆసక్తుడై వస్తువులకు దాసుడై, స్త్రీకి వశుడై ఆమెచేతిలోను నొక ఆటబొమ్మయై తుచ్ఛమైన నరపశువుగా సిద్ధమగును.

౫. ఈ సంసారమందలి, మమత ధిక్కారమునకు సత్సంగము చేయుడు, ఏక్షణము సత్సంగము ప్రాప్తించునో, ఆక్షణమే, సాధు సత్పురుషుల సాంగత్యములభించి విషయవాసనల యందలి మమత నశించును. దానివల్ల ఆత్మజ్ఞానముకలుగును. దానిచే ఆత్మశుద్ధియగును. దానిచే ముక్తిలభించును.

౬. ఎవనికి ఎలాటి, పరిగ్రహానుండదో, వాడు పరిపూర్ణ ముక్తుడే, ఇందులో సందేహములేదు.

౭. అనేకులు విషయ భోగముల త్యజించి-తిరిగి, సుఖభోగము లందిచ్ఛగలవారలై దానము మొదలగు పుణ్యాకార్యములు చేయు చుందురు.దీనివల్ల జన్మతప్పదు, దుఃఖముతప్పదు. ఎలాటితృష్ణయున్నను జన్మతప్పదు, సుఖముకదాపిదొరకదు. దుఃఖముతప్పదు.

## ౭౫ శ్రీ హరిశ్చంద్ర మహారాజు

౧. రాజు ప్రజలయొక్కయు, తన కుటుంబముయొక్కయు సహాయమువలననే, యజ్ఞ-దాన తపః పుణ్యఫలములను పొందును. కాన, దానిఫలముకూడా, అందరుసమముగా, పంచుకొనుట సత్యము. స్వర్గఫలమేకాని మోక్షఫలమేగాని నాయొక్కనికి అవసరములేదు. అందరు భాగస్థులే. నాకు స్వార్థము వలదు.

౨. నేను స్వర్గ సుఖలోభములోబడి నా యొక్క ప్రియమైన ఉపకారులగు ప్రజలను త్యజించను. నాచేజరిగిన పుణ్యాకార్యముల ఫలమంతయు అందరితో సమానమేనాకు దొరుకవలెను. అందరికి సమాన అధికారమేకలదు.

౩. సత్యముతోనే నా ప్రాణమునిలిచి యున్నదని మరువను. అందులో నా ప్రాణము పోయినను సత్యమును వదలను.

## ౬౬ మహారాజ నహుషుడు

౧. ఎవనియందు ఆత్మసంబంధమైన శోభయుండునో, అతడే బ్రాహ్మణుడు. ఎచ్చట అట్టిదుండదో వాడు శూద్రుడు.

౨. ఎవరు కామక్రోధములచే పూరింప బడుచుందురో, ఎవరు హింస, దురాశలకు, అభ్యాసపడుదురో, అట్టివారు మనుష్యస్థితినుండి క్రిందికి త్రోయబడి, పశువుల జన్మనెత్తుదురు.

౩. ధనమువల్ల భ్రమజెంది జీవిత సౌఖ్యములలో మునిగియున్న వారందరు భ్రమ ప్రమాదములతో కూడియుండువారే!

౪. జితేంద్రియత్వము, వైరాగ్యము, దానము, అహింస, సన్మార్గము, యీ గుణములన్నియు, మనస్సునకు సహాయము చేయును. కులముగాని, వంశముగాని, కుటుంబముగాని, సహాయము చేయజాలవు.

## ౬౭ యయాతి మహారాజు

(వీరు వేలపండ్లు నిద్రాహారములులేక తపస్సు చేసినందున, స్వర్గప్రాప్తి కలిగి స్వర్గములో సంతోషముగా నుండేవారు. ఒకరోజు ఇంద్రసభలో, తనయొక్క తపస్సునుగూర్చి తనకంటె తపస్సులో గొప్పవాడు, లేడని, దేవతలకంటె, ఋషులకంటె, నేనే గొప్పవాడనని, తన ఆత్మప్రశంస, స్వయముగా చేసుకున్నందున, తపస్సుయొక్క ఫలము నశించి స్వర్గమునుంచి మర్త్యలోకములో పడెను. కాన, ఎవరైనను ఆత్మప్రశంస చేసికొనరాదు, వినరాదు.)

## ౬౮ మహారాజ దశరథుడు

౧. సూర్యునకు వుదయముతోకూడ, అస్తమయమును నియమిత మైనట్లు ప్రతివానికి పుట్టుకతోగూడ చావు నియమితము,

౨. సంకల్పమువల్ల ప్రపంచము పుట్టును, నశించును. సంకల్ప ములు గల జాగ్రత్స్వప్నావస్థల యందు మాత్రమే ప్రపంచము గానవచ్చును. సంకల్పములేని సుషుప్త్యవస్థ యందు ప్రపంచము గానరాక పోవుట అనుభవసిద్ధ విషయమె కదా, అంతయు శూన్యమే. సంకల్ప ములు లేకపోవుట యనగా వస్తువులను భావింప కుండుటయే! యని ఎరుగుము.

౩. కడచినదానిని విచారింపక, రాబోవుదానికై సంకల్పింపక, వర్తమానమునం దభిమాన ముంచక ఎప్పటికేది లభించునో దానిని ఆచరింప వలయును. మోక్షమును సాధించుటకు సంకల్ప నిర్మూలమే వుపాయము.

౪. సాధకుడగువాడు ఏమిచేయక దేనినిగురించి విచారించక వూరక యుండిన చాలును. సంకల్పములు తమంతటతామే నశించును.

౫. ఇంత అల్పకాల జీవితమునకై కోరికలు కోరి ఏల దుఃఖించెదవు, భోగేచ్ఛను విడచిపెట్టుము. ఈ కార్యము దుర్ఘటము కాదు, కొంచెము నిదానించి యూరకుండుము. పిమ్మట తమంతట తామే నశించును.

౬. రాగ ద్వేషములు క్షీణించుటయే సంసార నాశనము. సంకల్పములు, నేను కర్తనుగాను, అను దృఢభావముచేత నశించును. కర్త కానివానికి, సంకల్పములతో పనిలేదు. కాన నీవు కర్తవుగాకుము.

౭. ఆకాశమెట్లు శూన్యమో, ప్రపంచముకూడ అట్లే శూన్యము. ఈ భ్రాంతి సజ్జన సాంగత్యము మొదలగు పురుష ప్రయత్నముచేత నశించును.

౮. నేను, నాది, అను దేహాభిమానమును వదులుము. ఇచ్ఛ అంతయు సంకల్ప రూపమే, కాన కోరికలను పూర్తిగా వదులుము.

౯. స్వర్గ మర్త్య పాతాళలోకములో పరికించి చూచిననూ, పంచభూతములేకాని ఆరవ భూతము ఎందునులేదు. మరి ఆశ ఎందులకు, దేనినిగురించి విచారము.

౧౦. సమస్తమైన వాసనలను వదలి మౌనముగా నుండుటయే శ్రేష్ఠమైన పరమ పదము. కాన, సంకల్పశూన్యుడవు కమ్ము.

## ౬౯ మహారాజ మహీరథుడు

౧. దుఃఖజీవుల దుఃఖములను పోగొట్టుటకు ఒకక్షణముకూడా ఆలస్యము చేయుట పాపమే, జీవించుట వ్యర్థము.

౨. ఎవడు తనసుఖమే చూచుకొనునో వాడు రౌరవాది నరకములో బడును. సాధుపురుషులు ఇతరుల సుఖములోనే, తమ సుఖమును చూతురు. వారు మరణించి యైనా ఇతరులను జీవింప చేయుదురు.

## ౭౦ మహారాజ బృహదశ్వుడు

(వీరు నూరు అశ్వమేధ యజ్ఞములు చేసి, స్వర్గమునకు పోదలంచి, యజ్ఞమును ప్రారంభించినారు. ఒకరోజు తనగురువుగారు వారి సర్వస్వమును దానమడిగినారు, ఏది నీదో అదంతా నాకర్పించుమనగానే, తథాస్తని అర్పించినారు! అనగా శరీర మనోబుద్ధులతో సహా, సమర్పణ కాబడినట్లే కదా, మనస్సుతో ఆలోచించుటకు కూడా నీకు హక్కులేదని గురువుగా రన్నారు, వీరు సంకల్పనుశూన్యులైరి.)

౧. పూర్ణసమర్పణ చేసితివా పాపము పుణ్యము రెండును ఈశ్వరార్పణచెయ్యి నీవు దేనికి బాధ్యుడవు కాకుము! ఒక పుణ్యమునే కోరితివా వెంటనే పాపముకూడా వచ్చును. కాన ఏదికోరకుము! అర్పించి సంకల్ప శూన్యుడవుకమ్ము.

## ౭౧ మహారాజ జీమూతకేతుడు

(వీరు అపారధనవంతులు. ఒకరోజు ఒకసాధువు ఆజ్ఞలేకయే మహాల్ లోనికివచ్చి తన మంచముపై కూర్చుండెను. దానివల్ల రాజు కోపముతో మీరు లోనికెట్లు వచ్చితిరి ఈమహాల్ నాదని అనెను. ఈ మహాల్ నీదికాదు. ఇదొక ధర్మశాల అని సాధువు బదులు చెప్పెను. ఎట్లనగా దీనిలో నీకంటెముందు నీ తండ్రి తాతలుండి వెళ్ళిపోయిరి. కొన్నాళ్లకు నీవుకూడా అట్లే పోగలవు. కావున ఇదిధర్మశాలయే! మమతను వీడుము. భగవంతుని నమ్ముము.)

౧. రాజుల యిండ్లలో విషయవాసన వస్తువులు ఎక్కువగా నుండును! సాధువులకుండ దగదు. విషయములు విషముతో సమాన ములుగాన అన్నివిషయములను త్యజించవలెను.

## ౭౨ కోసలదేశపురాజు

(వీరు మహాపుదారులు దానశీలురు. కాశీరాజు కోసల రాజ్యము ను జయించినపుడు కోసలరాజు అరణ్యమునకు బోయి కాలము గడుపుచుండెను. కాశీరాజు ఆరాజును చంపుటకై ఎవరు కోసల రాజును నావద్దకి తేగలరో వారికి ఒక లక్షరూపాయలు బహుమతి యీయగలనని చాటించినాడు. అదివిని ఒక ఆర్తుడు అడివిలోకిపోయి కోసలరాజు తిరుగుచుండగా అదేరాజును కోసలరాజు ఎక్కడవున్నా డని అడిగెను. రాజు దయగలవాడై వాని దుఃఖమును తెలుసుకొని ధనముకొరకై బాధపడు చున్నాడని గ్రహించి మారువేషము వేసు కొని అతని వెంట కాశికి వచ్చి పగరాజు ఎదుటనిలిచి నేను కోసల రాజును నన్ను పట్టుకవచ్చిన వారికి లక్షరూపాయలు బహుమతి నిచ్చె దవు కదానన్ను యితడు పట్టుకవచ్చినాడు. నీవిచ్చు బహుమతి ఇతని కీయుమన్నాడు! అదివిని కాశీరాజు చకితుడై వెంటనే వారిరాజ్యము వారికి యిచ్చి క్షమాపణ కోరుకున్నాడు.)

## ౭౩ శ్రీ శిబిచక్రవర్తి

[వీరు శరణాగత ప్రాణిని రక్షించుట నావిధి అని పావుర మునకు బదులు తన శరీరమునుకోసి డేగకు ఇచ్చిరి.]

౧. ఏ జీవియైనను నీ శరణు జొచ్చునేని దానిని తప్పక రక్షించుము. తుదకు నీప్రాణమునైనా యిచ్చి దానిని రక్షించుటే నీకుముక్తి.

## ౭౪ శ్రీ జనకచక్రవర్తి

౧. ఎవడు తన హృదయమందున్న ప్రభువును గానలేక అన్య దేవతల నాశ్రయించునో వాడు మూఢుడు.

౨. మనస్సు అంతర్ముఖమై బ్రహ్మవైపునకు దిరిగెనేని అపుడే ఆశలు తెగిపోవును.

౩. ఇంద్రియములను అణచినను మరల మరల పైకివచ్చు చుండును. కాన ఖండితముగా దండించు చుండవలెను, మరువవలదు. ఎన్నికష్టములనైనను పడి మనస్సును జయించ వలెను.

౪. ఎవడు ప్రపంచ పదార్థములన్నియు దుఃఖమును కలిగించు నవియే యని యెరింగియును ఆపదార్థములనే కోరుచున్నాడో అట్టి వాడు మనుష్యుడుకాడు. నరపశువే సుమా!

౫. సంపాదించిన సంపద ఏమయినది! బ్రహ్మసృష్టించిన ప్రపంచములన్నియు నేవి? ఇవన్నియు కాలగర్భములో విలీనమైనవి. కాన ఇట్టి వస్తువులందు నమ్మకమెందులకు. భార్యా పుత్రులు ధన సంపదలు మనము చూచుచుండగనే నశించును. లేదా వాటిని విడిచి మనమే మరణింతుము.

౬. ఏ వస్తువులపై మనుజుడు ప్రేమ నిలుపునో ఆ వస్తువు లన్నియు వానియొక్క త్వరితనాశనముకై కారణభూతములగు చున్నవి.

౭. పరమార్థ చింతనము రేపుచేయుదునని ఆలసించకుము. మృత్యువు సిద్ధముగా నున్నది కాన వెంటనే ఆలోచించుము.

౮. గడచినదానికై చింతించక రాబోవుదానికై విచారించక జరుగుచున్నది మాత్రము ఇష్టమైనను అనిష్టమైనను సంతోషముగా రాగ ద్వేషశూన్యుండవై దానిని ఆచరించు చుండుము. ఏలాటి కోరిక లుండరాదుసుమా.

౯. ఆత్మజ్ఞాన సంపాదన కొరకై క్రొత్తకార్యమును దేనిని ఆశ్రయింప పనిలేదు. ఆత్మ విచారమువల్లనే జ్ఞానము వైరాగ్యము కలుగును.

౧౦. ముముక్షువగువాడు, సర్వకాలములయందును లోలోన సర్వకార్యములను విచారించు చుండవలయును.

౧౧. సమదృష్టిగలవాని లక్షణములు, ఆశలేకపోవుట, భయము లేకుండుట, ఇష్టములగు పదార్థములను సంపాదించు కొనుటకు ప్రయత్నము లేకుండుట, అనిష్టము సంప్రాప్తమైనను దానిని తొలగించుకొన ప్రయత్నింపకుండుట,సర్వభూతములయందు దయగలిగి యుండుట, సదా సంతోషముగా నుండుట.

౧౨. రుచిచూడబడు పదార్థమునకంటెను; రుచిచూచువాని కంటెనుః (వేరై) రుచిచూడబడు దానికిని, రుచిచూచువానికి, నడుమ యున్నదై, కానవచ్చు (రుచియే) ఆనందము. అదేఆత్మ, అట్లే అనుభ వింపబడు పదార్థమునకు, అనుభవింపబడువానికి, మధ్యనున్న నిరాధార మగు అనుభవమే ఆత్మ. అనుభవించువాడు అనుభవింపబడునది అనునవి రెండును, ఉపాధులు. అట్లే ప్రకృతి ఒక వస్తువు. ఈశరీరము, అనుభ వించునది ( ఆనందించునదే ) మధ్యగల ఆత్మనిశ్చయము. నేనుకర్తను అనుట, నాకంటె భిన్నములని తలంచుట, అహంకారము.

౧౩. నాకును ఈ పదార్థములకును ఎట్టి సంబంధము లేదని భావింపుము. అశక్తుండవై మెలుంగుము, దేనిని, నాది అనుకోకుము.

౧౪. ఏది ఎట్లున్నను, పోయినను, నశించినను, సంతసించకుము. దుఃఖించకుము. వచ్చినను పోయినను, నీకు చింత ఏలా, నీకంటె భిన్నమైనది ఏది లేదుగదా.

౧౫. ప్రతి జీవుడు ఈ లోకమునందు లెక్కకు మిక్కిలియగు జన్మలను ఎత్తుచున్నాడు కదా, ఇట్టి వానికి వీడు బంధువు, వీడు శత్రువు, అనుతలంపు ఎట్లు, సర్వజంతు యోనులందు జనించువాడే అగుటచేత, వీనికి జంగమస్థావరరూప ప్రపంచమంతయు, బంధువే, అంతయు బంధువుకాన, ఈ భేదదృష్టి కేవలము భ్రాంతియే. జగత్తులోని ఏజీవిని కూడా భేదదృష్టితో చూడకుడు.

౧౬. కష్టములమీద కష్టములను అనుభవించితిని, విచారములపై విచారములు నన్ను బాధ పెట్టుచుండును. అయినను నాకు విరక్తి లేదు. ఆహో, ఇట్టి నానిర్భాగ్య జీవితమెంత హేయమైనది.

౧౭. బాధలవల్లను విచారముల వల్లను, అటునిటు పొర్లింపబడు సంసార సంబంధమందు బాధపడుటకంటె నరకమందలి మంటలో, నొక సారి పూర్తిగా మండిపోవుట శ్రేష్ఠము.

## ౭౫ బలిచక్రవర్తి

౧. ( వీరు పదివేల కోట్ల సంవత్సరములు రాజ్యమేలి ఒకనాడు బ్రతుకుపై విసుకుబుట్టి ఈ ప్రపంచమునగల సర్వభోగములను సుఖ దుఃఖములను వానినే మరల మరల రోజు అనుభవించినవే అనుభవించు చున్నానే? ఒకనాడు అన్నియునశించును. ఇన్నాళ్లు నేను బ్రతికి ఏమి ఫలము, సంపాదించితిని. అంతాసున్నయే. కొత్తది ఏదిలేదు. ఇంకా బ్రతుకెందుకు, సిగ్గగుచున్నది. తిన్నదే తినుట, కక్కినదే తిన్నట్లు రాత్రి పగళ్లుగడచి మళ్లివస్తూ, పోవుచున్నవే, ఏమి ఆశ్చర్యము. చేసినదానినే తిరిగిచేయుట, బుద్ధితక్కువపని, కాదా! నేడు దీనిని తింటిమికదా, రేపు దీనిని మరల తినవద్దనేది లేదుకదా. మళ్లీదానినే చేయుట, తినుట,

ఎంతవ్యర్థమైన పని, తృప్తి లేదు కదా ? ఇట్లు నాశనశీలమై చర్విత చర్వణముగ అనుభవించిన దానినే అనుభవించబడుచున్న ఈభోగముల కంటె (వేరై) ఎప్పటికినశింపని పదార్థము ఏదికలదో, దానిని ఆశ్రయించిన, నిత్యసుఖము దొరుకును. అని విచారించెను.)

౨. ఇట్లు చేసిన పనులనే ఎన్నిమార్లుచేసినా,ముగింపును తృప్తిని లేదుకదా! కావున వైరాగ్యముచేత ఆశలను విడిచి మనస్సును స్వాధీనము చేసికొనుడు. సర్వవిషయములందు అభిమానము ఆశయు వుంచకుండుటవలన మనో వ్యాపార మణగును, మనస్సును విషయము లందు పోనీయక పరమాత్మయందు నిలుపుడు.

౩. ఐశ్వర్యనాశనమునకైనను లేక నరకమునకైనను భయపడకుడు. కాని ఆడినమాట తప్పుటే గొప్ప రౌరవాది నరకము. ధర్మమే సంతుష్టి పరుచును.

౪. ఎవడు తన్ను తాను, అర్పించుకొనునో, వానికి దేవుడు అర్పించబడును.

## ౭౬ మహారాజ శిఖధ్వజుడు

౧. మనచే చూడబడుచున్న పదార్థములు మనశరీరముతో సహా అన్నియు నశించునవే. కాన బాహ్యరూపమును విడిచి సర్వకాలము లందు లోలోన సర్వాంతర్యామినే చూచుచుండ వలెను.

## ౭౭ మహారాజ రుక్మాంగదుడు

౧. ధనమును దాచిపెట్టుట పాపముకాన సమస్త సంసార విషయవాసనలపై మమతను త్యజించుడు.

౨. కర్తవ్యాకర్తవ్యముల విచారించియే కార్యముల చేయుడు, సదాజాగ్రతగా నుండుడు.

౩. నిన్ను నీవు శాసించుకొనుము, ఉదారశీలుడవు కమ్ము, అంతరాత్మ చెప్పినట్లు వర్తించుము.

౪. ఏకాదశీ వ్రతమును పాలించుడు, భగవంతుని సదా ధ్యానించుచుండుడు.

౫. ఏరాజు ప్రజారక్షణచేయడో, వాడు ధర్మాత్ముడైనప్పటికి అతనికి నరకము తప్పదు. 9/51

౬. తల్లిదండ్రుల ఆజ్ఞలను పాలించువాడే ధర్మాత్ముడు, అదే పుత్రునియొక్క ధర్మము.

## ౭౮ మహారాజ కేశిధ్వజుడు

౧. మట్టితో బెట్టిన గోడలను మట్టిజలముతోనే పూత పెట్టినట్లు ఈ మట్టితో ఏర్పడిన శరీరమునకు అన్నరూపమైన మట్టివల్లను నీటి వల్లను పుష్టిగలుగును. పంచభూతాత్మకమైన శరీరము పంచభూత పదార్థములచేతనే పుష్టిగానుండి అన్నిపనులు ఆచరించుచుండును. దానికై, నాది నేను చేయుచున్నానని అహంకారమేల! అంతా శూన్యమే.శరీరముయొక్క కర్మనంతయు ప్రకృతియే నడుపుచుండును. నీవు నిమిత్తమాత్రుడవు. (శరీరమును) నేనేఅనుకొని భ్రమపడి బంధించ బడుచుందువు.

౨. ఇతరులవల్ల అవమానపడే యోగి తొందరగ సిద్ధుడగును.

౩. ఒకపాత్రలో నీరు పోసి, క్రింద అగ్నిని పెట్టితే, నీరు వేడి అగునుకదా. అగ్ని నీరుకు తగులకయే నీరు వేడెక్కును. ఎట్లనగా పాత్రయొక్క సంసర్గమువల్ల నీరు వేడిఅయినట్లే, ప్రకృతియొక్క సంసర్గమువల్ల ఆత్మ, అహంకారములవల్ల దోషములపాలగును.

## ౭౯ మహారాజ లవణుడు

౧. ఈ ప్రపంచమంతయు ఇంద్రజాలమువంటిది, కల వంటిది కాన, శూన్యమే. నశించునదే, వట్టి భ్రాంతియేసుమా!

౨. త్రాటినిజూచి పామని తలచినట్లు, మనస్సుయొక్క వ్యాపారమునేచూచి సంసారమని తలంచుచున్నారు.

౩. ఎవనియొక్క మనస్సు సంకల్పములను విడిచి నిశ్చలమగునో వానికి ముక్తి దొరుకును.

## ౭౦ మహారాజ రంతిదేవుడు

(ఈయన తనప్రజలుతిననిదే తాను నీళ్లుకూడా త్రాగువాడు కాడు. తనవద్దనున్నదంతయు లేనివారికిచ్చి రాజ్యమునువదిలి భార్యా బిడ్డలతో అరణ్యములో ప్రవేశించెను. తుదకు కూటికి గుడ్డకు లేకుండా అయి (౪౮) రోజులు అన్నములేక ఉపవాసము చేసినాడు. తుదిరోజున ఎవరో అన్నముపెట్టితే దానినికూడా తనపిల్లలకు లేకున్నను అన్నార్తులకు పెట్టి భగవంతుని ప్రార్థించినాడు. ఏమనగా! అందరికి సుఖము గలిగించుము, అందరిదుఃఖముల నేనే అనుభవించగలను. ప్రజాసౌఖ్యమే నాసౌఖ్యము. ఇట్లు సదా ధ్యానించుచుండగా ఒకరోజు భగవద్దర్శనము కలిగినది.)

౧. పరుల దుఃఖములను నివారణ చేయుటకు మీ ప్రాణములనైనా అడ్డుపెట్టుడు. ఇదే ధర్మము, ఇదే మోక్షము.

## ౭౧ మహారాజు వసుదేవుడు

౧. ఎవడు తనమంచి కోరునో వాడు ఇతరులకు ద్రోహము చేయకూడదు. ఎందుకన కర్మయే జన్మకు కారణముకాన ద్రోహము చేసినవాడు తిరిగి వడ్డితోసహా దాని ఫలమును ఈ జన్మములోనో లేక మఱుజన్మలోనో తప్పక అనుభవించగలడు.

౨. మానవుడు రెండునాళ్ళుజీవించు శరీరముకొరకై పాపపు పనులు చేయరాదు. చచ్చిన తదుపరి లోకులు నిందించుదురు. క్షణిక జీవనమునకై లోకనింద పడరాదు.

## ౭౨ ఒక రాజు భక్తుడు

౧. (వీరు మహా ఉదారులు. ఇతరుల సుఖమే నాసుఖమనువారు. మొదలు అందరికిపెట్టి తదుపరి మిగిలిన అన్నమును తినువారు. ఆర్తులను

బీదలను రక్షించువారు. వీరు ఒకనాడు స్వర్గమునుండి నరకము చూడ గోరి పోయిరి. అక్కడ వుండునట్టిపాపులు ఈరాజునుచూచి రాజా! మీ దర్శనమువల్ల మాదుఃఖములు శాంతించినవి కాన కొంత సేపు ఇక్కడనే వుండుడని మొరపెట్టుకోగా, రాజు వారిమొరవిని, వీరి దుఃఖము తీరు వరకు నేనుకూడా నరకములోనే వుందునని అక్కడనే వుండెను. భగవంతుడు వీరిభక్తికి మెచ్చి అందరికి ముక్తినిచ్చెను.)

౨. దుఃఖితుల దుఃఖములను తొలగించనివాడు ఎన్ని పుణ్యకర్మలుచేసినా వ్యర్థమే. దీనులను రక్షించనివాడు రాక్షసుడేసుమా.

౩. ఇతరులసుఖమునకై తనప్రాణములనైనా అడ్డుపెట్టి వారిని రక్షించుటే ధర్మము. న్యాయము.

## ౮౩ శ్రీ సురఘు మహారాజు

౧. ఆత్మవిచారముచే నేనెవడను అని విచారించి, సమస్త విషయ వాసనలను విడచి, పరమాత్మను ధ్యానించినచో ముక్తి దొరుకును.

౨. కలిమి లేములు ఇంద్రియములయొక్క దృశ్యమే కాన కలిగినపుడు కలవనియు, లేనపుడు లేవనియు చెప్పబడును. ఆత్మ అట్లుకాదు. ఈఆత్మ బ్రహ్మమొదలు గడ్డిపోచవరకు వ్యాపించియున్నది.

౩. సంసారమును దాటుటకు, సత్పురుష సమాగమమే చక్కని నావ. దీనిని మరువకుము.

## ౮౪ ధర్మరాజు

౧. ధర్మముయొక్క రహస్యము హృదయ గుహయందు దాగియున్నది; దానిని కనుగొనుటకు సరియైన మార్గము, మహా పురుషులు నడచిన మార్గమే.

౨. శక్తియే ధర్మమునకు కారణము; దానమే కీర్తికి కారణము; సత్యమే స్వర్గమునకు కారణము, మంచినడకయే సౌఖ్యమునకు కారణము.

౩. ఇతరుల అధికారమును నష్టపరుచరాదు, ధిక్కరించరాదు. వారి వస్తువును తీసుకొనరాదు, ధర్మమును, సత్యమును త్యజించరాదు. ఎవడు ధర్మమును రక్షించునో ధర్మము వానిని రక్షించును; నీ దృష్టిని నింద్యవస్తువులపై పోనీయకుము చూడకుము.

౪. క్షమవల్ల క్రోధము నశించును, బ్రహ్మ పదవి లభించును. కాన క్షమను ఆశ్రయింపుము.

౫. కామమే సంసార బంధమునకు కారణము, కాన కామమును వీడుము, సుఖములోకెల్ల శ్రేష్ఠసుఖము సంతోషమే.

౬. దేవత, అతిథి, భృత్యువర్గము, పితురులు, ఆత్మ, ఈ అయిదింటిని ఎవడు పోషింపడో వాడు బ్రతికియున్నను చచ్చినవాడే.

## ౮౫ మహారాజ ప్రియవ్రతుడు

౧. (వీరు రాజ్యమువల్ల ప్రపంచ సంగమువల్ల పరమార్థ సుఖమునకు హాని చేకూరెనని చింతించి నేను ఇంద్రియములకు జిక్కి అవిద్యా విరచితంబులై విషమ విషయంబులచే నత్యంత నీరంధ్రంబైన సంసారాంధకూపమునంబడి, కామ భోగములందవిలి ఈ వనితకు క్రీడామృగంబునైతి. నిక జాలుంజాలు నిట్టి కుపథ ప్రవృత్తుండనై నా వర్తనంబు గటగటా పరమనింద్యంబయ్యెనని తన్ను తాను నిందించుకొనుచు సంసారవిముఖుడై సర్వసంగ పరిత్యాగియై సదా భగవంతుని ధ్యానించుచుండెను.)

## ౮౬ మహారాణి సౌభ్యా (హరిశ్చంద్రుని భార్య)

౧. సత్యరక్షణ చేయుడు, ఎవడు సత్యవ్రతుడుకాడో, వానిని మృత శరీరిగా భావించి త్యజించుటే మంచిది.

౨. నరశ్రేష్ఠునికి సత్యవ్రతముకంటె అధికమైన ధర్మము వేరొకటిలేదు.

౩. మానవుడు సత్యమును పాటించక, ఎన్ని యజ్ఞములు, దాన ధర్మములు, పుణ్యకర్మలు చేసినను, అన్నియు నిష్ఫలములే అధర్మములే.

౪. సంసార సాగరమును దాటుటకు సత్యవ్రత నిష్ఠయే శ్రేష్ఠము.

## ౮౬ మహారాణి సంధ్యావళి (రుక్మాంగదుని భార్య)

౧. హింసకు ఆరుగురు భాగస్వాములు; చంపినవాడు, పురికొల్పినవాడు, సహాయము చేసినవాడు, తిన్నవాడు, వండినవాడు, వడ్డించేవాడు, వీరందరు హింసాపరులే, పాపాత్ములే, హింసాపరులు ఎన్ని ధర్మములు చేసినను వ్యర్థమే! పాపము తప్పదు.

౨. అహింసా పరమో ధర్మః, కాన ఇతరుల మనస్సునుకూడా నొప్పింపరాదు. గడ్డిపోచకైనను కీడు చేయరాదు.

౩. ధర్మమునకు వెనుదీయకుము ధర్మమును, విడుచుటకంటె ప్రాణమును విడుచుట మేలు.

౪. నీ ప్రాణమును గోలుపోయిఐనను ఇతరులను రక్షింపుము. అడిగిన వారికి లేదనకుండా ఇచ్చి వారి సేవచేయుము.

## ౮౮ మహారాణి చూడాల (శిఖధ్వజుని భార్య)

౧. మనస్సుచేత, ఇంద్రియములచేత, చూడబడుచున్న పదార్థములన్నియు శూన్యరూపములే; వాని యదార్థరూపము బ్రహ్మమే. కాన ఆ పరమేశ్వరునే నమ్ముము.

౨. శరీరమునకు రెండు దుఃఖములు గలవు.

(1) శరీరమందు కలుగు జ్వరము మొదలగు దుఃఖములు వ్యాధులనంబడును.

(2) కేవలము సంకల్పములవల్ల పుట్టి మనస్సును బాధించు చింతలు ఆధులనంబడును.

ఈ రెండును ఆత్మజ్ఞానము లేకపోవుటచేత కలిగినవే. తత్త్వజ్ఞానము వలన ఈ రెండు నశించును. కోరిక లధికమై యుక్తాయుక్తము లెరుగక నాలుక రుచులకై మితిమీరి తినుటవల్ల కంటికియింపని తోచిన స్థలములకెల్ల విచారించక నడచుటవల్ల, చెడ్డకార్యములు చేయుటవల్ల శరీరరోగములు దుఃఖములు కలుగుచున్నవి.

౩. సమస్త కామములను త్యజించితివా వెంటనే ముక్తి కలుగును. శ్రద్ధలేనిది ఎన్ని వేదాంతములు విన్నా వ్యర్థమే. అహంకారము త్యాగముకానిది. ఎంత త్యాగము చేసినను, త్యాగమనంబడదు. నేను నాది అను భావము పోగానే నీవు త్యాగము చేయునది యుండనే యుండదు. నేనే లేనపుడు ఇక త్యాగము చేయువాడెవడు.

౪. ఇది సుఖము, ఇది దుఃఖము అను తలంపులు పుట్టుటయే బంధము. అది లేకుండుటే మోక్షము.

౫. సంసార దుఃఖము నశింపవలయుననిన, జ్ఞానమునే ఆర్జింపవలయును. ప్రయత్నముచేత వాసనలను విడుచుటచే మోక్షము కలుగును. ఎట్లనగా నే నెవడను, ఈ ప్రపంచ మెట్లు కలిగినది, సంసారమునకు నాకు సంబంధమేమి, బంధ మెట్లు వచ్చినది, మోక్ష మెట్లు వచ్చునని, విచారించుము. సాధువుల సహవాసము చేసి వారిని ఆశ్రయింపుము.

౬. ఎవడేని మనఃపూర్వకముగా ఆశలను, భోగములను, విడుచునేని, వాని అజ్ఞానము ధ్వంసమగును, ఆశయే అజ్ఞానమునకు ఆధారము.

౭. సర్వవ్యాపకమై యుండు మనస్సునే, లోకులు, జీవుడు, ప్రాణము, అనెదరు. విచారించిన అది జడమునుకాదు చేతనమును కాదు. సర్వప్రపంచమును (కల్పించుటచేత) అది జడముకాదు, సాక్షి

లేక ప్రకాశించునది కాకపోవుటచేత చేతనముకాదు. కాన ఈ చిత్తమును విడుచుటే త్యాగము; చిత్తత్యాగమే సర్వ పరిత్యాగము. చిత్తము నశించునేని, భేదాభేదములు రెండును తోడనే నశించును. కావున మనస్సును విడువుము; అనగా మనస్సును నాది అని అనుకోకుము. నీవు వేరు మనసు వేరు కదా.

౮. పరమేశ్వరుడు అమృతరూపి, ఆయన స్వస్వరూప మిట్లుండ, చిత్త ప్రభావము వలన ఆయనయందు లేని భేదముల నారోపించి జీవభావమును కల్పించి జనులు నిరర్థకముగ శోకింపుచున్నారు. కావున మనస్సును త్యజించిన కల్పనలన్నియు పోవును.

౯. మనకు అనుభవములోనున్న భ్రాంతియే మనస్సునకు స్వరూపము; ఇది ప్రపంచమను దృఢవాసనయే మనస్సునకు స్వరూపము. నేను నాది అనుటయే అహంకారము. కావున జాగ్రత! ప్రతిక్షణమందు పుట్టుచున్న కామక్రోధాదులను అణచి వేయుము, భోగములను సంకల్పింపకుము. కోరికలులేక శాంతుడవై యుండుము.

౧౦. సమస్త సంకల్పములు ఏస్థలమునందు పుట్టుచున్నవో దేనిచేత ప్రత్యేకముగ నిర్ణయించి ఎరుగబడుచున్నవో అట్టిజ్ఞానమే నీకు స్వస్వరూపము! అదియేకదా సర్వసాక్షి.

౧౧. ఏ పదార్థమునకైన నుత్పత్తి ప్రళయములు కలవనిన వానికి సాక్షి యుండవలయును. చేతనరూపమగు జ్ఞానమునకు మరియొక చేతనము సాక్షిగనుండుటకు వీలులేదు. బ్రహ్మముకంటె భిన్నమగు ప్రపంచమనునది ఒకటిలేదు. సర్వము భ్రాంతి కల్పితమే! నీవు కర్తవుగావు భోక్తవుగావు.

౧౨. ప్రపంచమంతయు చిద్రూపమే! సముద్రమంతయు జలమే! అయినట్లు ప్రపంచమంతయు బ్రహ్మమే. జలము తనకంటె భిన్నముకాని అలలచేత చలించునట్లు ఆ బ్రహ్మము బుద్ధివృత్తుల భ్రాంతిచేత ప్రపంచరూపముతో చలించు చున్నది.

౧౩. మేలుకొనువానికి ఆధారము బుద్ధియే! పండుకొనువాని మెలుకవకుకూడా (బుద్ధియే) తెలుసుకొనేది (బుద్ధియే) ఎరుక పరచునది (బుద్ధియే.)

౧౪. ఆశలను విడిచితివా సర్వదృశ్యములకును అతీతమైయున్న స్థలమును చూడగలవు. బ్రహ్మాపదవిని చూచితివా ధన్యుడవగుదువు.

౧౫. కర్మానుసారముగ సంభవించునది ఏమిచేసినను తొలగునది కాదు! కాన దుఃఖింపకుము.

## ౮౯ సామ్రాట్ అశోకచక్రవర్తి

౧. సర్వమును పరలోకహితము చేయుటే నా కర్తవ్యము. ఈ కర్తవ్యముతప్ప మరేమిలేదు.

౨. సత్కార్యములను చేయుట, ప్రజల నుద్ధరించుట ప్రజా సౌఖ్యమునకై పాటుబడుటే ముఖ్యము.

౩. నీతిని సంస్కరించు ముఖ్యసాధనము శాంతి సహనముల యందున్నది.

౪. ధర్మప్రచారముకన్న వేరైన దానము మరొకటి లేనేలేదు.

## ౯౦ మహారాజ విక్రమాదిత్యుడు

౧. తమతమ రక్షణము ప్రతిజీవి చేసికొనును, కాని ఇతరజీవుల రక్షణలో ఎవరు తమ ప్రాణమర్పింతురో వారే ధర్మాత్ములు. దయ లేని పుణ్యము వ్యర్థమే. ప్రాణ మర్పించియైనను ఇతరజీవులను రక్షించుటే ధర్మము.

## ౯౧ మహారాజు భర్తృహరి

౧. భోగములలో రోగముల భయము, శ్రీమంతములో పతనముయొక్క భయము, ధనములో వ్యయభయము కీర్తి మానములలో దీనతయొక్క భయము, బలములో శత్రువులభయము, రూపములో

వృద్ధావస్థ భయము, శాస్త్రములో వాద వివాదముల భయము, శరీరమునకు మృత్యువు భయము, సంసారములో యిన్ని భయములు కలవు. వైరాగ్యములో ఏలాటి భయములు లేవు.

౨. నీబొందిలో జీవముండగానే వృద్ధత్వము రాకముందే నీ కల్యాణమునకై ప్రయత్నించుము. ఆలసించకుము.

## ౯౨ భోజమహారాజు

౧. అన్నియు దేహముతోపాటు మనలను వదిలివేయును. కావున అవిఅన్నియు మిత్రములు కావు. మనలను విడువనిది ఒక ధర్మమేసుమా! భార్యాబిడ్డలు బంధువులు సమస్త సంపదలు నశించును. పెట్టినంత సేపే చుట్టాలు, కీర్తి ప్రతిష్ఠలు. లేనిచో ఎవరూ మనవైపు చూడరు. కాన దేనికిని ఆశపడకుడు. కోరకుడు. మమతను వీడుడు.

౨. ధర్మపరాఙ్ముఖునకు ఎన్ని విద్యాబుద్ధులున్నా ఎంత ధనమున్నా నరకము తప్పదు. మరువకుడు.

౩. అశాశ్వతమైన ధన, కనక, వస్తువాహనముల కాశింపక, శాశ్వతమైన ఆత్మసుఖమున కాశింపుము. ఇది కర్మభూమి. కర్మభూమిలో వున్నపుడే సమయము వచ్చినదికాన ధర్మకార్యము లొనర్చుము. పాపకార్యములు చేయకుము. స్వర్గాదులలో నీవేమి చేయుటకు వీలుండదు. ఇపుడే మంచిచేసుకొనుము.

౪. తనువు శాశ్వతముకాదు. నీటిబుగ్గవంటిది. ఎపుడెగిరిపోవునో. ఎగిరిపోయినపిమ్మట ఏమైపోవునో ఎరిగినవారెవరు లేరు. కాలమును నిగ్రహింపగలవారెవరులేరు.

౫. జరుగవలసినదేదో జరిగితీరును. దానికై చింతించనేల.

౬. నశించునట్టి ఈ శరీరమును గాపాడుకొనినను ప్రయోజనములేదు. శాశ్వతమగుకీర్తి శరీరమును గాపాడుకొనుము. మునుముందు కీర్తి సంపాదింపకూడదాయని యెన్న డనుకోకుము. మరు నిమిషము మనదికాదని నమ్ముము.

౭. కూడబెట్టువాడు ఎవడైనను క్రిందికి వంగియే యుండును. ఇచ్చుచుండువాడు మేఘమువలె లోకములో పై భాగమునందుండును. ఎవడు దానమొనర్పడో వాడు జీవన్మృతుడని యెరుంగుము.

౮. నీవు కష్టించి సంపాదించినదే తినుము. ఇతరుల సొత్తును తినవద్దు. పరాధీనుడవు కాకుము. ఇతరుల ఆధారముపై జీవించకుము.

౯. పురుషునకు సుగుణములు తన స్వాధీనములై యుండగా గుణము లేకుండుట దోషము. ధనము లదృష్టాధీమునలై యుండి నందున పురుషుని దోషమేమున్నది.

## ౯౩ మహారాజా ప్రతాపసింహాజీ (కాశ్మీరము)

(వీరు మహా దయాలురు. ఒకరోజు వీరు పోవుచుండగా, దారిలో పశువులు పండుకొనియుండుటచే వాటినిలేవగొట్టు ఇష్టము లేకుండెను. ఎందుకన నన్ను గురించి ఇతరజీవులకు కష్టమునివ్వకుండుటే ధర్మము.)

౧. బీదలకు దానముచేయుము. నీ విలాస సుఖ భోగముల కొరకై కర్చు పెట్టుకొనకుము. లేనివారికిచ్చుటే ధర్మము.

## ౯౪ మహారాజా రణజీతసింహాజీ

౧. (ఈ రాజుగారు ఎక్కడనో పోవుచుండగా నొక రవుతు రాజుగారి కాలునకు తగిలి చాలాబాధ కలిగెను. వెంటనే సిపాయీలు ఒక ముసలమ్మను పట్టుకొనివచ్చి రాజుఎదుట నిలపెట్టిరి. కారణము విచారించగా నాయనా నాపిల్లవాడు మూడు రోజులనుండి అన్నము లేక ఉపవాసము వున్నందున చెట్టుపైనున్న పండ్లు రాలుటకై రాయితో పండు రాలుటకై కొట్టితిని. అకస్మాత్తున ఆ రాయి తమకు తగిలినది. నన్ను క్షమించ గలరని ముసలమ్మ అనగానే రాజుగారు ఆముసలమ్మకు వేయిరూపాయలు యిప్పించి పంపించెను. దీనికై మంత్రులు ఆశ్చర్య పడి విచారించగా రాజుగారన్నారు. జడమైన వృక్షము రాళ్ళతో

కొట్టితె పండ్లనీయగా నేనుచేతనుడనై మానవుడనై రాజునై శిక్షించుట ఎంత పాపము. నేను యిచ్చినది చాలాస్వల్పమే మానవుడు ఇచ్చుటకే జన్మించినాడు.]

## ౯౩ మహారాజావీర్ ధవల్ (గుజరాత్)

(1) [వీరు ఒకరోజు మంచముపైపరుండి, కండ్లు మూసికొని యుండెను. సేవకుడు కాళ్ళు పిసుకుచు, చేతికివున్న రత్నపు ముద్దు టుంగరమును తీసి, తన నోట్లో పెట్టుకొనెను.రాజు అది గ్రహించియు, ఉదారుడై శాంతివహించెను. రెండవరోజు రెండవ వుంగరము పెట్టు కొని పరుండెను. ఆరోజు అట్లే సేవకుడు వుంగరమును తీయు చుండగా, రాజుచూచి నాయనా, నిన్నటియుంగరము నీకిచ్చివేసితిని దీనినితీయుట పాపము. కాని, నీది తప్పుకాదు, నీకు యివ్వబడే వేతనము కొద్ది. కాన, ఆ తప్పు నాది, నీకు లేక తీసితివి, నీది దోషము కాదన్నాడు.]

## ౯౪ శ్రీ శివాజిమహరాజ్

౧. నేను దానముచేయుచున్నాను, అందరికి జీవనోపాధి కలిగించుచున్నానని అహంకారపడకుము. నిన్ను నీవు పాలించుకొనలేవు. దానికై ఎందరి సహాయమో కావలెనుకదా! అందరిని పాలించు వాడు ఈశ్వరుడే అని మరువకుము, అహంకారపడకుము.

## ౯౫ చక్రవర్తి హారూన్

(ఈ చక్రవర్తి కుమారుణ్ణి తల్లిని ఇతరులు బూతుమాటలు తిట్టినారని చక్రవర్తితో కుమారుడు వచ్చిచెప్పగా కొందరు తిట్టిన వానిని చంపమని అన్నారు. కొందరు వాని నాలుకను కోయించ మన్నారు. కాని రాజుదానికి యిష్టపడక నాయనా అపకారికి ఉపకారమే శ్రేష్ఠము. కాన బదులుచెప్పక క్షమించుటే వీరత్వము, అదేధర్మము.)

## ౯౮ సామ్రాట్ ద్వితీయ జోసెఫ్ (జరమ్నీ)

[వీరుగొప్పదయాళురు. మారువేషమున ప్రజలయిండ్లవద్దకిపోయి వారిస్థితిగతులను రహస్యముగా తెలుసుకొని వారికి తగిన సహాయ్యము చేయుచుండు వారు ఇట్లే ఒకరోజు ఒక బీదరాలు రోగస్తురాలై యుండగా చూచివారికి తగిన ద్రవ్యమునిచ్చి వైద్యుని స్వయముగా తీసుకవచ్చి సేవచేసి తగు ఏర్పాట్లుచేసి పోయిరి.]

## ౯౯ బౌద్ధ సంస్థానాధీశులు

1 ప్రజలు ఏమితిందురో ఏమికట్టుదురో రాజులు, ధనవంతులు అట్లే తినవలెను.అట్లే కట్టవలెను.బీదలుకష్టపడి సంపాదించిన ద్రవ్యముచే ధనవంతులు పెద్దలమను వారు సుఖపడుట మహాపాపము.

2 ఎవడు కష్టించునో ఆకష్టఫలితము వాడే అనుభవించ వలెను. ప్రభువులు ప్రజలవలెనే నివసించవలెను.

3 ఈ రాజు స్వయముగా వీధులు వూడ్చుచు పాకీపని చేయు చుండువాడు. సత్య అహింసలయందు నిష్ఠకలవాడు.

## ౧౦౦ మహారాజ తారకాంతరాయ్ (బంగాళపురాజు)

1 (ఒకనాడు వీరిసేవకుడు వీరి శయ్యానుపరచి అప్రమత్తతతో ఆ శయ్యాపైన పడుకొని నిద్రించినాడు. వీరువచ్చి సేవకుని నిద్రాభంగము చేయక రాత్రైనప్పటికి క్రిందనే చాపవేసుకొని పరుండిరి. దీనిలోనే రాజుకు శాంతికలిగినది. ఎందుకన మరచి పరుండినందున దోషమేమి ? నిద్రకు మెత్తనిపరుపు, భూమి సమానమే. అట్లైనాకు సేవకునికి శరీరము నిద్ర సమానమేకదా ? వీరు ఇట్టి ద్వంద్వాతీతమైన దృష్టిని కనబరచిరి.)

## ౧౦౧ శ్రీరామచంద్రమూర్తి

౧. ఆయువు చివురుటాకు కొననున్న నీటిబొట్టువలె క్షణ భంగురము. రెప్పపాటున ఈ శరీరమును వదిలిపోవును.

౨. విషసర్పములబోలు విషయముల వలన చితికిన మనస్సు గల అవివేకుల జీవితము దుఃఖహేతువుగా నుండును.

౩. జీవితము శరత్కాల మేఘమువలెను, చమురులేని దీపము వలెను చంచల తరంగముల వలెను నిలుకడలేనిది దానిని లేనిదానిగనే తలంచుట మంచిది.

౪. అన్ని జీవులకు కారణభూతుడు నిర్గుణబ్రహ్మము. ఇతర మేమియు కాదు. అదియే పంచీకరణములకు కారణము కాని ప్రపంచ ముత్పత్తికి మాత్రము కారణభూతము కాదు.

౫. జీవన్ముక్తిని యీ జీవితమందే పొందవచ్చును. కాబట్టి నీవు కోరికలన్నియు విడిచి బ్రహ్మను నిరంతరము ధ్యానించుచుండుము.

౬. నేను శరీరమను నమ్మకముండుటయే బంధము భయము. నేను బ్రహ్మమునను గట్టినమ్మకమే మోక్షము. కాబట్టి బుద్ధిమంతుడు తన అహంభావమును పరమాత్మలో ఐక్యముచేసి, తాను ఎల్లపుడు నేను బ్రహ్మముననని జపించుచుండవలెను. అన్నిటిలో ఉత్తమమైన ఉపాసన ఇదియే.

౭. నేర్పుగల వాసనలచే ప్రాణములు కంపించుచున్నవి. వాసనలు కంపించుటలేదు. ఇది మనోబీజమువల్ల జరుపబడుచున్నది. మనోబీజము ఇతర అంకురములకు కారణమగుచున్నది.

౮. మనస్సను చెట్టునకు రెండు బీజములు కలవు. 1 ప్రాణముల కంపనము 2 వాసనలు. ఇందులో నొకటి నాశనమైనచో రెండవది దానియంతట అదియే నాశనమగును.

౯. ఎవడు సమాధియందు స్థిరుడై ప్రాపంచిక విషయముల నుండి ముక్తుడగునో, ఎవడు అకర్తగా నుండునో ఎవడు ఎట్టిమార్పును పొందక స్వేచ్ఛగలిగి యుండునో, అట్టివాడు విదేహుడని పిలువబడును.

౧౦. శరీరము యొక్క నశించెడి స్వభావమును తెలిసికొనుట వల్ల ప్రాపంచక వ్యవహారములు విడిచి పెట్టుదుము. దానివల్ల

అసంగత్వము అలవడును. దానిచే వాసనలు నశించును. వాసనలు నశించిన మనస్సు నిర్మలమగును.

౧౧. ఎపుడు మనస్సు పనిచేయుట మానునో అపుడు శాంతి నిచ్చునదియు, సన్నిహితముక్తికి కారణమైనదియగు చైతన్యము బయలుపడును.

౧౨. తనయొద్ద ఇంద్రియసౌఖ్యము కలిగించు వస్తువలున్నను వాటియందు ఉదాసీనత గలిగి గాఢనిద్రలో వున్నవానివలె నుండు వ్యక్తి, అచేతనుడనబడును. కోరికలను జయించినవాడగును.

౧౩. కోరిక లనుభవించుటవల్ల ఎన్నడు తృప్తిగలదు. ఇది బాగున్నది ఇదిబాగులేదనె భేదబుద్ధి వుండరాదు. సంగ రహితుడవు కమ్ము.

౧౪. ఎవడు మితముగాను, సత్యముగాను, మృదువుగాను, సందర్భానుకూలముగా మాట్లాడునో, అట్టివాడు నిజముగా మౌనియే. ప్రయోజనములేని ఏపనిని చేయకుము.

౧౫. బుద్ధిమంతుడు గౌరవమును విషమువలె అసహ్యించుకొనవలెను. అవమానమును లేక దూషణమును అమృతమువలె కోరవలెను.

౧౬. ద్వేషింపబడువాడు లేక అవమానింప బడువాడు, సుఖముగా నిద్రించును, సుఖముగా తినును. కాని ద్వేషించువాడు త్వరలో నశించును.

౧౭. కోపముగా నుండువానిని, ఎవడును కోపముతో చూడ గూడదు. అట్టివానితో మృదువుగా మాట్లాడవలెను. అసత్యభాషణము ఎంతమాత్రము పలుకకూడదు.

౧౮. ఇంద్రియములను స్వాధీనమందుంచుకొని మమత అసహ్యాభావమును నశింపచేసికొని, అన్నిప్రాణులను సమముగా ప్రేమించువాడు మోక్షమునకు హక్కుదారుడగును.

౧౯. శ్రీరామ చంద్రమూర్తి, లక్ష్మణస్వామితో చెప్పిన సుభాషితములు:

(1) సంసారములోని వస్తువులను గూర్చి చింతించుట వృథా! మనము దేనిని కోరుదుమో అది ప్రాప్తించదు. మనము దేనిని కోరమో స్వయముగా దానంతటదే ప్రాప్తించును. కాన ఆసక్తిలోపడుట మూర్ఖత. సమస్త కోరికలను త్యజించుము. ఏది ప్రారబ్ధములో నున్నదో అదే జరుగును. నిశ్చింతగా నుండుట మంచిది. ఇష్టానిష్టముల రెండింటిని సమానముగ భోగించుటయే మంచిది. నీవు స్వయముగా చూచుచున్నావు. నిన్నటి దినము నాకు పట్టాభిషేకము కానుండెను కదా! అది యేమయినది. యీరోజు అడవిలో పోవుచున్నాము. దీనికంటె మించిన సాపేక్ష వేరేపమి కావలెను. ప్రారబ్ధము తప్పదు. కాన ఏలాటి చింతలు చేయరాదు.

౨౦. నాతో గలయవలయునన్నచో సంసారమునుండి దూరముగా నుండుడు. ఇదే మోక్షము నిచ్చు తాళపుచెవి.

## ౧౦౨ శ్రీకృష్ణభగవానుడు

౧. విషయాసక్తిగలవాడు, స్థితి, బలము, కాలము మొదలగు వానిని, పాటింపక, తన ఆత్మకు వ్యతిరిక్తముగా, నుండునట్టి, అక్రమ అపవిత్రములైన పనులను చేయుచుండును. దీనివల్ల అంత్యకాలము సమీపింపకపోయినను ఇట్టి పనులు చివరకు, వాని పాపములను వృద్ధిచేసి, అధోగతిపాలు చేయును.

౨. చేయబడిన కర్మలు మంచివైనను, చెడ్డవైనను అవి నశింపవు. వాటిని తిరిగి తిరిగి చేయుటవల్ల వాటి ఫలములు, తిరిగి తిరిగి అనుభవింపవలసివచ్చును.

౩. ఏకాంతస్థలమున కూర్చొని, మౌనముగానుండి, ఏమియు, ఇతర ఆలోచనలులేక, విషయవాసనల నొకదాని తరువాత, నింకొక

దానియందు, విరాగము కలిగినవాడు, అన్ని కర్మలనుండి విముక్తు డగును.

౪. జీవించుటయందు, చచ్చుటయందు, సుఖ దుఃఖ లాభ నష్టములందు, ఇచ్ఛాద్వేషములు లేక, సమత్వబుద్ధిగలవాడు, తప్పక మోక్షము నొందును.

౫. సన్మార్గ, దుర్మార్గములు లేనివాడును, అప్రతిగ్రహీతయు, ఇతరులను దూషింపనివాడును, ద్వంద్వములకు అతీతుడును ధనము కూడబెట్టనివాడును, శరీరమును కృశింపజేయువాడును, శాంత్యాత్మ గలవాడును, ముక్తి పొందును.

౬. మనస్సును విషయములనుండి తొలగించి, అంతర్ముఖము చేయవలెను. మొదట తీవ్రమైన వైరాగ్యమును, అభ్యసింపవలెను. తరువాత ముక్తికొరకు యోగము నభ్యసింపవలెను.

౭. ఎవడు ఆత్మయొక్క అభేదతత్త్వమును, ఎపుడు గ్రహించునో, అట్టివానికి వేరే ప్రభువు లేదు.

౮. కూడబెట్టుట పూర్తిగా వ్యయముచేయువరకే యుండును. ఎక్కుట, పడిపోవునంతవరకే నుండును. కలియుట విడబాయువర కుండును. జీవితము చావుతో అంతమగును. అన్ని కర్మలకు హద్దు నాశనమే. యజ్ఞము దానములు, తపస్సు మొదలగునవి అన్నియు నశించునవే. జ్ఞానమునకు, అంతులేదు, అది శాశ్వతము.

౯. భిక్షువు, ఎక్కువదొరికినను, సంతోషించక, తక్కువ దొరికినను చింతించక ఎక్కువ భుజించక, ప్రాణము నిలుపుటకే భుజించుట ధర్మము.

౧౦. రెండు అక్షరములు మృత్యువునకు, మూడు అక్షర ములు మోక్షమునకు, మార్గము చూపును. మమ (నాది) ఇది చావు నకు మార్గము (నమమ) నాదికాదు. ఇది మోక్షమునకు మార్గము.

౧౧. మీరేల కొంచపుదానికై క్రోధాగ్నిలో కాలుచున్నారో తెలియదు. శాంతమూర్తులుగండు. ఆలసించకుడు.

౧౨. నామస్మరణవలన తన్మయత్వముగలిగి, దేహమును మరచు స్థితివరకు, కర్మమానరాదు. కర్మ తనంతట తానే జారిపోవలయునుగాని, నీవు బలవంతముగా, మానరాదు.

## ౧౦౩ భగవాన్ దత్తాత్రేయుడు

౧. ఆసక్తిని త్యాగముచేసి, క్రోధమును జయించి, స్వల్పాహారమును స్వీకరించుచు, ఇంద్రియ నిగ్రహముచేసి, మనస్సును ధ్యానములో పెట్టుము. ఏకాంతములో, మౌనముగా నుండుట మంచిది.

౨. సంగ్రహము చేయకుము, త్యాగమువల్ల ఆనందము కలుగును. లోభగుణమును, త్యజించుము. ఏదికానున్నదో అది అయితీరును, లోభము నశించుట కుపాయము, అస్తేయము. అపరిగ్రహణము.

## ౧౦౪ భగవాన్ బుద్ధదేవుడు

౧. నాకు అష్టైశ్వర్యము లున్నవి. రాజమహల్ వున్నది. రాజ్యమున్నది! చక్కని భార్య పుత్రుడున్నాడు! దాసదాసీజనము చెప్పుచేతులలో నున్నారు. కపిలవస్తు పౌరసముదాయము గీచినగీత దాటరు. ఈ వైభోగముతోనే నా బ్రతుకు తెల్లవారవలసినదేనా? నా జీవితమునకు ఇదేనా యుపయోగము. వీటితోకలిపి నన్నెంతో గొప్పవానిగా లోకము భావించుచున్నది. నిజానికి నాలో గొప్పతనమనునది కలదా! వేలాది పరిచారకగణము అడుగడుగున జోహుకుములు చెల్లించుచున్నారు! ప్రజాపరివారము చూచినదే తడువుగా అడుగులకు మడుగు లొత్తుదురు. ఇదినాకా? నా వైభవమునకా? రాజు

కొడుకును కాకపోయినచో వీరిలోఎంతమంది నాకు చేతులు జోడించు వారు. ఎందరు జోహుకుములు చెల్లించువారు? ఇదినామీది భక్తికాదు! రాజవైభవముమీది భక్తి. వీరు నాకు దాసులుకారు. ధన భోగాలకు దాసులు. ఈ దాసుల బానిసల ఆసరాతో నిలిచినదేనా! నా గొప్ప తనము. ఈ గొప్ప వేషమువల్లనే కాని, నిజముతోలేదు. నాకులుకు పాటు ఈ తళుకు బెళుకులు ఎరువుల సొమ్ములతోనేగదా! ఇట్టి చింతన వల్ల చూచువారు నన్ను అసంతుష్టునిగా తలపోయు చున్నారు. వారి మెర మెప్పులకోసము లేని భీకరాకారాన్ని ప్రదర్శించ వలసినదేనా బ్రతుకు.

౨. బుద్ధుడు నేనిరువది తొమ్మిదవ వత్సర ప్రాయమునందు గృహత్యాగినై పరమపద నన్వేషింప బ్రవృత్తుడనై యుంటిని. పరి వ్రాజకుని రూపంబుననే నేబదియొకటవవత్సర ప్రాయంబు దనుక ధర్మ క్షేత్రమునందు, భ్రమణమును సలిపియుంటిని. యుపర్యుక్తములగు నార్యధర్మాష్టాంగ మార్గము దక్క వేరొండు సాధనము నిర్వాణప్రాప్తి కుపయోగించునది నేనెరుంగజాలను. (1) సమ్యగ్దృష్టి (2) సమ్యక్సం కల్పము (3) సమ్యగ్వాణి, (4) సమ్యకాచారణ (5) సమ్యక్జీవనము (6) సమ్యగ్వ్యాయామము (7) సమ్యక్స్మృతి (8) సమ్యక్సమాధి. ఇవియె ధర్మాష్టాంగ మార్గములు.

౩. లాభమును గౌరవమును కీర్తిని గోరువాడు పాపమువల్ల నశించును.

౪. దేనివల్ల నుద్రేకము పుట్టునో కోరికలు పెరుగునో గర్వము పుట్టునో జనులమధ్య వుండవలెనని కోరికపుట్టునో సోమరితనము ఏర్ప డునో తృప్తిగలుగదో అది ధర్మముకాదు. ఇవి బుద్ధుని బోధకు వ్యతి రిక్తములని మరువకుడు.

౫. బంధములు తెగినవాడు కామములు నశించినవాడు శాంతి పొందును. ఇది నాది అని భావించుటే బంధము.

౭. పంచశీలములు 1. సత్యభాషణము 2. అహింస 3. సురాపాన వర్జనము 4. అపరిగ్రహణము 5. పరధనపరకాంతా విముఖత.

౮. తన కోరికలన్నిటిని జయించి, అన్యులకు హితము మాత్రమే చేయుచుండుటచే అహంకారమును జయించుట సాధ్యము. చివరకు నిర్వాణపదము పొందవచ్చును.

౯. ఎవరికైనా ఒక బహుమతి నిచ్చినపుడు దానిని వారు నిరాకరించినచో అదిఎవరికి చెందును ? తిరిగి ఇచ్చినవారికే కదా ? అట్లే ఇతరులు నిన్నునిందించినచో వారినిందను నీవు స్వీకరించకుము. తిరిగి వారిది వారికేచెందును.

౧౦. రేపటి కెట్లాయను చింతనుంచకుడు, అంతా భగవంతుడే సమకూర్చును. విచారపడకుడు, సంగ్రహము చేయకుడు.

౧౧. భూతభవిష్యత్సంగతులు తెలియనిది దేనిని చెడ్డదని అన రాదు. నీవు నిన్నుగూర్చి తెలుసుకో లేనపుడు ఒకరిని మంచివారని ఒకరిని చెడ్డవారని భావించుట తగదు.

౧౨. ఎవరు ఇతరులపై ఆధారపడక ఇతరులు చెప్పిరనే భక్తి భావముతో కాక తమలోని వివేకముపై ఆధారపడి జీవయాత్ర సాగించుదురో వారే అత్యున్నత పదవి పొందగలరు. కాని వారిలో నిరంతరము తీక్షణమగు జిజ్ఞాస వుండవలెను.

౧౩. ఎవరి నిర్వాణ సాధనభారము వారిదే, ఆభారము మరొకరిపై వేయరాదు, సాధనలేనిదే ఏదీకాదు.

౧౪. ఇతరులపై కంటె తనపై విజయము సాధించుట ముమ్మాటికిమేలు, ఎవడు సుశిక్షితుడో జితేంద్రియుడో అట్టి వానిని జయించడము మరునికిగాని మరెవ్వరికి గాని సాధ్యముకాదు.

౧౫. అన్ని ధర్మములు మొదట మనస్సులోనే యుత్పన్న మగును, మనస్సే ముఖ్యము. అవి మనోమయములు. మానవుడెంత

వరకు మలినమైన మనస్సుతో మాట్లాడునో పనిచేయునో అంతవరకు దుఃఖము అతని వెన్నంటియే యుండును.

౧౬. సాధనమార్గములో నీకు సమానుడైనవాడు కాని నీకంటె అధికుడైనవాడు కాని నీకుతోడు దొరుకక పోయినచో నీవొక్కడవే మరింత దీక్షతో ముందుకుసాగిపొమ్ము. మూర్ఖులతో సాంగత్యము చేయకుము.

౧౭. నిష్ఫలమైన వాక్చాతుర్యము అందమైన నిర్గంధ కుసుమము వంటిది.

౧౮. ఏ విధముగా తేనేటీగ, పువ్వులోని మకరందమును గ్రోలి, పువ్వును దాని రంగును, పరిమళమును పాడుచేయకుండా, చల్లగా వెళ్ళిపోవునో, అదే విధముగ, సంయమి పురుషుడు, ప్రజల మధ్య జీవించవలెను.

౧౯. తాను, ముందు తనను కల్మషరహితునిగా జేసుకొని, తరువాత, తాను అనుసరించిన ధర్మములను బోధించుచు ఇతరుల పరిశుద్ధతకై ప్రయత్నించవలెను, సర్వవిధములైన స్వార్థ నిర్మూలనముతోనే అరహాత సిద్ధించును.

౨౦. రూపములను, తృష్ణను, విడనాడినచో తిరిగి జన్మవుండదు, ఇది నిశ్చయము, సత్యము.

౨౧. పరులదోషము లెన్నకుము. రేపోమాపో, గిట్టు నీకీ భేద బుద్ధి నిర్మూలముకానిదే, నిర్వాణపదము గోచరింపదు.

౨౨. పరులకపకారము మనస్సునందైన చింతింప కుండుటయే, లోకోపకార మొనరించుట. నీ ఆత్మ సమానముగ, విశ్వము నంతయు వీక్షించుము.

౨౩. జిహ్వా చాపల్యమునకు వశుడవైతివా, నీవు నశింతువు.

౨౪. జీవహింస చేయకుము, ఇతరులకు కీడుచేయకుము, కొడుకులకై నేస్తులకై చెడుపనుల చేయకుము, ఖడ్గమృగమువలె ఒంటరిగా

బ్రతుకుము, సత్సంగమును చేర్చుకొమ్ము, అది లభించనపుడు యొంటరి గానే జీవింపుము.

౨౫. అందము, సౌఖ్యము, హృదయాన్ని పాడుచేయును, వాటి ప్రమాదాన్ని గుర్తించి యొంటరిగా నుండుము.

౨౬. వాంఛలను, వంచనలను, ఆశలను, ఈసులను, ఎదిరించుము, మాయావాంఛలతో మలినుడవు కాకుము, లోక నాటకమును కట్టివేయుము.

౨౭. సౌఖ్యము, సంతోషము, క్షణికానందము, నిమేషమాత్ర పరవశత, అనంత దుఃఖములను కలిగించును.

౨౮. ప్రపంచముయొక్క చప్పుళ్లకు బెదిరిపోకుము. ప్రభంజనముల వలలో పడకుము. తరంగముల మధ్య ఉండియు తరంగములతో గురుతులు పొందని పద్మమువలె లోకములో మలినుడవు కాకుము.

౨౯. కోరికలే దుఃఖమునకు కారణము, వీనిని త్వరగా త్యజించుము, అష్టాంగయోగములన్నియు ఇందే ఇమిడి యున్నవి.

౩౦. బుద్ధుని సిద్ధాంతములు 1 ఏ ప్రాణిని హింసింపరాదు, 2 దొంగతనము చేయరాదు, 3 వ్యభిచారము చేయరాదు, 4 అసత్యమాడరాదు, 5 కఠినముగా మాట్లాడరాదు, 6 ఆశలు వదలవలెను, 7 అసూయవుండరాదు, 8 భోగములను వదలవలెను, 9 ఇతరుల తప్పులు ఎన్నకూడదు, 10 అజ్ఞానమును పోగొట్టుకొనవలెను, 11 పెద్దలయెడ వినయ విధేయతలతో వర్తించవలెను.

౩౧. క్రూరమృగముల కన్న పైకి, మానవ వేషము వేసుకున్న మానవ మృగము అతి ఘోరమైనది, మానవునిలోనున్న కామ, క్రోధాది మొదలగు మృగములు మహాచెడ్డవి, క్రూరమృగము ఆహారమునకే జీవహింసచేయును కాని, మానవునిలోనున్న కామ, క్రోధములు వానిని నాశనముచేయునదే కాక, ఇతరులను కారణము లేకయే పాడుచేయును, కావున, మొదలు నీ దుర్గుణములను మృగ

ములను చంపవలెను. క్రైటకనబడే సింహాము, పాము, తేలు, మొదలగు వాటిని, హింసచేయకుము.

౩౨. విషయమునందలి ఆశను, సంసారమునందలి ఆశను విడుచువాడు, తిరిగి జన్మనెత్తడు. దుఃఖానికి కారణము, కామేచ్ఛయే.

౩౩. చలిని, వేడిని, ఆకలిని, దప్పిని, గాలిని, ఎండను, ఈగలను, దోమలను, పురుగు, పుట్రను, అన్నిటిని, అధిగమించుము.

౩౪. శరీరమునంటి నీడ ఎట్లుండునో, ఆత్మకు శరీరమట్లే. శరీరము యొక్క నీడను, కొట్టిన, తిట్టిన, ఉమ్మివేసినా, ఆ నీడకు అభిమానము సిగ్గులేదుకదా. అట్లే యీ శరీరమును అవమానపరచిన ఆత్మకు అభిమానమెందులకు ? శరీరానికి, నీడకు భేద మెట్లో, అట్లే ఆత్మకు-శరీరానికి భేదముకలదు. శరీరము వేరు, నీడవేరు, అట్లే ఆత్మవేరు-శరీరమువేరు కాన బాగుగా విచారించుకొనుము. శరీశముపై మమతచే అభిమానపడకుము.

౩౫. ఇతరులు చేయని మంచిపనులు నీవు చేసినను, చెడ్డపనులను మననము చేయుట తగదు, నేను చేయుచున్న పనులు చేయవలసిన పనులు ఏమిటి అని మాత్రమే, ఎవరిమటుకువారు యోచించుకోవలెను.

౩౬. దేనివల్ల ఇతర జ్ఞానులు తన్ను విమర్శించెదరో. అట్టి పొరపాటు, లవలేశము చేయరాదు.

౩౭. ఎవరును ఇతరులను మోసము చేయకుందురుగాక. ఎవరిని ఎచ్చోటను అవమానించ కుందురుగాక. ఎవరికిని హానిచేయకుందురుగాక. అన్నిప్రాణులు సౌఖ్యముగా భద్రముగా నుండునుగాక. బాధలనుండి విముక్తి నొందుదురుగాక.

౩౮. సంతృప్తి కలిగి ఆడంబర రహితుడై, స్వార్థరహితుడై, లజ్జాపరుడై, మెలంగువాడే ముక్తుడు.

౩౯. మూర్ఖుడా! నీవు విత్తినవిత్తు రూపుమారిన, నెగాని క్రొత్త మొక్కరాదు. ఐహిక శరీరాన్ని విత్తి ఆధ్యాత్మిక శరీరాన్ని సంపా

దించుకొనవలెను. అనగా పరివర్తనము కేవలము పైపై మార్పుకాదు. సమగ్రమైన ఆంతరిక పరివర్తనము కావలెను.

౪౦. తనహృదయాన్ని అదపులో పెట్టుకున్నవాడే ఋషి.

౪౧. శాంతి సంపాదన కొరకు కీర్తి ప్రతిష్ఠలు, ఆస్తి పాస్తులన్నియు విసర్జింపవలయును.

౪౨. మనుష్యుడు స్వాగత సన్మానములకు, ఆశపడి నాశనమగును. ఈ సంసారములో భార్యా బిడ్డలు, తదితరులు స్వాగతమిచ్చునది వ్యక్తికికాదు. ధనమునకు, మరియు అధికారమునకే, అవ్యక్తే బీదవాడైనచో, భార్యాబిడ్డలు మొదలగు వారెవ్వరూ అడుగరు. అంతియేకాక కసురుచుందురు. కావున వీరినెవ్వరిని నమ్మక దేనికిని ఆశపడక, ఈశ్వరునే నమ్మి భజించుము.

౪౩. నాయనా నీవు తొలుదొలుత వాణిని స్వాధీనమొనరించుకొనుము. నీకు కీర్తి అపకీర్తులను, ధర్మాధర్మములను, పాపపుణ్యములను, సుఖదుఃఖములను కలిగించునది వాణియే.

౪౪. ఎవ్వానివాక్కు మధురముగ నుండునో వాని తపము సఫలము. కావున దివారాత్రములం దెపుడైనను నీవు వచింపనెంచు ప్రతివచనమును, ఆచి, తూచి, మరి నుడువుము. నీ వాక్యమందెట్టి కాఠిన్యభావ లేశమున్నను, హత్యాదోష సమానమగును. జాగ్రత.

౪౫. ప్రతివ్యక్తితో నాయనా! అని సంబోధించుచు, మృదువుగా మాట్లాడుము. మదియం దెవ్వానికిని ద్రోహమును జింతింపకుము.

౪౬. నిస్సారంబును, మాయా కల్పితంబును, క్షణికంబునగు సంసారమును పరిత్యజించి కామినీ కాంచనములను, పుత్ర, మిత్ర, కళత్ర, బంధు వర్గాది ప్రగాఢ వ్యామోహ పాశముల, బూర్ణముగ ఖండించి, సమస్త సౌఖ్యములను త్యజించి, సర్వసంగ పరిత్యాగివై క్షణికంబును అవిశ్వాసనీయంబగు మానవ జీవితమును బ్రహ్మానంద సేవకే నిర్మింపబడినదని ఎంచి, తత్సేవార్థమై వెడలుము. ఆలసించకుము,

౪౭. భూపాలురు కేవలము బాధ్యతాయుత రాజ్యపరిపాలన నిమిత్తము, సర్వేశ్వర ప్రేరిత ప్రతినిధులు భూపాలురు ఏవస్థయందును, స్వమనోరంజనానుకూల పరిపాలనా స్వత్వసంహితులు కాజాలరు. భూపాలురకైనను కుటుంభరత్వోచితోదారాహారస్వీకారమునకే స్వామ్యము కలదు. గాని షడ్రసోపేతాన్నముల హాయిగ గుడువ నధికారములేదు. పరమేశ్వర ప్రదత్త భాగ్యంబుల దుర్వినియోగము చేయక పరమేశ్వర సంతస ప్రధాన కార్యములకే వినియోగించుట ధర్మము.

౪౮. పరులకొదవు దుఃఖముల మనమే అనుభవింపవలయును. ఇదియే త్యాగము. పరుల నిమిత్తము మనజీవిత సర్వస్వముల నర్పించ వలసియుండ నచ్చోట బరుల జీవనములనే బాధించుట యుక్తమా? పరోపకారమునకై స్వయమర్పితంబగుటయే మోక్షమనబడును.

౪౯. మనజీవితములు క్షణభంగురములు, నేడున్నా, రేపు సున్నా. ఇట్టి విశ్వాస దూరములగు మాయతిత్తులకే, గర్వించుచు, నీతి దూరులమై, చండాలురమై, విలాసప్రియులమై, నోరెరుగని, మూగ పశువులను జంపి తినుటకు బూనితిమి, ఇందుకేనా, మానవశరీరమును భగవంతు డిచ్చినది! ఆలోచించుడు.

౫౦. భోగవిలాసాభిలాషయే, దుఃఖోత్పత్తికి మూలము. విషయ వాసన క్షయమునకు పూర్వము, మానవుడు మృతినొందెనేని, కాంక్ష వానిని అంటియె యుండును. కాబట్టి పునర్జన్మ తప్పదు. కావున నీవు చావకముందే విషయ వాసనలను జయించుము.

౫౧. తన ఆహారమును దా నార్జించుకొలేని, ప్రాణి జడ పదార్థములకంటె హేయమగును. వృషభములచే సహాయ్యమును బడయుట, ఏ మానవునికి ధర్మముకాదు. పశుల స్వేచ్ఛను, భంగపరచి వానిని బంజరముల బంధించుటవలన, సాత్వికంబగు, మానవ జీవితమున కించుక లాభముకాని, వికాసముకాని, వాటిల్లనేరదు కదా; పశువు

లకు వార్ధక్యమున కాహారము సక్రమముగా నొసంగుచుండిన, ప్రత్యుపకార ప్రాప్తిలేదు కదా యని భావించి, వానిని బోషింప కుండుట మహాపాపము. మానవుని న్యాయబుద్ధి ఇట్టి సందిగ్ధావస్థయందే సుస్పష్టమగును. సంసారులనేకులు, జవసత్వములుడిగిన, వృషభముల బీడించియు, చర్మాపేక్షచే మాదిగలకు విక్రయించి మహాదోషము సల్పుచున్నారు. కఠినాత్ములొకప్పుడు కఠినచిత్తులకే వశమగుట రూఢి.

౫౨. ఆహార పానీయంబులయెడ, మితమును, సాత్త్విక మును గలిగియుండుడు. ఎవరికిని బాధ గలుగకుండా, సాత్త్విక జీవిత ముల, నిర్వహింపుడు, మీ జీవితయాత్ర పరుల సౌఖ్యానందముల కవాంతరముల గలుగజేయ నీయనివై యుండును గాక, పరపీడనా సంజనిత సౌఖ్యాభిలాష పాపమునకు హేతువు.

౫౩. నాయనలారా (1) సదాధ్యవసాయమునఁ ఆర్జించిన సుకృతమును నిరంతరము సంరక్షించుకొనుడు. (2) నిత్యము నవీనంబు లగు పుణ్యముల సముపార్జింప యత్నింపుడు. (3) పూర్వసంచితంబు లగు సమస్త పాపంబుల విధ్వంస మొనర్చుడు. (4) నూతనంబగు పాపము దండెత్తివచ్చి మిమ్మాక్రమింప కుండునటుల మీరు సావధాన చిత్తులై మనుచుండుడు.

౫౪. కుమారా భవితవ్యమునుగూర్చి మది దలపోయకుము, ఏ నిముషమందాచరింప దగిన కార్యము ఆ నిముషమందే యాచ రింపుము.

౫౫. ముందు తాను ఆచరించి ఇతరులకు బోధించవలెను. చెప్పునది వైరాగ్యము, చేయునది సంగ్రహము. ఇది చాలా పాపము.

౫౬. ఇతరులపై అధికారములను చలాయించకుము, ఇతరు లతో చాకిరి చేయించుకొనకుము,

## ౧౦౫ భగవాన్ మహావీరుడు

౧. అన్ని జీవులకు బ్రతుకవలెనను ఆశయుండియే, చావనిన భయపడును. కావున ఏ జీవిని చంపినా ఆ జీవికి యిష్టములేని పని చేసినట్లగును. కావున అది జీవహింసయే, భగవదాజ్ఞకు వ్యతిరేకమే.

౨. నవ్వులాటకుకాని, స్వార్థమునకుకాని, నీ ప్రాణముపోయినను, కలలోనైనను, అసత్యము పలుకరాదు; ఇతరుల మనస్సు నొచ్చునటువంటి మాటలాడరాదు; ఇతరులకు బాధకలుగునట్టి పనులు చేయకూడదు; ఇవి చాలా పాపము.

౩. నీది కానిది దేనినైనను తీసుకొనకుము. రేపటికని నీ వద్ద ఏదియు వుంచుకొనకుము; సంగ్రహము దొంగతనమేసుమా!

౪. బ్రహ్మచర్య వ్రతస్థునకు రుచిగల పదార్థములు, ప్రియమైన భోజనము, అధిక భోజనము. నిషిద్ధములు.

౫. సూర్యుడుదయించక ముందుగాని, సూర్యుడస్తమించిన తదుపరిగాని, భోజనముచేయుట పాపమే.

౬. అనేక విఘ్నములకు మూలమైన అత్యంత, అల్పస్వల్పాయువుగల ఈ మానవశరీరమును చూచి భ్రమపడకుము.

౭. ఇంద్రియముల ద్వారాపొందే సుఖమంతా దుఃఖమే, పాపమే, పరాధీనతయే.

౮. క్రోధమును క్షమాగుణమువల్ల, గర్వమును వినయమువల్ల మోసమును సరళభావమువల్ల, ఆశను తృప్తివల్ల, జయించుడు.

౯. ప్రపంచమును త్యజించినవాడు, జన్మరాహిత్యము పొందును.

౧౦. క్రమమైన బుద్ధి, క్రమమైన జ్ఞానము, క్రమమైన ధర్మము వీటివలన అంతరాయములు తగ్గును. నింద్యమైన పనులు మానుటయే ధర్మము. కష్టములన్నిటిని ఓర్పుతో సహించుటే క్రమమైన జ్ఞానము.

మహాత్ములు చెప్పిన ప్రకారము ఆచరించుటచే, క్రమమైనబుద్ధి. తప్పులు ఇచ్ఛలు మొదలగునవి నశించుటచే ఆత్మదర్శన మగును.

౧౧. జీవనము క్షణభంగురము కాన ఒక క్షణకాలముగూడా ప్రమాదములో పడకుము.

౧౨. ఎవడు నిష్కపటియో వాడే సరళుడు, వాని ఆత్మ శుద్ధముగా నుండును.

౧౩. రాగద్వేషములు సమూలముగా పోవుటయే అహింసా లక్షణము.

## ౧౦౬ భగవాన్ రుషభదేవుడు

(౧) మానవులారా మానవశరీరము క్షణిక సుఖభోగము లనుభవించుటకు వచ్చినదికాదు, జన్మరాహిత్యమునకై వచ్చినదని మరువకుడు. ఈ శరీరముతో దివ్యమైన తపస్సుచేసి అంతఃకరణశుద్ధిని పొంది ముక్తిని, బడయుడు. మహాపురుషుల సత్సంగము చేయుడు. స్త్రీలసంగము విషయవాసనల సంగముచేసి నాశనము కాకుడు.

(౨) ఏమానవుడు తనవారికి భగవద్భక్తి ముక్తిని గురించి చెప్పడో వాడు పాపాత్ముడే, కావున అందరికి హితవు నేర్పుము.

(౩) మృత్యురూపమగు సంసారమందలి మమతను మరియు సమస్త కామ్యకర్మలను త్యజించుడు.

(౪) సమస్త విషయవాసలను త్యజించి ఏకాంతవాసము మౌనము వహించుడు.

(౫) ద్వేష వైరములే నరకమునకు దారితీయును, వీనికి విషయభోగములే కారణములు.

## ౧౦౭ మహాత్మ జడభరతుడు

(౧) దయ, ప్రేమ, హితము చూపుము. పరోపకారము చేయుము. కాని, ఆసక్తి ఉంచకుము. దేనియందుకూడా మోహము

ఉంచకుము. వీటి మమతలో పడితివా చెడుదువు. దానికై జన్మ ఎత్త వలసియుండును. జాగ్రత్త. (జడభరతుడు మమతవల్లనే జింక జన్మము ఎత్తినాడు.)

(౨) [వీరు సదా ఇతరులకు సేవ చేయుచుండేవారు. ఏది దొరికితే దానితోనే సంతోషించేవారు, కావలెనని అడుగువారుకారు. పనిచేసి ప్రతిఫలమున కాశించేవారుకారు. పెట్టితె తినేది, లేదా ఊర కుండేది. ఎండ, వాన, చలికి భయపడేవారుకారు. వట్టి భూమిపై బయలులోనే పరుండేవారు. అతనికి మానావమానములు లేవు. జడము వలెనే వుండేవారు. అతనికి ఎవరితో ఏ అవసరము లేకుండెను.]

## ౧౦౮ మహాత్మ భీష్మపితామహ

(౧) సదా సంతోషముగా నుండుము. అదియే మోక్షమునకు దారి. ఇచ్ఛాద్వేషములను జయించినవాడే ముక్తిని బడయును. లోభగుణమే క్రోధమోహములకు కారణము సుమా! జాగ్రత్త.

(౨) సత్యవ్రతము అన్నిటికంటె శ్రేష్ఠము. కృతజ్ఞతను మరువకుము. ధర్మాచరణమునకు ఇతరుల సహాయ్యమవసరములేదు. తాను ఒకడే చేయవచ్చును. ఒక్కసత్యమే నిన్ను మంచిదారికి తీయును. ఇతరులకు అనిష్టము చేయనివానికి దేనితో భయముండదు. కావున ఏ జీవికిని అనిష్టము చేయకుము.

౩. మనుష్యుడు తనకొరకై ఏది కోరుకొనునో దానినే ఇతరుల కొరకుకూడా కోరుచుండవలెను. దీనిని మరువకుము.

౪. నేను త్రైలోక్య సంపదను బహిష్కరించి వేయుదును. దేవతల స్వర్గమును తృణప్రాయముగ విసర్జించి వైతును. వీనిని మించిన మహాపదార్థ మెద్దియేని యున్న నదియు త్యజించుటకు సంసిద్ధుడను. కాని, నేను సత్యమును వీడజాలను.

౫. మనష్యుడు, ధనమునకు దాసుడు గాని ధనమెవ్వరికిని దాస్యము చేయదు. కాన ధనాశను విడువుము.

## ౧౦౫ మహాత్మ అశ్వినీదత్తకుమారు

౧. భగవంతునియందు, భక్తివున్నచో, మృత్యువునకైనను మరి దేనికైనను భయపడనవసరముండదు. నిరాశజెందక భక్తినిసాధించుము.

౨. శ్రీరామచంద్రుని, ఓరి, రామా, అని పిలచిన గుహుని, ప్రేమించెను. ఓ మానవుడా, నిన్ను ఎవరైనా ఓరీ అనిన కోపమేల, కావున అభిమానము వదులుము.

౩. అభిమానమునకు, ధనమదాంధునకు, స్వర్గమునందు, స్థానము లేదు.

౪. దీనహృదయుడు కానిది, విశ్వాసము లేనిది భక్తికుదురదు. దరిద్రుడు, ధనికుడని భేదముంచకుము.

౫. దానము మీద నీకు హక్కేమికలదు, నీవెవ్వరవు, నీవు భగవంతుని కింకరుడవు. నీకు ఆయన ఇచ్చినాడు. నీతో ఆయనయే ఇంకొకరికి యిప్పించును. ఇచ్చినవాడు తిరిగి తీసుకొనును. ఇచ్చినపుడు సంతోషించి పుచ్చుకున్నపుడు దుఃఖించుటేల, అహంకారము పనికిరాదు.

౬. భగవంతుడు మన వెంటనేయుండి చూచుచున్నాడు. కాని మనము విషయలోలురమై గుర్తించకున్నాము. వ్యాకులముతో, భగవంతుని ప్రార్థించుచు చేసిన పాపములకై పరితపించి తిరిగి పాపములు చేయకుము.

౭. ఆలుబిడ్డలకొరకై ఏడువకుము. సంతలోకలసి సంతనుండియే ఎవరిదారి వారు పోవుదురు. ఇందుకై చింతయేల, ఇచ్చినవాడు తీసుకొనినాడు, అంతయు నశించునదియే.

౮. కామము వల్ల రాదగినవి (పది) వేట, జూదము, పగటినిద్ర, పరులదోషముల ఎన్నుట, స్త్రీసంగము, సురాపానము, నృత్యము, గీతము, వాద్యము, వేడుకగ తిరుగుట, ఇందుకు మనస్సే కారణము.

౯. క్రోధముచేత వచ్చునవి, కొండెములు చెప్పుట, పరులకు హానిచేయుట, ఇతరులను చూచి ఓర్వలేకుండుట, పరుల దూషించుట, ఇవ్వదగిన దానిని ఇవ్వకుండుట, దానముచేసిన దానిని అపహరించుట, కఠినపు మాటలు పలుకుట, దయలేని పనులు చేయుట.

౧౦. పాపములవైపు మనస్సును పోనివ్వకుము, నీలో ఉండు ఒక్కొక్క చెడువృత్తిని త్యజించుము.

౧౧. వేడుకగా తిరుగకుము. వృథా ధనమును కర్చు చేయకుము. ఇది పాపమే సుమా.

౧౨. నీవు ఒక్కడవే చెడునదే కాక, ఇతరులను చెరుచకుము. ఎందుకన నీ వర్తననుచూచి ఇతరులు చెడుదురు. కాన జాగ్రత.

౧౩. పరులు నిన్ను నిందించినా, స్తుతించినా, వ్యసన పడక సమత్వము వహించుము.

౧౪. నీవేదైన పని చేయబూనినపుడు, మొదలు నీమనస్సును వివేకముతో విచారించుకొనుము. ఈ పనివల్ల లోకోపకార మగునా లేక అపకారమగునా? లోకమునకు హితముకాని ఏపనిని చేయకుము.

౧౫. నీవు కష్టపడి సంపాదించి మితముగా సాత్త్విక భోజనమే చేయుము. పరాధీనుడవు కాకుము.

## ౧౧౦ మహాత్మ జరథూస్త్రర్ (పార్శి)

౧. మనకు ఈశ్వరుడిచ్చినది మన స్వార్థమునకు కాదు. ఇతరులకు ఇచ్చుటకొరకే. మనము ఈశ్వరుని భృత్యులము. నీకున్న ధనమును జ్ఞానమును ఇతరులకు ఇచ్చినయెడల తగ్గదు. హెచ్చును.

౨. దుష్కార్యములను చేయకుము. అంతరాత్మ చెప్పినట్లు ఆచరించుము. ముక్తిని బడయుదువు.

౩. ఈశ్వరుడు ఒకడే, అంతట నిండి యున్నాడు. ఈశ్వరుని చేరుటకు ప్రయత్నించుట ప్రతిమానవుని విధి.

## ౧౧౧ మహాత్మ కన్ఫూషియస్ (చైనదేశము)

౧. ఇతరులు ఏది చేసినచో నీకు కష్టమో, దానిని ఇతరులకు నీవు చేయకుము. నిన్ను నీవు క్షమించుకొను తీరుగనే ఇతరులను క్షమించుము.

౨. నిన్ను ఇతరులు సన్మానించనిచో నీవు అభిమానపడకుము. ఇతరులను సన్మానము చేసితివా, వారు తిరిగి నిన్ను సన్మానించుదురు.

౩. ప్రజలు నిన్ను గుర్తించలేదని చింతించకుము. కాని నిన్ను ఇతరులు గుర్తించే యోగ్యత నీలో లేదని చింతించి ఆ యోగ్యతను సంపాదించుము.

౪. ఎవడు భయ, దుఃఖరహితుడో వాడే మహానుభావుడు.

౫. గౌరవమునకంటె విధేయత దొడ్డది. ఎన్నాళ్ళో మంచి చేసి ఒకరోజు చెడుచేసితివేని ఆచెడ్డ ఎప్పుడు వుండును, మొదటి మంచి చెడును.

౬. అన్నిటికి మూలము చిత్తశుద్ధి, స్వర్గమునకు బాట, కాన జాగ్రత్తగా అభ్యసింపుము.

౭. చెడుగు చూడక, వినక, చేయక, ఉండుటయే సౌఖ్యమునకు మార్గము.

౮. విజ్ఞులకు సందేహము కలుగదు, ధార్మికులకు వ్యాకులత ఉండదు, ధైర్యవంతులకు భయముండదు.

౯. సామాన్యమైన సాత్వికాహారముతిని మంచినీరు త్రాగి తన చేతులనే దిండుగా చేసుకొని పరుండి, సాధువు ఆనందించును.

౧౦. వేయిమైళ్ళ దూరముపోయి దేవుని పూజ చేయుటకంటె ఇంటిలోవుండి మంచిచేయుట మేలు.

౧౧. విజ్ఞానవంతమైన మనస్సే స్వర్గము. అజ్ఞానముతో గూడిన మనస్సే నరకము.

౧౨. ధర్మము నతిక్రమించకుండా, అంతర్వాణి చెప్పినట్లు వినుము, దేవుని చెందుటయే మానవునకు ముఖ్యము.

౧౩. నీయందు తప్పులున్న ఇతరులు నీతప్పులను సూచించిన తప్పక దిద్దుకొనుము. వారలపై కోపించకుము. అహంకారము వదులుము.

౧౪. ముందు మానవుల సేవింపుము, తదుపరి భగవంతుని సేవించుట సులభము. నీజీవనమును గురించి ముందు తెలిసికొంటివేని మృత్యువును గూర్చి తెలిసికొనుట సులభము.

౧౫. పరలోకమనినను భగవంతుడనినను పెద్దలనినను వారి ఉపదేశములనినను భయముకలిగి వర్తింపవలెను.

౧౬. ప్రార్థించుసమయమున భగవంతుడెదురుగ నున్నట్లు భావించ వలయును.

౧౭. ఒక్కనిమిషము కోపమును నిగ్రహించు కొనినచో జీవిత మంతా పశ్చాత్తాప పడవలసిన అవసరముండదు.

౧౮. కార్యనిర్వహణమున కుపాయమాలోచించుట మానవుని వంతు, అది సమగ్రమగుట భగవదాధీనము.

౧౯. నిన్నుచూచి ఇతరులు నడుచునట్లు నీవు మహాపవిత్ర వర్తనుడవుకమ్ము.

౨౦. ప్రపంచము ఒక మజిలీ వంటిది. మోక్షము కోరువాడు తప్పక యమ నియమములను ఆచరించవలెను.

## ౧౧౨ మహాత్మ లావోత్జె

[వీరు, క్రీస్తుకుపూర్వము ౬౦౪ సంవత్సరమున చైనాదేశములో చూరాజ్యములోని హోనాన్ ప్రాంతమున (క్వేతే) అను నగర సమీప ములో ఒక చిన్నగ్రామమందు జన్మించిరి. వీరు 'తాఒ' ధర్మమును

స్థాపించిరి. ఆధర్మము యొక్క ముఖ్య ఉద్దేశ్యమేమన, సమస్తము ఈశ్వరమయమేనని బోధించుట.]

౧. మానవుడు, ప్రకృతిసిద్ధాంత ప్రకారము జీవయాత్ర గడుప వలయును. ప్రకృతి మరియు సృష్టిసిద్ధాంతములకు వ్యతిరిక్త మాచ రించవలదు.

౨. ఈశ్వర విధానమే ముఖ్యము. దాని ప్రకారము ఆచరించు వాడు, ముక్తుడే. అదే మానవునియొక్క ముఖ్యధర్మము.

౩. అహంకార శూన్యుడవై, సరళస్వభావుడవు, న్యాయ శీలు డవు కమ్ము. సంతుమహాత్ములు చెప్పునటు లాచరించుము.

౪. జనసందడినుండి దూరుడవై ఆత్మచింతనలో లీనుడవుకమ్ము.

౫. ఈశ్వరవిధానము తప్పినచో భౌతికవిధానము హెచ్చును. దానిచే నీవు నాశనమగుదువు.

౬. ఆధ్యాత్మిక జీవనమే మానవుని రక్షించును. ఏకాంత వాసము చేయుము. ఈశ్వరునివైపు ముఖము త్రిప్పుము. శాంతిలో మగ్ను డవు కమ్ము.

౭. జీవనము వచ్చుచు పోవుచుండును. జనన మరణ చక్రము నడుచుచుండును. శాంతియే జీవితముయొక్క ముఖ్యఉద్దేశ్యము.

౮. నిత్యవస్తు తత్త్వమును పరమేశ్వరునిలో సంపూర్ణ సమర్ప ణమే పరమశాంతి, ఈ శాంతియే సనాతన చిన్మయజ్యోతి.

౯. ప్రేమ, నమ్రత, సదాచారము, ఈ మూడే నిన్నుముక్తుని చేయును. కావున, వీటిని, నియమపూర్వకముగ, ఆచరించుము మరువ కుము.

౧౦. సంయమముగలవాడవై ప్రేమమయజీవనము జీవిం చుము. ప్రేమచే వీరత్వము కలుగును. నమ్రతచే గొప్ప మహాత్ముడ వగుదువు.

౧౧. నిష్కామముచే, నిస్వార్థముగా జీవించుము. ప్రతిసమయములో ఇతరులకు హితము చేయుచుండుము.

## ౧౧౩ మహాత్మ లోత్సే (చైనా)

[వీరు చైనాదేశమున చూ రాష్ట్రములోని లూ ప్రదేశములో క్రీస్తుకు పూర్వము 604లో జన్మించిరి. వీరి మతమునకు టో, మతమని పేరు. టో శబ్దమునకు, స్వర్గమునకు దారి అని అర్థము. ఈ మతము వారు ముక్తిని పునర్జన్మను నరకమును అంగీకరింతురు.]

౧. ఆసక్తి ఉన్నచోటనే బంధముండును, ఆసక్తి లేనిచో ముక్తి దొరుకును.

౨. భయములేకుండుట, దానముచేయుట, వినయము కలిగియుండుట మంచిది.

౩. చేయుచున్నానని భావములేకయే చేయుట ధర్మమార్గము.

౪. ఎట్టి ఆకాంక్షలేనివాడే యోగి. తన్నుగురించి తాను ప్రకటించు కొనడు. తనకార్యములను గురించి గర్వింపడు. దేనిని కోరడు, అహంకారపడడు, మానావమానములు అతనికి సమానములే.

౫. ఏ జీవికైనా హింసలేకుండా, చరించుము. అందరిని ప్రేమించుము. చీమ, దోమకైనా తుదకు గడ్డిపోచకైనా హింస చేయకుము.

౬. ఇతరులను సంస్కరించుటకంటె ముందు నీవు న్యాయపరుడవుకమ్ము.

౭. గొప్పతనము పొందవలయు ననుకొనుట కంటె, అధికమగు పాపములేదు. కోరికలను వీడుము, తృప్తిపడుము.

౮. నేటుగ పొరపాటుచేసిన ప్రజాదండనము, చాటుగ పొరపాటుచేసిన ఈశ్వర దండనము సంభవించును. కాన, ఈ రెంటికి భయపడి వర్తించుట చాలా శ్రేష్ఠము.

౯. ఈ లోకములో మంచిని పెంపొందించుము, నీ గొప్పను గూర్చి ప్రగల్భములు పలుకకుము, ఇతరుల దోషముల నెంచకుము, అధికముగనున్న వస్తువులను త్యజించుము, సంపాదన వదలిపెట్టుము, లాభము నార్జింపకుము, దొంగలుందురు.

౧౦. ప్రశాంతముగా మౌనముగా నుండుము, అంతా వశము గుము, సంగ్రహించినది చేసినది అంతా పోవును, కాన దుఃఖించకుము.

౧౧. తెలియనిచోట తెలియదనుకొనుటే మంచిది. తెలియక పోయినా తెలిసినట్లు నటించుట గొప్ప వ్యాధి. ఈ వ్యాధి ఉన్నదని గ్రహించుకున్న వాడే బాగుపడును.

## ౧౧౪ మహాత్మ షింటో

౧. చిత్తశుద్ధి చాలాముఖ్యము. హృదయ పవిత్రత గలవారికి భగవత్ దర్శనము లభించును. ఈశ్వరేచ్ఛను ప్రతిఘటింపకుము. పితృ దేవతా పూజను విస్మరింపకుము. రాజ్యాంగ శాసనముల నతిక్రమింప కుము. దేవతల దయవలన సమస్త వ్యాధులు కుదురునని మరువకుము. ఇతరులు కోపపడుచున్నను నీవు కోపపడకుము.

౨. మన కన్నులు మలినమును చూచినగాని, మనస్సు చూడ కుండునుగాక. మన చెవులు చెడ్డ విన్నను మనస్సు చెడ్డ వినకుండును గాక.

౩. ఆత్మనిగ్రహమే సమస్త ధర్మములకు మూలము.

౪. భగవంతుని దయ పొందుటకు ప్రార్థనకంటె ఉత్తమమైనది వేరొకటి లేదు.

౫. చెడును చూడకుము, వినకుము, వర్ణించకుము, ఎందుకన నీవు చేసిన అకృత్యము నిన్ను చేరవచ్చును.

౬. మూడురోజులు ఉపవాసము చేయుటకంటె ఒక మంచిపని చేయుట గొప్పది.

౭. నీ హృదయమును బట్టే ప్రపంచముండును. హృదయము స్వచ్ఛముగా నుండిన పనులు స్వచ్ఛముగానే ఉండును.

౮. న్యాయమని తోచినది ఆచరించక పోవుట పాపము, ఎందుకన మన జీవితము స్వప్నము వంటిది.

౯. గర్వముండిన ఇతరుల సహాయ్యము లభించదు. ప్రార్థించక పోయినను స్వచ్ఛవ్రతుని దేవతలు రక్షించెదరు.

౧౦. చీమ కోరికలను కూడా భగవంతుడు మన్నించును. కాన తన తప్పును తా నొప్పుకొనువాడు మన్నించబడును.

౧౧. నీవు చెల్లించే మ్రొక్కుబడులు దేవుని సంతోష పెట్టవు, నీ పవిత్రాచరణయే, నీ నిర్మల హృదయమే, దేవుని సంతోషింప జేయును.

## ౧౧౫ శ్రీ ఏసుక్రీస్తు

౧. మీరు మీ ఆత్మను విశ్వసింపుడు. ఆత్మయందు అవిశ్వాసము వల్లనే మీరు నశింతురు.

౨. భోజనము, నిమిత్తము దేవునిపని పాడుచేయకుడు. దేవుని పనిలో ఏ పదార్థము మీకు అడ్డుపడునో దానిని తెలిసికొని విసర్జింపుడు.

౩. మీకేది కావలయునో ఆ జగత్పితకు తెలియును. మీరు అడుగక పోయినా, మీకర్మానుసారము ఇవ్వవలసిన దేదో ముందే సిద్ధముగా వుంచినాడు.

౪. ఏపూటకేది లభించునో, అదే ప్రాప్తమనుకొని సుఖముగా జీవనము గడుపవలయును.

౫. కావలసిన దానికంటె ఎక్కువ ప్రోగు చేసుకొని దాచి పెట్టుకొనుట మహాపాపము.

౬. నీ స్వేచ్ఛానుసారముగాక, విశ్వనియంత యొక్క ఇచ్ఛాను సారమే బ్రతుక వలయును.

౭. త్రాగుడు, తిండిపోతు తనము, సంసార తాపత్రయము, వీటిలోబడి చెడిపోకుడు. వీటిని వీడుడు.

౮. మీ జీవితములో, శరీరముపై ఆత్మకు పూర్ణాధికారము ఇవ్వవలయును.

౯. దానము, ప్రాయశ్చిత్తము వంటిది. కుడిచేతితో ఇచ్చు దానము, ఎడమచేతికి తెలియరాదు.

౧౦. ప్రతిరోజు, ఆత్మవిచారము చేయుము. దానికొరకై దుఃఖ పడుము, సాత్వికము, నీతి, కనికరము హృదయశుద్ధి, అలవడ చేసు కొనుము.

౧౧. దేవుని ప్రార్థించబోవుటకు ముందు నీమనస్సులో ఏదురా లోచనలు లేకుండా నీకు ఎవరు విరోధులు లేకుండా చేసుకొని, దుర్గుణంబు లన్నియు బలిపీటపై అర్పించుము.

౧౨. నిన్ను అడిగినవానికి లేదనకుండా యివ్వుము. నిన్నెవ డైనా కుడిచెంపపై కొట్టితె ఎడమ చెంపను కొట్టమని చూపుము.

౧౩. ఏమి తిందుమో, ఏమి త్రాగుదుమో, ఏమి కట్టుదుమో, అని ఆలోచించకుడు. పక్షులు, పశువులు చూడుడు ఎంతహాయిగా యున్నవో, అంత భగవంతుడే సమకూర్చును. నీకు చింత ఎందులకు, రేపటినిగూర్చి చింత వుండరాదు.

౧౪. నీకంటిలోనున్న దూలాన్ని మొదలు తీసుకొని నీ ఎదటి వాని కంటిలోయున్న నలుసును తీసుకొమ్మని చెప్పుము. మొదలు నిన్ను నీవు పరీక్షించుకొనుము.

౧౫. కీర్తి ప్రతిష్ఠ గౌరవముల కొరకు ఆశపడకుము. సత్య, ధర్మములను విడనాడకుము.

౧౬. వ్యర్థముగా మాట్లాడకుము. మౌనముగా నుండుము. భగవంతుని నమ్మినవానికి ప్రపంచము తృణప్రాయమే.

౧౭. మీరు భూలోకములో త్యాగము చేసితిరా, పరలోకములో దేవుడు మీకు పదిరెట్లు ఎక్కువ ఇచ్చును.

౧౮. సమస్త విషయభోగములను, దుర్గుణములను రాగ ద్వేషములను వెంటనే విసర్జింపుడు.

౧౯. బీదలను కనికరించి వారికి ఉపకారము చేయుము. నీవలె నీసోదరుని, ఇతరులను ప్రేమించుము.

౨౦. సూది బెజ్జమునుండి (ఒంటె) దూరుట సులభమే కాని ధనవంతుడు పరలోకము చేరుట మహాకష్టము.

౨౧. మంచిపని చేసితిరా పునర్జన్మయందు మహాఉత్తములుగా జన్మింతురు.

౨౨. ఎవడు గొప్ప గాదలంచుకొనునో, వాడు మొదలు పరిచారకుడు కావలెను. అందరికి దాసుడు కావలెను.

౨౩. మిమ్ముల ద్వేషించువారల ప్రేమింపుడు, శపించువారిని దీవింపుడు, బాధించువారికై ప్రార్థింపుడు.

౨౪. ఏసును, శిలువలో బంధించినపుడు ప్రార్థించిన దేమన, ఓ భగవంతుడా, వీరు అజ్ఞానులు వీరితప్పులు క్షమింపుడు.

౨౫. లోభివి కాకుము, ఏనిమిషమున చత్తువో, మరణించకముందే మంచిపనులకై దానము చేసుకొనుము.

౨౬. ఇతరులు పాపముచేసినారని, ఇతరుల ఎన్నెదవు కాని నీవు పాపము చేసితివా లేదా అని ఆత్మాలోచన చేసికొనుము.

౨౭. అన్యాయులు, ధర్మహీనులు దేవునిరాజ్యమునకు వారసులు కానేరరు. ధర్మము నిమిత్తము ఎవడు ఉరిదీయబడునో వాడు ధన్యుడు.

౨౮. మీలోనుండి ఎవడైనా, ధర్మమునుండి దొలిగెనేని, అతనిని ధర్మమార్గమునకు త్రిప్పుడు. అతనిని, అధర్మమునుండి రక్షించిన వారగుదురు.

౨౯. మానవుడు బ్రతికియున్నంతకాలము, ధర్మశాస్త్రమునకు విరుద్ధము, భగవదాజ్ఞకు వ్యతిరేకముగా నడువ వలదు.

౩౦. ప్రేమలో, హెచ్చుతగ్గులుండరాదు. ఇదే ధర్మము తోటి మానవుల లోటుపాట్లను క్షమించుము.

౩౧. మీకీ ప్రపంచములో, సొంతమనునది, నాది అనునదే మాత్రముండరాదు. స్వార్థమును వీడి ప్రతిజీవికి సేవచేయుడు.

౩౨. ఎప్పుడును ఇతరులవలన సేవ పొందకుడు, పరాధీనులు కాకుడు, మీరు నియమముగ నడచి ఇతరులకు ఆదర్శప్రాయులుగండు.

౩౩. ధర్మజీవనము వలన వచ్చెడు ఫలిత మేమని కదా, మీసందేహము. విశ్వాసియొక్క జీవితములో ఫలాపేక్షకు చోటులేదు. సేవకుడు తన విధ్యుక్త ధర్మమును, భగవదేచ్ఛను నెరవేర్చవలెను. కావున మీరు మీ ధర్మములను నెరవేర్చుడు, మీరు భగవంతుని సేవకులమని మరువకుడు.

౩౪. ఏదివచ్చినా దానితోనే తృప్తి నొందుడు. మీకు ఇచ్చిన అమూల్యమైన ఆత్మజీవనమును మాత్రము ధ్వంసమై పోకుండా చూచుకొనుట ముఖ్యము. పరీక్షకు సంసిద్ధులై మీపని మీరు నెరవేర్చుచుండుడు.

౩౫. నిజము చెప్పుచున్నాను. మానవుడు మరల జన్మమెత్తినగాని మోక్షమును పొందజాలడు. పాపములకు పశ్చాత్తాపపడి మరల పాపములు చేయక భక్తిగా నుండునేని మరల జన్మ యుండదు.

౩౬. ఓ మానవులారా! మీకు మోక్షమే కావలెననినచో మీకుగల ధనసంపత్తి నంతా దానముచేసి తదుపరి నావెంటరండు. అపుడు మోక్షము దొరుకును. ఇహము, పరము రెండూ కోరువాడు మూర్ఖుడు. కాన, పరమే కావలయునంటే, సమస్తమును విడిచి, ఆశలు వదలి రండు, ఆలసించకుడు.

౩౭. మానవుడు ఆహారము వలననే జీవించుటలేదు, భగవంతుని ఆజ్ఞ చేతనే జీవించుచున్నాడు.

## ౧౧౮. మహాత్మ సుకురాతు

[వీరు క్రోధరహితులు, త్యాగశీలురు, కాని, వీరి భార్య వీరి స్వభావమునకు విరుద్ధమైన లక్షణములుగలది. ఒకరోజు వీరిని, ఆమె, దూషించి, అంతటితో తృప్తిచెందక ఒక కుండెడు నీళ్లు తెచ్చి వారి పైన పోసినను, వారు కోపపడక, మందహాసముతో, ఉఱిమి ఉఱిమి వర్షించుట సహజమే, కదా, అనుచు శాంతము వహించెను.]

౧. ప్రపంచమును ప్రేరేపింప వాంఛించు నతడు తన్నుతానే ప్రేరేపించుకొన వలయును,

౨. సమస్త సుఖభోగములను విడిచి, ఆత్మధ్యానపరుండవు కమ్ము, అందరిని భగవత్స్వరూపులుగా భావించి సేవించుము.

## ౧౧౯. మహాత్మ సోక్రటీసు

౧. దైవవాణి అంతరాత్మ రూపమున నీలోనుండి అహర్నిశలు నిన్ను ప్రబోధించుచుండును. నీమనస్సులో వాక్కులో పనిలో ఎపుడే లోటు కలిగినా, ఈ వాణియొక్క మందలింపు స్పష్టముగ వినవచ్చు చుండును. కావున, అంతర్వాణి ఆజ్ఞ చొప్పుననే నడుచుకొనుము. కాని దీనికి ఏకాగ్రత ముఖ్యము.

౨. ఆత్మ చావులేనిది, ఈ విశ్వాసమునకై ఎట్టి త్యాగమైనా చేయవలెను.

౩. విషయసుఖములకై, పై అలంకారముకై, కీర్తి ప్రతిష్ఠలకై, మనకాలమును వ్యర్థపుచ్చ తగదు. ఇట్టి వ్యర్థజీవితము వలన మంచి కలుగకపోగా అపారమైన నష్టము, హానియు సంభవించును. కాన విషయ లోలత్వ మెన్నటికి తగదు.

౪. ఆత్మకు అలంకారములైన విద్య, ఇంద్రియ నిగ్రహము, ధర్మానుష్ఠానము, ధైర్యము, స్వాతంత్రేచ్ఛ, సత్యాగ్రహము, వీనితో గూడిన జీవితమును గడుపుచు, పిలుపు వచ్చినంతనే ఈ లోకమును

విడిచి పోవ్వుటకు సంసిద్ధులుగా వుండవలెను. ఇదియే మహా ఆనందము సుమా.

## ౧౧౮ మహాత్మ గోకర్ణుడు

౧. ఈ శరీరము అనిత్యమైనది, మలమూత్ర దుర్గంధపూరితము. ఈ శరీరమే నేనని భ్రమపడకుము. భార్యాపుత్రులు నావారు, ఇది నాది, అని అనుకొనకుము. రాత్రి పగలు ఈ ప్రపంచము క్షణభంగురము అని విచారించి అన్నిటిని త్యజించుము. అన్నిటియందలి ఆశలను వదలుము.

౨. ఇతరుల గుణదోషములను విచారించకుము. భగవంతుని స్మరించు చుండుము.

౩. సుఖభోగములకు లోనుగాకుము. సదా దుఃఖితులకు సేవ చేయుచుండుము. సంగ్రహాము చేయక లేనివారి కిచ్చుచుండుము.

## ౧౧౯ మహాత్మ గోమతిదాస్‌జీ

౧. నీవేపనిచేసినా నియమబద్ధుడవై చేయుము. ఎందుకనగా నియమముల వలన మనస్సు బంధింపబడును.

౨. చేతితో నోరుతో మనస్సుతో సర్వదా భజించు చుండుము.

౩. సోమరితనమే నీకుశత్రువు. కాన జాగరూకుడవై సదా మంచికర్మలనే చేయుచుండుము. కష్టములకు భయపడక సహించుము.

౪. భజనచేయు వారికి అధికసంభాషణ అధికమైన తిండి అధిక నిద్ర యుండరాదు. సత్సంగము చేయుచుండవలెను. ఏకాంతవాసము ముఖ్యావసరము. కాని! మనస్సు వశముకానిది ఏకాంతవాసము కష్టము.

## ౧౨౦ మహాత్మ రామకృష్ణదాస్‌జీ

౧. మానవుని జన్మ తిండికి సంతానోత్పత్తికి రాలేదు. జన్మరాహిత్యానికే వచ్చినది. కాన సమస్తకోరికలను త్యజించి భగవంతుని భజించుచుండుడు.

## ౧౨౧ మహాత్మ మంగతరాంజీ

౧. ఆత్మశుద్ధి లేనివాడు వాసనారహితుడు కాని వాడు ఉపదేశము చేయరాదు. కీర్తి గౌరవముల కాసించి ఉపదేశము చేయువాడు దురాచారుడు. దేశధర్మములను చెడగొట్టిన వాడగును.

౨. ఎవనిలో సత్యము, ప్రేమ, దయ, ఆత్మశక్తి మొదలగునవి ఉండవో వాడు ఎంతగొప్ప విద్వాంసుడైనను, మూర్ఖుడే.

౩. సమస్త దోషములచే రహితుడై స్వతంత్రుడై సమస్త సంసార వాసనలనుండి విడబడినవాడే ముక్తుడు.

## ౧౨౨ మహాత్మ సూర్యదాస్‌జీ, మహారాజ్

[వీరు సేవాభావము కలవారు. ఎండిపోయిన రొట్టె అయాచితముగ దొరికిననాడు తినేవారు. ఒకరోజు రొట్టెమీద నెయ్యి పెట్టి ఉండెను. దానిని తిరిగి ఇచ్చివేసినారు. ఎందుకన, అందరికి లేని సౌఖ్యము నాకెందులకు. అని ఆరోజు ఉపవసించినారు.

ఒక పఠానువాడు వారివైపు కాళ్లు చాచి పండుకొనగా వారు ఆ పఠానుని కాళ్లు పిసికినారు. అందుకు ఆ పఠాను సిగ్గుపడి క్షమాపణ కోరెను. అందుపై నాయనా ఇదినాయొక్క సహజకర్మఅని అనిరి.]

## ౧౨౩ మహాత్మ మస్తురాంజీ, మహారాజ్

[వీరికి ఒక కౌపీనముతప్ప ఏమిలేకుండెడిది. దిగంబరులుగానే ఉండేవారు. చలికాలములో కూడా బట్టలు లేకుండెడివి. ఒకరోజు ఒకరు వారి భోజనములో కడి (చల్ల పులుసు)ను వడ్డించినారు. అది బహురుచిగా ఉండుటచే ప్రతి సమయము ఆ కడియే జ్ఞాపకమునకు వచ్చెడెది. అందువల్ల కడిని చేయించి బాగా తృప్తిగాతిని తన మనస్సును సంబోధించుచు ఓమనస్సా నీకెంత తినవలెనని అభిలాషకలదో ఇక తినుమని బాగుగా కక్కేట్టు కడిని త్రాగి కక్కి కక్కినదానినే మరల త్రాగి ఇట్లు మూడు నాలుగు పరియాయములు ఆ కక్కిన కడినే

[త్రాగినాడు. అపుడు దానియందు విసుగు విరక్తి పుట్టినది. మళ్లీఎన్న డైనా ఆకడి స్మరణకే రాలేదు. కావున మనస్సును ఇట్లు వశపరచుకొను మని చెప్పెడివారు. ఎవరైనా వీరికి బట్టలు యిచ్చినచో వాటిని లేని వారి కిచ్చేవారు. ఒక గాడిదకు వీపుమీద పుండు ఉండుట చూచి తనవద్ద ఉన్న పట్టుబట్టను చింపి ఆ పుండుపైన కట్టు కట్టినాడు. వీరిచేతిపై ఒక పుండు పుట్టి దానిలో పురుగులు పడినవి. ఆ పురుగులను తీసివేసే వారు కాదు. ఆ పురుగులు క్రిందపడితె వాటినితీసి మరల ఆ వ్రణములోనే వేసే వారు. ఇతరులు కారణ మడిగినచో అరే రామరామ పాపము ఈ పురుగులు ఉపవాసముచే చనిపోవును. కాన, వాటి ఆహారమును అవితిన వలెనని వాటిని వ్రణములో వేయుచున్నానని సమాధానము చెప్పేవారు.]

౧. ఎవనికి ఏలాటిఇచ్ఛ ఉండదో వాడే చక్రవర్తి. ఎవనికి ఇచ్ఛ లేదో వానికి దారిద్ర్యము ఎట్లు వచ్చును. ఇచ్ఛలేనివాడే ధనవంతుడు.

౨. కష్టములను సహించువాడే మానవుడు. సుఖములను అనుభవించుచు దుఃఖములను దూరముచేయుట మానవుని ధర్మము కాదు. సుఖ దుఃఖములను భగవత్ప్రసాదమని అనుభవించవలెను. రెండింటిని సమానముగానే ప్రీతితో సేవించవలెను. ఈ శరీరము నశించునని భయమెందులకు? ఈశ్వరుడిచ్చిన దానిని స్వీకరించుచు రామ రామ అనుకొనుచు శరీరమును విడుచుట మానవుని యొక్క ధర్మము.

## ౧౨౪ మహాత్మ త్రైలింగస్వామి

౧. జిహ్వాకు వృధాగా మాట్లాడే అలవాటు, కాన, జాగ్రత్త వహించుము. అధికముగా మాట్లాడేవాడు అధికముగా అసత్యము చెప్పును. కావున వ్యర్థసంభాషణ చేయకుము.

౨. శాస్త్రముల చదివి తెలిసియుండియుకూడా వాటి ననుస రించనివాడు పాపాత్ములలో మహాపాపాత్ముడు సుమా.

౩. ప్రపంచము మిథ్య, ఇది మంచిది, ఇది చెడ్డది, అని సదా మనన చేయుచుండుము. ఎవని పాపపుణ్యములు వాడే సంపాదించుకొనును. నీ మంచిచెడ్డలకు ఇతరులు కారకులు కారు.

౪. సంపదను, పుత్రమిత్రులను, నావి, నావారనుకోకుము. నీ శరీరమే నీది కాకుండా పోవుచుండగా, అవి నీ వెట్లగును. ఇది మరువకుము.

౫. ఇతరుల మనస్సు నొప్పించినచో, ఇతరులు నీ మనస్సును నొప్పింతురు. నీ వేదిచేయుదువో ఇతరులవల్ల అదే నీకు ప్రాప్తించును. అది తప్పదు.

౬. విషయ వాసనలను జయించక ఎన్ని పూజలు తపస్సులు చేసినను వ్యర్థమే. ఇతరులకు నీవేమి ఉపదేశము చేయుదువో, దానిని నీవు మొదట ఆచరించుము.

## ౧౨. మహాత్మా నారాయనాస్వామి

౧. ఆత్మవిరుద్ధమైన పనులు చేయరాదు, ఆత్మ చెప్పినట్లే వర్తించును. ఎల్లపుడు భగవద్ధ్యానము చేయుచుండుము.

౨. నీయొక్క శ్రేయస్సు ఇతరుల శ్రేయస్సులో ఇమిడియున్నది. నీవలన ఇతరులకు కష్టములు రాకుండ చూడుము.

౩. ప్రతిరోజు ప్రతినిమిషము, ఆత్మను పరీక్షించు చుండుము. సుఖములను ఆశించక కష్టములను సహించుము.

౪. విషయాసక్తుడవు కాకుము. నీకు ఎక్కువ ప్రీతిగలదానిని విడువుము. ధనమును సంగ్రహము చేయకు, బీదలకీయుము.

౫. ఆహారమును మితిమీరి తినకుము. ఏలాటి దుర్గంధము రాకుండా కడుపును ఎల్లపుడు శుద్ధముగా నుంచుము.

౬. ఈ సంసారములో నావి అనే పదార్థము లన్నింటిని విడిచి వెళ్లవలసి వచ్చును. కావున, వాటిపై మమత వదలుము.

## ౧౨౬ మహాత్మా నాథూరాంజీ శర్మ

౧. నీ వేది చేసినా ఏ ప్రాణికిని హింసకాకుండా చూడుము. నీ మాటలవలననే కాని, లేక క్రియల వలననే కాని, ఏ జీవికిని మానసిక హింస కారాదు.

౨. ఎంతవరకు దేహాభిమానము మరి సంసార చింతన నీకు ఉండునో అంతవరకు ఈశ్వరప్రాప్తి కలుగదు. దీనిని సదా మరువకుము.

౩. ధనతృష్ణ, స్త్రీతృష్ణ ఈ రెండు నిన్ను నశింపజేయును. దీనిచే చిత్తశుద్ధి కానేరదు. కాన సదసద్విచారము చేయుచుండుము.

౪. సదా ఆత్మవిచారణ చేయుచు, నీలో ఉన్న తప్పులను ఏరి, ఏరి, త్యజించు చుండుము.

## ౧౨౭ మహాత్మా సదాశివబ్రహ్మేంద్ర్

[వీరు విరక్తులు, భక్తులు, దండక మండలములను కూడా ఉంచెడివారు కారు. వీరు అవధూత గంటలకొలది సమాధిలో వుండే వారు. ఒకప్పుడు మధురపట్టణ సమీపము నదిలో సమాధిలో వుండిరి. నదిప్రవాహామువల్ల ఇసుకతో కప్పబడి ఇసుకదిబ్బలో పూడ్చబడి వుండిరి. కొంత కాలమునకు ఎవరో ఒకరు, ఇసుకను, త్రవ్వుచుండగా వారు సమాధిలోనే కనిపించిరి. బాహ్యా వాతావరణమువల్ల సమాధి భగ్నము కాగానే వారు లేచి వెడలి పోయిరి.]

## ౧౨౮ మహాత్మా విజయకృష్ణగోస్వామి

౧. ఎవరు ఉపదేశము చేయుదురో, వారి మనస్సులో, ఆచరణలో, పాపచింతన ఉండరాదు. ఉపదేశములు ఏప్రకారము చేయుదురో, అదే ప్రకారము ఆచరణ ఉండుచో ఆత్మదర్శనము తప్పక కలుగును. శరీర నాశనమువల్ల పాపనాశనము కాదు. కావున, నీ శరీరమును నాశనము చేయకుము. దీనితో ఎంతో పని తీసుకోవలసి ఉన్నది. దాని కర్మ తీరువరకు అది ఉండి తీరవలెను. భగవంతుని విధానమే అట్లున్నది. ఆయన ఆజ్ఞను ఉల్లంఘించరాదు. ఈశ్వర విధానమునకు వ్యతిరేకముగా వర్తించుట మహాపాపము.

## ౧౨౯ మహాత్మా శిశురాకుమార్ ఘోష్

[వీరు లోకకల్యాణము గురించి ప్రతిజీవికి సేవచేయువారు. సదా భగవంతుని ధ్యానించు చుండెడివారు. ప్రతిఘడియ నవీన జీవనమని తలంచువారు. "రేపు తెల్లవారేవరకు ఈ జగత్తులో ఉండేవాడనో, కానో, నాకు తెలియదు కాన, సదా పరిశుద్ధమైన అంతఃకరణము గలవాడవై ఉండుటే శ్రేష్ఠము. ఎపుడేది జరుగునో ఎవరికెరుక", అని ఎల్లపుడు అనుచుండేవారు.]

## ౧౩౦ మహాత్మా టాల్‌స్టాయి

౧. ఈ దినము బ్రతికి రేపు చనిపోవనున్న నీవు ఇపుడే ఈశ్వరుని ధర్మశాసనమును అనుసరించి నడుచుకుందునని ప్రతిజ్ఞ చేసితివా, నీ అంతరాత్మ ఇపుడే ప్రజ్వరిల్లును.

౨. ఇతరులపై ఆధారపడి, వారి కష్టముల మీదనే బ్రతుకదలంచితివా, నీకు నరకప్రాప్తియే.

౩. స్వకాయ కష్టమువలన సంపాదించినదే తినవలెను, పనిజేయకుందువేని, మహాపాపి వగుదువు.

౪. విషయ భోగముల కొరకు ప్రాకులాడుటలో తరుచుగ ఒకరి లాభము, మరొకరికి నష్టముగ పరిణమించును. కావున, నీ స్వార్థము కొరకు ఇతరులకు నష్టము కష్టము కలిగింపకుము.

౫. అసత్యము చెప్పకుము, సత్యమునకు భయపడకుము. నీ అంతరాత్మ ఏమి చెప్పునో దానినే ఆచరించుము. దానిపై విశ్వాసముంచుము.

౬. అన్నిటికంటె ముఖ్యము పరోపకారము. నీ సర్వస్వముమ తుదకు నీ ప్రాణమునైన వడ్డి, బీదలకు ఉపకారము చేయుము. నీ సౌఖ్యమునకై, స్వార్థపరుడవై ద్రవ్యమును నీ కొరకై వ్యయ పెట్టక దీనుల నిమిత్తమే కర్చు పెట్టుము.

౭. పరుల దోషములను చూడకుంటివా స్వర్గము దొరుకును.

౮. చంటి పిల్లలకు ఏలాటి వికారము లుండవు. నీవు అట్లే సమస్త విషయ వాంఛలను విడిచినచో, తత్షణమే ఈశ్వర దర్శన మగును.

౯. నిన్ను అడిగిన ప్రతివానికి, నీ వద్దనున్న దాని నీయుము. నీ వస్తువులు తీసికున్న వారిని తిరిగి ఇవ్వమని అడుగకుము.

౧౦. నాది, నాది, అనుచు, ఇది ఎట్లుబోవునో, ఎవరు దొంగి లించుదురో, అని చింతించకుము. అంతా భగవంతునిదే.

౧౧. సంతృప్తియే సుఖము. ఉన్న దానిలోనే తృప్తిపడుము. పాపభీతియు, పరమార్థ చింతకలవాడవు కమ్ము.

౧౨. నీవు ఇతరులకు ఏది కోరుదువో దేవుడు నీకు అదే ఇచ్చును. కావున, ఎన్నడూ ఇతరులకు చెడు కోరకుము.

౧౩. నిన్ను ద్వేషించిన వారిని ప్రేమించుము. క్రోధమును వీడుము.

౧౪. ప్రేమలోనే దేవుడున్నాడు. కేవలము నాకే సౌఖ్యము కావలెనని కోరకుము. ఇతరుల సౌఖ్యములోనే నీకు సుఖమున్నది. ఒకడు తప్పుచేసినచో వానికి శిక్ష కావలెనందువు. నీవు చేసిన తప్పులన్ని టికి ఎంత శిక్ష ఇవ్వవలెనో ఆలోచించు కొనుము.

౧౫. ఎంత భూమి కావలె? కొద్ది భూమితో కష్టపడి జీవనము గడుపవచ్చును కదా! దానిలోనే తృప్తిగలదు. నీవు చచ్చినచో బొందకు ఏడు జానల భూమియే సరిపోవును. కావున, సమస్త కోరిక లను విడువుము.

౧౬. దొంగల చేతికి, దుష్టుల చేతికి, చిక్కని విత్తమును అనగా జ్ఞానమును కూడబెట్టుము.

౧౭. రాత్రి, నీ నిద్రకు భంగము కలిగించునట్టి పనిని పగలు చేయకుము. తన్ను తాను జయించినవాడే నిజమైన వీరుడు.

౧౯. విజ్ఞుడు పఠించునది జ్ఞానముకొరకు, అల్పుడు పఠించునది తన పేరు ప్రతిష్ఠలకొరకు.

౧౯. ఉదారుడవైన నీవు విచ్చలవిడిగా తిరుగకుము. గుడ్డివారు, కుంటివారు, కూడులేనివారు ఉన్నారు. వారిని కనికరించుము.

౨౦. ఉదారుడవైన నీవు పతితప్రజలనుద్ధరించుము. సచ్ఛీలుండవైన నీవు అర్థిజనులపాలిటి కల్పవృక్షము కమ్ము.

౨౧. విషయభోగములకై ప్రాకులాడక, సమస్త జీవులయెడ వైరము ద్వేషమును వీడుము.

౨౨. నీ కొరకు గాక, ఈశ్వరుని కొరకే జీవించుట నేర్చు కొగలిగితివేని, నీకు దుఃఖ నివృత్తికలుగును.

## ౧౩౧ మహాత్మా నారాయణస్వామి (ఆర్యసమాజ్)

౧. జీవుడు విషయ సుఖములకొరకు, ఇంద్రియలోలుడై తన స్వాతంత్ర్యమును పోగొట్టు కొనుచున్నాడు. ఇది పాపకృత్యము.

౨. ప్రతి దినము పశుపక్షులకు, కీటకములకు, రోగులకు, అతిథులకు, తృప్తిగా పెట్టి తదుపరి నీవు తినుము.

౩. పాపముచే ఆర్జింపబడిన అన్నమును తినకుము. అధర్మమును అన్యాయమును చేయకుము.

## ౧౩౨ మహాత్మా గాంధి

౧. భగవంతునిపై విశ్వాసముంచుము. ఆయన ప్రతి అణువు నందు వ్యాపించి యున్నాడు: కాన దేనిని నీస్వంత హక్కుగా తలంచకుము.

౨. భగవంతు డిచ్చిన దానినే భోగింపుము. నీకు అవసరమైన దానికంటె ఎక్కువ వాడుకుంటివా, దొంగవే అగుదువు. నాది, నాకు, అనే భావముండరాదు. సర్వము కృష్ణార్పణము చేయుము.

౩. ఇతరుల ధనమును నీవాసింపకుము. ఈ అనంత జీవకోటిలో నీవొక జీవాణువని తెలిసికో. ఈశరీరమునకు, అన్నము, నీరు, వస్త్రము, అవసరమే. వాటికై నీత్యాగఫలమే చాలు. భగవంతునిపై ఆధారపడి వుండుము. త్యాగమునకు ఫలితము భగవంతుడే ఇచ్చును. చింత పడకుము.

౪. సత్యవ్రతుడు, భూమిపైనుండు ధూళికంటెను వినమ్రుడై సత్యాన్వేషణమున మెలగ వలయును.

౫. అహింసాపరుడు, ఎదుటివానిని చంపబోడు. ఎదుటివాని చేతిలో తాను చచ్చుటకు సిద్ధముగా నుండును.

౬. తన పనులయందు శ్రద్ధచూపి ఇతరుల పనుల నుపేక్షించు వాడు, పాపియే. తనది యనునది వేరే వుండకూడదు. అంతా ఈశ్వరునిదే.

౭. పరమేశ్వరుని, దర్శింపవలెనని కోరికగలవాడు, దేహమును దాటి తీరవలెను. సత్యమును పాలించుటకు, చావునైనా అంగీకరించ వలెను.

౮. ఇతరులు చేసిన పొరపాటునకు, వారిని బాధింపరాదు. మనమే ఆనష్టకష్టములను అనుభవించ వలయును.

౯. లోకసేవ చేసినామనిన, ఎవరినో ఉద్ధరించినామని కాదు. మనకు మనమే ఉపకారమొనర్చు కొన్నాము. మన ఋణభారమును, మనము తీర్చుకోవలసి యున్నపుడు మనకర్తవ్యమును, నెరవేర్చవలెను.

౧౦. మానవుడు, పుట్టుటెట్లో, చచ్చుటల్లే. మృత్యువు ఒక పిశాచముకాదు. అది ఆప్తమిత్రుడు. కష్టములనుండి విముక్తి జేయును. నిద్రవలె మరణము కూడా నూతన నిర్మాణశక్తి గలిగించును.

౧౧. నిద్రలో జీవుడు, దేవుని సన్నిధిలో చేరును. మేల్కొను సమయము ఉషఃకాలము. అదే బ్రహ్మాముహూర్తము. బ్రహ్మ సన్నిధానమునుండి జీవుడు తిరిగి బాహ్యామునకువచ్చు పవిత్ర సమయ

మగుటచే దీనిని బ్రహ్మముహూర్త మందురు. బాహ్యశరీరము శక్తి వంతముగాను, హృదయము నిర్మలముగా నుండును. కావున అది ధ్యానమునకు మంచి సమయము. క్రిందటి రోజున అలసిన శరీరము అప్పటివరకు అలసటతీరి పునః సృష్టికి జాగ్రతపడును.

౧౨. దీనజన సేవయే దేవుని సేవ. కావున దరిద్రనారాయణులను సేవించుడు.

౧౩. ధనవంతులు తమ ధనమును, విలాసములకై ఆడంబరములకై కర్చుపెట్టకూడదు. బీదప్రజలకై వినియోగించ వలయును. బీదప్రజలను, తమ కుటింబీకులవలె ఆదరించ వలయును.

౧౪. తన భావములను, ఇతరుల మీద రుద్దుటకు ఎన్నడును ప్రయత్నించరాదు. మంచి వల్లనే మంచిపుట్టును.

౧౫. దైవము గాక నిన్నెవరు కాపాడలేరు. ఒక మానవుడు మరొక మానవుని కాపాడ జాలడు.

౧౬. ఆత్మ పరిశోధన వలన ఉన్నతి కలుగును. పరుల పరిశోధన వలన పతనము కలుగును.

౧౭, దేవునికి విముఖులై, ఆలోచనలు చేయుట కూడా పాప పరిగ్రహమగును. కావున, అట్టి సంకల్పములు చేయరాదు.

౧౮. రేపటికై, తిండి కావలెనని ఆలోచించకుడు, దేవుడే సమకూర్చును, మీకు అభిమాన మెందులకు? సమస్తమునకు, యజమానుడు దేవుడే, కోరికలను విడిచి త్యాగబుద్ధిని వృద్ధిచేసుకొనుడు.

౧౯. లోకములో ద్వేషభావము పోయినపుడే శస్త్రసన్యాసము సంపూర్ణముగ ఫలించును.

౨౦. మన దుఃఖ సమయములలో కూడా దైవము మనలను చేబట్టి తెన్ను చూపుచుండును. కాని, మనము గ్రహించుటలేదు.

౨౧. ఉదయపు ప్రార్థన తాళపు చెవివంటిది. సాయంత్రపు ప్రార్థన గడియ వంటిది.

౨౨. మనము బీదలను కాపాడ దలంచుకొనినచో, మొదలు మనము బీదలమై తీరాలె. మొదలు మన దోషములను నివారింప చేసుకొని ఇతరులకు తమ దోషములను పోగొట్టుకొనుటకు సహాయ పడవలెను.

౨౩. రాగము, ద్వేషము, ఈ రెండే మానవుని పాడుచేయును. కావున సమస్తకోరికలను విడిచి ఆత్మను ప్రేమించుము. నీలోవున్న దోషములను ద్వేషించుము.

౨౪. మానవుడు ఎపుడు జబ్బుపడినా, తన పాపముల వలననే జబ్బు పడును. తన మనస్సును వశపరుచుకొని పరిశుద్ధము చేసుకొన్న వాడు జబ్బుపడడు. సదా శాంతముగా నుండును.

౨౫. మద్యపానమువల్ల సంపాదించిన డబ్బుతో ఆహారాన్ని తినరాదు. అది బీదలపాలిటి రక్తము.

౨౬. వాసనలకు లోబడకుము. తిండికై ఆశించుకుము సేవకై శరీరశ్రమ చేయగలిగినపుడే భూమిపై జీవించుటకు హక్కుగలదు. తన్నుతాను త్యజించు కొనవలెను. నేను, నాది, అనేది వుండరాదు.

౨౭. దానము చేయుచున్నానని గర్వింపకుము. ఉచితముగా ఇచ్చుటలేదు. మీరు తీసుకున్నదే ఇచ్చుచున్నారు. నీవద్దగల సమస్త సంపదలు బీదల కష్టార్జితమే కద?

౨౮. ఏనాటి కానాడు మన అవసరములకు సరిపోవునంత ప్రకృతి యుత్పత్తి చేసి పెట్టుచునే యున్నది. ప్రతివాడు తాను జీవించుటకు సరిపోవునంతనే తీసుకొనిన యెడల ఈ ప్రపంచములో పేదరికమే ఉండదు.

౨౯. కోట్లాది ప్రజల కందరాని కలిమిని, సుఖమును, అనుభవింపకుము. పట్టుదలతో నిరాకరింపుము. ఇదే ధర్మము. ఇతరులకు లేని సౌఖ్యములను, సౌకర్యములను, నీవు పొందకుము.

౩౦. కేవలము శరీరచర్య నడుచుకొరకే తప్ప జిహ్వాచాపల్యము కొరకు తినకుము. నీకు దేనియందు అధిక ప్రీతియో దానిని త్యజించుము. ఇట్లు ప్రతి ఇంద్రియముద్వారా శరీరము యొక్కయు శరీర ద్వారమున ఆత్మయొక్కయు ప్రయోజనము కొరకై వర్తించుచుండవలెను. దీనికై ఎంతటి త్యాగమైనను చేసి తీరుము.

౩౧. తనువును దేవమందిరముగ వినియోగించుటకు బదులుగా వ్యసనములకు వాహనముగా వినియోగించు చున్నాము. ఈ దివ్య మందిరమును కలుషితము చేయుటనుకూడా లజ్జింపజాల కున్నాము.

౩౨. నీ ధ్యాననిష్ఠకు ప్రతిబంధకములేని పుణ్య కర్మలనే చేయుము. మనస్సునకు విక్షేపము కలుగజేసెడి అశాంతికరమగు కర్మబాహుళ్యములో పడిపోకుము.

౩౩. ఈ సృష్టిలోగల సమస్త జీవులను ప్రేమించుము. భేద భావ ముండరాదు. ఇదే మంచి ఉపాయము.

౩౪. కేవలము ఈరోజు జీవించుటకే ప్రయత్నించుడు. రేపటికై ఆలోచనలు వ్యర్థము. రేపు నీ వుండేది నిశ్చయమెట్లు? వ్యర్థచింతనలు చేయకుడు? రాబోవు జీవితమును గురించి, ఇపుడే చింతనలు చేయుట అజ్ఞానము.

౩౫. వృథాగా మాట్లాడకుము. నీ మాటలయొక్క ధ్వని నూరు గజముల దూరమే వినవచ్చును కాని, నీవు, సంకల్పించినచో భూలోకమంతట వ్యాపించునదే కాక భూర్భువాది లోకములవరకు వెళ్లును. కావున వ్యర్థముగా మాట్లాడకుము. నీ సంకల్పము సిద్ధి పొందుటకు మౌనము, ఆత్మనిగ్రహ మవసరము.

౩౬. దానధర్మములు చేయుము, కాని, చూచి, విచారించి చేయుము. ఏమి ఆస్తిలేనివారికి, జ్ఞానాభివృద్ధిని చేయువారికి, వికలాంగులకు, ఇచ్చుచుండుము.

౩౭. అహింసాత్మకమగు సత్యజీవనము గడుపుటకు పడు పరితాపమే ప్రార్థన.

౩౮. ఇతరులకు మేలు చేయదలచువాడు నీతిమార్గమును అణుమాత్రము విడిచిపెట్టక, కత్తిమీద నడచినట్లు వర్తించుచు ఇతరులకు బోధచేయవలెను. ప్రతిక్షణము తననుతాను పరీక్షించుకొనుచుండవలెను. నోటితొందర యుండరాదు. లేనిపోని ఆశలకు గురికారాదు.

౩౯. సకల ప్రాణులను విశ్వరూపులుగా మారునట్లు ప్రయత్నించ వలెను. సకల ప్రాణుల అభివృద్ధి పరుచుటకే మానవుడు సృష్టింపబడినాడని మరువకుడు.

౪౦. తనకు నిసుమంతయు నుంచుకొనక దైవకార్యములకు సమర్పించువాడు, ముక్తజీవు డనబడును. తనకు కావలసిన దానిని యుంచుకొని, మిగిలినదానిని సమర్పించువాడు, ధర్మజీవు డనబడును.

౪౧. తన అంతరాత్మకు సత్యమని తోచినదానిని, దైవప్రీతికరమని తోచినదానిని, జీవకోట్ల కుపకారమని తోచినదానిని, చేయుటలో ఎన్నినిందలు, దూషణములు, అవమానములు, కలిగినను తనవారందరు వీడిపోయినను, విడువక, ప్రాణమును ఒడ్డియైనను, ప్రాణ ముండువరకు, వెనుదిరుగనివాడే సత్యవ్రతుడు.

౪౨. తిండికై ఒకప్రమాణ ముండవలెను. నానాప్రకారమైన వస్తువులు తిండిలో యుండరాదు. సాత్వికభోజనము మితముగా ఒకే వస్తువు తినవలెను.

౪౩. తానుచేసిన తప్పుపనులను ఇతరులకుచెప్పి పశ్చాత్తాపపడి మళ్ళీ ఆ తప్పుపనులను చేయరాదు.

౪౪. నీ అవయవములు ఏవైనా నీవు చేయుచున్న మంచి పనులకు ఆటంకము కలిగించెనేని వాటిని పెరికి పారవేయుము.

౪౫. ఎపుడూ ఒంటరిగానే నిదురించుము. నిద్రకుముందు నిదుర లేవగానే మంచినీరు త్రాగుము. చివర ఆహారము సాయంత్రము ఆరు గంటలలోగ ముగించవలెను. కాళీకడుపుతో పరుండుము.

౪౬. ప్రతిరోజు ౩-౪ సార్లు ఆత్మవిచారము చేయుచు పరీక్షించి దుస్సంకల్పములున్నచో దొలిగించుము.

౪౭. మధ్య మధ్యనగాని నిలబడిగాని నడుచుచుగాని తినకుము, వేడిపదార్థములను అధికమైన వేడిపాలను వాడకుము.

౪౮. ఏ స్త్రీనైనా కామదృష్టితో చూచితివేని ఆత్మ నాశనమును చేసుకున్న వాడవే అగుదువు.

౪౯. ప్రతివాడు ఎదుటివాని దుర్గుణాలను లెక్కించక తన తప్పులనే తానుచూచుకొనుచో పాపములువుండ నేరవు.

౫౦. సత్యము, అహింస, దేవుడు, ఈ మూడింటిని రాత్రింబగళ్లు మరువకుము. న్యాయముగా నడుచుకొనుము. భయపడకుము. భయపెట్టకుము. ధర్మము నిన్ను రక్షించును.

౫౧. నీవారు ఏచెడ్డపనిచేసినా దానికి నీబాధ్యతను గుర్తించి ఆత్మశాంతి కొరకై పశ్చాత్తాపపడి శిక్షించుకొనుము.

౫౨. నీవు ఇతరులకు మంచిచెప్పిన విననిచో నీవు కష్టపడి వారలకు మంచినేర్పుము, కాని నీవు వారిపై కోపపడవలదు.

౫౩. నీదారిలో ముండ్లు పరచినవారికి పువ్వులు పరువుము. నీవు కష్టపడి ఇతరులను సుఖపెట్టుము; ఇతరులను క్రింద బడద్రోసి నీవుపైకెక్క దలంచకుము.

౫౪. అకాలమరణమను నదిలేదు. ఈ లోకములో ఎవరును భూమిమీద చేయవలసినపని ముగిసిపోనిదే చావనేరరు.

౫౫. చెడు చూడకుము, చెడు వినకుము, చెడు చెప్పకుము, వీటిని ఆచరించితివేని బాగుపడుదువు.

౫౬. ఇతరులు కోరని పదార్థములను తినుట వలన జిహ్వా చాపల్యము వీడిపోవును.

౫౭. ప్రాణము నిచ్చుటకు శక్తిలేని మానవునకు ఏజీవి ప్రాణ మును తీయుటకు హక్కులేదు.

౫౮. ఈశ్వరుడు అందరిలో నున్నాడు. కావున ఎవరినైనా ద్వేషింపకుము.

౫౯. పాపమును ద్వేషించు కానీ పాపిని ద్వేషించకుము. ఇత రుల స్వేచ్ఛకు నీ స్వేచ్ఛ అడ్డుకాకూడదు.

౬౦. సిద్ధాంతాలకు ఆచరణకు భేదము యుండరాదు. మనో వాక్కాయ కర్మలు ఏకరూపము పొందవలెను.

౬౧. ఈ ప్రపంచములో దేనివల్ల ప్రస్తుతమున కాని భవిష్య త్తున కాని భయము కలుగునని తోచునో దానిని విడిచితివా నీకు చింత భయము ఆందోళనము పోయి శాంతి కలుగును.

౬౨. యోచించినదే బోధించుము,ఆలోచించినదే వ్రాయుము, కనిపెట్టినదే ప్రకటించుము. తెలియనిదానిని తెలియునని చెప్పుట మహాపాపము.

౬౩. ఇదినాది ఇది నాదికాదు అను రెండు మాటలే నరకము నకు మోక్షమునకు మార్గములు.

౬౪. ఏది ఆచరించినా మాట్లాడినా ప్రకటించినా అనుమానము భయము అమర్యాద యుండదో అదియే సత్యము.

౬౫. ఈరోజు నేనెంతమందికి ఉపకారము చేసితినని ప్రతిరోజు లెక్కచూచుకొను చుండుము.

౬౬. మంచి పదార్థములను నీకొరకై దాచుకొని చెడుపదార్థ ములను ఇతరుల కీయకుము, ఇదిమహా పాపము. నీ పనిని ఇతరులతో చేయించు కొనకుము, పరాధీనుడవు కాకుము.

౬౭. మానవుడు ధర్మజీవనమును గడుపగలిగినపుడు అతనినుండి అద్భుతశక్తి ఉద్భవించును.

౬౮. ఎపుడు నీమనస్సులో అపవిత్ర విచారములు కలుగునో వెంటనే వానిస్థానమున పవిత్ర విచారములుతెచ్చి పెట్టుము.

౬౯. ప్రతిరోజు ౨౪ గంటలు ఈశ్వరుని మనస్సుచే స్మరించు చుండుము. మనస్సు నిన్నెంత బాధించినను. ఒక ఇంద్రియమునైనా దాని స్వాధీనము కానీయకుము. ఇంద్రియములను నిగ్రహించుము.

౭౦. ఈ పదకొండు వ్రతములు ఆచరించుట ముఖ్యము. (1) ఉదార స్వభావముతో శాంతిగలిగి ఉండుము. (2) అగ్నిలో, జలములో ఉమ్మివేయకుము. (3) ఇతరుల వస్తువులను తీసికొనరాదు. (4) ఇతరులను నిందించకుము. (5) వర్షము కురుయునపుడు స్వార్థపరుడవై దానిని నిందించకుము. చలి, ఎండాకాలముల రుతువులకు కష్టపడి వాటిని నిందించకుము. (6) ఇతరులను బాధించకుము. (7) పశువులను, తేళ్లను, పాములను, మొదలగు జీవులను హింసించకుము. (8) మాంసము, గుడ్డు, చేపలను తినకుము. (9) సాధు, సంతు, ఉత్తములను నిందించకుము. (10) నేను శక్తి సంపన్నుడనని అహంకారపడకుము. (11) ఆత్మను అవమాన పరచకుము.

౭౧. ఏ వస్తువునైనా, ముందే నాకు కావలయునని తీసుకొనకుము, ఇతరులందరికి ఉన్నదా లేదా అని చూచి ఎవరికి అవసరము లేని పక్షమున నీకు అవసరమైనయడల తీసుకొనుము.

౭౨. ఈశ్వరుని చేరే ఉపాయము ఒకటే. అ దేదన, నాకువద్దు నీవే తీసుకో. ఏవస్తువునైనా, తుదకు మోక్షమునైనా నాకు అక్కర లేదని ఇతరులకై కోరుము.

౭౩. తన నాలుకను నిగ్రహింపజాలని మానవుడు సత్యవ్రతుడు కానేరడు. నీవు ప్రతి మాటను యోచించియే నుడువుము. ఒక మాటయైనా వృథాపోరాదు. నీ మాట నీ సంకల్పమునకు ప్రతిబింబముగా నుండవలయును. నీ చేతలు, నీ నోటిమాటలకు ప్రతిబింబములై యుండవలయును.

౨౪. ఇంద్రియములు బలహీనములై, రోగగ్రస్థుడవై మృతి నొందుటకంటె కర్తవ్యమును పాలించుచు మరణించుట శ్రేష్ఠము. చావుకు భయపడకుము.

౨౫. దేవునిగురించి నాకు నమ్మకము లేదని చెప్పుట అతి సులభము. ఏలనన అతడు తనను గురించి ఎవరేమి చెప్పిననూ దండించడు క్షమించును.

౨౬. శరీర, కుటుంబ, కీర్తి, ప్రతిష్ఠ, ఐశ్వర్యములపట్ల, మోహమునువిడిచి పెట్టిననాడు. మన హృదయములోని భయముపోవును.

౨౭. మనకు మనము అబద్ధీకులముగా నుండుటకంటె ప్రపంచము ముందు మనము అబద్ధీకులముగా, ప్రకటన మగుట లక్షరెట్లు మంచిది.

౨౮. తన పశువాంచ్ఛలను నెరవేర్చు కొనుటకై ప్రపంచమంతా పరుగెత్తుట తప్పు.

౨౯. తాను చేసిన త్యాగమునకు ఆనందము లేనియడల, దానిని త్యాగమనుటకు వీలులేదు.

౩౦. పనిచేయకుండా తినువాడు దొంగయే. అది ఈశ్వర విధానమునకు విరుద్ధము. ఇతరులపై అధారపడి జీవించుట పాపమే.

౩౧. జిహ్వాచాపల్యముచే చిన్న బెల్లపు ముక్కనైనా, తీసికొనకుము. అత్యవసర మున్నచో ఔషధము వతుగ తీసికొనుము.

౩౨. వ్యర్థమైన మాటలు మాట్లాడనివాడే మౌని. ఆలోచించి అవసర ముంటేనే మాట్లాడుము.

౩౩. ధర్మమునకు ఏది అడ్డువచ్చునో, దానిని త్యజించుము. మన చర్యలలో బుద్ధిని త్రాసువలె నుపయోగించవలెను.

౩౪. ఎదుటివానిపై విరోధమున్నంతసేపు సత్యవంతుడు కానేరడు. ప్రార్థన చేయగోరువారు ముందు తమ హృదయములను పరిశుద్ధములగా చేసుకొనవలయును.

౮౫. ఏ వస్తువేకాని, అది నీదియైననను, ఇతరలు చూచెదరని రహస్యముగా తినుట దొంగతనమే సుమా! ఇతరులకు లేనిది, నీవు తినుట పాపమే. మనస్సులో ఏ వస్తువుపైనా కోరిక గలిగిన అది దొంగతనమగును. అట్లే ఏదైనా మంచి విచారము నాకు తోచినదని చాటుట అహంకారమగును. అదియు దొంగతనమగును.

౮౬. పాలు కామోద్రేకమును కలిగించును. కావున, జాగ్రత్త, పాలగుణమది.

౮౭. నా అభిప్రాయమే సరియైనదని, అహంభావ పడుకుము.

౮౮. నీ ఇంద్రియములు నీకు లొంగనిచో, మోకరిల్లి భగవంతుని సహాయ్యమునకై మొర పెట్టుకొనుము.

౮౯. వైద్యుడు, డాక్టరు అందరూ చనిపోవు చున్నారుకదా, వారివెంట వైద్యానికై ఏల తిరిగెదరు? రామునివైపు ఏల తిరుగరు? రామ, రామ అని జపించుడు. సర్వము బాగుపడును. క్షణిక సుఖముల కై ఆశపడి నశించకుడు.

౯౦. మానవ దశ, పరీక్షా దశ, కావున జాగ్రత్తగ మెలంగుము.

౯౧. బీదలకు దానధర్మములుచేసి సంతోషింతుమని చెప్పబోకుము. వారిని సోమరులచేయకు. అది పాపము.

౯౨. అన్ని వస్తువులు అందరకు స్వేచ్ఛగా దొరుకవలెను. కావున ఇతరులను పీడించుట కొరకు వాటిని వర్తకపుసరకుగా చేయకూడదు, దాచకూడదు.

౯౩. దోషములు శరీరమునకే సంబంధించినవి. కాబట్టి శరీరముతోపాటు దోషములుకూడా చచ్చిపోవును. గుణములు చావవు, ఆత్మ శాశ్వతమైనది, గుణములు శాశ్వతమైనవే.

౯౪. తినునట్టి వస్తువులలో; త్రాగునట్టి వస్తువులలో కల్తీ కలుపుట ద్రోహమే. పాలలో నీళ్లు కలుపుట పాపమే. స్వలాభముకొరకై దేశారోగ్యమును పాడుచేయకుడు.

# ౧౩౩ ఒక మహాత్ముని బోధ

౧. ఏది నిన్ను విడిచి పోవునని తెలియునో, దానిని త్యజించుము. జీవనము, మరణము, ఈ రెండు పరివర్తనములే. మరణ మనుట మార్పుచెందుటే.

౨. మనస్సును అనవసరమగు కార్యములను ఆలోచించ నీయకుము. అవసరములేని అక్కరకురాని తలంపులను దలంచకుము.

౩. సాధకుని జీవితములో, వస్తువుల నాశనమునకై, మృత్యువునకై భయముండ రాదు. సంసారము నాది, అనువానికే భయముండును. సర్వము సమర్పణ చేసినవానికి భయముండదు. మమత వీడగానే అహంకారము నశించును.

౪. ఇతరుల అధికారములను అణచి స్వయముగా గొప్పగా దలంచుట పాపము.

౫. అపవిత్రమగు, అన్యాయార్జిత ఆహారమును, తినుట దోషము. దానివలన మనస్సు కల్మషమగును. చెడ్డబుద్ధి కలుగును. మాంసాహారి చేతితో, చెడువృత్తిగలవారి చేతితో తినకూడదు. హోటల్‌లో మరచియైనను తినకూడదు.

౬. ఆశను విడువుము. ఆశ నిన్నొదలనిచో, సాధు సత్సంగము చేయుము. కామమును సర్వదా త్యాగము చేయుము.

౭. సాధకుడు, ఏకాంతములో శాంతముగా మనస్సును లోతుగా వెదకి చెడుగుణములున్నచో వాటిని నిర్మూలించుటకు ప్రయతించ వలెను.

౮. ఇంద్రియములను గట్టిగా నిగ్రహించ వలెను. చూచుట, వినుట, రుచిచూచుట, మొదలగు వాటిని కోరుచుండును. కావున వాటి ఇచ్ఛప్రకారము వర్తింపకుండుటయే ఇంద్రియనిగ్రహమనబడును.

౯. నడుచునపుడు ఇటునటు చూడరాదు. ఏకాగ్రతతో క్రిందికి చూచుచు పోవుచుండవలెను.

౧౦. ఈశ్వర విధానమును తెలిసి కొనిన వాడు సంసారము వల్ల భయపడడు. ఎందుకన ఆయన విధానమునుండి తప్పిపోవునో ఏమోనని భయపడు చుండును. అతడు సంసార సుఖభోగములం దాశ పెట్టు కొనడు.

౧౧. వ్యవహారములలో ప్రతివానితో భగవద్బుద్ధితో వర్తించ వలెను. ప్రతి పదిహేను నిమిషముల కొకతూరి నిశ్చలుడవై ఈశ్వరుని ధ్యానించుచుండుము. సదా మరువకుము.

౧౨. ఇతరుల కహితము చేయకుము. అసత్యమును పలుక కుము. ఇతరుల హక్కుల నపహరించకుము. పరస్త్రీని కన్నెత్తి చూడకుము. క్రోధపడకుము. ఇతరులపై చాడీలుచెప్పకుము. ఇతరులను నిందించకుము. అబద్ధపుసాక్ష్యమివ్వకుము. వృధా మాట్లాడకుము. తోలు వ్యాపారము చేయకుము. ఇతరుల అపహసించకుము. సమయమును నష్టపరచకుము. వేశ్యాగానమును వినకుము. చెడ్డ చిత్ర పటముల చెడ్డ చిత్రవినోదములను చూడకుము. తినరానిది, త్రాగరానిది సేవించకుము. హింసతో చేయబడు చెప్పులను తొడుగకుము. కీర్తి ప్రతిష్ఠల కాశ పడకుము. ఇతరుల భావములు మంచివైనచో వారి కోరిక ప్రకారమే వర్తించుము. నీకోరికలను త్యజించుము. ఆశలేనిచో ద్వేషముండదు. కావున, సమస్తమైన ఆశలను విడువుము.

౧౩. సుఖదుఃఖములు దేహమునకే కాని నీకు లేవు. కీర్తి, అపకీర్తులు పేరునకే కాని నీకు లేవు.

౧౪. ప్రపంచసుఖము మెరుపువంటిది కాన, మోహములో పడకుము.

౧౫. మమత పెరుగుచుండుచో, మాయ పెరుగుచుండును. నాది అనునది కనబడును. నేను అనునది కనబడదు.

౧౬. నాది అనునది ప్రకృతిలోనుండి వచ్చును. నేను అనునది నీలోనే యున్నది.

## ౧౩౪ హజరత్ మహమ్మదు

౧. ఈ ప్రపంచములో ఒక బాటసారివలె మెలంగుము. చని పోయినవాని క్రిందనే నిన్ను నీవు గడించుకొనుము. నీకు సంబంధము లేని పనిలో నీవు జోక్యము కలిగించు కొనకుము. త్రికరణశుద్ధిగల వాడవు కమ్ము.

౨. తానేది కోరునో ఇతరులకదే కోరవలయును.

౩. మానవుడాచరింపవలసిన నిగ్రహములు.

(1) జనులనుండి వైదొలగి ప్రభువును స్మరించుము, (2) ప్రార్థ ననే నిద్రగాను, ఆకలినే అన్నముగాను భావింపుము, (3) మితి మించిన ఆహారపానీయములచే హృదయమును వేధించకుము. (4) ఆకలి అను జ్యోతిచే నీ హృదయమును ప్రకాశింపచేయుము, (5) ఆకలి దప్పులచే నీ శరీరమును లొంగదీయ ప్రయత్నింపుము, (6) ఆకలి మూలముననే స్వర్గద్వారములను తెరుచునంత దనుక తట్టుచుండుము. (7) ప్రపంచము నుండియు అందలి చెడు నుండియు వైదొలగుము. (8) వారెవ్వరైనను, వారెక్కడున్నను నిగ్రహముకలవారే నాకు అత్యంత సమీపస్థులు, అసత్యమును, అయోగ్యతను, అపనిందను, ఇతరులను చెడగొట్ట తలంచుటను వీడుము.

౪. మీరు దేవుని మార్గమున జంపబడినను, జచ్చినను అది మీ సంపాదలన్నిటిలోను గొప్పది.

౫. మనుష్యులనుండి తప్పించుకొనచ్చునుగాని, దేవుని నుండి తప్పించుకొన శక్యముగాదు.

౬. పాపముచేసి మీ ఆత్మలకే నష్టముగూర్చుకొని దేవుని క్షమింపమని వేడుకొనుటేలా.?

౭. మీ ధనమును మీ సంపత్తిని చూచుకొని దైవమును మరువకుడు. మరచితిరా నశింతురు.

౮. మీకు మృత్యువు సమీపించకముందే మీ కిచ్చిన వ్యవధి కాలములోనే అన్ని మంచి కార్యములను దానధర్మములను చేసుకొనుడు, వ్యవధి ఇంకా లేకపొయెనని ముందుకై ఆలోచించకుడు. వ్యవధిదొరకదు. మీ పనులన్నిటిని దేవుడుచూచుచునే యున్నాడు.

౯. మీరు అర్పించిన జంతువుల రక్తమాంసములు అల్లాను చేరవు, మీ భక్తియే అల్లాను చేరును.

౧౦. ఎవడు తన ఆస్తిని పెంపొందించదలంచునో వాని ఆస్తిని దేవుడు తగ్గించును.

౧౧. ప్రజలవద్ద బిచ్చమెత్తి తినుటకంటె కట్టెలుమోసి అమ్ముకొని జీవించుటమేలు. దేవుడు మెచ్చుకొనును. ఇతరుల సొత్తు తినకూడదు. ఎందుకన ఋణస్తుడవై వారికి లొంగి యుండవలసి వచ్చును.

౧౨. నీ అంతరాత్మకు వెగటు దోచిన ప్రతి దానిని విడిచిపెట్టుము.

౧౩. నీ కంటె ఎక్కువవారిని చూచినపుడు వెంటనే నీ కంటె తక్కువవారి వైపు చూడుము.

౧౪. తన కోపమును ప్రదర్శింప శక్తిగలిగి యుండియు దానిని అణచినవానికి దేవుడు గొప్పబహుమాన మిచ్చును.

౧౫. తన హృదయమును జిహ్వాను పావనముచేయనివాడు మహా పాపి. వాటిని శాంతింప జేయుము.

౧౬. దేవుడు చెప్పుచున్నాడు: నన్నునమ్మి,నావైపు వచ్చువానికి నేను ఎదురేగి ముక్తి నిచ్చెదను. వాని భారమంతా నేనేభరింతును.

౧౭. మీరు మీ సృష్టికర్తను ప్రేమించుచున్నారా.? అయితె మొదలు మీతోటి జీవులను ప్రేమించుడు.

౧౮. దేవుడిట్లు చెప్పుచున్నాడు ఓ మానవుడా నీవు నాశాసములను అనుసరించుము. ఆమాత్రముచాలును. నావంటివాడవగుదువు.

౧౯. మానవులు నిన్ను నిర్దోషివని అనిననూ, నీలో నీకు సంశయములు, కలవరములున్నచో అవి దోషములే.

౨౦. సుఖసంతోషములలో నరకము దాగి యున్నది. కష్ట దుఃఖములలో స్వర్గము దాగి యున్నది.

౨౧. హృదయములో ఆవగింజంత గర్వాంకురమున్నను స్వర్గములో జేరలేరు. ఇది సత్యము.

౨౨. సమస్త సంపదలను, సంతానమును త్యజించి అల్లాను ఆశ్రయించుము.

౨౩. రాత్రి అంతయు ప్రార్థన జరుపుటకంటె, రాత్రిపూట ఒక గంట ప్రజలకు జ్ఞానబోధ చేయుట మేలు.

౨౪. తన్ను తాను నెరుంగువాడు, దేవుని తెలుసుకోగలడు.

౨౫. బాకి వుండి యివ్వలేని వారిని అడుగకుడు, తీసుకొనకుడు. మాఫీ చేయుడు. వడ్డీ వ్యాపారము మహా పాపము.

౨౬. విసిగించి, వేధించి, దూషించి డాంబికమునకై ధర్మము చేయకుడు. గుప్తముగా దేవుని కొరకై ప్రేమతో దానముచేయుడు. అది మిమ్ముల ముక్తులనుచేయును.

౨౭. విద్య నేర్పుటకు జీవితమర్పించువాడు చనిపోడు. మీవద్ద వున్నదానిని అనాధులకు లేనివారికిచ్చు చుండుడు.

౨౮. మీరు సేకరించిన దానిని వ్యయపరచనంతవరకు ధర్మ జీవితమును అలవరచు కొనలేరు. మీరు ఖర్చుచేసేదంతయు అల్లాకు తెలుసును.

౨౯. అల్లా అనుమతిలేనిదే నిర్ణీతకాలము రానిదే ఎవరు మరణించ జాలరు. ఎవరేది కోరుదురో వారికది సంభవించును.

౩౦. అల్లా ప్రసాదించిన సంపదలను కూడబెట్టకు. అది నీకు క్షేమకరముకాదు. తీర్పురోజున ఆపాపమే నీకంఠమునకు ఉరిపెట్టును.

౩౧. మీరు చేయుచున్న ప్రతిపనిని భగవంతుడు చూచు చున్నాడని తుదిరోజు లెక్క అడుగునని భయపడుడు. తప్పక లెక్క అడుగును.

౩౨. నీవేదికోరుదువో ఏదితిందువో ఇతరులకు నీ సేవకులకు కూడా అదియే యీయుము. చెడ్డది యీయకుము.

౩౩. గరికపోచ యందైనను భగవంతుడున్నాడని నమ్మి ప్రతి జీవిని ప్రేమించుము. దేవునిపై ఆధారపడి నిష్కామసేవ చేయు చుండుము.

౩౪. ఎల్లప్పుడు నే నెవడను ఈజన్మపమిటి అని ఆత్మాలోచన చేసుకొను చుండుము.

౩౫. సుఖభోగములకు ఆశపడి రుచికొరకు తినకుము. సాత్వి కాహారమే మితముగా తినుము.

౩౬. ఇతరుల ఆస్తులను అక్రమముగా మ్రింగువారు తమ కడుపులో నిప్పుకణములను దాచుచున్నారు. వారు ఆ అగ్నిజ్వాలలకు ఆహుతి అగుదురు.

౩౭. ఇతరులు నిన్ను కష్టపెట్టినా తిట్టినా కొట్టినా దూషించినా అగౌరవ పరచినా వారి దోషములను వెల్లడిచేయక వారియం దసూయ పడక తిరిగి వారికి అపకారము చేయక వారికి తెలియదని భగవంతుని ప్రార్థించుము.

౩౮. ఈ లోకమును కాంక్షింపక సమస్త విషవాంఛలను త్యజించినచో దేవుడు నిన్ను ప్రేమించును.

౩౯. డబ్బు తినేవస్తువు కాదు. దానికై ప్రాకులాడకుము. పరాన్నమునకై ఆశపడకుము. ఇతరులవద్ద నున్నదానిని కాంక్షింప కుంటివా వారు నిన్ను ప్రేమింతురు.

౪౦. వనితలవైపుకన్నెత్తి చూడకుము, తలవంచుకొని పొమ్ము.

౪౧. అపరోక్షమునందు ఇతరుల యెడ పలికెడి అపనిందలవల్ల ఆ వక్తయొక్క శుచియు ఉపవాసము పుణ్యము వ్యర్థమగును.

౪౨. మానవుడు పూర్తిగా నమ్రుడైనపుడే, దేవుడు సహాయము చేయును.

౪౩. నీ సంభాషణలో పిమ్మట పరితాప పడవలసిన వాక్యమును వాడకుము. ప్రతి విషయమునుండి తప్పును దొలగించు కొనుము.

౪౪. దేవుని గూర్చిన జ్ఞానము సంపాదించుటకే మౌనము వహించుము. దేవునియందు విశ్వాస ముంచుము.

౪౫. అతిథిగా గృహస్థునకు కష్టము కలుగునంతవరకు అతని ఇంటి నుండరాదు.

౪౬. సత్యముకొరకు నీజీవిత మర్పింపుము. సమస్త దుర్గుణ దోషములను త్యజించుము.

౪౭. కీర్తి ప్రతిష్ఠ అధికార వైభవములకై ప్రయాసపడి నశించకుము. ఏపనిచేసినా నేనే చేసితినని గర్వించకుము.

౪౮. కుటుంబీకుడవై బీదవాడవైననూ ధర్మవిరుద్ధమైన పనుల నుండి భిక్షుకవృత్తినుండి వైదొలగితివా దేవుడు నిన్ను ప్రేమించును.

౪౯. అసౌకర్యములు, అమర్యాదలు, దుఃఖములు సంభవించినపుడు ధైర్యముతో వాటిని సహించుము. ఇతరుల మనస్సును నొప్పింపకుము.

౫౦. ఒకపూటకు రొట్టెయున్నపుడు రెండోపూటకై చింతించుట అధర్మము.

౫౧. దేనినైనా చంపకుము, ఎప్పుడైనా దేవునికి ఇష్టముకాని పనులు చేయకుము.

౫౨. నీ కాలమును ఇతరులకై వినియోగించుచు ప్రేమించుము. సత్యము, దయ, ధర్మము, న్యాయమును, ఎన్నడూ వీడకుము.

౫౭. ఈర్ష్యను వెంటనే త్యజించుము. ఈర్ష్య (విషము) పాపము.

౫౮. ఇతరులకు మేలుచేసి చెప్పుకొను వానికి స్వర్గములభించదు.

౫౫. మహమ్మదు, ప్రతిరోజు తన ఇల్లుతానే శుభ్రముచేసుకొనే వారు; ఎంతచిన్న పనినైనా తానే స్వయముగా చేసుకొనే వారు. తానురాజై నప్పటికి తన చెప్పులను బట్టలను తానే కుట్టుకునే వారు. తన బట్టలనుతానే శుభ్రపరుచుకొనే వారు. రోజు రొట్టె పాలు ఖర్జూర పండ్లు తినేవారు. నిరాడంబము గలవారు.

## ౧౩౫ హజరత్ ఇబ్రాహిం

౧. యజమానుని ఇచ్ఛ ప్రకారమే సేవకుడు సేవచేయవలెను. అట్లే భగవదేచ్ఛ ప్రకారమే భక్తుడు నడుచుకొనవలెను.

౨. నిజమైన సాధువుయొక్క లక్షణమేమన, దొరికినదానిని అందరు పంచుకొని తినవలెను. దొరుకనిచో భగవంతుని కృపవలన తపస్సుకు సమయము దొరికినదని సదా ధ్యానించుచుండ వలయును.

౩. ఎవరైనా నిన్ను ఏదైనా అడిగితే నీవద్ద ఉన్నదానిని లేదన కుండా యీయుము. అందరిలో భగవంతు డున్నాడని నమ్ముము.

౪. నా వెంట ఏదియురాదు. కావున సమస్తమును త్యజించితిని. ఫకీరునైతిని. ఇపుడు నిశ్చింత అయినది.

౫. ఒకడు సారాత్రాగి మత్తులో పడియుండగా వానిని ప్రేమతో లేవనెత్తి ముఖముకడిగి తెలివి గలిగించి నాయనా, ఈ నోటి నుండి భగవంతుని స్మరణచేయక సారాత్రాగి చెడగొట్టికుంటివా, విచారించుమనెను.

౬. తన ఇంటిలో ముప్పది సంవత్సరములనుండి ఒక దాసిది పనిచేయుచుండెను. కాని ఎప్పుడైనా వీరు ఆ దాసిదాని ముఖమును చూడలేదు. ఒకరోజు అదేదాసిదానితో మా దాసిది లోన ఉండ;

వచ్చును, శ్రమనక ఇక్కడికి రమ్మని చెప్పుమన్నారు. నేనే తమ దాసిని అని వారికి వందనము చేసెను. ఇది ఇబ్రాహింగారి వైరాగ్యము.

## ౧౩౬ ఖలీఫా ఉమరు

౧. వీరు నిరాడంబరులు. ముతుకబట్టలే కట్టేవారు. పశువుల కాపరిగా ఉండేవారు.

౨. సుఖభోగముల కాశించకుడు. విలువగల దుస్తుల తొడుగకుడు. అందరిని మీతో సమానముగా జూడుడు. రుచిరాన్నములను తినకుడు. ఇతరులతో పనులు చేయించుకొనకుడు. ఇతరులకొరకు కష్టపడి వారిని రక్షించుడు. ఇతరుల సొమ్మును కోరకుడు. స్వయముగా కష్టించి సంపాదించినదానిని జీవించుటకే తినవలెను. రుచికై తిన కూడదు.

## ౧౩౭ హజరత్ ఖ్వాజా మొయినోద్దీన్ చిష్తి

౧. విపత్తు కలిగినపుడు దుఃఖించినవానికి ఈశ్వరప్రాప్తి కలుగదు. దుఃఖితుల దుఃఖములను తీర్పుము. లేనివారికి నీ యొద్ద నున్న దానిని యీయుము. దీనివల్ల నీ దుఃఖములు నశించును.

౨. నీవు పూజించు సమయములో దుఃఖితులువచ్చి నిన్నాశ్రయించినచో, ఆ పూజను విడచి, మొదట వారి ఆపదలను తీర్చుటే శ్రేష్ఠము. ఇతరుల నాదరించి వారికి సేవచేయుటే పూజ అనబడును.

౩. ఈశ్వరుడు బీదలను, దుఃఖితులను ప్రేమించుచుండును.

౪. మూడు ప్రకారముల మనుష్యులు స్వర్గానికి పోజాలరు. అబద్ధీకులు, లోభులు, పరులధనమును కోరువారు.

౫. జ్ఞాని తనలో దైవగుణములను పెంపొందించుకొనును. ఈశ్వరుని ప్రేమించును. ఈశ్వరప్రాప్తికై శరీర మనోధనముల సర్వస్వమును త్యజించును.

## ౧౩౭. హజరత్ ఖ్వాజా కుతుబోద్దీన్ బక్త్యార్ కాక్

౧. సాధకుడు ఆహార విహారములందు చాలా జాగరూకుడై మెలంగ వలయును. సాంసారిక వ్యవహారముల నుండి అలిప్తుడు కావలయును.

౨. నీవద్ద నాదనే వస్తువు యుండరాదు. నాకు కావలెనని నాది అని ఒక మంటి ముంతయున్నా, ఒక చినిగిన బట్ట యున్నా, నీకు ముక్తి దొరకదు.

## ౧౩౮. ఖలీల్ జిబ్రన్

౧. ప్రేమ మృత్యువుకంటె బలముకలది. మృత్యువు జీవనము కంటె బలముకలది. ఇట్లు తెలిసియు నొకరిపై నొకరు భేదబుద్ధితో క్రోధపడు టెందులకో!

౨. ఏవస్తువు నీకు అక్కరలేదో దానిని ఇతరుల కిచ్చినచో దానిలో విశేషములేదు. కాని ఏవస్తువుతో నీకు అధిక అవసరమో దానిని ఇతరుల కిచ్చుటలోనే ఉదారత, త్యాగమున్నది. దీనిని మరువకుము.

## ౧౩౯. శ్రీ ఆది శంకరాచార్యులు

౧. విత్తమును, కుటుంబమును, యవ్వనమును గాంచి గర్వాంధుడవు కాకుము. నిమేషమాత్ర కాలమున ఈ ఐశ్వర్యము లన్నియు స్వప్న లబ్ధ భాగ్యములవలె నశించును. ఇదంతయు మిధ్య, తృష్ణా. అంతయు నశ్వరమే యని గ్రహించి శాశ్వతమగు నిర్వాణ పదమునకై చింతించుము.

౨. పత్ని ఎవరు, సుతులెవ్వారలు, నీవెవండవు, త్వదాగమనము, ఈ లోకమున కెచ్చోట నుండి? ఈ సంసారముయొక్క విషయములు అతి చిత్రములు. నీ తత్త్వమును గుర్తెరుంగుము.

౩. ఎవడింద్రియాది విషయములనుండి యొకతూరి విరక్తుడై జ్ఞానోపార్జనమందు లగ్న మనస్కుడై యుండియు, తిరిగి విషయములకు వశుడగునో, వాడు మహా మూర్ఖుడు.

౪. పరుల దోషముల నెన్నవలదు. నీ దోషములను పరిశీలించుకొని వాటిని విడనాడుము.

౫. బద్ధుడెవడు? విషయాసక్తుడే. ముక్తిఏది? వైరాగ్యము. నరకమేది? దేహాసక్తియే. స్వర్గమేది? తృష్ణాత్యాగమే. నరకమునకు హేతువేది? స్త్రీ. స్వర్గప్రాప్తి దేనినుంచి? అహింసనుంచి. జాగ్రత గలవాడెవడు? సత్యాసత్య వివేకము గలవాడు. శత్రువులెవరు? ఇంద్రియములే. దరిద్రుడెవడు? తృష్ణగలవాడు. శ్రీమంతుడెవడు? సంతోషము గలవాడు. నీకు ఉరిఏది? మమత, అభిమానము. గొప్ప రోగమేది? భవరోగము. దీనికి మందేది? సత్యాసత్య విచారము. అన్నిటికంటే చెడ్డదేది? కామినీ, కాంచనములు. బ్రహ్మప్రాప్తికి ఉపాయమేది? సత్సంగము. ప్రాణులకు జ్వరముఏది? చింత. మూర్ఖుడెవడు? వివేకహీనుడు. యదార్థజీవనమేది? దోషవర్జితమే. జగత్తును జయించువాడెవడు? తన మనస్సును జయించినవాడే. విషముకంటే ఎక్కువ విషమేది? విషయాసక్తియే. ఎల్లపుడు దుఃఖితుడెవడు? విషయానురాగియే. ధన్యుడెవడు? పరోపకారియే. హీనతనమునకు మూలమేది? యాచనయే. ముముక్షుడేమి చేయవలెను? సత్సంగమును చేయుచు, మమతను త్యాగము చేయవలెను. శత్రువేది? కామము. దుఃఖమునకు కారణమేది? మమత. నరకమేది? పరాధీనత. సుఖమేది? సమస్తపదార్థములను త్యజించుటయే. యదార్థమైన దానమేది? కామరహిత దానమే. మిత్రుడెవడు? పాపములనుండి తొలగించువాడే. నాలుకకు భూషణమేది? సత్యభాషణమే. వ్యసనములను నాశనము చేయువాడెవడు? త్యాగపురుషుడే. మృత్యుపరియంతరము అంతఃకరణమును బాధించునదేది? గుప్తమైన పాపకర్మ.

౬. కేవలము భగవంతుని నియమములను పాటించి వర్తించుటే మన కర్తవ్యము. భక్తి, ముక్తిని ప్రసాదించుట భగవంతుని ఆధీనము. కావున భగవంతునిపై విశ్వాసముంచి సేవింపుము. ప్రారబ్ధానుసారము ఏది లభించినా సంతోషముతో అనుభవించుము. ధన స్త్రీ సంపదల యందలి మమతను త్యజించుము. ప్రతిజీవిని ప్రేమింపుము. దుఃఖములను సహించుము. ఆపత్తులు ప్రాప్తించినచో భయపడక వాటిని సహించుము. నిద్రాహారమును ఆదరించకుము. నియమములను పాటించుము.

౭. శరీరపోషణా తత్పరుడై ఆత్మ సాక్షాత్కారమును కోరువాడు మొసలిని తెప్పకొయ్యగా దలంచి దానిని పట్టుకొని నదిని దాట నిశ్చయించిన చందమగును. కాన, విషయభోగము లనుభవించుచు, మోక్షమును కోరువాడు నశించును.

౮. నిష్కామ కర్మచే అంతఃశుద్ధియు, ఉపాసనచే చిత్తైకాగ్రతయు, జ్ఞానముచే, మోక్షము, కలుగును.

## ౧౪౨ శ్రీ రామానుజా చార్యులు

౧. ధ్యానము భగవత్ప్రసాదములేనిదే సిద్ధింపదు. భగవత్ప్రసాదము, భగవంతుని ప్రియులగు వారిపైననే కలుగును. నిష్కామముగా భగవంతుని భజన చేయువారే భగవత్ప్రియులు.

౨. భగవద్భక్తులకు, వర్ణాశ్రమములులేవు. ఆళ్వారులలో ఒకరు, స్త్రీ, కొందరు శూద్రులు, ఒకడు అంత్యజుడు, భక్తులయందు, జాతి, మత, విద్యా, కుల, ధనాది భేదములులేవు.

౩. ఆత్మజ్ఞానము కలిగిన పిదపకూడ నిత్యానుష్ఠాన ధ్యానాది సాధనలు చేయుచుండుటే శ్రేయస్కరము.

౪. సాధన పూర్తియగు వరకు, దేహధారణ మావశ్యకము. న్యాయార్జితమైన ద్రవ్యముచే పంచమహా యజ్ఞములుచేసి మిగిలిన

అన్నముచే శరీరమును నిలుపవలెను. తనకొరకై సంగ్రహము చేయ కూడదు.

౫. భగవంతుడు ఇతరులకొరకై ఇచ్చిన సంపదలను తమవని తలంచుచు వాటిని భోగించువారు దొంగలేసుమా.

౬. అహంకార శూన్యుడై నేను కర్తనుగానని భగవత్ప్రీతి కొరకు చేయబడుకర్మ అకర్మ యనంబడును.

౭. ఉపదేశము పొందని వాడును ఉపదేశముపొంది ఆచరించని వాడును ఉపదేశమునందు సంశయబుద్ధిగల వాడును చెడుదురు.

౮. చిత్తపరిపాకము కలిగెనేని ఆత్మ అకర్తయనియు ఈ నాట్యమంతయు ప్రకృతి సంబంధమేనని దెలిసికొని సర్వకర్మల సన్న్యశించును.

౯. ఆత్మకు శరీరముతో సంబంధములేదని తలంచుటచే, మానావ మానములకు గురి కానేరడు.

౧౦. పరమ పురుషార్థమగు మోక్షమునకు ప్రబల ప్రతిపక్షులగు కామ క్రోధముల వేగమును తగించినవాడే ముక్తినొందును.

[వీరు గురువుగారి వల్ల మంత్రోపదేవము పొంది ఆ మంత్రమును ఇతరులకు చెప్పనని ప్రతిజ్ఞ చేసిరి. కాని ఆమంత్ర ప్రభావమును తెలిసికొని కాంచీపుర దేవాలయము పైనెక్కి సర్వజనులకు ఆమంత్రము నుపదేసించిరి. తనకు ప్రతిజ్ఞా భంగమువల్ల దోషము కలిగినను లక్ష్యము చేయక సర్వసాధాణులకు ఉపకారము చేసిరి.]

## ౧౪౨ శ్రీ మధ్వాచార్యులు

౧. వ్యర్థమైన నశించేసంసార కూపములోబడి నీయొక్క అమూల్య సమయమును నష్టపరచకుము.

౨. సుఖదుఃఖములు కర్మానుసారమే వచ్చును, కావున వాటిని సంతోష సహనములతో అనుభవించుచు సదా భగవద్ధ్యానము చేయు

చుండుము. దేనిని సంగ్రహము చేయకుము. ఈశ్వరునిపై విశ్వాస ముంచుము.

౩. ఓమానవులారా! నాయొక్క నిర్మలహృదయ పూర్వకమైన నాస్మరణను వినుడు. రెండుచేతులు ఎత్తి శపథముచేసి సత్యము చెప్పుచున్నాను. మీరు అన్నిటిని త్యజించి ఒకే భగవంతునినమ్మి, సదా స్మరించు చుండుడు. ఆలసించకుడు. ఎందుకన మరణ సమయములో మీకు చెప్పరాని బాధకలుగును. అపుడు మీకు స్మృహఉండదు. దీనిని మరువకుడు.

౪. సుఖ సమయములో భగవంతుని మరువకుడు, దుఃఖసమయములలో నిందించకుడు.

౫. వేదశాస్త్రములు చెప్పిన చొప్పున వర్తించుము. విచారము శ్రవణము, ధ్యానమునకన్న శ్రేష్ఠమైనసాధన సంసారములో మరొకటిలేదు.

౬. భగవంతుని చరణములనునమ్మి భజించితివా నీజన్మ జన్మాంతరముల, పాపరాసులు భస్మీభూతమై పోవును.

౭. జిహ్వను అదుపులో ఉంచుము. సత్యముననుష్టింపుము. దయతో మాట్లాడుము. దానధర్మములను చేయుచుండుము. దుర్బలులను బీదలను గాపాడుచుండుము. ప్రేమచే సత్కార్యముల చేయుచుండుము. సమస్తజీవులను ప్రేమించి సేవించుచుండుము.

## ౧౪౩ శ్రీ వల్లభాచార్యులు

౧. అహంకార,మమతలు నశించుటచే, నేననే భావమునశించును. ఈ ప్రకారము సంపూర్ణముగా అహంకారము నివృత్తి కాగానే ఆత్మ జ్ఞానముకలిగి, జీవాత్మ తన స్వస్వరూపమును పొందును.ఇదే జీవన్ముక్తి.

౨. సంపూర్ణముగా చిత్తమును భగవంతుని యందు లీనము చేయుటచే సేవ యనబడుము. ఇది సిద్ధించుటకు శరీర, మనో, ధనముల

సమస్తమును సమర్పించుకుంటివా, జన్మ మరణదుఃఖములు నివృత్తియై, బ్రహ్మ ప్రాప్తి కలుగును. బ్రహ్మసంబంధము కలుగగానే, దేహ, జీవ, సంబంధమైన సమస్త దోషములు నివృత్తియగును. దోషములు (౫) అయిదు-1 సహజ, 2 దేశ, 3 కాల, 4 సంయోగ, 5 స్పర్శ. ఇవి జీవుని వెంటనే సూక్ష్మరూపముతో నంటియుండును. (దేశ, కాల, దోషములు యా యాదేశ కాలముల ననుసరించి సంభవించును. ఎట్టి సంయోగ ముచే అట్టి దోషములు పుట్టును. ఎట్టి స్పర్శవల్ల అట్టి స్పర్శ దోషములు కలుగును.)

౩. భగవతార్పితమైన వానికి, ఏలాటి విచారము, చింత, భయము, దుఃఖము, యుండరాదు.

౪. నిరంతరము అంతర్వాణి యొక్క ప్రేరణను గమనించుచు, అదే ప్రకారము ఆచరించుచు, జీవయాత్ర గడుపవలెను.

౫. బాహ్య సంబంధ విచ్ఛేదము వల్ల సమస్త దోషములు నశించును. ఇహపరలోకము లందలి, మమతను విడిచి సదా భగవంతుని, మానసికముగా భజించుచుండుటే; మానవుని యొక్క ధర్మము.

## ౧౪౪ శ్రీ గోవిందాచార్యులు

[వీరు ఒకరోజు ఒక నాగసర్పము నోటిలో చెయ్యి పెట్టి దాని నోటిలోనున్న ముల్లును తీసివేయగానే ఆసర్పము సొమ్మసిలి పడి ఉండెను. ఆభీషణ దృశ్యమును రామానుజాచార్యులు చూచి వీరిని సమీపించి ఇట్లనిరి. విషసర్పము నోటిలో చెయ్యిపెట్టితివి అది కరచినచో నీగతి ఏమగును. సరే నీవుదాని నోటిలో నీచేతివ్రేళ్లు పెట్టినచో దానికి బాధకలిగెను. ఏజీవిని కూడా కష్టపెట్టరాదు గదా! కావున నీకు మర్యాదకాదని (పరీక్షార్థము) అనిరి. అదివిని వీరు వినయముతో, అన్నా! ఈ సర్పము ఏదో సన్ననిముండ్లుగల వస్తువును మ్రింగినది. అందులోని ఒకముల్లు దీని కంఠములో కుచ్చుకున్నందున, ఆ బాధకు

తాళలేక గిజగిజ కొట్టుకొనుచుండ, దాని బాధనుచూచి, నేను భరించ లేక దానినోటిలో నాచేతి వ్రేళ్లనుపెట్టి ఆముల్లును తీసివేసితిని. దానిచే ఈ సర్పము సొమ్మసిలిపడి ఉన్నది. ఇప్పుడే వెళ్లిపోగలదని బదులుచెప్పిరి. అది విని రామానుజా చార్యులు వీరి ధైర్యమునకు దయకు సంతోష పడిరి.]

## ౧౪౫ శ్రీ శంకరాచార్య (జ్యోతిర్ మఠ్)

౧. ముందు నిన్ను నీవు దిద్దుకొనుము. తదుపరి ఇతరులను గూర్చి చింత చేయుము.

౨. ఏ పనిని స్వయముగా చేయగలుగుదువో దానినే చేయుము. ఇతరుల ఆధారముపై పని చేయదలంచితివా దుఃఖము సంభవించును. ఈశ్వరుని నమ్మినచో ఇతరులను వేడనక్కరుండదు.

౩. ధనము పాపమునకు మూలము. ఇతరుల సంపత్తిని చూచి వ్యసన పడకుము.

౪. మళ్లీ జన్మ రాకుండునట్టి కర్మల చేయుచుండుము.

౫. మనస్సులో ఇతరులఎడ క్రూరచింతన నుంచకుము. ఇత రులు నిన్ను నిందించినచో సంతోషించుము.

౬. ప్రేమచే, భయముచే, కీర్తికై ఇతరులకు లొంగి పాప కార్యములను చేయకుము. ఆ పాపమునకు ఫలితము నిన్ను చేరినపుడు నీ దిక్కెవరు చూడరు. ఆ దుఃఖమును నీవే అనుభవించవలసి వచ్చును.

౭. ఇతరులను నీ వశము చేయదలంచుకొనినచో నీవు పవిత్ర మానవుడవు కమ్ము.

౮. తిండికై ధర్మములను విడవకుము. ఈశ్వరుడు చూచు చున్నాడని మరువకుము. ఈశ్వరుని మోసపుచ్చుటకై వ్యర్థ ప్రయాస పడకుము.

## ౧౪౬ శ్రీ కోమండూరు రాఘవాచార్యులు

౧. అహింసా పరుడు ఎల్లపుడు సత్యమునేపలుక వలయును. దుశ్చరితులకు ఆత్మలభింపదు. ధర్మమును వీడవలదు.

౨. గుణవంతుడు, ధర్మజుడు, సత్యవంతుడు, సర్వభూతహితుడు దయావంతుడు, ఇన్ని గుణములు గలవాడే అహింసా వ్రతుడగును. దీనికి మౌనముకూడా ముఖ్యము.

౩. పరిశుద్ధముగా హృదయముంచుకొను వారికి అంతరాత్మ బోధన వినబడును. అప్రమత్తుడవు కావలదు.

౪. అంతరాత్మకు కష్టముగతోచు కర్మలను చేయరాదు. పరులు నీకు చేయరాదను పనులను నీవు పరులకు చేయకుము.

౫. ఈశ్వరుని యందు భక్తి శ్రద్ధగలిగియున్న యడల ఏది ధర్మమో ఏది అధర్మమో తెలియక సందేహము కలిగినపుడు భగవంతుడే తోపింప చేయును.

౬. రాజ్యము, స్వర్గము, మోక్షము, అక్కరలేదు. దుఃఖార్తులగు ప్రాణుల బాధ తొలగించుటయే ఈశ్వర సేవ అదియే భక్తి.

౭. నిత్యము భూతయజ్ఞము చేయుము. అనగా జీవులను పోషించుము. త్యాగమే శ్రేష్ఠము. నీకున్నదానిలో అడిగిన వారికి లేదనకుండా యిమ్ము. స్వార్థమును వదలుము.

౮. వ్యక్తిగత మోక్షము నాశింపకుము. లోకులకందరికి జ్ఞానము కలుగునట్టి కర్మలనే చేయుము.

౯. నీమనస్సులో ద్వేషముండినచో ఇతరుల మనస్సులో నట్లే యుండును. కాన ఈర్ష్యా ద్వేషములను మానుము.

౧౦. లోభగుణమును మానుము. దర్పము, క్రోధము, అభిమానము, లోభగుణమునుండి పుట్టును.

౧౧. విలాసేచ్ఛ, స్వార్థము, ద్రవ్యాశ, ఆత్మకు హానికరము. కాన వీటిని వీడుము.

౧౨. ఆహారము మితముగా తినవలెను. జిహ్వాచాపల్యమును వీడుము.

౧౩. మన దేహేంద్రియములను, లోకోపకారమునకే దేవుడు ప్రసాదించినాడు. కాన ప్రజాసేవ చేయుడు.

౧౪. నీశత్రువును ప్రేమించి, ఉపకారము చేయుము.

౧౫. జనకుడు, ధనకాంక్ష, విషయాపేక్ష, స్వార్ధబుద్ధి, లేక రాజ్యము పరిపాలించెను. కాన నీవు స్వలాభాపేక్ష లేకుండా నిష్కామ కర్మ చేయుము.

## ౧౪౭ సంత్ మార్కస్ అరేలియస్

౧. 'ప్రతికార్యము చేయునపుడు, అదే నీ జీవయాత్రకు అంతిమ కార్య మనుకొనుము.' ప్రతిదినమును ఇదే అంతిమ దినమని భావింపుము.

౨. నీవుచేయు వివిధకర్మలు లోకకళ్యాణార్థమైయుండవలెను.

౩. సుఖ దుఃఖములు మనోకల్పితములే. కావున, వాటిని సమత్వబుద్ధితో చూడుము.

౪. భోగలాలసత్వమున మునుంగకుము. దేనిని సంగ్రహము చేయకుము.

౫. రాగద్వేషములను శరీరాభిమానమును వీడుము. దుష్టులను, శత్రువులను ప్రేమించుము.

౬. న్యాయము మరియు, ఈశ్వరుని భయము నీమనస్సులో యుండి యుండవలెను.

౭. నీ మాటను యెదుటగల వ్యక్తి వినిపించుకొననిచో దానిని నీవు అత్యుమందు ఉంచుకొనకుము.

౮. ఎంతయో కాలమును అవివేకమువలన వ్యర్థపరచితివి ఇప్పుడైనా మేలుకొనుము. ఎందుకన, మృత్యువు నిన్ను కబళించుటకు సిద్ధముగా యున్నది. కావున ఆలసించక, ఆత్మవిచారము చేయుము.

౯. శాస్త్రము మరియు భగవద్విధానమును అనుసరించియే నీ జీవిత యాత్రను సాగించుము.

౧౦. భగవంతుని రాజ్యమునకును, నీ ఆత్మకును ద్రోహివి కాబోకుము.

౧౧. మనస్సునగల చెడు తలంపులను తీసివేయుము. మనో వాక్కాయ కర్మలకు భేద ముండరాదు.

౧౨. ఇతరుల పనులయందు జోక్యమును కలిగించు కొనకుము. లోకుల దిశకు చూడకుము.

౧౩. నిన్ను గురించి ఇతరులు ఏమి విచారించు చున్నారనే భావమును, నీ మనస్సులోనుండి తీసివేయుము.

౧౪. కీర్తి, ప్రతిష్ఠలకై ప్రాకులాడకుము.

౧౫. మనస్సునకు చంచలత్వమును కలిగించు పనులను, విచారములను, వస్తువులను, త్యజించుము.

## ౧౪౮. సంత్ రోమాల్డ్ (ఇటలీ దేశము)

[వీరు సదా మౌనములో ఉండేవారు. మౌనమునుండి ముక్తి కలుగునని అనేవారు.]

౧. మౌనమే గొప్ప దివ్యభాషణము. మౌనముచే ఆశ్చర్య జనితమైన గొప్పగొప్ప కార్యములు సిద్ధించును.

## ౧౪౯. సంత్ ఇవోహిలారీకా (ఫ్రాన్స్ దేశము)

[వీరు స్వయముగా కష్టించి వ్యవసాయముచేసి పంట పండగానే బీదలకు దానము చేయుచుండెడివారు. ఒక చిన్న గుడిశలోనే

యుండేవారు. ఒక రొట్టె యున్నా దానినికూడా బీదలకు పంచి పెట్టేవారు. మీరేమి తిందురని అడుగగా! భగవంతు డేదిచ్చునో దాని తోనే సంతోషించుదును అనిచెప్పిరి.]

## ౧౩౦ సంత్ డొమినికె (స్పేన్ దేశము)

[వీరు గొప్ప ఉదారులు. తనవద్ద నాది, అనునది ఏదియు లేకుండెను. సమస్తమును ఇతరుల సేవ కొరకై వినియోగించువారు. ఒకసారి ఒక బీదవృద్ధురాలు వచ్చి వీరిని యాచించెను. అపుడు వీరివద్ద ఇచ్చుటకు ఏమియు లేకుండెను. అపుడు వీరు స్వయముగా ఒక వర్తకునివద్ద సేవక వృత్తికి ఒప్పుకొని ఆ ముసలమ్మ అక్కరను తీర్చినారు.]

## ౧౩౧ ధర్మయాజిక్ పాదరి (ఇటలీ దేశము)

[వీరికి అనేక కష్టములు సంప్రాప్తమైనప్పటికిని ఎల్లపుడు శాంతముగానే ఉండేవారు. వీరిని, ఒకరు వీరి శాంతమునకు కారణ మడుగగా దానికి మూడు కారణములనిరి, అవేవనగా, ఒకటి, పైకి చూచుట ఎందుకన, ఇహలోక వ్యవహారములవల్ల నా మనస్సు చెడ కుండుటకై నేను పైకి చూచెదను. నేను అక్కడికే వెళ్లవలసి యున్నది కదా? రెండవది, క్రింద భూమిని చూచుట. నాకు కూర్చొను టకు, పరుండుటకు, భూమి ఎంత కావలెను, ఆరుజానల భూమియే చాలును కదా! మూడవది నా చుట్టుప్రక్కల చూచుట ఎందుకన, నా చుట్టుప్రక్కల ఎంతోమంది దుఃఖములలో మునిగి యున్నారు. నా కన్న ఎక్కువ బీద లున్నపుడు నాకు దుఃఖ మెందులకు. కావున ఈ మూడు కారణములచేతనే నేను శాంతముగా యున్నానుఅని అనిరి.]

## ౧౩౨ సంత్ మార్టిన్ లూథర్

[వీరు నిరాడంబరులు, ధైర్యశాలి. వీరిని అన్యాయముగా నిర్బంధించి కారాగృహములో యుంచిరి. ఆసమయములో ఒకరు వీరిని

నిన్ను నిర్బంధించినను నీకుచింతయు దుఃఖములేని కారణమేమని ప్రశ్నించిరి. నాయనా, నాకు కావలసిన దేమున్నదని; నేను చింతించుదును.]

౧. ఎవనికి అణువంత కోరికయున్నా వానికి దుఃఖముతప్పదు. ఎవనికెన్ని పదార్థములం దిచ్ఛయుండునో వానికి అన్ని దుఃఖములు సిద్ధించును.

౨. నాయొక్క యజమాని పరమపిత, పరమాత్మ నన్ను ఆయన ఇష్టప్రకారము నడిపించును. దానికైనాకు విచారమేలా!

౩. నాకుపదైనా పొందాలెనని ఆశయే లేనపుడు, దుఃఖము నాదరికిజేర ఏలసాహసించును.

౪. సంసారము యొక్క సమస్త సంపత్తి, ఎవనియొక్క వ్యక్తిగత సొత్తు కానేరదు. సమస్త సంపత్తి భగవంతుని ప్రసాదమని, తలంచి దీనులకు, దుఃఖితులకు సదుపయోగము చేయుటే, ధర్మము. లేనిచో నీసంపత్తే నిన్ను ఘూతమైపట్టి నశింపజేయును.

౫. ఎంతఅధికముగా ధనమును సంగ్రహము చేయుదురో, ఆధనమే అంత అధికముగా కామమును పెంచును. ఈ కామమువల్ల సుఖానికి బదులు దుఃఖములు పెరిగి నిన్ను అధోగతి పాలుచేయును.

## ౧౫౩ సంత్ ఏపీక్యూరస్, (యూనాన్ దేశము)

౧. నీవు మొదలు బాగుపడి ఇతరులను బాగుచేయుటకు ప్రయత్నించుము. నీ ప్రవర్తననుచూచి ఇతరులు బాగుపడునట్లు వర్తించుము.

౨. నీయుపదేశముకంటె నీప్రవర్తనే బాగుండవలెను. నీఇచ్ఛ ప్రకారమే ఇతరులు వర్తించ వలెనని తలంచకుము.

౩. ఇతరుల వస్తువులు నష్టమైనపుడు ఎట్లు ఉదాసీనుడవుగా యుందువో, అట్లే నీవస్తువులు నష్టమైనపుడును ఉదాసీనుడవుగా నుండుము. భేదభావ ముండరాదు.

౪. నేను జ్ఞానిని భక్తుడనని, ఇతరులకు చెప్పుకొనకుము. తనను తాను శ్లాఘించుకొనుట తప్పు.

## ౧౩౪ దార్శనిక్ సంత్ పీకస్

౧. సంసార కార్యములలో, కీర్తి ప్రతిష్ఠలలోచిక్కి ముక్తిని, వాస్తవిక శాంతిని నాశనము చేసుకొనకుము.

౨. సంసారములోని భోగవాసనలను విడచి, ఏకాంతములో ఈశ్వరచింతన చేయుచు నిశ్చింతగా యుండుము.

## ౧౩౫ సంత్ ఎగనాశియస్ లాయిలా

౧. మనకొరకు ఈశ్వరుడు, ఏవిధానమును నిశ్చయముచేసి యున్నాడో, దానినే ఆచరించ వలయును. మోహావశమున ఆశకు లోబడి ఇంద్రియ సుఖములకు లొంగితివా, నశించుదువు.

## ౧౩౬ సంత్ జాన్‌జోసఫ్

౧. ఎవడు ఈశ్వరునిపై విశ్వాసముంచునో వాడు పాపములను చేయజాలడు. కావున, ఈశ్వరునినమ్మి భజించుచుండుము.

౨. ఎవడు, సదానిర్దోషుడో వాడు ముందు ఒక మహాసంతు కాగలడు.

## ౧౩౭ సంత్ జెబక్ భ్యూమి (జర్మన్ దేశము)

౧. ఒక క్షణమాత్ర మైనను, నీవిచారములను, కోరికలను త్యజించితివా ఈశ్వరునియొక్క సందేశములను వినగలుగుదువు,

౨. నీకోరికలే నిన్ను సంసారములోకి ఈడ్చును. నీవు వాటిని ధిక్కరించి ఆ ఇచ్ఛలను ఈశ్వరుని వైపునకు త్రిప్పుము. సంసారము యొక్క మోహామునుండి విడుదలగుటకు దుఃఖములను సహించుటే శ్రేష్ఠము.

౩. జగత్తు అనిత్యమైనది, ఇది అసురస్వభావము గలది. కావున దీనిని తలంచకుము. ప్రాపంచిక వృత్తిని విడచి నివృత్తిమార్గమునే అవలంబింపుము. నీవు ఇంద్రియములకు లోనుగాక, ఆత్మచెప్పినట్లు నడుచుకొంటివా తక్షణమే, ఈశ్వరప్రేమ కలుగును.

౪. నీఇష్టములేనిది, ఏ ఇంద్రియములు, మరియు మనస్సు నిన్నేమి చేయజాలవు. వాటికి స్వశక్తిలేదు. నీవు ధృఢప్రతిజ్ఞ చేసితివా నీకు అవి లొంగును.

౫. నీఆత్మదృష్టిని అనిత్యపదార్థముల వైపునకు పోనీయకుము.

## ౧౫౭ సంత్ బ్రాయిలారెన్స్

౧. ఈశ్వరునియందు విశ్వాసముంచుము. నిన్ను నీవు ఈశ్వరునికి అర్పించుకొంటివా, అతడు ప్రత్యక్షమగును.

౨. భగవద్విషయమైన అపరాధములకుతప్ప ఇహాపర సుఖ దుఃఖముల వేటికైనను భయపడకుము.

౩. లోకులు నన్ను మంచివాడని అనుకొనుచున్నారా? నన్ను చూచి సంతోషపడుచున్నారా? లేదా, అని విచారించకుము. ధర్మయుక్తమైన పనిని, నిష్కామముగా ఈశ్వర ప్రీతికొరకు చేయుచుండుము.

౪. ఈశ్వరప్రాప్తి కోరుదువేని, సంపూర్ణముగా లౌకిక వస్తువులను త్యజించవలెను. నీవు మరియు, ఈశ్వరుడు మీ ఇద్దరుతప్ప మీఇద్దరి మధ్య మూడవది ఏవస్తువు యుండనిచో అపుడే ఈశ్వరప్రాప్తి కలుగును.

౫. భగవద్ధ్యాన సమయములో నీ మనస్సు అటుఇటు పోవుచుండును. అపుడు వెంటనే దానిని త్రిప్పి ధ్యానములో పెట్టుము. ఇట్లు ధృఢప్రతిజ్ఞచే కొంతకాలము సాధనచేసినచో ఈశ్వరానుగ్రహము కలుగును. ఇతర సమయములో నైనను మనస్సును జాగ్రతగా కనిపెట్టుచు విషయ వాంచలవైపు పోనీయక మరలించు చుండుము.

౬. నీ మనస్సులోని దుర్గుణములను సదా పరీక్షించుకొనుచు దీన హీన భావముతో జీవయాత్ర సాగించుము.

## ౧౫౯ సంత్ ఎడ్మండ్

౧. మనుష్యుడు ఏ శబ్దములను నోటినుండి వెడలించునో వాటి అనుభవమును హృదయము గుర్తించి యుండవలెను.

౨. ఆత్మ ఏమిచెప్పునో, దానినినే ఆచరించ వలెను. ఈ సృష్టిలో పరమాత్మను తప్ప మరి దేనిని విశ్వసింపకుము.

౩. నిన్ను నీవు మోసపుచ్చుకొనకుము. భగవదాజ్ఞను మీరుటే మోసము.

## ౧౬౦ సంత్ ఫ్రాంసిస్

౧. నీవు దేని నీయుదువో తిరిగి అదే నిన్ను చేరును. క్షమించితివా, ఇతరులు నిన్ను క్షమించుదురు. నీ వేది చేయుదువో నీకు అదే లభించును.

౨. నిన్ను ద్వేషించినవారిని ప్రేమించుము. ఇతరులు నీకు నమస్కరించక ముందే, ఇతరులకు నీవు నమస్కరించుము.

౩. నీకొరకై దేనిని కోరకుము. ఇతరుల సుఖము కొరకై పాటుబడు చుండుము.

## ౧౬౧ సంత్ బర్నార్డ్షా

౧. ఏ మానవుడు బాహ్యకార్యములయందు, దృష్టి ఉంచునో వాని అంతఃకరణములో ఏమి జరుగుచున్నదో దానిని గ్రహించలేడు. ఈ శరీరమే నేను, అంతా నాదే అనుకొనుచు ఇచ్ఛకు దాసుడగును. కామములచే బంధింపబడును.

## ౧౬౨ సంత్ లెవిస్

౧. సంపదయొక్క మదముచే, జీవుడు బంధింపబడుచున్నాడు. ధన వైభవములయొక్క మమతలోబడి తనను తాను, మరియు ఈశ్వరుని మరచిపోవును. దీనివల్ల వాసనలు బలవత్తరములై, అహంకారము వృద్ధియై నిన్ను నశింపజేయును.

## ౧౬౩ సంత్ దామోలెన్స్పిగల్

౧. భగవదాజ్ఞ ప్రకారమే ఆచరించితివా, నీ అంతఃకరణ శుద్ధమై, నీకు శాంతి చేకూరును.

౨. లోకకల్యాణ నిమిత్తమే జీవించువాడు, దుఃఖములను సంతోషముగా అనుభవించువాడు, మోక్ష మార్గమును చూపించువాడు, మహాత్ముడనంబడును.

౩. శరణాగత జీవనము, తపస్వీ జీవనముకంటె గొప్పది. ఈశ్వరుని సేవ చేయదలంచితివా, ఇతరుల దుఃఖములను బాపి వారికి సేవచేయు చుండుము.

౪. మౌనమును, దుఃఖసహనమును, శాంతితో ధైర్యముగా ఆచరించితివా, నీకు అత్యంత కల్యాణము కలుగును. బుద్ధిమంతుడు చేయుట అధికము, మాట్లాడుట కొంచము. అనవసరముగ మాట్లాడుట తప్పు.

౫. సత్యమైన దీనహృదయముగల మానవునకు జగత్తులో ఏ గౌరవప్రతిష్ఠలు కలిగినా, వాటిని ధిక్కరించి, తనను తా నుద్ధరించు కొనును. నేను స్వయముగా చెడ్డవాడనే, నన్ను ప్రజలేల పొగుడు చున్నారు, అని దుఃఖించును. తనను హింసించిన వానిని ప్రేమించి, గౌరవించి, సంతోషించును.

౬. నమ్రభావముతో శరణాగతుడవై, మౌనము వహించితివా, ఈశ్వరుని సమీపించ గలుగుదువు.

## ౧౬౪ సంత్ రాల్ఫ్‌వాల్డ్ ట్రాయిన్

౧. ఇతరులను, నీ వెంత చెడ్డవారనుకుందువో, నిన్ను ఇతరులు అంతకంటె ఎక్కువ చెడ్డవాడవనుకుందురు. నేనే మంచినాడనని, ఇతరులచే అనిపించుకునే ప్రయత్నము చేయకుము.

౨. ప్రపంచము నిన్ను ప్రేమించవలెనని తలంచితివా, మొదలు నీవు ప్రపంచములోని మానవుల నందరిని ప్రేమించుము.

౩. చెడుతనమునుంచి (విషము) ఈర్ష్య ఉత్పత్తియగును, అదే తిరిగి నిన్నే నశింప చేయును.

౪. నీవు విశ్వాసముకలవాడవైతివా, సకల ప్రపంచము, నీ మాటలను, నీ కార్యములను విశ్వసించును.

౫. నీకు తెలిసినదానిని, మొదలు నీవు ఆచరించి ఇతరులకు ప్రేమ పూర్వకముగాం బోధించుచుండుము.

## ౧౬౫ సంత్ జెఎమ్స్ఎలిన్

౧. కోరికలే నరకము. అన్ని దుఃఖములకు కారణము, కోరికలే. నీవు నీస్వార్థమును త్యజించి, త్యాగ శీలుడవైన ఈణమే, నీకు నిజమైన సుఖము దొరుకును.

౨. సుఖప్రాప్తి కొరకై అటు ఇటు వెతకుట అజ్ఞానము. సుఖము నీలోనే యున్నది. శాంతముగా, త్యాగబుద్ధితో ఆలోచించితివా, సుఖమును నీలోనే పొందుదువు.

౩. స్వావలంబనమే శ్రేష్ఠము. ఇతరులపై ఆధారపడి జీవించరాదు. కాళ్లు చేతులు ఉన్నంతవరకు కష్టించి తినవలయును.

౪. అధిక భోజనము చేయకుము. జీవించుటకే తినుము.

## ౧౬౬ సంత్ హిలేర్యోకె (మిసర్ దేశము)

[వీరు తన సర్వసంపత్తిని దీనులకు, బీదలకు, పంచిపెట్టి, అరణ్యములోకి పోయి ధ్యానించు చుండిరి. ఇపుడు ఎవరితో,

దేనితో నాకు భయములేదు. నేను స్వతంత్రుడను, అని అనే వారు.]

౧. నీ ప్రాణము పోయినాసరే, కాని అసత్యమును వదలి, సత్యమునే పలుకుము.

## ౧౬౭ సంత్ సెరాపియోకీ (మిసర్ దేశము)

[వీరు, తనవంటి మీది బట్టలను కూడా, తీసి లేనివారికి ఇచ్చు చుండెడివారు. స్వయముగా ఇతరులకు సేవకుడై, కూలిచేసియు దీనులకు ఇచ్చు చుండెడివారు. ధర్మ గ్రంధములను కూడా అమ్మి దుఃఖితులకు ఇచ్చువారు. ప్రతి జీవిని ప్రేమించివారికి సేవచేయు చుండెడివారు.]

౧. భగవదాజ్ఞ ఏమనగా, నాది అని దేనిని, యుంచుకొన రాదు. కావున, సమస్తమును ఇతరుల కిచ్చివేయుము. భగవదాజ్ఞ ప్రకారము వర్తించుము. దీనికంటె మించినది ఏదిలేదు.

## ౧౬౮ సంత్ అర్సేనియస్

౧. పుణ్యకార్యమేదైనను చేయవలయునని కోరికయున్నను దానివల్ల అహంకారము వృద్ధిపొంది నేను చేయుదును, చేయు చున్నాను, నేను పుణ్యాత్ముడను, పరోపకారిని, అనే భావములు కలుగును. కావున, ఇతరులను ఉద్ధరించవలయుననే కోరిక కూడా యుండరాదు. నీ కర్తవ్యమని తలంచి, నిష్కామముగా, సేవ చేయు చుండవలెను.

## ౧౬౯ సంత్ ఇఫ్రమ్ (సీర్యా దేశము)

౧. ధనమును సంగ్రహముచేయకుము. ఈ ప్రపంచములో నీకు, నాదనే వస్తువయుండరాదు. సంసార పదార్థములలో దేని యందైనను ఆశ నుంచకుము.

౨. నీ బాహ్యాడంబరములను తొలగించి, లోచూపును చూడుము. నీలోన అంతా దుర్గంధమే. మలమూత్రములతో పురుగులతో నిండి యుండును. నీలోగల దోషములను గప్పి పుచ్చునట్టి, నిగ నిగ మెరసే, బాహ్యా తోలుబొంతను చూచుక సంతోషించుచు, అహంకారముచే నశించకుము.

౩. దేహాభిమానముమ వీడుము. అశ్రద్ధచేయకుము. తొందర పడి మేలుకొనుము. కాలము సమీపించు చున్నది.

౪. సమస్తమైన విషయవాసనలను విడిచి, భగవంతుని ధ్యానించుచుండుము.

## ౧౭౦ సంత్ ఎమ్‌రసన్ (అమెరికా)

౧. ఆత్మబలము, భౌతిక బలముకంటె చాలా గొప్పది. ప్రపంచమును శాసించునది ఆత్మబలమే.

౨. భగవంతునిపై విశ్వాసము గలవాడు ఈ సంసారమును త్యజించి నప్పటికిని నిశ్చితంగా, సంతోషముతో, నుండగలుగును.

౩. సంసార భోగములు క్షణభంగురములు. వీటిని ఆశించి నశించకుము. అత్మ దర్శనమునకై ప్రయత్నించుము.

౪. ధనసంపదలందలి లోభము చేతనే, మృత్యువు తొందరగ ప్రవేశించును. పాపము లనుభవించవలసి వచ్చును.

౫. వృథాగా నీకాలమును వ్యర్థపుచ్చకుము. నీకర్తవ్యమును నెరవేర్చుకొనుము. సంపూర్ణ జీవనమును, పరమాత్మచరణ సన్నిధిలో గడుపుము.

## ౧౭౧ సంత్ ట్వాయిన్‌స్కీ (పోలేండ్ దేశము)

[వీరియొద్ద ఒకకుక్క యుండెను. ఆకుక్క ఒకరోజు, శరీరము నిండా, బురద అంటించుకొని వీరిపై ప్రేమచేత పీర్ఠివడిలో

పరుండి వీరిబట్టలకు బురద అంటించెను. అప్పటికిని వీరు శాంతముగా నుండిరి.
దగ్గరనున్న వారు బట్టలుచెడిపోవు చున్నవనగా ? నాయనా, ఆకుక్క యొక్క [ప్రేమకంటె బట్టలు గొప్పవిగావు. ప్రతి జీవిలో భగవానుడు యున్నాడు కదా అని అనిరి.]

## ౧౭౨ సంత్ అఫ్రాయత్

[వీరు గొప్పవిరాగులు. ఎవరిని ఏదియు అడుగెడివారు కారు. ఎవరేమిచ్చినను ముట్టెడివారు కారు. ఒక వస్త్రముండగా రెండో వస్త్రమును గ్రహించుట పాపమనేవారు. కేవలము ఒకటే రొట్టెను ఒకపూటే తినేవారు. కేవలము చాపమీదనే పరుండేవారు. ఒకచిన్న గుడిసెతప్ప మరేమి లేకుండెను. సదా భగవద్ధ్యానము చేయు చుండెడివారు.]

## ౧౭౩ సంత్ బెల్విపోర్చ్యుస్

౧. ఇతరులను కష్టపెట్టకుము. నీచులకు తలవగ్గకుము. సత్పురుషులను సన్మార్గములను వీటిని నీవు పొందగలిగితివా చాలును.

౨. చెడు పనులన్నియు, చెడు తలంపులకే దారి తీయునని మరువకుము.

## ౧౭౪ సంత్ జోరాస్టర్

౧. ఈ ప్రపంచములోని అన్నివస్తువుల విలువకన్న కాలము యొక్క విలువ మహాగొప్పది. కొనుటకు గాని అప్పుగా గాని ఇది దొరకదు. కావున సమయమును వ్యర్థపుచ్చక, అమితముగా సద్వినియోగము చేయుచుండుము.

౨. నీకుజరుగు సన్మాన సత్కార్యములను లక్ష్యపెట్టకుము. అవి ఆధ్యాత్మిక జీవనమునకు అంతరాయములు.

## ౧౭౫ సంత్ థోమస్ ఏకెమిప్స్

౧. నీకు మాట్లాడే అవసరమున్నచో, నీఆత్మ ఉన్నతికి సంబంధించిన మాటలనే మాట్లాడుము. విషయ వాసనలను జయించినచో హృదయమునకు శాంతి కలుగును.

౨. నిన్ను నీవు అందరికంటె తచ్చుగాదలంచి అందరికి దాసుడవు కమ్ము. నీకంటె నిర్బలుడువేరే గలడని గర్వించకుము. నేనే సత్కార్యములు చేయుచున్నానని అహంకార పడకుము.

౩. ప్రతి సమయమున ఆత్మపరీక్ష చేయుచుండుము. ఇతరుల కంటె నేనే మంచివాడనని తలంచకుము.

౪. నీకన్నులను నిన్నే చూడనిమ్ము. ఇతరులవైపు నీదృష్టిని పోనీయకుము. ఇతరులకర్మల విచారించకుము, విమర్శించకుము.

౫. నీవొకటి దలంచిన, దైవమొకటి దలంచును. కావున అన్ని నేనే చేయుచున్నానని గర్వించకుము.

## ౧౭౬ సంత్ వింద్రూకార్ నైగి

౧. నీవు నీయొద్ద బంధించియుంచిన ధనమును సద్గుణాలన్నింటిని ప్రజాసేవకై వినియోగించుము. నీఇంద్రియములను కామ క్రోధ లోభ, మోహ, ఈర్ష్యా, ద్వేషములలో విచ్చలవిడిగా తిరుగకుండా వెంటనే బంధించుము.

౨. సంపత్తి ననుభవించు సమయములో, కృతజ్ఞతను, పూజ చేయు సమయములో భగవత్ప్రేమను, విపత్తు సమయములో సహనశీలతను, పాపములనుండి తప్పించు కొనవలసివచ్చు సమయములో, పశ్చాత్తాపమును, అనుసరించుము.

౩. ఆలోచించలేనివాడు మూర్ఖుడు. ఆలోచించ గోరనివాడు, అంధవిశ్వాసి. ఆలోచించ సాహసించనివాడు బానిస.

## ౧౬౭ విశ్వాసి అంగ్రేజ్, ఆఫీసర్

[వీరు వీరిభార్య సముద్రముపై ఓడలో ప్రయాణము చేయు చుండగా, తూఫాను వల్ల ఓడ, మునిగే సమయము ఆసన్నమైనందున, ఓడలోని వారందరు మరియు వీరిభార్యయు ప్రాణములపై ఆశలు విడచి, భయపడసాగిరి. వీరుమాత్రము నిశ్చింతగా యుండిరి. వీరిభార్య, వీరి నిర్భయత్వమునకు నిశ్చింతకు కారణ మడుగగా, వీరు ఒక కత్తిని భార్యకంఠముపై పెట్టి నీకు దీనివల్ల భయమున్నదా, లేదా, అని అడిగిరి. అపుడు ఆమె, నీవు నన్ను ప్రేమించు చున్నవనె నమ్మకము నాకు కలదు. కావున ఈ కత్తివల్ల నాకు భయములేదని చెప్పెను. అందుకు వీరు, నేను భగవంతుని విశ్వసించు చున్నాను. ఆయన నన్ను ప్రేమించు చున్నాడను, నమ్మకము నాకు కలదు. కావున ఈ తూఫాను వల్ల నాకు ఏలాటి భయములేదు. కనుకనే నేను నిర్భయముగా, నిశ్చింతతో నున్నానని చెప్పిరి.]

## ౧౬౮ సంత్ లూయిఫిషర్

౧. మృత్యువునకు భయపడకుడు. మృత్యు వనగ ముక్తికి దారి తీయు మార్గమని సంతోషించుడు.

౨. ఇతరుల తప్పులకు తగిన దండనను, తాననుభవించ వలయును.

## ౧౬౯ సంత్ శ్రీరాంజీ

౧. మృత్యువు తప్పదు. కేవలము కడుపు నింపుకొనుటకే ఈ సంసారము. ఇందులో సారమేమియును లేదు. నాది అనేదేదియు లేదు. అంతా ఈశ్వరునిదే. నేను ఆయన సేవకుడనని, నిష్కామకర్మ చేయు చుండుము. వీటిని మరువకుము.

౨. ఎవడు భగవంతునికి సమర్పింపబడ గోరునో వాడు ఈ ఆరు ప్రతిజ్ఞలను చేయుట ముఖ్యము.

౩. నేను నీ ఆజ్ఞలను వర్తించెదను. నీవేది నిషేధించుదువో దానిని చేయను. నీవే నారక్షకుడవు. అంతా నీదే. నేను నీవాడను. నీవు నావాడవే.

## ౧౮౦ సంత్ కబీరు

౧. ఆత్మ సంయమమును, ఆత్మ పరిశుద్ధతను, ఆత్మ గౌరవమును, ఎంత కష్టపడియైనను, సంపాదించుకొన వలెను.

౨. ప్రతిజీవిని తనవలె చూచుకొనుచు దయగలవాడై ధర్మముగా వర్తించువానికి ఈ లోకముననే భగవత్కృప కలుగును.

౩. మానవుడు ఉదయము కాగానే, ద్రవ్య సంపాదనకై, తిండికై, సౌఖ్యమునకై, ఆతురత పడుచుండును. రాత్రి కాగానే, పడక సౌఖ్యమునకై సంతోషించు చుండును. కాని తన ఆయువులో, ఒక పగలు, ఒక రాత్రి, తగ్గుచున్నదని విచారించుట లేదు.

౪. యాచించుట ఎంత హీనమో, లోభి అగుటయు అంత హీనమే. కావున త్యాగివి కమ్ము. సమస్త కోరికలను విడిచి మోక్ష మార్గమును అనుసరించుము.

౫. మంచిగుణములు గలవానికి సంపదలేల. ధర్మము గలవానికి తపస్సేల. భూతదయ, పశ్చాత్తాపము గలవానికి వ్రతమేల. ఆత్మశుద్ధి గలవానికి, ఆచారమేల.

౬. సృష్టినియమములను పాటించుచు, పొరపడకుండా, స్థిర బుద్ధితో నడుచుటే, అహింస అనబడును.

౭. మానవుడు ఏ దుఃఖములనుభవించినను తన దోషముల వల్లనే అనుభవించును. ఏది చేయునో అదే ప్రాప్తించును. నీ దుఃఖములకు ఇతరులు కారకులని వారిని ద్వేషించి దూషించుట వెర్రితనము.

౮. పరుల ధనమును మట్టివలె చూడవలెను. తనది కానిదానిని ముట్టరాదు. ఇతరుల వద్ద ఉన్నదని వారిపై అసూయ పడరాదు.

౯. అనునట్లు ఆచరించవలెను. ఆచరించక కాలమును వ్యర్థ పుచ్చుట పాపము.

౧౦. కానున్నది కాకమానదు. కానిది కానేకాదు. కావున విషయవాంఛలను విడచి శాంతుడవుగమ్ము.

౧౧. భూతదయలేని తపము, విరక్తిలేని త్యాగము, సత్యము లేని వాక్యము, పరోపకారములేని ప్రయాస, దురాశచే సంపాదించిన ద్రవ్యము, వ్యర్థములే సుమా.

౧౨. కామి సన్యాసమును, లుబ్ధుడు సర్వసుఖములను, స్త్రీ లోలుడు మోక్షమును, అహంకారి జ్ఞానమును, ఎన్నటికిని పొంద లేరు.

౧౩. శరీరముయొక్క సుఖము స్మృతి తప్పువరకును, ఇంద్రియ ముల యొక్క సుఖము జొక్కువరకును, మనస్సు యొక్క సుఖము మరచు వరకును, జీవనము యొక్క సుఖము మరణము వరకు యుండును. ఈ సుఖములన్నియు వ్యర్థములే.

౧౪. కీర్తి, ప్రతిష్ఠలకై ప్రాకులాడకుము. ఇతరుల గౌరవములను చూచి అసూయ పడకుము.

౧౫. సత్సహవాసము చేత, శాస్త్రవిచారణచేత, మోహము వదలి పోవును.

౧౬. ఇతరులను నిందించుట, పరులపై దోషారోపణము కల్పిం చుట, పాపము.

౧౭. ముఖ్యమైనవి రెండే? ఇహము. పరము. పరమును కోరితివా, ఈ ప్రపంచ వస్తు వాహనములను, ధన సంపదల యందలి ఆశను విడచి, భగవంతుని ధ్యానించు చుండుము.

౧౮. ఒక రూపాయిని సంగ్రహించుట, నూరు పాపాలతో సమానము సుమా జాగ్రత్త.

౧౯. చచ్చుట మేలు. కానీ శరీరపోషణ గురించి ఎవరిని యాచించరాదు.

౨౦. కేవలము ఎండిన రొట్టెతునుకలనే తినుము. చల్లటి మంచినీటినే త్రాగుము. రుచులకు లోబడి నశించకుము.

౨౧. నిందితునికంటె కుక్క మంచి. కుక్కకంటే క్రోధి చెడ్డ.

౨౨. మంచిరోజులు వెళ్లిపోయినవి, ఇకనైనా తొందరపడు, ఆలసించకు, ఈరోజుపని రేపటికై ఉంచకుము.

౨౩. బాహ్యమును బంధించి, అంతరమును విప్పుము.

౨౪. నీలోనుండి, ఏ ఒక శ్వాసనైనా వృధా పోనీయకు. అది మూడు లోకములయొక్క మూల్యము కలది సుమా!

౨౫. నాది ఏదిలేదు, ఏదున్నా నీదే, నీది నీకిచ్చుటకు నాకు అడ్డెందులకు.

౨౬. కోట్లకొలది జన్మలు గతించెను, ఇపుడైనా జాగ్రత పడుము.

౨౭. చాలాకాలము సంతోష సౌఖ్యములలో దినములు గడిచెను. ముందేమి కావలయునో విచారించు కొనుము.

౨౮. ఒకరోజు కబీరు వీధిలోపోవుచుండగా, ఒకస్త్రీతనభర్తతో, ఈ ముక్కుపోగు ఎంతో బాగున్నది కంసాలివాడు చాలా అందముగా చేసినాడని కంసాలి వానిని పొగుడుచుండుట కబీరుగారు విని, అమ్మా, ఆముక్కుపోగును చేసిన కంసాలిని పొగుడుచున్నావు కాని, నిన్నూ, నీ ముక్కును సృష్టించిన, పరమాత్మను మరచితివి. నీకు ఆ ముక్కే లేకున్నచో, ఈ ముక్కుపోగును ఎచట ధరించి యుందువు. ఇది ఎంత వెర్రితనము! అని అనెను.

## ౧౮౧ సంత్ తులసీదాసు

౧. ఆకలిగొన్న కుక్కను ముందుంచుకొని మనము భుజించుట తగునా, కాన, ముందు ఇతరజీవులకు పెట్టవలెను.

౨. నేను, నాది, నీది, అనుపించునదే మాయ, ఈ మాయయే జీవుని నాశనము చేయును.

౩. శరీరమును, సంపదలను, చూచుకొని అభిమానపడకుము. వినమ్రుడవై మెలుంగుము.

౪. వైరమునకు మూలము, కటువువచనము. ప్రేమకు మూలము, హిత మధురవచనము. దుఃఖమునకు మూలము, ధనము.

౫. ఎంతవరకు సుఖభోగములను కోరుదువో, అంతవరకు దుఃఖము లనుభవించ వలసి వచ్చును.

౬. నిద్రాహారములు మొదలగునవి పశువులకు మానవులకు సమానమే కదా! ఇక నీవు మానవుడవై ప్రయోజనమేమి?

౭. ధన, మానములను, కీర్తి, ప్రతిష్ఠలను, పూర్తిగా త్యజించితివా ముక్తుడ వగుదువు. ఇందుకు సందేహ మేమి లేదు.

౮. ఏ జీవినైనా జీవింపచేయుశక్తి లేనప్పుడు చంపేశక్తి గలదనుట మహాపాపము. కావున ప్రతిజీవిని ప్రేమించ వలెను.

## ౧౮౨ సంత్ శ్రీరామానందజీ

౧. ఏ దేవుడు నిన్నుద్ధరించు చున్నాడో, ఆదేవుడే ఇతరుల నుద్ధరించుచుండ, నేను ఇతరులను బాగుచేయుదును. దానధర్మములు చేయుచున్నాను, పరోపకారము చేసితిని, అని అనుకొనుట పాపమే. కావున నేను, అనే అహంకారమును విడువుము.

## ౧౮౩ సంత్ సియారాంజీ

౧. నిన్ను నీవు, పొగుడుకొనకుము, ఇతరులు పొగిడినను సంతోషించక అయ్యా, నాలో చాలా దుర్గుణము లున్నవి, నన్ను పొగడకుడని వేడుకొనుము.

౨. స్వాదిష్టములైన పదార్థములను విడువుము. రుచికై తిన కూడదు. సాత్విక భోజనము మితముగా తినవలెను. దీనివల్ల ఇంద్రియ జయము కలుగును.

౩. నీవు, నీ మంచిని కోరితివా, పాపములు చేయనని ధృఢ ప్రతిజ్ఞ చేయుము.

౪. నిన్ను ఇతరులు నిందించినా, పరిహసించినా, కీడుచేసినా అది నీకు శ్రేయస్కరమే. కావున వారిని ద్వేషించక ప్రేమించుము.

## ౧౮౪ సంత్ ఏకనాథస్వామి

౧. [వీరు ఒకరోజు, నదిలోస్నానముచేసి వచ్చుచుండగా ఒక పఠాను వాడు వీరిమీద ఉమ్మివేసెను. తిరిగివీరు స్నానముచేసి వచ్చుచుండగా మళ్లీ ఉమ్మివేసినాడు ఇట్లే ౧౦౮ సార్లు ఉమ్మివేసినను ౧౦౮ సార్లు స్నానము చేయుచు వానిపై క్రోధపడక సంతోషించి నాయనా నీవల్ల నేను ఈరోజు ౧౦౮ సార్లు స్నానఫలమును పొందితినని ఆపఠా నును గౌరవించెను. అందుకై ఆపఠాను లజ్జించి, ఇప్పటినుండి నేను ఎవ్వరిని బాధపెట్టనని ప్రతిజ్ఞచేసెను.]

౨. [వీరి శాంతమును పరీక్షించుటకై ఒక బ్రాహ్మణ యువకుడు, వీరిభార్య ఒంగివడ్డించు చుండగ, ఆమె వీపుమీదఎక్కి కూర్చుండెను. వీరు శాంతముగా భార్యతో నీవీపు మీదఉన్న బ్రాహ్మణ పిల్లవాడిని క్రిందపడనీయకుము అట్లే వొంగియుండుము, జాగ్రత్తగా కాపాడుమని చెప్పెను.]

[౩. వీరు త్రివేణిలో గంగను తీసుక రామేశ్వరాభిషేకము నకై, స్వయముగా కావడిని మోసుకొని పోవుచుండగా రామేశ్వర సమీపమున ఒకగాడిద నీరులేక గిల గిల కొట్టుకొనుటచూచి, జాలిపడి ఆ గాడిదెకు కావడిలోని గంగాజలముపోసి తృప్తిపడెను. వెంటనున్న వారు ఈశ్వరాభిషేకమునకు తెచ్చిన జలమును, క్షుద్రజంతువునకు పోయుట తప్పనగా, నాయనలారా, రామేశ్వరుడే ఈ రూపముగా వచ్చి నాతో అభిషేకము చేయించుకొని నాడనిచెప్పి సంతోషించెను.]

౧. ఈ సృష్టిని, నీ దృష్టిలో భగవత్స్వరూపముగా భావించుచు, సమస్తమును త్యజించి, భజించు చుండుము.

## ౧౮౫ సంత్ వ్యాధ్

౧. వేదశాస్త్రమే సత్యము. సత్యసారమే ఇంద్రియ నిగ్రహము ఇంద్రియ నిగ్రహసారమే, త్యాగము. ఇదే శ్రేష్ఠము.

౨. ఇతర జీవులకు ఏలాటిదుఃఖములు హానియు కలుగకుండా ఉండునట్టి వృత్తిచే నీజీవయాత్రను గడుపుము.

౩. లోభమే పాపమునకు మూలము. కావున లోభమును విడువుము.

## ౧౮౬ సంత్ బాయిజీద్

[ఒక యువకుడు, వీరి నెత్తిపైన తాంబురచే కొట్టగా తాంబుర పగిలి వీరినెత్తిపైన గొప్పగాయము కలిగెను. వీరుశాంతము వహించి కొన్ని రూపాయలు కొంతమిఠాయిని తీసుక ఆ కొట్టినవాని ఇంటికి పోయి, నాయనా నాగురించి తాంబురచెడెను. కావున బాగుచేయించు కొనుమని రూపాయిలు ఇచ్చెను, ఈ మిఠాయినితిని నీ క్రోధమును త్యజించి ప్రేమను పెంపొందించు కొనుము, నన్ను క్షమింపుమని వేడుకొనెను.]

## ౧౭౭ సంత్ సహనశీల్

౧. ఎవ్వరైనానిన్ను నిందించినా తిట్టినా, వారిని చెడ్డగాదలంచకుము. వానివద్ద ఏవస్తువున్నదో అదేనీకు ఇచ్చినాడు అదినీకు ఇష్టము కానిచో తీసుకొనకుము. తిరిగి వానివస్తువు వానివద్దకే చేరును.

ఆ తిట్లు నిన్నేమిచేయును. తిట్లకు బదులు తియ్యని మాటలచే ప్రేమించి సేవ చేయుము. నీయొద్ద యున్నది యీయుము. ఇదే ఉత్తమము.

## ౧౭౮ సంత్ బాబాజీమహారాజ్

[వీరు దొరికిన దానితోనే సంతృప్తి పడేవారు. ఆకులు అలములనే తినేవారు. ఎల్లప్పుడు జప తప ధ్యానములలోనే యుండేవారు. కాని పాలమీద వీరికి చాలా ప్రీతి యుండుటచే జీవముండు వరకు పాలు త్రాగనని ప్రతిజ్ఞచేసి, నలుబై సంవత్సరములు వ్రతమును పాలించి, ఒకరోజు పాలుత్రాగేబుద్ధి పుట్టుచున్నదని ఒకరితో అనెను. వారు పాలను తెచ్చి తన పూర్వపు ప్రతిజ్ఞను జ్ఞప్తికి తెచ్చిరి. అందుకై వీరు పశ్చాత్తాపపడి కఠినప్రాయశ్చితము చేసుకొని మరణము వరకు, పాలను ముట్టకుండిరి. ప్రతిజ్ఞను ఉల్లంఘించుటకంటె చచ్చుట మేలు. సింహము వలె గర్జించుచు తోడేలువలె వర్తించుట కూడదు.]

## ౧౭౯ సంత్ తుక్డోజీ

౧. స్వయముగా ఉత్పత్తిని చేయకుండా సుఖభోగము లనుభవించు వాడు, దొంగ. తాను గొప్పభవనములలో యుండి ఇతరులను పూరిగుడిసెలలో యుంచువాడు మోసగాడు. తాను కడుపునిండాతిని, ఇతరులను గంజిలేక మాడ్చువాడు హీనుడు.

౨. తనకు కావలసినదానికంటె ఎక్కువ సంగ్రహించి వైభవముతో జీవితమును గడుపుచు, సంఘములో గొప్పతనమును జూపువాడు సంఘద్రోహి.

౩. పుస్తకపాండిత్యము పాండిత్యము కాదు. అది హృదయములో తారసిల్లవలెను. పుస్తకము లెన్ని చదివినను ఆచరించనిది వృధాకాలక్షేపమే యగును.

౪. త్యాగులుకండు. ఈరోజుపని రేపటికై యుంచకుడు. చావు ఏఘడియకో తెలియదు. ఈరోజు మృతినొందితిరేని, రేపు ఏమి చేయుదురు. పోయిన సమయము తిరిగిరాదు. ఇపుడే మంచి చేసుకొనుడు.

౫. సేవచేయుడు. ఇదే మంచిపని. దీనినుండి మీరు ముక్తిని బడయుదురు, ప్రతిష్ఠకై ఆశపడకుడు. అందరికి దాసులుగండు.

౬. మూడు రకాల మనుష్యులు గలరు. (1) దేవత (2) మనుష్యుడు (3) పశువు.

(1) మొదటివాడు తాను కష్టపడుతు, ఇతరులను సుఖపెట్టును. (2) రెండవవాడు తాను సుఖమును కోరుచు ఇతరుల సుఖమును కోరడు. (3) మూడవవాడు, తనకు మరియు ఇతరులకు కష్టమే కలిగించును, మూర్ఖుడు.

## ౧౭౦ సంత్ సాధు మహ్మద్సయ్యద్

[వీరు నిరాడంబరులు, వీరికి గోచితప్ప మరేమి లేకుండెను. వీరిని ఉరి తీయించినపుడు సంతోషించుచు ఉరికంభమును సమీపించి, ఈ శరీరము భగవద్దర్శనమునకు, అడ్డముండెను. ఈ రోజు ఆత్మనుండి ఈ శరీరము విడిపోవుచున్నది, ఇది చాలా సుదినము. ఈ ఉరి నాకొరకు స్నేహితుడై ప్రాప్తించినది. కావున నాకు చాలా సంతోషమనుచు ప్రాణమును విడచెను.]

## ౧౭౧ సంత్ మన్సూర్

[వీరు సర్వత్ర బ్రహ్మస్వరూపమే చూచుచు, నేనే బ్రహ్మనని, అనుచుండెడివారు. ఇట్లనుటచే, అదేశపు, దల్వాది ఖలీఫా సహించక

వీరికి శిక్ష విధించి, చేతులను కాళ్ళను నరికించినను. నేను బ్రహ్మాను అను ఆమాట మరువలేదు. సంతోషముగా భగవంతుని ధ్యానించెను. వీరి నాలుకను కోయుటకై ప్రయత్నించగా, కొద్దిగా నిదానించుడు, ఒకసారి ప్రార్థన చేయనిండు, అని, ఓ ప్రభో, నన్ను పీడించువారిని దండించకుము, వారికి దుఃఖములు కలుగజేయకుము. వారు నాయొక్క కష్టములను తగ్గించుటకై నా జన్మయాత్రను తగ్గించు చున్నారు. ఈ శరీరమనే బందిఖాననుండి నన్ను విడదీయుచున్నారు. ఇపుడే వీరు, నా తలను, నరుకనున్నారు. అపుడే నీ దర్శనభాగ్యము నాకు కలుగును. కాన, వీరు నాకు ఉపకారులు. వీరివల్లనే, నీ దర్శ నము తొందరగ లభించుచున్నది. కావున, వీరిని క్షమించి, సుఖింప జేయుమని ప్రార్థించెను.]

## ౧౯౨ సంత్ శేఖ్‌సాది

౧. నీవు మితిమీరి కడుపును నింపకుము. కొద్దిగా కడుపును వెలితి యుంచుము. దీనిచే ఈశ్వరునియందు భక్తి ప్రజలయెడ ప్రేమ కలుగుచుండును. మనస్సు నిర్మలమై చిత్తశుద్ధి కలుగును. ఎక్కువ తింటివా, నిద్ర పాపచింతన, కలిగి నశించుదువు.

౨. ఎన్నిటినో చిన్నచిన్న జంతువుల త్రొక్కి చంపుదువు. అట్లే నిన్ను నీకంటె గొప్పదగు ఏనుగ త్రొక్కినచో, నీ వపు డెట్లుందువో తలంచుకొని. చిన్నజీవులను కాపాడు చుండుము.

౩. మానవుడు ఆశను, లోభమును విడచినచో రాజును మించిన గొప్పపదవిని పొందును. సుఖదుఃఖములకై చింతపడక సదా సంతోషముగా యుండినచో జీవుడే, దేవుడగును.

౪. నీకు ధనము, శక్తి, ఈ రెండు యున్నపుడే పుణ్యమును చేసుకొనుము. అవి తగ్గిన తదుపరి విచారించిన లాభముండదు.

౫. ఈ సంసారములోని మానవ్రుల, కన్నులు సంతోషముతో నైనా నిండును, లేక, బొందలో పాతిపెట్టిన తదుపరి మట్టితోనైనా నిండును. కావున, దేనిని ఆశించక సదా సంతోషులుగా నుండుడు.

## ౧౫౩ సంత్ బేకన్

౧. నిరంతరము మృత్యువు యొక్క స్మరణచే, మానవుని అజ్ఞానమయమగు చర్యల నోకించుక క్షీణింపజేసి, వానిని పాపభీతిగల వానిగ జేయును.

## ౧౫౪ సంత్ దాస్‌జీ

౧. ప్రప్రథమమున దరిద్రుల సేవచేయుడు. ధనవంతులు, తమ వద్ది ధనముతో సేవ పొందగలుగుదురు. పాపము బీదలకు ఎవరు సహాయ్యము చేయుదురు. కాన ఎల్లప్పుడు బీదలయెడ దృష్టియుంచి వారికి సేవచేయుటే ముక్తి.

## ౧౫౫ సాధ్వికె థేరిన్

౧. నీవు వినయుడవుకమ్ము. దుఃఖసమయములో దుఃఖములను సహించుము. సౌఖ్యసమయములో గర్వపడకుము. నిన్ను నీవు శాసించుకొని, నీవశములో నుంచుకొనుము. ఇట్లాచరించితివా, ఈశ్వరుని యొక్కయు మానవులయొక్కయు ప్రియమునకు పాత్రుడవగుదువు.

౨. ఎవడుసమస్త సంసార వస్తువులయందలి మమతను త్యజించి, ఆత్మదృష్టిగలవాడగునో, వాడే ముక్తుడు.

౩. ఎవనికి తనలో పాపము, మలినభావమున్నదని తెలిసియు, వాటిపై అసూయపుట్టదో, వాడు ఎన్నటికిని ఉత్తీర్ణుడు కానేరడు.

## ౧౫౬ కుమారిపెర్నా

౧. కేవలము దుఃఖము లనుభవించుటకే జీవించవలెను. ఇందులోనే మోక్షముకలదు. ఎందుకన, కర్మాంతమే ముక్తి కదా!

౨. నీకొరకై దేనిని యాచించకుము. దేనిని కోరకుము. దుఃఖములను, మృత్యువునే ఆశించుము. మృత్యువు నిన్ను సమీపించు కొలది సంతోషించుము. ఎందుకన, ఈశ్వరుని సమీపించు చున్నావుకదా.

## ౧౯౭ మేడం బ్లావట్స్కీయు

౧. భూమిలోపల మట్టిచేగప్పబడిన, వజ్రముయొక్క కాంతి, బయటకు తెలియని విధమున, మాయచే లోతుగ బూడ్చబడిన, నీ ఆత్మ స్వరూపము, నీమనస్సునకు అగోచరముగ నున్నది.

౨. నీ హృదయము జింకవంటిది. నిత్యానంద సాగరమునకు జనుదెంచుచున్న ఈ జింకను తరుముచున్న నీ కోరికలు, వేటకుక్కల వంటివి. నిత్యానంద సాగరమును జేరక పూర్వమే, ఆజింక, వేట కుక్కలకు జిక్కినచో, దుఃఖముల పాలగును.

౩. అజ్ఞానమునువిడచి, భ్రాంతిని విడగొట్టి, ప్రాపంచిక మాయా జాలమునుండి, అంతర్ముఖుడవు కమ్ము. నీ ఇంద్రియములను నమ్మినచో, అవినిన్ను మోసపుచ్చును. నీవు వెదుకునది నీలోనే కలదు. దానిని జూచినచో అది నీవే అగుదువు.

## ౧౯౮ కరమాన్ దేశపు రాజకన్య

[ఈమె గొప్పవిరాగిని, పూర్ణవిశ్వాసముగల విరక్తిగలవానినే, వివాహమాడగలను. లేనిచో ఆజన్మ బ్రహ్మచారిణిగా యుండెదనని ప్రతిజ్ఞచేసియుండెను. ఒక విరక్తి సన్యాసితో వివాహము జరిగి, వారి వెంట అరణ్యమునకు పోయి, ఒక చెట్టుక్రిందయుండిరి. ఆచెట్టుపై ఒక యెండిన రొట్టెతునుకను ఆ రాచకన్యచూచి, నాథా ఈ రొట్టెతునుక ఎందుకని ప్రశ్నించగా, రాత్రికొరకై యుంచినానని చెప్పెను. అదివిని రాచకన్య దుఃఖించెను. ఎందుకన, పూర్ణవిశ్వాసము గల, విరక్తి గల వానినే, భర్తగా గైకొందునని ప్రతిజ్ఞచేసియుంటిని. ఈ ఎండిపోయిన రొట్టెతునుకమీద యున్న విశ్వాసము, ఆభగవంతునిపై లేనిభర్త

లక్ష్యమైనందుకు దుఃఖించినది. అపుడు ఆ సన్యాసియైన, భర్త లజ్జపడి, ఆరోట్టెముక్కను పారవైచి పూర్ణవిరక్తుడై, భగవంతుని ధ్యానించుచు జీవనము గడిపెను.]

## ౧౯౯ డాక్టర్ అనిబిసెంట్

౧. మొదలు మానసిక సత్యమును నేర్చుకొనుము. పరులపై దురుద్దేశములను ఆరోపింపకుము.

౨. నీకు తెలిసిన దానిని ఇతరులకు తెలియజేయుట మంచిది. నీవేదికోరుదువో, ఇతరుల కదియే కోరుము.

౩. నీ ప్రయోజనము కొరకు, కామమెంత గొప్పదైనను, బంధకారియే యని మరువకుము. నీ దృష్టి కాటంకము గలిగించు దానినెల్ల దహించుము.

౪. లోకమున నీవు ప్రకాశింపవలెనని గాని, చమత్కారము చూపవలెనని గాని, కోరకుము.

౫. మాట్లాడవలెననే వాంచను వీడుము. నిన్ను అడగనిదే పైబడిమాట్లాడకుము. మౌనము చాలా మంచిది.

౬. నీవుచెప్పబోవునది, సత్యము, ప్రియము, ఉపకారిగ నున్నదని నీకు ధృడముగ తోచినచో ప్రతిమాటను పరిశీలించియే మాట్లాడుము.

౭. ఇతరుల విషయమై ప్రశంసించకుము. ఇతరుల పనులయెడ వ్రేలుపెట్టి చూపుట మంచిదికాదు. దీనిని నీవు ఖండితముగా అణుచుకొనుము.

౮. నేను గొప్పవాడనని, ఏదో గొప్పకార్యము చేయుచున్నానని అహంకార పడకుము.

౯. నీవేదిచేసినను, అది మానవునకు కాదు, భగవంతునికని దానిని మనఃపూర్వకముగా చేయుము.

౧౦. ఇతరులయందలి చెడుగును, నీవుదలంచితివా ఏక కాలమున మూడు పాపములను చేసినవాడవగుదువు.

౧౧. మన కామములను తీర్చుకొనుటకై ఎందరినో కష్ట పెట్టుకొనుచున్నామని ఇంచుకైనను విచారించుట లేదు. దీనివల్లనే ఇన్ని దుఃఖములు మనకు కలుగుతున్నవి. కావున మీకొరకు ఇతరులను కష్టపెట్టుట పాపము.

౧౨. సత్యమును, ధర్మమును, అంతరాత్మబోధలను, ఎల్లపుడు దృష్టియందుంచు కొనుడు.

౧౩. మనవల్ల ప్రపంచమునకు ఏమి ప్రయోజనము అగుచున్న దని, నిరంతము విచారించు చుండవలెను.

౧౪. బ్రహ్మవ్రతుడు తోటిమానవుల నుద్ధరించవలెను. అణుగ ద్రొక్కరాదు. నీ ప్రభావముచే ఇతరులను బాధించరాదు.

౧౫. ఇతరులకై నీ యావదాస్తిని, నీ శరీరమును, త్యాగము చేయుము. నీకున్న దానినిఇచ్చి నీరుణము తీర్చుకొనుము.

౧౬. క్రిందనున్నదానిని విడుచుటవల్లనే పైనున్నది దొరుకును.

౧౭. ఇతరులకంటె నీవు భిన్నుడనను భావము మదియందుంచు కొనకుము. భేదభావముండుటే ప్రమాదము.

౧౮. కష్ట నష్టములను, జరా మరణములను లక్ష్యమందుంచు కొనక, మనశ్శాంతిని అలవరచుకొనుము.

౧౯. ఎవరైన ఇతరులగురించి చెడుమాట్లాడినచో దానిని వినకుము. ఇతరులనుగూర్చి నీవు చెడుచెప్పకుము.

౨౦. తన జీవితమును ప్రేమించువాడు, ధర్మమును గోలు పోవును. ఇతరులను ప్రేమించుటే మానవునియొక్క ధర్మము.

౨౧. ఇచ్చుటచేతనే అన్యోన్యమైన ప్రేమ పుట్టును. ప్రపంచమునకు, ఋణగ్రస్తుడవు కాకుము.

## ౨౦౦ మాతామదర్ (పాండుచరీ)

౧. ప్రతిజీవిలో అంతరమున, నివసించుభగవంతుని, మానవుడు జూడగలుగునేని, నిందించుటకు బదులు ప్రేమించును.

౨. నీదికానిదానిని, దేనినిగాని, నీకొరకై కోరకుము. నీదనునది నీకేమి మిగిలియుండనపుడే, సర్వమును నీకీయబడును.

౩. నిన్నెవరైన, అవమానించినా, తిట్టినా, ప్రతిక్రియ చేయక వారికి మేలుచేయుము. నీ జీవితములో ఎన్నికష్టములొచ్చినా వాటిని సుఖముగా అనుభవింపుము.

౪. కోరికలే దుఃఖమునకు, కారణము. అట్టి కోరికలు నీమనస్సులో జనించెనేని వాటిని కనిపెట్టి తుచ్ఛముగా తలంచి త్యజించుము.

౫. శరీరముయొక్క ప్రతి అణువులో శాంతిని రానిమ్ము. తాను దేనిని ప్రేమించునో దానిరూపమునే పొందును.

౬. దైవమునుగూర్చి మాత్రమే భావించినచో దైవము నీతో నుండును.

౭. దైవమునందలి విశ్వాసము ననుసరించియే, దైవకృప మనకై పనిచేయును. అహంకారమును త్యజించుము.

౮. మౌనమువహించి అంతర్ముఖుల మగుదుమేని, దైవవాణిని గనిపెట్ట గలుగుదుము.

## ౨౦౧ శ్రీ మహాసంత్

౧. ఆకలి, దప్పి, నిద్ర, జాగరణ, మూత్ర, పురీషాదులు ఈ ఆరు ప్రకృతి విధానముచే వాటంతటవే జరుగుచుండును. వీటికై ఏమియు చేయ నవసరములేదు. ప్రకృతియే చేయును. వీటిలో మనము జోక్యము తీసికొనరాదు. సుఖభోగములకొరకై ఆశపడి అందులో

జోక్యము తీసికొంటిమా? మనమే కర్తలము కావలసి వచ్చును. దాని పరిణామముగ దుఃఖము లనుభవించవలసి యుండును. తమంతటతామే జరుగుచుండు కర్మలయందు మనస్సు పెట్టవలసిన అవసరముండదు. కోరికలతో చేయబడు పనులకై మనస్సుచే, విచారించవలసి యుండును. ఎచట మనస్సు చేర్చబడునో అచట సంకల్ప వికల్పములు ఉత్పత్తి అగుచుండును. కావున, పై ఆరు, ఇంద్రియముల యొక్క సహజ కర్మలందు నీవు జోక్యము తీసికొనకుము. అవి ప్రకృతి విధానమువల్ల జరుగుచుండును. నీవు చేయునదేముండదు? ఎపుడు నీకు చేయునదే ముండదో, అపుడే మనస్సు సంకల్ప శూన్యమై సమాధిస్థితి కలుగును. అహంకారమను కారణశరీరము నశించగానే, ఈశ్వరప్రాప్తి కలుగును. జన్మరాహిత్యమగును.

## ౨౦౨ సంత్ హజరత్ అలి

[వీరి సేవకుడు వీరిపై ఈర్ష్యచే, ఒకరోజు వీరు (కుపా) నగరములో ఉదయమున ప్రార్థన చేయుచుండగా ఆసమయమును కనిపెట్టి కత్తితో నరికి పారిపోయెను. ప్రార్థన పూర్తి కాగానే అక్కడ నున్నవారు తహ తహపడి కొందరు వీరికి సేవచేయుచు కొందరు ఆ హంతకుని వెంబడించిరి. వీరికి ఆదెబ్బచే గొప్ప గాయము తగిలి అలసిపోయిరి. వీరి దాహమును తీర్చుటకై మధుర పానీయము తెచ్చిరి. అంతలో ఆ దుండగుని పట్టుకొని తెచ్చి వీరిఎదుట నిలపిరి. అపుడు వీరు, ఈ మధుర పానీయమును, నన్నుచంపనున్న నా సేవకుని కీయుడని చెప్పెను. ఎందుకన, అతడు పరుగెత్తి పరుగెత్తి అలసటజెంది దప్పికొని ఉన్నాడు. కావున, మొదలు అతనికి ఈ పానీయము నిచ్చి అలసట తీర్చుడని ఆ పానీయమును అతనికి యిప్పించెను. తదుపరి అతనిని క్షమించి, విడిపించెను.]

౧. ప్రతిజీవిని ప్రేమించి క్షమించుట మానవునియొక్క ముఖ్య కర్తవ్యము.

౨. స్వార్థమును వీడి పరులకు మేలుచేయుడు. మీకొరకై దేనిని కోరుకొనకుడు.

౩. సంసారమునందలి మమతను త్యజించి ఈశ్వరుని నమ్మి ప్రార్థించుచుండుడు.

## ౨౦౩ శ్రీ ఆనంద్‌మాయి

౧. సమస్త దోషములను నీ వివేకశక్తిచే నశింపచేసి నీవు నిజమైన మానవుడవు కమ్ము. నీవు పవిత్రుడవే కాని, భోగలాలసుడవై నిన్ను నీవు మరచితివి. ఆలసించక మేలుకొనుము.

౨. ఎవడు తన మనస్సును జాగ్రతగా చూచుచుండునో వాడే నిజమైన మానవుడు. అనగా, తనను తాను మరువకుండుట. తనను తెలిసికొనుచో అంతయు తెలిసినటులే. తన్ను తెలిసితె భగవంతుని తెలిసికొనినటులే. లేక, భగవంతుని తెలిసికొనిననూ, తనను తెలిసి కొనినటులే.

౩. ధర్మమును, నీతి ననుసరించి సమాజ విధాన ప్రకారము వర్తించినచో మానవుడు, మానవత్వము పొందును.

౪. అన్నిటికంటె ముందు నీవు మానవుడ వగుటకు ప్రయత్నించుము.

౫. మానవుడు ఈశ్వరునియొక్క ప్రతిరూపమే. తనను, లేక, భగవంతుని తెలిసికొనుటకు ప్రయత్నించుటే మానవునియొక్క కర్తవ్యము. అదియే పరమ పురుషార్థము.

౬. మానవత్వము ప్రాప్తించగానే పరమార్థ భావము స్వతః సిద్ధముగా దానంతటదే కలుగును. అపుడు సమస్త మోహములు నశించును. అపుడు ముక్తికై వెతుక నవసరముండదు. మనుష్యుడు అవిశ్వాసముచే, నేను కర్మ చేయవలయు ననుచు అహంకారముతో చేయుచుండును. నిజమైన మానవుడు నిశ్చింతగా అకర్తగానుండును.

౭. మానవునకుండు లక్షణములు లేకున్నచో వాడు మానవు డనుటకు అర్హుడు కాడు.

## ౨౦౪ శ్రీ బ్రహ్మస్వరూప్ సన్యాసిని

౧. ఈశ్వరుని సర్వవ్యాపిగా నమ్ముము. ఏది చేసినను ఈశ్వర ప్రీతికొరకే చేయుము. ప్రతి జీవిలో ఈశ్వరుడు కలడని ప్రతి జీవిని సేవించుము.

౨. సమస్త కోరికలను త్యజించినచో నీవు పాపములనుండి విడబడుదువు.

౩. విషయాసక్తిని విడచుటచే మానవునకు మానవత్వము సిద్ధించును.

౪. పవిత్రమానవుడే, లోక, పరలోకములలోపూజ్యుడు. వానికే సుఖము, శాంతియు, కలుగును.

## ౨౦౫ పరమసంత్ శ్రీ స్వామిజీ మహారాజ్

౧. మనో ఇంద్రియములను, నీ వశములో నుంచుకొనుట ముఖ్యము. విషయ భోగములను విడచి వైరాగ్యము నవలంబించుము.

౨. ప్రపంచ ప్రేమను విడచి, భగవంతుని ప్రేమించుము. సత్సంగము చాలా మంచిది. సాధువులగోష్ఠి చేయుము.

౩. సత్సంగము చేయువారికి, క్షమ గలిగి యుండుట, ముఖ్యము. క్రోధము, కాలునిచక్రము వంటిది.సత్సంగము కల్పతరువు వంటిది.

౪. ధ్యాననిష్ఠకు సాత్వికాహారమును మితముగా తినుట ముఖ్యము. ఏకాంతమున మౌనముతో ధ్యానింపుము.

౫. దురాచారుల సంగమము చేయకుము. అన్యాయార్జితము గల వారివద్ద, కామ, క్రోధ, లోభగుణములుగల వారివద్ద తినకుము. తామసాహారమును తినరాదు. అతినిద్ర పనికిరాదు.

౬. శత్రు మిత్రులలో ఒకే పరమాత్మ గలదు. అయినచో మిత్రులను ప్రేమించుచు శత్రువులను ద్వేషించు టెందులకు ?

౭. సంతులయొక్క సత్సంగము వలన మృత్యువుయొక్క భయముండదు.

౮. సంసారి మృత్యువునకు భయపడును. సాధువు మృత్యువునకు భయపడడు. ఎందుకన, సంసారి సంసారముయొక్క పదార్థములం దాసక్తుడై యుండును. సాధువు సంసార పదార్థములను దుఃఖ రూపముగా భావించును.

౯. ఎంతవరకు స్థూల సూక్ష్మ కర్మలు నశించవో అంతవరకు ముక్తి దొరుకుట దుర్లభము.

౧౦. ఏపని చేసినను, ప్రభువు యొక్క సంతోషమునకే చేయుము. నేను, అనునట్టి అహంకార ముండరాదు. అహంకారమును నశింపచేసి, దీనతను పొందుము.

౧౧. నిందాస్థుతులు రెండూ పాపములే.

౧౨. ఎవనికి దోషదృష్టి ఉండునో వానికి సత్సంగము లభింపదు.

౧౩. గురునాజ్ఞను జవదాటక వర్తించువాడే నిజమైన భక్తుడు. ప్రేమానురాగముచే భక్తి కుదురును.

౧౪. పరమార్థమందు సత్యమైన ఇచ్ఛ, నిర్మల హృదయము గల వానినే సంతులు ప్రేమింతురు.

౧౫. జిహ్వాతో జపించుటకంటె, హృదయమునుండి జపించుటే ముఖ్యము. ఆత్మతో జపించుట అంతకన్న ముఖ్యము. నిజమైన అనురాగము సహజ వైరాగ్యముండుట ముఖ్యము.

౧౬. ఎవడు భగవంతుని స్మరించడో వాడు తనకుతానే హానిచేసికొనును.

౧౭. ఆత్మకు అనిష్టమగు పనులు చేయరాదు. శరీరము యొక్కయు మనస్సు యొక్కయు స్వభావమునకు విరుద్ధమగు పనులు చేయరాదు.

౧౮. న్యాయముగా స్వతఃకష్టించి సంపాదించియే తినుట ఉత్తమము. ఆడంబరము పనికిరాదు.

౧౯. మాదక ద్రవ్యములు త్రాగుటచే, మాంసాహారమును తినుటచే మనస్సు కల్మషమై వికారము చెందును.

౨౦. అందరిని ప్రేమించి సేవించుటే భగవత్ సేవ అనబడును.

## ౨౦౬ యోగీ శ్రీ జాలంధర్‌నాథ్

౧. సాత్విక స్వల్పాహారమును భుజించువాడే జ్ఞానమునకు అర్హుడై ముక్తుడగును. అధికముగా అరగించువాడు రోగపీడితుడై బద్ధుడగును.

౨. ప్రతి పనిని, ధర్మయుక్తముగా, వివేకముచే ఆచరించుట యోగ్యము.

## ౨౦౭ యోగీ శ్రీ మత్స్యేంద్రనాథ్

౧. వీధిలోనో, అంగడిలోనో, చెట్ల క్రిందనో, గుట్టల మీదనో, ఎక్కడనో యుండుము! కాని కామమును క్రోధమును, తృష్ణను, సంసారము నందలి మమతను, త్యజించుము. దీనిని మరువకుము.

## ౨౦౮ యోగీ శ్రీ గోరఖ్‌నాథ్

౧. చూడు, విను, కాని నోటితో మాట్లాడకుము. వాదవివాదములకు దిగకుము. వినమ్రుడవుకమ్ము. ఈ ప్రపంచమొక, ముండ్లకంచె కావున జాగ్రత్తగా చూచుచు అడుగుపెట్టుము.

౨. తిండికై ఆశపడకుము, ఉన్న దానితోనే సంతృప్తి చెందుము.

౩. అంతర్ముఖుడవై ఆత్మవిచారము చేయుచుండుము.

౪. నిన్నుతిట్టిన వానిని, ద్వేషించిన వానిని, క్షమించి, ప్రేమించుము.

## ౨౦౯ యోగీ శ్రీ గంభీర్‌నాథ్‌జీ

౧. సత్యవ్రతుడవుకమ్ము. ప్రపంచవిషయ లంపటము యొక్క జోలికిపోకుము. అహంకార, మమతలను త్యజించుము. గతమునకై విచారపడకుము.

౨. భగవంతుడు ప్రతి జీవిలోనుండి, అనేక రూపములతో దర్శన మిచ్చుచున్నాడు, కావున ప్రతిజీవిని ప్రేమించుము.

౩. దరిద్రులను దైవములగా దలంచి వారిని పూజింపుము. వెనుకముందా లోచించకు, ముందుకుసాగి పొమ్ము.

౪. నిత్యా నిత్య వివేకముగల వాడవై, సమస్త సంపదలను త్యజించి, ఈశ్వరుని భజించు చుండుము.

## ౨౧౦ శ్రీ వేమనయోగి

౧. లజ్జాభిమానమును వర్జించినచో, మోక్షము లభించును. అహంకారాదులను జంపుకొని శుశ్రూషల గావించినచో, అభిమానము నశించును.అభిమానమును విడచినవాడే మృతజీవు డనబడును. పరమును సాధించుకొన దలంచువాడు మానావమానములను లెక్కింపరాదు.

౨. కడివెడు గాడెదపాలకంటె, గరిటెడు గంగగోవుపాలు ఉపయోగపడునట్లు, వివిధపదవులచే కూడుకొనిన అనేక ప్రపంచ వ్యావహారములకంటె, నిరాడంబరముగ, నొక భగవన్నామమును జపించినచో ముక్తిని ప్రసాదించును.

౩. ధనమును సంగ్రహము చేయకుము. దానిని సద్వినియోగము చేయుము. లోభివి కాకుము. ఇదేనరకమునకు కారణము. సర్వసంగ పరిత్యాగివికమ్ము.

౪. ఆశకులోబడి, తిండిని తినగోరితివా, బంధించ బడుదువు. రుచికై మితిమీరి తినకుము. కేవలము శరీరము నిలుచుటకే తినుము.

౫. ఇంద్రియ నిగ్రహము గలవాడే ధన్యుడు. కావున సమస్త విషయ భోగములను త్యజించుము.

౬. గర్వించకుము. దేహమస్థిరము. మృత్యువు సమీపించు చున్నది, ఆలసించక దేవుని ఆజ్ఞలను పాలించుచు దేవుని జూడ ప్రయత్నింపుము.

౭. జ్ఞానికి కర్మలతో నవసరము లేదు. జ్ఞానులకు జ్ఞానమే కర్మలు. సామాన్య మానవుల కటుల కాదు. కర్మల నంత మొందించు కొనుటయే వారికి ముక్తి.

౮. కామమే మృత్యువనకు హేతువు. నైతిక పతనమే వాస్తవముగా మృత్యువు.

౯. సమస్త బ్రహ్మాండములను ఈశ్వరునిగా భావించి సేవించు చుండుము.

౧౦. చూచుటకు, ఉప్పుకప్పుర మొకటిగా నుండినను, రుచి చూచునపుడు భేదము తెలియునటుల మానవులంద రొకటిగా గనుపించినను, వారి వారి ప్రవర్తనలనుబట్టి, మహనీయులను వేరుగా గుర్తింప వలయును.

## ౨౧౧ శ్రీ యోగీశ్వర్ ప్రబుద్ధ

౧. మొదలు నీదేహాసక్తిని మరియు పుత్ర మిత్ర కళత్ర వస్తు వాహనముల నందలి ఆసక్తిని విడుచుట నేర్చుకొనుము. తదుపరి సమస్త ప్రాణులయెడ నీ యోగ్యతానుసారము దయ, మైత్రి, వినయము, గలిగి నిష్కపట భావముచే ప్రవర్తించుట, నేర్చుకొనుము.

౨. మట్టి నీరు మొదలగు వాటిచే బాహ్యశరీరము శుద్ధి యగును. క్రోధము, కపటము, ద్వేషము, ఈర్ష్య మొదలగు వాటిని,

త్యజించుటచే అంతఃశుద్ధి యగును. కావున, ధర్మానుష్ఠాన పరుండవు కమ్ము.

౩. దేనిని సంగ్రహాము చేయకుము. లేనివారి కిచ్చుచుండుము. నీకని దేనిని యుంచుకొనకుము. స్వార్థరహితుడవుకమ్ము.

౪. ఇతరులను దూషించకుము. ఒకటి చెడ్డ ఒకటి మంచిదని తలంచకుము. భేదభావ ముండరాదు. ఇదే రాగ ద్వేషములకు కారణము.

౫. మౌనముద్వారా నీ వాణిని సంయమము చేసికొనుము.

౬. నీతో సహా నీ సర్వస్వమును భగవదర్పితముచేసి, సర్వత్ర భగవంతుని దర్శించుచు, సదా ధ్యానించు చుండుము.

## ౨౧౨ శ్రీ శివయోగీ సర్వభూషన్ జీ

౧. నీ పుణ్యము క్షీణించగానే, నీ ధన సంపత్తు లన్నియు క్షీణించును. అపుడు నీవు దుఃఖించినచో లాభమేమి. నిజమైన మోక్షమును విడచి లౌకిక సౌఖ్యములకై ఆశపడి నశించకుము.

౨. ఈ ప్రపంచము, కుక్కకలవంటిది. అసత్యమైనది, జన్మించునపుడు, దుఃఖమే, మరణించునపుడు దుఃఖమే, ఏడ్చుచు పుట్టి, ఏడ్చుచు చచ్చుట ధర్మమా, నవ్వుచు చచ్చుటకు ప్రయత్నించుటే ధర్మము.

౩. శరీరమును, భార్యాపుత్రులను, ధనసంపత్తులను చూచుకొని భ్రమపడి నశించకుము.

## ౨౧౩ శ్రీ బందరు దొంతులమ్మ

౧. లేదని దుఃఖించి ఎవరిని దేనిని అడుగకుము. ఖేద, మోదముల రెంటిని, వదులుము. విషయము లస్థిరములు వాటియందలి మమతను విడువుము.

౨. నీకు ధనము సంపాదించవలెనని చింత ఎందులకు? అది అనిత్యమైనది, పాపములకు మూలము. కావున, సమస్త కోరికలను విడచి, భగవంతుని ధ్యానించుచుండుము.

## ౨౧౪ శ్రీ రంగావధూత

౧. శిలావిగ్రహములు, భూషించిన సంతోషపడక, దూషించిన దుఃఖపడక, యుండు విధమున మానవులు సుఖములచే నుప్పొంగక, దుఃఖములచే కృశింపక, నిశ్చలహృదయులై యుండవలెను.

౨. ముల్లుచే ముల్లుతీసి, ఆరెంటిని పారవేయు విధమున, సత్కర్మలచే దుష్కర్మలను, నశింపజేసి, తుదకారెంటిని త్యజించినవాడే, పరిపూర్ణుడై జనన, మరణమనెడి జాడ్యమునుండి తప్పించుకొనును.

౩. రత్నములు గలిగినవారు, రాళ్ల నలక్ష్యము చేయునట్లు, పరమార్థమును గాంచినవారు, ప్రపంచమును పాటించరు.

౪. తరువు విరిగి కూలిపోవునపుడు, దానిపైనున్న పక్షు లన్నియు ఎగిరిపోవునట్లు మనస్సు శూన్యస్థితి బొందిన వెంటనే, దాని నంటిపెట్టుకొనియున్న సర్వ వికారములు నశించును.

౫. రోగము కుదురుటకు మందు, పథ్యము, ఎట్లవసరమో, అట్లే భవరోగము కుదురుటకు, జ్ఞానమనెడి మందు, విరక్తి యనెడి పథ్య మవసరము.

౬. పెట్టెలోని చిమ్మెటలను, పెట్టెలోనేయుంచి, పెట్టెను నెత్తిపై పెట్టుకొని, యూరూర, తిరిగినను వస్త్రములను తినుట ఎట్లు మానజాలవో, అట్లే మనస్సులోని దుర్గుణములను, మనస్సునందే యుంచి ఎన్ని యాత్రలను జేసినను, ఎన్ని శాస్త్రములు వినినను అన్నియు నిష్ప్రయోజనములే.

## ౨౧౫ శ్రీ అరవిందఘోష్

౧. తనను తాను, సంపూర్ణముగ దేవునికి సమర్పించు కొను జీవునకే దేవుడు తనను తాను సంపూర్ణముగా సమర్పించు కొనును.

౨. దేని కొరకు నిర్దేశింపబడి, నీ జీవభూత మవతారము దాల్చెనో, దానికొరకు నీ జీవరథమును కర్మా చరణో పకరణముగ, భగవచ్ఛక్తి యంత్రముగ నుపయోగింపుము.

౩. క్షుద్ర సుఖభోగములకై ప్రయాసపడు, నీ క్షుద్ర అహంకారమే, నీవని భ్రమపడకుము.

౪. నీ అంతరాత్మమాటను వింటివా ముక్తిదొరుకును. ప్రకృతి స్వభావమునుండి విముఖుడవై, అంతరాత్మను దర్శించుము.

౫. ఏకాగ్ర బుద్ధిగలిగియుండుట, దానియందు, దనను మరువ కుండుట, ఇదియే వేదాంత రహస్యము.

౬. నీ ప్రకృతి నీ కర్మ విధానమును నిర్ణయించు చున్నదని గుర్తెరుంగుము. నీ వాచరించు కర్మ కామ్య రహితమై స్వేచ్ఛగలిగి యుండవలెను.

౭. గుణముల ప్రవర్తనచే గలుగు తారుమారులకు లోను గాకుము. నేను, నాది, అని భేదభావము కలిగించునవి, కోరికలే.

౮. మానవులకు సాహాయ్యము జేయుము, కాని, వారి స్వీయ శక్తిని నశింపచేయకుము.

౯. ప్రతి జీవిలో ఈశ్వరుడున్నాడని భావించి ప్రతి జీవిని ప్రేమించి సేవించుచుండుము.

౧౦. మంచిగా, తినవలె, సుఖపడ వలెనని, కలలోనైనా తలంచకుము. జీర్ణకోశమును పాడుజేయు పదార్థములను తినకుము. సాత్వికాహారమును, మితముగా, ఆకలిపూర్తియగుటకే తినుము.

౧౧. లోకసేవజేయుటకుగాను జీవింపచేయుమని భగవంతుని ప్రార్థింపుము, మరేమి కోరకుము.

౧౨. మౌనవ్రతమువల్ల ఏకాగ్రతయు మనఃశాంతియు తప్పక కలుగును.

౧౩. అనవసరముగా, బాధ్యతలేనిదే మాట్లాడకుము. ఇతరులేమిచేసినను, చేయకపోయినను, దానితో నీకు సంబంధముండరాదు. వారిపైగాని, లేక వారుచేసేపనిపైగాని, లేక వారినిగురించి, ఇతరులేమనుకొనెదరో, ఏమిచెప్పెదరో దానిని గూర్చిగాని, నీ అభిప్రాయమిచ్చుటకును, మాట్లాడుటకును, నీకు అవసరములేదు. నిన్ను నీవు, నీ హద్దులో పెట్టుకొనుము.

౧౪. నీలో ఏమి జరుగుచున్నదో దానిని యున్నదున్నట్లు తెలిసికొనుట నీకే మిక్కిలి కష్టసాధ్యముగనుండ, ఇతరులయందేమి జరుగుచున్నదో దానిని యదార్థముగ తెలిసికొనుటెట్లు ? కావున ఇతరులగురించి ఆలోచించుట మానుము. వారుమంచివారో చెడ్డవారో, నీకేల తెలియును ? మౌనము వహించుటేమంచిది.

౧౫. వ్యక్తుల గురించిగాని, వస్తువుల గురించిగాని, చెడు పలుకకుము, ఇది చెడ్డ ఇది మంచిదని భేదభావముంచకుము.

౧౬. నీ యొద్ద ఉన్నదంతా ఈశ్వరునిదే, నీవు దానికి రక్షకుడవు, భోగవిలాసములకు ఆశపడకుము. ఇచ్చును, త్యజించుము, నీ అవసరములకై ప్రత్యేకించి దాచుకొనకుము.

౧౭. ఇంతవరకే నీ జీవితములోని ఎంతో భాగము వృధా పోయెను, ఇకనైనా తొందరపడి, నీ కర్తవ్యమును నెరవేర్చుకొనుము.

౧౮. నీలోనున్న ఉత్తమ పురుషుడు మనో వికారములచే మరుగుబడియున్నాడు. వికారములణగినచో, మనస్సు మౌనము వహించును, అపుడే నీకు ఆపురుషుడు గోచరమగును.

౧౯. నిలుపు, నిదానము, సహనము, అత్యావసరము, పేరు, ప్రతిష్ఠ, కీర్తి, గౌరవములు, కాశించి వశించకుము.

౨౦. ఆత్మస్తుతిని, ఆడంబరమును, నీవన్నదే వేదవాక్యమను, స్వాభిమానములను త్యజించుము. నీ జీవితమును ఎల్లపుడు సవరించుకొనుచుండుము.

౨౧. ఈ జన్మలోనే సర్వకష్టముల, నెదురుకొని, జయమొందుట చక్కని రాజమార్గము. ఆత్మ చెప్పినట్లు నడుచుటె ముఖ్యము.

౨౨. ఈ అధ్యాత్మిక మార్గమునకు స్వస్తి చెప్పి, తుచ్ఛ భోగములకు సేవాతత్పరుడవు కమ్మని, గుసగుసలు పలుకు, ప్రేరేపణలకు లోనుగాకుము. నీ ఆత్మ తృష్ణను, నీ పరమసత్యమే సంతుష్టిపరుచును. ఇది సత్యము.

౨౩. నీ కొరకై ఇతరులను కష్టపెట్టకుము, పీడింపకుము. ఇతరుల సంపాదనలపై జీవించుట కాశపడి, పరాధీనుడవు కాకుము, నీ స్వకీయ కష్టముపైననే ఆధారపడి జీవించుము.

౨౪. భూషణ, ధూషణ, తిరస్కారములను, లెక్కించకుము. నిన్ను ద్వేషించిన వారిని ప్రేమించి సేవించుము.

౨౫. నీలో ప్రాపంచకవాసనలు అణుమాత్రమున్నను అవి నిన్ను ఖండించును. సంపూర్ణముగా, ఆశలను విడిచి భగవంతునిపై భారమువైచి కింకరుడవై నిశ్చింతతో ధ్యానించుచుండుము.

## ౨౧౬. శ్రీ బాలయోగిని భారతదేవి

౧. ఈ సంసార చక్రమున సుఖమేమిలేదు చచ్చుటకే పుట్టుచున్నాము. మరల జన్మించుటకే చచ్చుచున్నాము.

౨. నిద్రకొరకు పరుండువారు సంసారులు. నిద్ర వచ్చిన తదుపరి పరుండువారు సన్యాసులు. తినుటకొరకు జీవించువారు సంసారులు. జీవించుటకు తినువారు సన్న్యాసులు. ఆకలి కలిగినపుడే భోజనమును వెదుకువారు, సన్యాసులు. ఆకలికంటె ముందుగానే

భోజనమును సిద్ధపరుచుకొనువారు, సంసారులు. ఈ నిద్రాహారములనే దొంగలు మానవ జీవితములను హరించుచున్నారు. వీటిని జయిం పనిచో, సంసారములో యుండినను, సన్యాసియైననూ వ్యర్ధమేసుమా.

౩. మోక్షమునకు ద్వారములు, వాఙ్నియమము, అపరి గ్రహము, ఆశలేకుండుట.

౪. మోక్షమునకు ఆటంకములు, జిహ్వా, ఉపస్థ. ఈ రెండింటిని బంధించినచో మోక్షద్వారము తెరువబడును.

౫. ఎవడు శరీరపోషణ తత్పరుడై, ఆత్మ సాక్షాత్కారమును కోరునో వాడు మూర్ఖుడు. పామునకు పాలువోసి పోషించినట్లగును.

౬. పరాధీనములైనట్టి వస్తువులను కోరకుము. ఇతరులకు కష్టములు కలిగించనివి, ప్రతిచోట సులభముగా దొరుకు నటువంటి వస్తువులనే స్వీకరించుము. నీ కోరకై ఇతరులకు శ్రమ కల్గించకుము. పరాన్నమును తినకుము.

౭. లోపలి సంబంధమును, బాహ్య సంబంధమును, మనస్సం బంధమును, తెంచివేసితివేని, సకల సంబంధములు వదలిపోవును.

౮. నిన్ను నీవు నమ్మి, నిన్ను నీవు తెలిసికొనిననాడే ముక్తి సిద్ధించును.

౯. వ్యవసాయముచే పండిన పంటను, నాది, దానికి నేనే యజమానుడనని సంగ్రహించుట పాపము. ఎట్లనగా, సూర్యుడు, చంద్రుడు, నీరు, గాలి, భూమి, పశువులు మొదలగు వాటిచే పండిన పంట, నీ యొక్కని దెట్లగును? అందరికి యజమానుడు భగవంతుడే గదా! కావున వాటిపైన అందరికి హక్కు గలదు. ఒక తండ్రికి నలుగురు కొడుకులున్నచో వారందరికి సమభాగముండును. అట్లే భగవంతునికి మనమందరము పుత్రులమేకదా! ప్రపంచమంతయు మనఅందరిదే, కావున నాది, అని సంగ్రహించుట దొంగతనమే.

౧౦. ఒక స్వచ్ఛమైన దీపముయొక్క లాంతరునకు యెఱ్ఱ పచ్చ, నలుపు రంగుగల అద్దాలచే ఆవరణ ఏర్పడినచో, ఆ అద్దాలు, దీపముయొక్క స్వచ్ఛమగు ప్రకాశమును కనపరచక ఆ అద్దాల రూపముననే, ఆ ప్రకాశముగూడా యున్నట్లు భ్రాంతిపింపచేయును. అట్లే రజస్తమో గుణములచే ఆవరింపబడినవారు, అంతఃకరణములోన నిజమైన ప్రకాశమును తెలిసికొనజాలక, బాహ్య రూపములనే సత్యమనీ తలంతురు. సత్వగుణ మట్టిదికాదు, స్వప్రకాశమై నిర్మలమై యుండును. భ్రమలోబడి దానిని గ్రహించుటలేదు.

## ౨౧౭ శ్రీ బాలయోగి

౧. కపటభావముచే స్మరణ చేయకుడు. నీది, నాది, అనేభావ ముండరాదు. ఉన్నన్నాళ్లు, నాది నీదనే బేరమేనైతే, ఇక జన్మ రాహిత్యమెన్నడు ? మళ్లీ ఈజన్మ వచ్చుట అసంభవము.

౨. భగవంతుని దర్శించ దలంచితివా అన్నిటిని త్యజించుము.

౩ తానెవ్వరో తన్ను తెలిసికొని, చలించే మనస్సును నిరోధించినచో గురువెందులకు ? తన ఆత్మయే తనకు గురువగును. తన ఆత్మయే అన్నియు బోధించును. ఇంద్రియములను జయించుటకు, ఆహార నియమము ముఖ్యము.

౪. నీకు కలిగిన బాధలను నీవు సహించకలిగినచో, నీయందు భగవంతునికి దయకలుగును.

౫. ముక్తికి మార్గము బయటలేదు. నీలోనే యున్నది. అంతర్ముఖుడవై చూడుము.

౬. మానవజన్మను వృథాగా పోనీయకుము. తపస్సు వలన సమస్తము సాధ్యమగును. సంపూర్ణముగా ప్రపంచమును త్యజించితివా వెంటనే మోక్షము సిద్ధించును.

# ౨౧౭ శ్రీ చినమ్మగారు

౧. వ్రాయువాడు, తప్పని వ్రాయడు. తప్పని తెలియగానే తుడిచి దిద్దుకొనును. కావున, నీకుతప్పని తెలిసిన కార్యములన్నింటిని దిద్దుకొనుము.

౨. చేతయే గీత, మనమేది చేయుదుమో, అదియే కర్మ సంబంధమగును.

౩. అని తెచ్చుకోకుము. అనినారని తెచ్చుకోకుము. (అనిచెడకుము) (అన్నారని చెడకుము) ఈ రెండింటిచే నీకుము క్తి సిద్ధించును. ఇదినిజము, వీటిని మరువకుము.

౪. నీలోనున్న ఆత్మ ఏమిచెప్పునో దానినే ఆచరించుము. ఈ జన్మ మళ్లీరాదు, జాగ్రత్త!

౫. లోకమర్యాదల కొరకు మనము జన్మించలేదు. జన్మ రాహిత్యమునకై జన్మించితిమి కావున, లోకమునకు లోబడక ఆత్మ చెప్పినట్లాచరించ వలెను.

౬. వినినటుల నడువలేకపోయిన ఆక్షేపించువారులేరు. అనినటుల నడువలేకపోయిన దండించువారు గలరు. అనినటుల నడుచుటే జ్ఞానము. అది మనలోనుండియే చెప్పుచుండును. అది చెప్పినట్లు నడుచుటే జ్ఞానమార్గము.

౭. మన ప్రయోజకత్వమును, కామక్రోధాదులపై చూపవలెను. అవి ఎన్నెన్ని లోకవిషయములను తెచ్చిపెట్టుచుండునో చూడుడు. కావలెనని కొన్నింటిని, ఆశ్చర్యముగా వర్ణించి బాగాయున్నవని కొన్నింటిని, ఇట్లే అనేకములైన విషవాంఛలను తెచ్చిపెట్టి మనల బంధించును.

౮. కామక్రోధములకు, లోభమోహములకు రాగద్వేషములకు లోబడితిమిగదా యని ఏడ్వవలయును. పరులు మనలోని దోష

ములను ఎంచునపుడు, మనలను, అనినారే యని అనుకొను వెఱ్ఱితనము నకును పడ్వవలయును.

౯. తమలో చెడుగున్న వారికి, మనలో చెడుగు కానిపించును. అందుకు మనతప్పేముండును. తమలో మంచియున్న మనలో మంచియే కానిపించును. అందుకుమన ఒప్పేముండును. ఎవరితప్పులు వారివే కదా, కావున అన్నారని తిరిగి అని చెడకుడు, రెండు విధముల చెడుదుము. వీటిని మరువవలదు. ఇదేనిష్ట, ఇదేమంత్రము. ఇదే అమూల్యమైన యుపదేశము.

౧౦. భక్తి యనగా అనుటకాదు, వినుటకాదు, అనుకొనుటయు కాదు, తెలిసికొనుటకాదు. తెలియుట, తెలియుటే, అగుట, అగుటే నడుచుట.

౧౧. బిక్షమెత్తుకొని తినువాడెట్లు రాజు అనబడడో అట్లే ఇంద్రియ వృత్తులకులోబడు, నడత రాజయోగ మనబడదు.

౧౨. ఆకలి దప్పులు తీర్చుకొన ఇసుక రేణువంత, ఆధారము లేనివాడును, విధికిలోబడి వర్తించువాడును, సన్యాసి యనబడును.

౧౩. దొరలే దొంగలు, ఎట్లన దొరలెఅగుచో దాచుకొనుటేల? లోకమునకు లోబడువారందరు, దొంగలే. పరులను దొంగలను చేయునది మన సామానే, కావున దాచియుంచుటే గొప్ప దొంగతనము. దొరలే దొంగలకు యజమానులు. కనుక అట్టిశిక్షకు, పాపానికి బాధ్యులు దొరలే సుమా.

౧౪. నీవుచదివి యుపదేశించు చుందువు. దానిప్రకారము నీవు వర్తించనందుకు నీకు దుఃఖమురాదా? లజ్జకాదా? అసత్యముకాదా, నీవు వ్రాయునట్లు మాట్లాడునట్లు, వర్తించక పోయినచో, అసత్యము పాపము, సంభవించును.

౧౫. తన మాటనుబట్టి నడువలేని మానవుడు, మాయారూప మగు మనస్సును పట్టగలననుట, సిగ్గుగాదే? మాయనుబట్ట నేర్పునీతి సత్యములోనే గలదు.

౧౬. ఇచ్ఛ ఆనందపడునంతవరకు జన్మరాహిత్య మగుట కల్ల. ఇచ్ఛ పరులసొమ్ముచే చల్లారదు. ఆత్మ విచారముచే చల్లారును కావున సమస్త కోరికలను త్యజించుడు.

౧౭. ఋణబంధము తీరవలయునంటే, మనస్సు, మాట, చేత యొకటి కావలెను. భేదముండరాదు.

౧౮. మనలో లోకమున్నది, మనలోనున్న లోకమే వెలుపల నున్నది. దేవుడు కావలయునంటే మనలోని లోకము వెలుపలికి రావలయును. బయటిలోకమును లోనికి రానీయకుము. చెట్టుయొక్క ఆకులు ఫలములు లోపలినుండియే వెలుపలికి వచ్చును. కాని అవితిరిగి లోపలికి పోవుకదా, అట్లే ఈ దేహమొక మానవ వృక్షమె, కావున బాహ్యవిషయములను లోనికి పోనివ్వరాదు.

౧౯. మంచికార్యములను చేయుచున్నట్లు ఇతరులకు కనపడ నీయకుము. అదొకపాపమె. చెడ్డవాడని అపఖ్యాతి కలుగునని భయపడి ఏ కార్యములు చేయరాదు. కీర్తిప్రతిష్ఠలకు ఆశపడుటే పాపము.

౨౦. నీవు ఎంత, నీశక్తి ఎంత, కూర్చున్నపు డక్కరకు వచ్చు శ్వాస, నడుచునపుడు చాలదు. నడుచునపు డక్కరకువచ్చు శ్వాస, పరుగెత్తునపుడు చాలదు. ఇంతటి శక్తిహీనుడవైన, నీకు అహంకార మేల? విచారించుకొనుము.

౨౧. ఇతరులు, మనలను, ద్వేషించినా మనదోషమే. మనము ఇతరుల ద్వేషించినా మనదోషమే.

౨౨. ఏది చేయుటచే పాపమో, దేనిచే ఏలాటి ప్రయోజన ముండదో, అట్టి పనులను చేయరాదు. ఏది చేయకుండుటచే పాపమని

తెలియునో, ఆపనిని చేయుము. పుణ్యకార్యమైనను చేయవలెనని కోరిక గలిగి చేసినచో అదే కర్మబంధనమునకు కారణమగును.

౨౩. దొంగ, యజమానుని చూచుచు దొంగతనము చేయును. కాని యజమానుడు దొంగను చూచుచున్నాడని ఆ దొంగకు తెలియగనే ఆ దొంగ దొంగతనము చేయకనే పారిపోవును. అట్లే జీవాత్మ అంతరాత్మ చేయుచున్న పనులు, తెలియక చేయుచే, ఆత్మ జ్ఞానము కలిగెనేని చేయునది ఏమి యుండదు. తెలియక చేయుట, జీవాత్మ, తెలిసి తెలియక, చేయుట అంతరాత్మ, ఆత్మ, అఖండుడు. ఏది చేయదు.

౨౪. (1) జీవాత్మ, (2) అంతరాత్మ, (3) ఆత్మ, (4) పరమాత్మ,

(1) జీవాత్మ అనగా, ప్రకృతిబద్ధమైన జీవుడు. తన్నుతా తెలియక నడుచునది.

(2) అంతరాత్మ యనగా, విజ్ఞానమును, తెలిసికొనుట. తెలిసికొని నట్లు ఆచరించక పోవుట.

(3) ఆత్మ యనగా, తన్నుతా తెలిసినరీతి నడుచునది. ఆత్మ. ఈ మూడు విధముల మాయలేనిదే పరమాత్మ.

మొదటి రెండును జీవుడే. మూడవది, ఆత్మ, ఇదియే సత్యము. జ్ఞానము.

౨౫. నీభావమెట్లో అట్లేజగత్తు కనుపించును. నీలో ద్వేష ముండునేని, ఇతరులు నీకు ద్వేషులుగా కనిపించుదురు. ఇదంతా భావ ప్రపంచమే, అద్దములో ప్రతిబింబము కనుపించునట్లు నీ భావము ఎట్లుండునో అట్లే కనబడును.

౨౬. జాగ్రతలో మూడవస్థలు.

(1) తెలిసిన దానిని తెలిసినట్లాచరించునదే జాగ్రదావస్థ

(2) తెలిసియు ఆచరించక పోవుట స్వప్నావస్థ

(3) తెలియక పోవుచే సుషుప్త్యవస్థ

౨౭. ఈ ప్రపంచము ఒక మాయ. దీనిని భగవంతుడు సృష్టించ లేదు. మన సంకల్పములే సృష్టికి కారణములు. ఎవనికర్మలచే వాడు సృష్టించుకొనును. దీనికై భగవంతుని ప్రార్థించుటేల? ఆయనపై నిందమోపనేల? నీవు తప్పుచేసి ఇతరులను వేడుకొనుట న్యాయమా? మనము తెలియకవ్రాయు పొరపాటునకు వెలుతురునకెట్లు బాధ్యత లేదో అట్లే రక్షింపుమని ఎన్నిపూజలు చేసినను దేవునకు బాధ్యతలేదు. మనవ్రాతయొక్క పొరపాట్లను దిద్దుకొనుటకు జాగ్రత ఎట్లవసరమో, అట్లే మనమనో దోషములను, తొలగించుకొనుటకు సత్యమైన ఆచరణ అవసరము.

౨౮. క్రొత్తకర్మలను, చేయక పాతకర్మలనగా, ప్రారబ్ధకర్మల ననుభవించి తీర్చుటే, జన్మరాహిత్యము.

౨౯. నేనువిడిచితిని, చేసితిని, ఇచ్చితిని నేను అనేభావమున్నంత వరకు నీవు చేసినదంతయు దండుగే. యిచ్చినచో పుణ్యములేదు. ఈయనిచో పాపమని, ఇచ్చితివా, ఋణముతీరును.

౩౦. ఏకాకివై జీవించుము. శరీరముకూడా నీది కాదు. నీవువేరు నీశరీరము వేరు. దాని సాహాయ్యము కూడా వలదు దానిపై అధార పడకుము.

౩౧. నీది కానిది, ఏది నీవు వాడుకొనినను, ఆ ఋణమును తీర్చుటకు దానికి తగినజన్మ ఎత్తవలసియుండును. ఏలాటి ఋణమును చేయకుము. ఇతరులయొద్ద తినుట, ఇతరులచే సేవచేయించుకొనుట ఋణమే యగును. ఈ జన్మలో ఒకరికి ఒక దమ్మిడి బాకీయున్నా దానిని తీర్చుటకు జన్మతప్పదు సుమా!

౩౨. ఒకగుడ్డ యున్నవానిని చూచి రెండు గుడ్డలున్నవాడు సిగ్గుపడవలసినదే, ఇది దొంగతనము కాదా, అందుకనే ఇతరులు చూచెదరని దాచుకుందురు. దాచుకొనునదంతయు దొంగసొమ్మే.

ఇతరులకు లేనిది నీకెట్లు వచ్చెను? ఇతరులకంటె నీయొద్ద యెక్కువ యున్నదంతా ఇతరులదే కావున, ఎవరిది వారికిచ్చివేయుము.

౩౩. ఇచ్చేఅందుకె పుట్టినావు. తీసికొనేహక్కు నీకులేదు. విధికి లోబడి నడుచుటచే లోకముయొక్క ఋణము తీరును. లోక ఋణము ఎపుడు తీరునో అపుడే అన్నివృత్తులు రహితమై జన్మ రాహిత్యమగును.

౩౪. కూడబెట్టుట పాపము. చక్కెరకు చీమలు పట్టుచో వాటిని చంపకుము. అట్లు కూడపెట్టనిచో చంపుటెట్లు సంభవించును. ఇతరులను (రారా) అని పిలుచుటకూడా పరిగ్రహమే. ఎవరిచే దేనిచే సంబంధము లేనివాడే అపరిగ్రహము కలవాడు, ఎవరికి లేనిదానిని దేనినికూడ సంగ్రహించరాదు.

౩౫. ఇతరులు నీ ఆజ్ఞలోనుండి నీ కోరిక ప్రకారమే ఆచరించ వలెనని అభిప్రాయపడకుము.

౩౬. (1) సంసారమును, నిప్పును వాడినట్లు వాడుకొనుము. (నిప్పును చేతితో ముట్టకుండా, వాడుకొందుము గదా! అటులే సంసారమును అంటుకొనకుము.)

(2) భగవంతుని నీరునువాడినట్లు వాడుకొనుము. (నీరును ముట్ట కుండా వాడలేము కదా) అటులే భగవంతుని సదా విడువ కుండా స్మరించుచుండుము.

౩౭. ఆసక్తితో దేనిని వాడకుము. అనాశక్తిచే వాడుము. ఈశ్వరునియందు ఆసక్తి, సంసారముయెడ అనాసక్తి యుండవలెను.

౩౮. నీకు ప్రతిబంధకమైన పరాధీనమైన కర్మల చేయకుము. నీ మనస్సును కలవరపెట్టు కర్మల చేయకుము.

౩౯. బ్రతికియున్నపుడే చచ్చిచూడుము. జీవన్మృతుడవు గమ్ము. నాది, నేను, అనేది యుండరాదు. నేను లేనపుడు పునర్జన్మ

లేదు. ప్రపంచములోనిది, ఏదియు, నీది కానపుడు, మళ్లీ జన్మ ఎట్లుండును ? ఉండినను దేనియందుండును.

౭౦. నీవు దానము ఇచ్చినా, ఎవరికి తెలియకుండాయియాయుము. తీసికొనువారి మనస్సు నొవ్వకుండా యీయుము.

౭౧. లోకోపకారిననుట, అహంకారము. లోకోపకారమును చేయు మనస్సు లోకానిదే. కాని నీదికాదు. నిన్ను నీవు ఉద్ధరించుకోలేనివాడవు, లోకమును ఎట్లు ఉద్ధరించగలవు ?

౭౨. ఇతరులు తిట్టినారని నీవు వారి తిట్లను తీసికొనకుము. ఇతరుల సొత్తును తీసుకొనుచో పరిగ్రహ దోషమెట్లో అట్లే ఇతరులన్నమాటలను తిట్లను, తీసుకుంటివా, అనగా నన్నే అనినారని భావించితివా, పరిగ్రహ దోషమే సంభవించును. కావున వాటిని విషమువతుగా త్యజించుము.

౭౩. నిజమైన జ్ఞాని, నమ్రతగలిగి యుండును. డాంబికముండదు. తెచ్చుకున్న జ్ఞానము, వినిన జ్ఞానము కలవాడు, డాంబికుడు, అహంకారి యనబడును.

౭౪. ఎవరికైనా ఉత్తరము వ్రాయుచో మహారాజశ్రీ, రాజమాన్య, అని వ్రాయుదురు. దీని అర్థమేమో తెలిసికొనుడు. వారు రాజులచే పూజింపబడినవారేనా ? అట్లు కానిచో ఆ అబద్ధపు వ్రాతలు వ్రాయుచు, అసత్యులు కాకుడు.

౭౫. నిన్ను నీవు తెలిసికొనుట అనగా, రెండవవాడు లేనపుడు నీవు నేను అనేది యుండదుకదా, నేనని ఎవరితో చెప్పుకొనెదవు, కావున, నిన్ను నీవు తెలిసికొంటివా, ఐక్యమవుదువు. రెండు ఉండుటే భేదము. ఒకటి అఖండము, రెండవవాడు లేనిది నేను నాపేరు ఇది అని ఎవరితో చెప్పుకొనెదవు? అపుడు నీకు నీవే సాక్షివి.

౭౬. భుక్తిపై ఇచ్ఛలేనిచో, భక్తి కలుగును. భక్తివల్ల ముక్తి కలుగును.

౪౭. నీ సుఖము కొరకై ఎక్కువ ఖర్చు పెట్టకుము. రుచికై తినకుము. జిహ్వా చాపల్యము నిన్ను నశింపజేయును.

౪౮. వివాహమైన బిడ్డ, తల్లిదండ్రుల యందలి మమతను విడచి, భర్తను ప్రేమించి, తల్లిగారి ఇంటిని విడచి అత్తగారింటికి ఎట్లు పోవునో, అట్లే నీవు సంసారమునందలి మమతను విడచి భగవంతుని ప్రేమించుము. ప్రపంచమనే ఇహమును విడచి, నీ నిజ స్థానమగు పరమును జేరుము.

౪౯. తెలిసికొనుట మాయనే, తెలిసినట్లు చేయుటే జ్ఞానము. తెలిసినా చేయకుండుట అజ్ఞానము.

౫౦. కీర్తి, గౌరవముల పొందు తలంపుచే ఇతరులను బాగు చేయుదునని హామీ తీసుకొనకుము.

౫౧. నీ ఋణము తీర్చుకుంటివా ముక్తి దొరుకును. పుణ్యము చేసినను, జన్మ తప్పదు. పాపము చేసినను జన్మ తప్పదు. పుణ్య పాపములు రెండు లేనపుడే జన్మ యుండదు. కావున, సమస్త కోరికలను త్యజించి, తటస్థుడవు గమ్ము.

## ౨౧౯ శ్రీ పొత్తూరి రామరాజయోగి

౧. విసర్జించిన కార్యమును తిరిగి స్వీకరింపకుము.

౨. మొదట జిహ్వాచాపల్యమును జయించుము. సత్యమును, ధర్మమును, ఇతరులకు భయపడి విడువకుము.

## ౨౨౦ శ్రీ యోగిరాజ్ శివానంద్ సరస్వతి

౧. అంతర్‌దృష్టి గలవాడవై నీలోనున్న ఆత్మను తెలిసి కొనుము.

౨. మనస్సుయొక్క విజయమే సంసార విజయము. మనస్సును జయించితివా ఆత్మదర్శన మగును.

౩. ఆత్మజిజ్ఞాసుడు నిర్భయుడగుట ముఖ్యము. ఆశ లేనివాడే నిర్భయుడు కాగలడు.

౪. నీ జన్మకు నీ కర్మలే కారణము. కావున, ప్రతికర్మ వివేకముచే, ఆత్మబోధన ప్రకారమే చేయుము.

౫. నిన్ను నీవు సంపూర్ణ విశ్వాసముచే బాలునివలె నిర్మల మనస్సు గలవాడవై ఈశ్వరునికి సమర్పించు కొంటివా, వెంటనే సమస్త దుఃఖములు నశించును.

౬. సమస్త జీవులలో ఈశ్వరుడు గలడనే భావముచే అన్ని జీవులను ప్రేమించి సేవించుము. ప్రతిపనిని పూజాభావముచే చేయుచుండుము.

౭. ఈశ్వరుని విధానమునకు భిన్నముగా ఏపనిని చేయకుము. అహంకారమును త్యజించుము.

౮. నీవేపనిచేసినా, నేను, నాది, అనే భావ ముండరాదు. లోపలనున్న భగవచ్ఛక్తియే ప్రతిపని చేయుచున్నది. చేయించుచున్నదని, జ్ఞాపక ముంచుకొనుము.

౯. దేహాభిమానము వల్లనే జగత్తు సత్యమని తోచును. నీలో ఏభావ ముండునో, బాహ్యమున అదే కనుపించును.

౧౦. ఈశ్వరాజ్ఞ ప్రకారము వర్తించితివా ముక్తుడవే. నీ ఇష్ట ప్రకారము వర్తించితివా బద్ధుడవే.

౧౧. నీలో ఎన్ని సంకల్పములు పుట్టినా భయపడకుము. వాటిచే నీకేల సంబంధము. వాటి ననుసరించక తటస్థముగా నుంటివా వాటంతటవే నశించును.

౧౨. "నీవు నావాడవైనచో, నేను నీవాడనే," అను దైవ వాక్యమును మరువకుము. నేను, నేను, అను అహంకారమును వదులుము.

౧౩. నీవు ఏజీవితో ఎట్లాచరించెదవో అట్లే అది ఈశ్వరుని జేరును. సర్వము బ్రహ్మమయమే. నీవేమి చేయుదువో ఏమి విచారించెదవో అది తిరిగి నిన్నే చేరును. ఇది గూఢమైన రహస్యము. జాగ్రత్త! మరువకుము.

౧౪. సమస్త విషయ వాసనలను త్యజించి, ఏ కోరికలు లేక, నిశ్చలుండవుకమ్మా.

## ౨౨౧ తపస్వీ అబూ ఉస్మాన్ హైరి

౧. రేపటికై చింతించక, ఏలాటి ప్రయత్నము చేయక, నిశ్చలుడై ఈశ్వరుని ధ్యానించుచుండువాడే ముక్తుడు. సంసార సుఖమునందాశ యుండు నంతవరకు ఈశ్వరునియందు ప్రేమ కలుగదు.

౨. ఈశ్వరునితప్ప ఇతరులపై ఆధారపడకుము. ఇతరులచే ఏదియు కానేరదు. ఈశ్వర ప్రేమయే నిన్ను ఈశ్వరుని జేర్చును.

౩. ధనకాంక్ష, లోభము, కీర్తి, ప్రతిష్ఠల యందలి కాంక్ష ఈ మూడు నీకు శత్రువులు. కావున వీటిని వెంటనే త్యజించుము.

౪. ఇతరులను తిరస్కరించుట, వారిని నీకన్న తచ్చుగా దలంచుట, ఇవి గొప్పవ్యాధులు సుమా! అహంకారపడకుము.

## ౨౨౨ తపస్వీ అబుల్ హుశేన్ అలి

౧. ఎంతవరకు నీ మనస్సు సంసారమందుండునో, అంతవరకు నీవు ఈశ్వరునికి దూరస్థుడ వగుదువు.

౨. ఈశ్వరునికి మించినది ఈ జగత్తులో వేరేమీ లేదని భావించి సమస్త సంసార సుఖభోగములను తృణప్రాయముగా దలంచి, ఈశ్వరుని నమ్మి భజించితివా, ఈశ్వర ప్రకాశము నీలో ఉదయించును.

## ౨౨౩ తపస్వీ షాహషుజా

౧. సంసార సంబంధమైన కీర్తి, ప్రతిష్ఠలకు ఆశపడకుము. బంగారమును, మట్టిని, సమముగా దలంచుము. భేదభావ ముండరాదు. ఇతరుల దృష్టి నీవైపు ఉండనటువంటి వర్తనలనే ఆచరింపుము. నిందాస్తుతులకు లోనుగాకుము. నీహృదయములో లౌకిక విషయములపై ఆశ యుండరాదు. కామములను పూర్తిగా త్యజించుము.

౨. పరనిందాత్యాగము. నిర్మల సంతోషము, ఈశ్వరుని ఆజ్ఞాపాలనము, ఈ మూడింటిని పాలించితివా మోక్షము తప్పదు.

## ౨౨౪ తపస్వీ ఇబ్రాహిం అహమద్

౧. నీవు, నీ ధనమును, సద్గుణములను, బంధించి యుంచితివి. వాటిని లోకసేవకై వినియోగించుము. కామ, క్రోధ, లోభ, మోహాది శత్రువులను, విచ్చలవిడిగా విడిచితివి. వాటిని వెంటనే బంధించుము.

## ౨౨౫ తపస్వీ హైహాయా

౧. విత్తనమును పెట్టుట నరకమునకు. ఫలమును ఆశించుట స్వర్గమునకు. ఇదెట్లు సంభవించగలదో మీరే ఆలోచించుడు.

౨. విరాగి, అనురాగి, కర్మయోగి, ఈమూడు ముఖ్య సూత్రములే.

౩. రోగము సంభవించినపుడు, దానికి భయపడి, అన్నమును తినడు, కాని, మృత్యువు సమీపించినను దానికి భయపడక పాపకర్మలను చేయుటకు వెనుదీయడు. ఇంత అన్యాయ మెందులకో, మీరే విచారించుకొనుడు.

౪. సావధానుడవుకమ్ము. ఈ సంసారము సైతానుయొక్క దుకాణము. ఈ దుకాణమునందలి ఏవస్తువునైనను నీవు కోరిక

గలవాడవై తీసుకొనెదవేని ఆ సైతాను నీవెంటబడి నీయొద్దయున్న ధర్మములను లాగుకొని నిన్ను నాశనము చేయును.

౫. సంసారమునందలి ఆసక్తిని త్యజించి మృత్యువునకు పూర్వమే, సంతోషముగా సిద్ధపడియుండి, ఈశ్వరుని గనుగొనుటకు తహ తహ పడువానికి మోక్షము సిద్ధించును.

## ౨౨౬ తపస్వీ ఫజల్ అయ్యాజ్

౧. ఇతరులపై బాహ్యమునకు ప్రేమ చూపించుచు, హృదయములో శత్రుభావ ముంచువాడు, మహాపాపి, వానికి, నరక ప్రాప్తి తప్పదు.

౨. సంసారములో ప్రవేశమగుట సులభము. కాని. దాని నుండి విడబడుట మహాకష్టము.

౩. ఎవడు, నేను, లోకసేవకుడను, నేను జ్ఞానినని తలంచుచు అహంకారపడునో వాడు, పాపాత్ముడు.

## ౨౨౭ తపస్వీ జునూన్ మిసరి

౧. అన్నిటికంటె ముందు అభిమానమును త్యజించుము. గొప్పతనమునకును, లోకకీర్తికిని, ఆశపడకుము.

౨. అధముడెవడు? ఈశ్వరుని మార్గమున నడువనివాడు. సంసారము నిన్ను ఈశ్వరునినుండి వేరుచేయును. జాగ్రత.

౩. ధర్మపాలనములో, ధ్యానములో లౌకికవ్యవహారము లుండుట, హానికరము.

## ౨౨౮ తపస్వీ హుసేఇబస్రాయి

౧. విషయలోలుడు మృత్యుసమయమున ఈక్రింద వ్రాయ బడిన వాటిని స్మరించుచు, పశ్చాత్తాపపడును. ఇంద్రియములు తృప్తి

బడకపోయెను, ఇంకా భోగించనై తిని, మనస్సులోఉన్న ఆశలన్నియు పూర్తి గాకపోయెనే, అపుడే మృత్యువు వచ్చెను. పరలోకమునకు నావెంట తీసుకపోవుటకై మంచిదేదియు లేకపోయెను కదా! నేనిపుడేమి చేయుదును? నాకు దిక్కెవ్వరని దుఃఖించును.

౨. మనుష్యులకంటె మేకలు, గొఱ్ఱెలు మంచివి. ఎందుకన, గొర్లకాపరి కేకవేయగనే, తినేగడ్డిని తాగేనీరును విడచి, కాపరివైపు పరుగెత్తును. కాని మానవులు, ఎన్ని పురాణములు వినినను, ఎందర మహాత్ముల యుపదేశములను వినినను, వాటిని ఆచరించక, సంసార కూపములోబడి నశించుచుందురు.

౩. నీవు మృతినొందిన తదుపరి లోకులు నీగురించి ఏమను కొందురో, కాస్త నీలోనీవు విచారించుకో, ఎందరినో మృతినొందిన వారిని చూచితివి, ఇంకా నీకు బుద్ధిరాలేదా? నీమనస్సు వేదనపడుట లేదా? నీచిత్తమే నీకు ప్రతిబింబమై కానుపించుటలేదా? నిదానించి, నీలోనీవు చూచుకొనుము.

౪. వాసనలను, ఈర్ష్యను త్యజించితివా, ముక్తి లభించును.

## ౨౭. తపస్వీ జున్నేద్ బగ్దాది

౧. ఎవని ఇంద్రియములు ఈశ్వరాజ్ఞకు భిన్నముగా వర్తించునో, వానికి ఇంద్రియములు లేకుండుటే మేలు. కన్నులు చెప్పినమాట విననిచో గ్రుడ్డివాడగుట మేలు కదా! ఇట్లే ఏ ఇంద్రియములు ఎవనికి లొంగవో వానికి అవిలేకుండుటే మంచిది.

౨. ధనమునకై ఆశపడి పరువులెత్తకుము. అది నిన్ను నాశనము చేయును. గడచిన కాలము తిరిగిరాదు. కావున, వృధా కాలమును గడపకుము. నిన్ను మృత్యువు సమీపించు చున్నది. ఆలోచించుకొనుము.

౩. అహంభావమును విడచి, విపత్తులను, దుఃఖములను, సంపత్తులనుగా భావించువాడే సంతోష మనబడును.

## ౨౩౦ తపస్వీ యూసుఫ్ హుసేన్‌రయీ

౧. ఎవడు ఈశ్వరుని భక్తుడో వాడు తనను ఇతరులు అవమానించినను సంతోషించి వారిని ప్రేమించి సేవించవలెను. అది ఈశ్వర మహిమ, పరీక్ష; కాన ఇందులో నెగ్గవలెను.

౨. నీవు చేయు పూజ, భక్తి, ధ్యానములు ఇతరులకు తెల్యరాదు.

## ౨౩౧ తపస్వీ అబూహసన్ కర్కని

౧. ప్రజలకు చెప్పుకొని దుఃఖించుట మంచిదికాదు. భగవంతునకు మొరపెట్టుకొనుము. నీ దుఃఖములను ప్రజలు తీర్పరు. ఈశ్వరుడే తీర్చును.

౨. నీయొక్క శరీరమును, మనస్సును, ధనమును, ఈశ్వరునికి సమర్పించిన నాడే, ఈశ్వరుడు నిన్ను ప్రేమించును.

౩. ప్రభువును ప్రేమించువానికి ప్రభువు దర్శనమగును. తన్ను తాను మరుచును, అహంకారము నశించును.

## ౨౩౨ తపస్వీ అబూబకర్ వాస్తి

౧. ఏమానవుడైనా గర్వము గలవాడై ప్రజలఎదుట తన గొప్పతనమును చూపించుకొనునో, వాడు తన గౌరవమును, జ్ఞానమును నశింపచేసికొనును.

౨. విధాతయొక్క విధానమునకు వ్యతిరిక్తముగా వర్తించకుము. సంసారముయొక్క పదార్థములను సంపాదించుటకంటె పరమాత్మను ప్రాప్తము జేసుకొనుట సులభము.

౪. ఎచట ఉపదేశ మధిక ముండునో, అచట గంభీరము తచ్చుండును. ఎచట గంభీర మధికముండునో, అచట ఉపదేశము తచ్చుండును.

## ౨౩౩ తపస్వీ అహమద్ అంతాకి

౧. ఎవడు అభిమానము గలవాడై, నీతివంతుడను, ధర్మాత్ముడను, పరోపకారిని అనుచు తన్నుతాను పొగడుకొనునో, వాడు పాషండుడు. మూర్ఖుడు.

౨. ఎవడు దేనిని యుపదేసించుచు దాని ప్రకారము ఆచరించడో వాడు, లోకనాశకుడు.. ద్రోహి.

౩. సదాచారుడవుకమ్ము, ధర్మయుక్తుడవై, ఇతరులను న్యాయశీలుర చేయుటకు ప్రయత్నించుము.

## ౨౩౪ తపస్వీ సహల్ తస్తురి

౧. మితముగా, ఆకలికంటె తచ్చుగా భోజనము చేయుము. రుచులకై ఆశపడి మితిమీరి తిని, చెడిపోకుము.

౨. ప్రపంచములోని, కీర్తి, ప్రతిష్ఠలకై ప్రాకులాడుట, దరిద్రుడ నగుదునని భయపడుట, ఈ రెండును, మానవుని, నశింప జేయును.

౩. ధన సంచయమును చేయక, ఈశ్వరేచ్ఛలోనే సంతోషించు వానికి ముక్తికలుగును.

౪. భగవంతునిపై భక్తిగలవాడు ఇతరులను యాచించడు. ఇచ్చినాతీసుకొనడు, తీసుకొనినా ఇతరులకిచ్చును.

౫. ఆత్మసమర్పణ చేయనిదే ఈశ్వరునియందు భక్తికుదరదు. స్వార్థత్యాగము చేయనిదే ఆత్మ సమర్పణ కానేరదు.

## ౨౩౫ తపస్వీ మారూఫ్ గోర్ఖి

౧. నీవు ఎన్నడైనా, ఏమానవునైనా, ఏవస్తువును అడుగకుము. నీయొద్దనున్న పదార్థములను ఇతరులు కోరినచో వాటిని వారికి యిచ్చివేయుము. ఇతరులు కోరునట్టి పదార్థములను నీయొద్దనుంచుకొనకుము. దాచుకొనుబడు పదార్థములను నీయొద్ద నుంచరాదు. దాచుకొనుటే పాపము. జాగ్రత.

## ౨౩౬ తపస్వీ సరీసక్తి

౧. ప్రాణమును నిల్పుటకు సరిపోవునంతే అన్నము, దప్పికి సరిపోవునన్నే నీళ్లు, మానమును కాపాడుటకు సరిపోవునంతే బట్ట, నివాసమునకు సరిపోవునంతే ఇల్లు చాలును. ఇంతకంటే ఎక్కువ రేపటికని దాచుకొనేవాడు, దొంగ. వానికి ఈ పాపము తప్పదు.

౨. నోటినుండి అన్నట్లు ఆచరించని వాడు, మోసగాడు. దోషములను కనిపెట్టి వెంటనే వాటిని త్యజించుము.

## ౨౩౭ తపస్వీ అబూఈసాక్ ఇబ్రాహీం ఖౌయ్యాస్

౧. ఎవడు ప్రజలఎదుట ఈశ్వరునిగురించి వేదాంతము చెప్పుచు, తన హృదయములో ప్రజలచే గౌరవ, మర్యాదలను పొందవలెనని ఆశకలిగి యుండునో వాడు మహాపాపి, పతనమగును.

౨. ఎవడు, నేనుత్యాగిని, భక్తుడనని ప్రజలకు చెప్పుచు, వారిని మీరు చెడ్డవారు,చెడుకార్యములు చేయువారు,నామాటను వినుడనుచు తిరుగు వానియందు ప్రజలకు నమ్మకము తగ్గి తుదకు, దుఃఖముల, పాలై నశించును. కావున, దంభమును అహంకారమును విడువుడు.

## ౨౩౮ తపస్వీ బషాద్ హాపి

౧. ప్రజలు నాయోగ్యతను గుర్తించరు, నేనుచెప్పినట్లు వినరు. వినినచో బాగుపడుదురు.ఇట్లనుకొనువాడు అభిమానముచేపతనమగును,

౨. నీకు దరిద్రదశ సంభవించినను, ఉదారస్వభావము కలిగి యుండుము. వైరాగ్యమునే అనుసరించుము. దేనికి భయపడకుము.

౩. ప్రతిక్షణము, నీలోనీవు సూక్ష్మముగా విచారము చేయు చుండుము. నీలో ఏదైన సందేహము కలిగెనేని దానిని త్యజించుము. ఈ రెండింటిని ఆచరించితివా, ఇవే నిన్నుద్ధరించును.

౪. ఆహారమును, నిద్రను, అయినంతవరకు తగ్గించుము.

## ౨౩౯ తపస్వీ యూసుఫ్ (అస్‌బాత్)

౧. ఇతరులు చెప్పనిదే వారిని పదేపదే అడుగకుము. అడుగనిదే చెప్పకుము. ఎక్కువ మాట్లాడకుము. పిలచితేనే పలుకుము.

౨. గౌరవ సన్మానములకై ఆశపడకుము. 'నేను చేసితిని' 'నేనే గొప్పవాడ'ననే అహంకారమును త్యజించుము.

౩. ఏపని చేయుటచే లజ్జ అనిపించునో దానిని వెంటనే త్యజించుము.

## ౨౪౦ తపస్వీ అబూబకర్ (ఈరాక్)

౧. ఎంతవరకు నీవు సంసారాసక్తిని నిర్మూలము చేయవో అంత వరకు ఈశ్వరప్రాప్తికై ఆశవదలుకొనుము.

౨. ఈశ్వరాజ్ఞ ప్రకారమే ఆచరించుచు, సమస్త జీవులను ప్రేమించుచు, నీయొద్దనున్న ధనసంపత్తులను లేనివారికీయుము.

౩. నీమధ్య ఈశ్వరుని మధ్య ఏసాధనలుండునో వాటిని పవిత్రములుగా తలంచి, సదుపయోగము చేయుము. నీకు ప్రాప్తించిన వస్తువులను ఈశ్వరప్రీత్యర్థము వినియోగించుకొనుము.

## ౨౪౧ తపస్వీ అబూబకర్ (కేతాని)

ప్రాయశ్చిత్తము ఆరు విధములు. 1. పూర్వము చేసిన పాపములకై ఖేదము. 2. తిరిగి పాపములు చేయకుండుటకై ప్రతిజ్ఞ.

3. ఈశ్వరభక్తిలో లోపమున్నచో దానిని పూర్తిచేయుట. 4. ఇతరుల కపకారము చేసినచో, ప్రత్యుపకారముచేసి వారిని క్షమాపణ కోరుకొనుట. 5. సుఖభోగములవల్ల పెరిగిన శరీరమును తపస్సువల్ల క్షీణింపజేయుట. 6. నీ మనస్సు ఎన్నో పాపవిచారములు చేసియున్నది, ఆ మనస్సును సాధనలద్వారా నిర్మలముచేసి ఆత్మవైపునకు మరలించుట. ఈ ఆరు ఉపాయములచే నీవు ఉద్ధరింపబడుదువు.

## ౨౪౨ తపస్వీ మహమ్మదు అలి, హకీంతిర్మీజీ

౧. ఉన్నతుడెవడు? ఎవడు పాపములకు లొంగడో, ముక్తుడెవడు? ఎవడు సంసార సుఖభోగములకు దాసుడుకాడో.

౨. అసురీవృత్తులను జయించినవాడే వీరుడు. ఈశ్వర ప్రాప్తికై ఏకనిష్ఠగలవాడే జ్ఞాని.

౩. వైరాగ్యములేని జ్ఞానోపదేశము వ్యర్థమే. వైరాగ్యములేనివాడు జ్ఞానోపదేశము చేయుట తప్పు.

౪. ఎవని దృష్టిలో జన్మమృత్యువుల భేదములేక సమముగా దలంచునో వాడు నిజమైన సాధువు.

## ౨౪౩ గురునానక్

౧. ఆకలిగొన్నవారికి లేదనక అన్నము పెట్టుము. వారికి స్వయముగా సేవచేయుము. ఇతరులచే చేయించకుము.

౨. గుళ్లు గోపరాలకడకు వృధా తిరగడములో మతము లేదు. వివిధతీర్థ స్నానాలలో మతములేదు. ప్రాపంచిక, కలుష కల్లోలములమధ్య, నిష్కల్మషుడవై నివసించుచు, సమస్త జీవులను సమముగా ప్రేమించుటే, పరమావధి.

౩. దేవతలయొక్కయు, భూతములయొక్కయు దాస్యముల నుండి విముక్తులై, సర్వసృష్టికర్త పరాత్పరుడొక్కడేయని విశ్వసింపుడు.

౪. పవిత్రాచరణ, ఓర్పు, దైవభీతి, ప్రేమ, ఇవి ప్రతి మానవుని ముఖ్యధర్మములు.

౫. హృదయమునకు లోభము, జిహ్వకు అనృతము, చెవికి పరనింద, ఈ మూడు దోషములే, కావున చెడుతలంచకుము. చెడు చెప్పకుము. చెడు వినకుము.

౬. స్వయముగా కష్టించి సంపాదించిన అన్నమును తినుట పవిత్రము. ఇతరులు కష్టించి సంపాదించిన అన్నమును తినుట అపవిత్రము. దరిద్రుల అన్నము పవిత్రము. ధనవంతుల అన్నము అపవిత్రము. ఎందుకన దరిద్రులు కష్టించి జీవింతురు. ధనవంతులు ఇతరుల కష్టార్జితములపై జీవింతురు. అపవిత్రమైన అన్నమువల్ల చిత్తశుద్ధికలుగదు.

౭. ధనము, స్త్రీ, కీర్తిప్రతిష్ఠలు, మొదలగువాటి యందలి మమతచే మానవుడు పతితుడగుచుండును.

౮. నీ వెవడవు, నీదేజాతి, అని భగవంతుడు అడుగడు. కాని, నీవేమి చేసితివని అడుగును. జాగ్రత.

## ౨౪౪ గురు రామదాస్

౧. దైవభీతి యుండవలెను. పరభీతి యుండరాదు. పాపాత్మునికి భయముండును. పుణ్యపురుషునకు భయముండదు.

౨. పరుల హక్కులను, వారి అక్కరలను తీర్చుడు, వారికి సేవచేయుడు.

౩. న్యాయముగా ఆర్జించుచు, నిరాడంబరముగా జీవించుచు, స్వల్పముగా వెచ్చించుచు, అధికముగా దానమిచ్చుచు, జీవితములను గడుపుడు. స్వార్థమును వీడుడు.

## ౨౪౫ గురు హర్రాయి

౧. దైవాయుధమును ధరించువాడు, దైవమువలె ఖచ్చితముగను, పవిత్రముగను, దయగలవాడై కోమలహృదయము గలవాడై యుండవలెను. తుదకు ఒక గడ్డిపోచకైనా హాని కలిగించరాదు.

౨. మానవుని హృదయమునకు, ఆవేదన కలిగించరాదు. భగ్నమైన దేవాలయములు, మసీదులు, బాగుచేయవచ్చును. కాని, విరిగిన మనస్సును తిరిగి అతికించరాదు.

[ఒకరోజు, వీరు ఎటో పోవుచుండగా, వీరు కట్టుకున్న ధోవతి ఒక పుష్పమునకు తగిలి ఆపుష్పము క్రిందపడినందున, ఆవేదనపడి, కన్నీళ్లు కార్చి, అప్పటినుండి బట్టలను క్రిందికి జారనీయక పైకితీసి కట్టుచుండెను. లోకములో దేనికిని, హాని చేయరాదని, తీర్మానించుకొనెను.]

## ౨౪౬ గురు అర్జన్

౧. మానవునికి ఏమియు లేకున్నను, హృదయములో దైవప్రీతియున్నచో, విశ్వమునకు పేరెన్నికగల ప్రభువగును.

౨. నీకు యుండబడే యావదాస్తిని త్యజించుము. సమస్త పుణ్యములకు స్వార్థత్యాగమే, పునాది.

౩. బాధానుభవము లేనిదే పుణ్యాకర్మ అసంభవము. విత్తనము యొక్క రూపు, మాయనిదే చెట్టు మొలువదు. కష్టపడనిదే సుఖము దొరుకదు.

౪. జీవితమందలి కాంక్షను త్యజించుము. మరణమునకై సిద్ధముగా నుండుము.

౫. ఎన్ని దుఃఖములు సంభవించినను, జీవితమే దుఃఖ భూయిష్టమని విలపించకుము. దైవము కలడని విశ్వసించి, సంతోషించుము.

## ౨౪౭ గురు అమర్‌దాస్

[వీరు నిరాడంబరులు. ఒకపూటకు సరిపోవు తినుబండారములను ఒక బట్టలజతను మాత్రమే యుంచుకొనువారు. ఇతరులు తిట్టినను, తన్నినను, వారిని ప్రేమించెడివారు.]

౧. ఎవని హృదయము ప్రేమమయమో, వాడే జీవన్ముక్తుడు. ఇంద్రియ నిగ్రహము కలిగి సత్యాన్వేషణ చేసిన చాలును.

౨. విద్యాగర్వములేని, పాండిత్య ప్రకర్షణ భావనసభావము లేని సేవ ఉత్తమము.

## ౨౪౮ గురు హర్‌కృష్ణ

౧. ఎవడు భయరహితుడో, ఎవనిచే ఇతరులకు భయము కలుగదో, అట్టివాడు మానవులలో కెల్ల మహిమాన్వితుడు.

## ౨౪౯ గురుగోవింద్

౧. ఒకరు మరొకరికి ఏలాటి హానిచేయరాదు. ఇది పరమాత్ముని ఆజ్ఞ.

౨. నేడో, రేపో, అనుచు ఆలసించకుడు. కాలము పరుగెత్తు చున్నది. వర్తమాన కాలముననే, మీ కర్తవ్యములను పూర్తి చేసు కొనుడు.

౩. జీవితమును ప్రేమమయ మొనర్చి సదా ప్రేమతో వర్తించు వాడే, స్వర్గము నారోహించును.

౪. శారీరకబాధ ననుభవించు చున్నప్పటికిని దైవప్రేమను వదలనిచో దైవప్రాప్తి కలుగును.

౫. శత్రుమిత్రులను సమముగా ప్రేమించుడు. భేదభావ ముండరాదు.

౬. యుద్ధ సమయములో ఒక సిక్కు సిపాయి, శత్రు సిపాయీలకును, తమ వారికిని, మంచినీరు యిచ్చెను. నీవేల ఇట్లు చేసితివని ఒక రడుగగా, మేము మానవులతో పోరాడుట లేదు. వారి మనస్సులోని దుర్మార్గగుణములతోనే పోరాడుచున్నా మనెను.

## ౨౪౦ గురు శ్రీ సమర్థరామదాసస్వామి

౧. ప్రజల ఎదుట ఏది చెప్పుదువో, అదియే నీవు ఆచరించ వలెను. మనో వాక్కాయ కర్మలకు భేదముండరాదు.

౨. తాను చెప్పునదే సత్యమని, నేనే జ్ఞానినని, తలంచువాడు మూర్ఖుడు. ఇతరుల మేలును సహించుము.

౩. ఇతరులయెడ అసూయపడకుము. వారిలో లోపములుండు నేని, వినయముగా ప్రేమచే వాటిని సవరించుము.

౪. నీవేది కోరుదువో ఇతరుల కదియే కోరుము. నీకు మేలు చేసినవారిని మరువకుము. విశ్వాసఘాతకుడవు గాకుము.

౫. నీవల్ల ఇతరులకు విచారము, కష్టము, నష్టము, కలుగ నీయకుము. నీ భారమును ఇతరులపై పెట్టకుము.

౬. ఇద్దరు మాట్లాడునపుడు వారి మధ్యన మాట్లాడకుము. అడుగనిదే చెప్పకుము.

౭. మిగుల భుజింపకుము. మిక్కిలి నిదురింపకుము. పగలు నిద్రింపకుము. నీళ్లలో ఉమ్మి వేయకుము.

౮. రుచిగల భోజనములకై ఆశించకుము. కష్టము చేయక లభించిన అన్నమును, పెద్దలు పెట్టినను, తినకుము.

౯. నీవు చేయు చెడుపనులకై లోకమేమనుకొనునో యని, సిగ్గుపడుము. లోలోన తప్పుడుపనులు చేయుచు బయటకు శ్రీరంగ నీతులు చెప్పుట మహాపాపము.

౧౦. దేహాభిమానమును విడచి, విరాగివై, విషయసుఖములను త్యజించుము.

౧౧. ఇతరులు నిన్ను నిందించినను, వారలను ప్రేమించి వారికి మేలుచేయుము. నీ పనికంటె ఇతరుల పనియెడ ఎక్కువ శ్రద్ధ వహించుము.

౧౨. ఎల్లపుడు ఆత్మానాత్మ విచారము చేయుచు నే నెవడను, నేనేమి చేయుచున్నానని, ఆలోచించుచుండుము.

౧౩. విరక్తుడవై, వివేకముచే ఆధ్యాత్మిక విద్యను లోకము నందు ప్రచారము చేయుచుండుము.

౧౪. ఇతరులను, ఆనందపరుచుటకై కల్లలాడకుము. తుదకు కలలోనైనను, అసత్యమాడరాదు.

౧౫. కీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడి చెడిపోకుము. పరాధీనమైన బ్రతుకు బ్రతుకకుము.

౧౬. విషయ వాసనలచే నిండియున్న సంసార భారమును నెత్తిపైన వేసికొని, నాది, నాది, అనుచు మొత్తుకొనుట మూర్ఖత్వము కావున, సమస్తమును భగవదర్పితముచేసి, నిశ్చలుడవై స్మరించు చుండుము.

## ౨౫౧ భక్త ప్రహ్లాదుడు

౧. ప్రపంచములోగల జడవస్తువులు, గాలిచే ఎట్లు చలించునో, అట్లే ఈ శరీరములోనుండు ఇంద్రియములు జీవుడనే గాలిచే నడుచుట, మాట్లాడుట మొదలగు కార్యములు చేయుచుండును. కావున, ఈ శరీరమును నేనుగాను, ఇదివేరు, నేనువేరు. ఈ శరీరమునుండి జీవుడనే గాలి వెళ్లిపోగానే, శరీరము జడమగును నశించును. ఇంద్రియములు చేయుచున్న పనులను నేను చూచుచున్నాను. కావున ఇంద్రియములు వేరు, నేను వేరు. నేను కేవలము సాక్షిమాత్రుడను.

౨. నేను సాక్షిని, నాచే దృశ్యములగు పదార్థములు, నాకెట్లు వికారములు గలిగింపగలవు ? ఇంద్ర జాలకుడు ఇంద్రజాలముచే, చేయుచున్న క్రియలు ఆ ఇంద్రజాలకుని ఎట్లు భ్రమపెట్ట నేరవో, అట్లే ఇంద్రియములచే జరుగుచున్న క్రియలు ఆత్మను భ్రమపెట్ట నేరవు. ఆత్మ సాక్షిమాత్రుడై చూచుచుండును. వాటికి లోనుగాడు. ఆత్మయొక్క సాహాయ్యము వలననే సమస్తేంద్రియముల క్రియలు జరుగుచుండును. కావున ఇంద్రియములే నేనని భ్రమింపకుము.

౩. క్షణకాలములో కన్పించు యాసక్తి కంతమును, నరుడు జన్మశతములనైనను గాంచనేరడు. కావున సమస్త విషయవాసనలను, త్యజించి కేవలము పరమాత్మనే నమ్మి సదా స్మరించుచుండుము.

## ౨౫౨ భక్తరాజ్ ధ్రువుడు

౧. శవతుల్యమైనట్టి ఈ శరీరముద్వారా, భోగములను అనుభవించు ఇంద్రియ విషయముల సంపర్గమువల్ల యుత్పన్నమగు సుఖముచే మానవులకు నరకమే ప్రాప్తించును కదా. కావున, మానవజన్మ జన్మరాహిత్యమునకై సంభవించినదని మరచి విషయాసక్తులై సంసార చక్రముచే బంధింపబడుచున్న మానవులెంత వెఱ్ఱివారు ? ఆలసించక ఇకనైనా జాగ్రత్తపడుము.

## ౨౫౩ శ్రీ భృంగీశ్వరుడు

౧. రాగద్వేషముల నొందక, సుఖదుఃఖముల నాశ్రయించక, ధర్మాధర్మముల పాటింపక, సిద్ధికి సంతోషింపక అసిద్ధికి దుఃఖపడక, ఎవడు కర్మల నాచరించునో వాడు మహాకర్త యనబడును.

౨. ఏ పదార్ధమునుగాని ద్వేషింపక, దేనిని కోరక, ఎప్పటికేది సంభవించునో అదిమంచిదైనను, చెడ్డదైనను, దానిని నిర్వికార చిత్తముచే ననుభవించువాడు మహాభోక్త యనబడును.

౩. సమస్త కోరికలను, సర్వవిధముల ఆటంకములను, సుఖ దుఃఖములను, ధర్మాధర్మములను, దృశ్య ప్రపంచమును సంపూర్ణముగా మనస్సుచే విడుచువాడు మహాత్యాగి యనబడును.

౪. సంసారముచే సుఖింపదలచువానికి, నే నెవడను, ఈ ప్రపంచ మెయ్యది, పరతత్త్వమెద్ది, భోగములచే నేమి ప్రయోజన మను తలంపే శ్రేష్ఠమగు తరుణోపాయము.

## ౨౫౪ శ్రీ సంజయుడు

౧. ఇంద్రియములను జయించుటకు సమస్త భోగములను త్యజించుట ముఖ్యము. ఇంద్రియములను నీ స్వాధీనములో నుంచు కొనుము. ఇది నీ విధి.

౨. ధనతృష్ణయే బంధనమునకు కారణము. ధనతృష్ణ వలన ధర్మమును కాపాడుటకై ధనమును సంగ్రహించకుము.

## ౨౫౫ శ్రీ మాతలి

౧. ఇతరుల అన్నము తినకుము. నీవు కష్టపడి సంపాదించియే తినుము. ఇతరుల అన్నము తిని, నీ వే.కార్యము చేసినను, అకార్యము యొక్క సగఫలము ఆ అన్నదాతకు చెందును. ఇది తప్పదు.

౨. మానవుడు తనలోని దోషములు తెలిసియు, శరీరములోని దుర్గంధములను ఆఘ్రాణించుచు, కంటిచే మైలను చూచుచుకూడా, విరక్తుడు కాకపోవుట ఎంత వెర్రితనము ? దీనికి మోహమే కారణము. కావున సమస్త విషయ వాసనలను త్యజించుము. దీనికై ధన సంగ్రహమును త్యజించుట ముఖ్యము. సంగ్రహించుట మహాపాపము.

## ౨౫౬ భక్త విదురుడు

౧. శమము, శాంతము, గలవానిని, ఏదియు భయపెట్ట జాలదు. శక్తి కలిగి యుండియు క్షమించు వాడును, నిర్ధనుడైనను దానమిచ్చు వాడును, స్వర్గస్థానమును అలంకరించును.

౨. ధనవంతుడైనను దాన మీయనివాడు, దరిద్రుడైనను కష్టములను సహించనివాడు, వీరిద్దరు రాళ్లుకట్టుకొని, బావిలోపడి మృతినొందుట మేలు.

౩. అధికధనవంతుడై సుఖభోగము లనుభవించుచును, ఇంద్రియములను వశములో నుంచనివాడు భ్రష్టుడగును.

౪. కటుశబ్దములను పలుకకుము. మధురముగా మాట్లాడుము. ఇతరులకు హానిచేయకుము. ఇతరుల మనస్సు నొప్పింపకుము.

౫. ఇతరుల సొత్తును పరిగ్రహించుట చాలాపాపము. పదేపదే పాపముల చేయుటచే బుద్ధి నశించును.

౬. వృద్ధాప్యముచే యౌవనము, ఆశచే ధైర్యము, మృత్యువుచే ప్రాణము, దోషములచే ధర్మము, క్రోధముచే లక్ష్మి, కామముచే లజ్జ, అభిమానముచే అన్నియు నశించును.

౭. ఏకార్యములో సత్యముండదో ఆకార్యము ధర్మవిరుద్ధమే.

౮. నీ జీవితములో పవిత్రమైన పనులు చేయుము. వాటిచే, నీవు మృతినొందినను, లోకులు నిన్ను మరువకుందురు గాక.

౯. సంతాపమువల్ల రూపము, బలము, జ్ఞానము, నష్టమగును. మరియు, రోగపీడితుడగును.

౧౦. ఎవనిలో క్షమ, ధృతి, అహింస, సమత, సత్యత, సరళత, ఇంద్రియ నిగ్రహము, ధైర్యము, మృదులత, లజ్జ, అచంచలత, ఆధీనత, అక్రోధము, సంతోషము, శ్రద్ధ మొదలగునవి యుండునో వాడు మహాత్ముడే. వానికి చేయవలసినదేమి యుండదు.

౧౧. జగత్తును విష్ణుస్వరూపముగా భావించి, సమస్త ప్రాణులను ప్రేమించి, సేవించుము.

## ౨౫౭ శ్రీ భిక్షువిప్రుడు

౧. ధనమునుండి పదహారు దోషములు కలుగును. అవి 1. చోరత్వము 2. హింస 3. అసత్యము 4. దంభము 5. కామము 6. క్రోధము 7. గర్వము 8. అహంకారము 9. భేదబుద్ధి 10. వైరము 11. అవిశ్వాసము 12. స్పర్థ 13. లంపటము 14. జూదము 15. మత్తు పదార్థ సేవనము 16. వ్యభిచారము. కావున ధనసంపాదనేచ్ఛచే నాశనము పొందకుము. నీ పుత్ర మిత్రాదు లందరు ఈ ధనముకొరకే నిన్ను ప్రేమింతురు. ధనసంపత్తి లేనినాడు నిన్ను అవమాన పరతురు, అపుడు నీగతి కుక్కకంటే హీనమగును. ఇహమునకు, పరమునకు, రెంటికి చెడెదవు. కావున అన్నిటియందలి మమతను త్యజించి, భగవంతుని ధ్యానించుము.

## ౨౫౮ శ్రీ కర్ణుడు

౧. ఒక యాచకుడు కర్ణుని యాచించగా, ఆసమయమున కర్ణుని ఎడమచేతి వైపున ఒక బంగారు గిన్నె నూనెతో ఉండెను. అట్లే ఎడమచేతితో ఆ బంగారుగిన్నెను కర్ణుడు దాన మివ్వబోగా, ఎడమ చేత నూనెగిన్నె దానము ఇవ్వకూడదని, ఆ యాచకుడు అనెను. అందుకు కర్ణుడు 'నాయనా జీవితము క్షణభంగురము. ఎడమచేతి నుండి కుడిచేతికి వచ్చులోపల మనస్సున కెట్టి మార్పు గలుగునో యేమొ? కావున తక్షణమే ఇచ్చితీరవలయును' అని కర్ణుడు ప్రత్యుత్తర మిచ్చెను.

౨. యాచించుట ఎట్టి నీచ కార్యమో, అటులే, లేదని చెప్పుట కూడా నీచకార్యమే యగును. అందుచే, 'సర్వేశ్వరా నాకు ఏజన్మ మందైనను ఇట్టి నీచకార్యము జరుగకుండా అనుగ్రహింపుము.'

౩. బ్రహ్మవేత్తయగు సత్‌పాత్రునకు దానము చేయుటచే పరమాత్మునకు తృప్తికలుగును. జన్మ పావనమగును. కాన ఫలాపేక్ష లేకుండా దానము చేయవలెను.

## ౨౫౯ శ్రీ భీముడు

[ఒకరోజు ఒక బ్రాహ్మణుడు వచ్చి ధర్మరాజును యాచించగా, ఆసమయములో ధర్మరాజు కార్యభారముచే వినయముగా, రేపు రమ్మని అతనితో చెప్పెను. అదివిని భీముడు జయభేరి మంగళవాద్యములు మ్రోగించెను. ఆ ధ్వనిని విని ధర్మరాజు కారణమడుగగా, అపుడు భీముడు, మహారాజా! మిమ్ము యాచించిన బ్రాహ్మణుని రేపు రమ్మంటిరి, కావున, మనము మృత్యువును జయించినవారమైతిమి, రేపటివరకు మనకు మృత్యుభయములేదు. ఎందుకన, మీ వాక్కు తప్పదుకదా, ఆసంతోషముచే నేను జయభేరి మ్రోగించితినని చెప్పెను. అదివిని ధర్మరాజు, తన పొరపాటును గ్రహించి, 'తమ్ముడా నన్ను జాగ్రత్తపరచితివి. పొరపాటుచే రేపు రమ్మంటిని, అది తప్పు; పుణ్యకార్యములకై ఆలసించరాదు. రేపు ఏమగునో ఎవరికెరుక ? రేపటివరకు జీవించి యుందుమని గర్వించుట పాపమే అనెను.]

## ౨౬౦ భక్త భద్రతను

౧. ధనసంగ్రహము పాపమునకు హేతువు. దానివల్ల దోషములు సంభవించి నిన్ను నాశనము చేయును. ఒకసారి పతనమైతివా, తిరిగి పవిత్రుడవగుట మహా దుస్తరము.

౨. చేసిన పాపములకై పశ్చాత్తాపపడి, తిరిగి పాపములు చేయక భగవంతుని ధ్యానించితివా, మేలు చేకూరును.

౩. ఓ సోదరులారా, మానవశరీరము కామ భోగములకై లభించలేదు. పాపకార్యములుచేసి, అధోగతిపాలు కాకుడు. ఏక్షణమో, చావనున్న మీరు సంసార సుఖభోగముల కాశపడి, మీరువచ్చిన కార్యములను మరచి చెడిపోకుడు.

౪. మనస్సును విషయవాసనలనుండి తొలగించి భగవంతుని వైపు మరలించుడు.

౫. సమదృష్టిచే వర్తించుము. భేదబుద్ధి యుండరాదు. నాది, యనున దేది యుండరాదు. నాది అనునది లేనినాడే ముక్తి.

౬. ఇతరుల దుఃఖములకు జాలిపడి వారి బాధలను తీర్పుము. స్వార్థమును వీడుము.

## ౨౬౧ భక్త భద్రమతి

౧. ఎవడు ఆశకు దాసుడో వాడు సమస్త ప్రపంచమునకు దాసుడే, ఆశను జయించినచో ప్రపంచమును జయించినట్లే.

## ౨౬౨ భక్త విష్ణుచిత్తుడు

౧. మానవుడు ఈజన్మములో కష్టపడి దేనిని సంపాదించునో అదే రాబోవు జన్మకు కారణమగును. మానవజన్మము సుఖపడుటకు రాలేదు, జన్మరాహిత్యమునకే లభించినది. కావున పదవులను వదలి, నీ కవసరమున్న దానినే యుంచుకొని, దానిచే సంపాదించి, ఇతరులకు పెట్టి మిగిలినదానిని తినుము. భగవంతునకు అర్పితుడవై అతనినే స్మరించు చుండుము.

## ౨౬౩ భక్త తులాధారుడు

౧. ధనాపేక్షగలవారి కెన్నటికి ముక్తి దొరకదు. లాభముచే లోభము వృద్ధియగును. భగవత్సృష్టిలోని ప్రతి పదార్థమును మంచి యుద్దేశ్యము చేతనే యుత్పత్తి చేయబడినది. ఇందులో యొకటి మంచి, యొకటి చెడ్డ, అనునది లేదు. అన్నిటి కన్నియు మంచివే. కాని వాటిని మానవుడు వివేకముచే ఉపయోగించుకొన వలెను.

౨. ధనముచే పాపము వృద్ధియగును. లోభముచే నరక ద్వారము తెరువ బడును.

## ౨౬౪ భక్త పుండరీకుడు

[౧. వీరు కూరా, నారా, పండ్లు, ఆకులు, సమయమునకు ఏది లభించునో దానిచేతనే జీవనము గడిపేవారు.]

౨. సమస్త సంసార సుఖభోగములను త్యజించి, భగవంతుని భజించుము. ముక్తికి భక్తియే ప్రధానము. నమ్రుడవై అందరికి దాసుడవై సేవించు చుండుము.

## ౨౬౫ శివభక్త మహాకాల్

౧. భగవంతునికి, నివేదన చేయక ఎవడు భుజించునో వాడు మహాపాపాత్ముడు.

౨. సత్యవ్రతుడవై, అంతఃశుద్ధి గలవాడవై, సర్వసంగ పరిత్యాగివై మెలంగుము. ప్రతిజీవిని ప్రేమించి సేవచేయుచుండుము. నీకై దేనిని కోరకుము. ఇతరుల సుఖమే నీ సుఖమని తలంచుము.

## ౨౬౬ భక్త చక్రికభీల్

౧. అన్నిటికంటె మంచివస్తువు మరి నీ కేది ప్రియమో దానిని నీ కొరకై యుంచుకొనక, నీవు తినక, ఇతరులకే ఇమ్ము. నీవు కష్టపడియైనా ఇతరులకు మేలుచేయుము.

## ౨౬౭ భక్త రాంనారాయణ్

౧. నీ సమస్త ధనసంపత్తులను బీదలకిచ్చి వారికి సేవచేయుము.

౨. నీ వెవరిని ద్వేషించుదువో ఆద్వేషమే తిరిగి నిన్ను చేరును. కావున, ఏ జీవిని ద్వేషింపక ప్రేమించుము. వైరభావమును వీడుము. నిన్నెవరైనా తిట్టినా, ద్వేషించినా, వారిని ప్రేమించి సేవించుము.

౩. నీ యొక్క ధన సంపత్తులను, కీర్తి ప్రతిష్ఠలను చూచి, ఇతరులకు ఈర్ష్య జనించి, దుఃఖితులగుదురేని, ఆ దుఃఖమునకు

బాధ్యుడవు నీవే కావున, దేనిని సంగ్రహించకుము. ఎందుకన నీ గురించి ఇతరులు దుఃఖితులగుదురు. అట్టి పాపమునకు నీవే బాధ్యుడ వగుదువు.

౩. సమస్తమును విడచి, నిస్సంగుడవై, నమ్రుడవై, దాసుడవై, సదా ఆత్మధ్యానపరుడవు కమ్ము.

## ౨౭౮ భక్త గదాధర్ భట్ జీ

[వీరు ఎవరియొద్ద దేనిని తీసికొనువారుకారు. ఒకరోజు తన గుడిసెలోనికి దొంగ ప్రవేశించి, అందున్న కొద్ది సామానులను మూటగట్టి ఆ మూటను నెత్తిపైన పెట్టుకొనుటకు ప్రయత్నించెను. కాని, ఆ మూట దొంగకు లేవనందున వీరు స్వయముగా, ఆమూటను దొంగనెత్తిపైనపెట్టి 'నాయనా, భద్రముగా పొమ్మ'ని చెప్పెను. అపుడు ఆ దొంగ లజ్జించి, ఏడ్చి, ఆ మూటను దించి వీరిని వేడుకొని, భక్తుడాయెను.]

## ౨౭౯ భక్త ధనుర్దాస్ జీ

[వీరు గొప్ప విరక్తులు. ఒకరోజు తనగృహములో దొంగలు ప్రవేశించి భార్యపైనున్న నగలను తీసికొనిపోయిరి. దానికై వీరు సంతోషించుచు, 'ఎవసొరిమ్ము వారికి ముట్టినది, ఈరోజు సుదిన'మని తలంచి భగవద్ధ్యానము చేసిరి. ఇతరుల సహాయమునకై బంగారు వస్తువులు పోవుట చాలా సుకృతమని యెంచి, ఇదంతయు భగవత్కృపయేయని సంతోషించిరి.]

## ౨౮౦ భక్త గణేశ్ దాస్ జీ

[వీరికి ఒకేకౌపీనముండెను. రెండవ బట్టను ఉంచుకొనువారు కారు. చలి వాన, ఎండకు భయపడక సదా భగవంతుని ధ్యానించు చుండెడివారు. ఉధయము అరణ్యములో ఏకాంతమున ధ్యానము

చేయుచు, రాత్రికి గ్రామములో ప్రజలకు భక్తి ప్రబోధముల చేయు చుండెడివారు. భోగపదార్థములను చూడగనే, వాటిని విషతుల్యములుగా భావించి, దూరముగా పరుగెత్తువారు.]

౨. మనస్సులో భోగవాసనలుండెనేని, నరకప్రాప్తి తప్పదు. కావున, హృదయమునుండి ఆశలను త్యజించుడు.

౩. కీర్తి, ప్రతిష్ఠలకై, పాటుపడితిరా నశింతురు. అది మిమ్ముల అధోగతిపాలు చేయును. అందరికంటె మిమ్ము మీరు తచ్చువారిగా తలంచుకొనుడు. సదా సావధానులుగా యుండుడు. మీ జప తపములను అతిరహస్యముగా యుంచుడు.

౪. భక్తుని దర్శించువారికి దైవభక్తియెడ ఇచ్ఛలేకున్నను, ఆభక్తుని దర్శన ప్రభావముచే దర్శించువారి మనస్సులో దైవభక్తి కలుగునేని ఆ భక్తుడే నిజమైన భగవద్భక్తుడు.

## ౨౭౧ భక్త గోవర్ధన్‌దాస్

౧. మహాత్ములయొక్క యుపదేశానుసారము ఆచరించుటే మహాత్ములకు సేవచేసినట్లగును. లేనిచో బాహ్యసేవ ఎంతచేసినను వ్యర్థమే.

౨. ఎవడు ఆర్తుడై భగవంతుని వేడుకొనునో, వానికి తప్పక అతని దర్శనమగును. తర్కబలముచే జగత్తును, మిథ్యయని ఖండించుట వలన లాభములేదు. ఎట్లు ఖండించుదురో అట్లే ఆచరించవలెను కదా, లేనిచో, ఇట్టి తర్కవాదములచే మీకాలమును వ్యర్థపరచక, భగవంతుని తెలిసికొను ప్రయత్నముచేయుడు.

౩. మూర్ఖుడు ధనలోభముచే, చెడుసహవాసమునకు లోబడి నాశనమగును.

౪. నీదుఃఖమునకు ఇతరులు కారకులని తలంచి వారిని ద్వేషించకుము. నీ కర్మలే నీదుఃఖమునకు కారణమని, మరువకుము.

## ౨౮౨ భక్త చతుర్భుజ్

[ వీరు ప్రజలకు భగవత్కథలను వినుపించుచు వారిలో సద్బుద్ధిని కలుగ జేయుచుండిరి. ప్రతిరోజు ప్రజలు ప్రీతిచే వారికథలను వినుచు ధర్మాచరణకలవారైరి. పాపకర్మలను త్యజించిరి. ]

౧. నీవు దేనిని, నాది, నావి, అని భావించుచుంటివో వాటిని ఇతరులు, నాది, నావనుచు, తీసుకొనుచో, నీవు సంతోషించుము. నీయొక్క భారమును తగ్గించి, నాది అనేది, నీకు లేకుండా చేసినందుకు వారిని ప్రేమంచి, సేవింపుము. నాది, నాది అని, అనుకొనుటేపాపము. నాది, అనునది, లేని, నాడేముక్తి.

## ౨౮౩ భక్త శ్రీరాంజీ

[ వీరు ఎప్పుడును ఏ ఆసనములేక భూమిమీదనే కూర్చునేవారు. ఎత్తుపై కూర్చుండుట మర్యాద కాదనుకొనేవారు. అందరికంటె ఎత్తుపైనకూర్చుండుట భగవంతుని విధానమునకు విరుద్ధమని భావించువారు. ప్రపంచవిషయముల జోలికిపోక, వాటి సంబంధమే తలంపక, ఏకాంతములో సదా ధ్యానించుచుండేవారు.]

౧. సమస్తజగత్తును భగవత్స్వరూపముగా భావించి అందరిని ప్రేమించి సేవించుచుండవలెను. ఇదేముక్తికి దారి.

## ౨౮౪ భక్త డాక్టర్ దుర్గాచరణ్‌జీ

[ వీరు ఎక్కడికేగినను పదయాత్ర తప్ప యెట్టి వాహనము పైనను ఎక్కేవారుకారు. ఎవరు దేనికొరకై బాధపడుచుందురో, వారికి, లేనిదానిని ఇచ్చుచు వారిబాధలను నివారణము చేయువారు. బాధపడుచుండు అనాధులను తనఇంటిలోనుంచుకొని వారికి తగుసేవ చేయుచుండేడివారు. తాను నివసించే ప్రదేశమందెవరైనా చనిపోయి నచో వారికై చింతించి, ఆరోజు నీరునుకూడా త్రాగేవారుకారు.

ఆయింటివారిని ఓదార్చి వారికి తగు సేవచేయుచుండెడివారు. తనకొరకై ఎన్నడువిచారించలేదు. అపుడపుడు ఉపవాసములు చేయుచు, ఇతరులకు అన్నమును పెట్టువారు. తనసామాను మొదలగు వాటిని స్వయముగా నెత్తిపైనపెట్టుకొని తెచ్చుకొనుచుండెడివారు. ఇతరులచే ఏలాటి సేవ చేయించుకునేవారు కారు. ఇతరులు బాధపడుచుండుట చూచి స్వయముగా బాధపడి దుఃఖించేవారు. తాను నివసించే ఇల్లుచాలచిన్న గుడిసె. అది జీర్ణావస్థలోనుండినను, అందులోనే కాలముగడపెను. తన ఇంటిలో తిండికిలేకున్నను, దానికై చింతించక, తిండికిలేక బాధపడు చుండెడివారికి కూలిచేసి, అట్లురాబడిన డబ్బుతో వారికి సేవచేసెడివారు.

## ౨౭౫ శ్రీ కాగావా

[ఇతడు త్యాగి, పనిలో గొప్ప దక్షుడు. ఇతనిబుద్ధి చాక చక్యమును చూచి, ప్రభుత్వము వారు ఇతనికి నెలకు మూడువేల రూపాయలు వేతనమును ఇచ్చెదమనినను, దానిని నిరాకరించెను. ఎందుకన ప్రభుత్వము యొద్ద అధికముగా, బీదలసొమ్మే యుండును. బీదల కష్టార్జితపు సొత్తుచే జీవించుట నాకు తగదు. గొప్పపదవులలో యుండుటచే, పెద్దల పంక్తిలో కూర్చొని రుచిగల పదార్థములను సేవించుటచే, నాకు బీదలకు మధ్యన గోడపెట్టినట్లగును. కావున నాకు బీదతనమే మంచిదనెను.]

౨. మానవుడు పరాధీనుడు కావలదు. ఇతరులపై ఆశపడి జీవించరాదు. ఇతరులచే సేవచేయించు కొనరాదు.

౩. నీవెవరికి బానిసవు కాకుము, నీపైమరియొకరి అధికారమును అంగీకరించకుము. ఇతరులపై నీ అధికారమును చెలాయించకుము.

౪. మానవునకు అతని ఆత్మయే రాజనీతి, విజ్ఞానము.

## ౨౭౬ శ్రీ కులశేఖరులవారు

౧. మనకు ప్రభువుకలడు. వారిని సేవించినచో, వారి స్వస్థాన మును ఇచ్చు నారాయణమూర్తి యుండగా మూఢులము, నీచులమగు

మనము, అల్పగ్రామములకు అధిపతులును, అల్పమొసంగు వారునగు యొకనరుని సేవించుటకు వెదకుచుందుము కదా, ఎంతమూర్ఖతయో విచారించుడు.

౨. దేనిని కోరకుడు. తుదకు మోక్షమునైనా కోరక ఒకే భగవంతుని నమ్మితిరా, ముక్తితప్పదు.

## ౨౭౭ శ్రీ యాదవ ప్రకాశకులు

౧. భేదజ్ఞానమే సంసార మనంబడును. సత్కర్మాచరణచే భేద జ్ఞానమునశించి నరుడు సంసారమునుండి విముక్తుడగును. ఈ సంసారమే జన్మమరణాత్మక మైనది.

౨. భేదజ్ఞాన నివృత్తిచే జ్ఞానముకలిగి తద్వారా బ్రహ్మప్రాప్తి కలుగును.

## ౨౭౮ శ్రీ వేదాంతదేశికులు

[కొందరు రసూయాపరులు, వీరి గృహద్వారమునకు, పాదరక్షలు కట్టిరి. వీరు వాటిని చూచి, భక్తుల పాదరక్షలు నాకెట్లులభించునని, సంతోషించుచు పాదరక్షలను కట్టినవారివి నాకుమేలు చేసితిరని దీవించి ప్రేమచే ఆదరించెను. వారు సిగ్గుపడి, వీరి పాదములపై బడి నమస్కరించిరి.]

## ౨౭౯ శ్రీ లీలాశుకులు

౧. కృష్ణా నిన్ను నమ్మిన ఎడల మోక్షమేరాగా, తక్కినవి వచ్చుటలో ఆశ్చర్యమేమికలదు. దేనిని కోరకుడు. వానినే నమ్ముడు. మిమ్ములను పరీక్షించుటకై ఎన్నోకష్టములు సంభవించును. ధైర్యమును వీడక ఎదుర్కొనుడు. అప్పుడే భగవద్దర్శన మగును. మరువకుడు. ఆలసించకుడు. [illegible]

## ౨౬౦ శ్రీ అపయ్యదీక్షితులు

౧. తినుము, త్రాగుము, తిరుగుము, మరేమైనా చేయుము. కాని ఈఅనిత్యమైన శరీరము నశించునని, సదా జ్ఞాపకముంచుకొనుము.

౨. ఈ ప్రపంచములో, వేదశాస్త్రపండితులు అనేకులు కలరు. కాని తన్నుతా దెలిసికొనువారు, ఎందరుకలరో ఎవరికెరుక ?

౩. సంసారసుఖ భోగములందలి మమతను త్యజించి నిన్ను నీవు తెలిసికొనుము.

## ౨౬౧ శ్రీ తిరువళ్ళువరు (సూక్తులు)

౧. ఐశ్వర్యము అనిత్యము. అది నీకు సమకూరెనేని, దానిని మంచిపనులకు వినియోగించుట కాలసింపకుము.

౨. నశ్వరములు శాశ్వతములని భ్రమించుటకంటె గొప్ప తప్పిదము వేరొకటిలేదు.

౩. మృత్యువొక నిదురవంటిది. జీవితము, నిద్దుర తరువాత మేలుకొనుటవంటిది.

౪. నీవు ధర్మతత్పరుడవు కాగోరుదువేని, కోరికలను త్యజించుము. ముక్తి లభించును.

౫. నీవిధి నిరాకరించుదానిని, నీవెంత జాగ్రత్త వహించినను నిలుపుకొనజాలవు. నీ విధిచే లభించు వస్తువును నీ బుద్ధిపూర్వకముగ పారవేసినను అది నిన్ను విడచి పోజాలదు. నీ కర్మానుసారము జరిగియే తీరును.

౬. పవిత్రతయనగా కోరికలు లేకుండుటయే. పవిత్రతగల సత్యవ్రతునకే ముక్తి చేకూరును.

౭. జడమైన జగత్తు సుఖము నీయజాలదు. ఆనంద స్వరూపుడైన భగవంతుడు దుఃఖము నీయడు. సమస్త దుఃఖములు మానవుని దోషములవల్లనే కలుగుచున్నవి.

౮. దుఃఖములు కలుగునప్పుడెల్ల ఇవి ఏవో పూర్వము చేసిన కర్మ ఫలములని తలంచి సంతోషముగ అనుభవించుచు, ఇకమీద దోషములు చేయకుండునటుల ప్రయత్నింపుడు.

౯. కోరికలు ఎవరికొరకు ? ఎందుచేత ఈ శరీరమును పోషించుట ? శరీరము వేరు, నేను వేరు. దీనికై ఇంత తహతహ పడనేల ననుచు, నీలో నీవు విచారించుకొనుచుండుము.

౧౦. ప్రయాణము చేయువారికి గుఱ్ఱములెట్లు వాహనములో, ఈ జీవునకు దేహములట్లు వాహనములు. కాన ఎల్లప్పుడీ శరీరము కొరకు తాపత్రయపడుట అజ్ఞానము.

౧౧. వైరాగ్యము దృఢముగా నుండెనా, తప్పక ఆత్మ జ్ఞానము కలుగును.

## ౨౮౨ శ్రీ భాసవిలాసులు

౧. మనస్సునందు బుట్టు ఆశలన్నిటిని సంపూర్ణముగా ఛేదించితివా, సుఖము చేకూరును. సంసారమందు సుఖములేదు.

౨. చూపునకు చూడబడు పదార్థమునకు మధ్యనుండునది అనుభవమే ఆత్మ, అదే బ్రహ్మము. కావున, చూపు, మరి చూడబడు పదార్ధములు అనిత్యములు. మధ్యగల అనుభవమే నిత్యము.

౩. ఆశను జయించగలిగినవానికి ఈ భూమండలమంతయు, గోష్పాదతుల్యమే.

౪. దేహమునకు ఎట్టిబాధలు కలిగినను, ఆత్మకు సంబంధ ముండదు. కర్మానుసారము సంభవించిన బాధలను అనుభవించక తప్పదు. నీవు ఆత్మసుఖమునే కోరుము. దేహాభిమానమును వీడుము.

౫. మనోజయమునకు రెండుఉపాయములు: 1. యోగము, 2. జ్ఞానము. యోగమనగా, ధ్యానమ్ముచేత చిత్తవృత్తులను నిరో

ధించుట. జ్ఞానమనగా దృఢముగా విచారించి ఆత్మను తెలిసి కొనుట.

౬. బాగుగా విచారించితిమేని, ఆత్మకు భిన్నముగా ఈ ప్రపంచములో వేరెయొక వస్తువులేదు. భిన్నముగా కనుపించినను ఆ భిన్నత్వము, చూచువానిని ఆశ్రయించియే యుండును. ఇది, దీనికంటె వేరని తెలిసికొనవలసినవాడు చూచువాడేకదా! ఇంకా లోతుగా విచారించినచో చూచువాడే ఆత్మ. ఆత్మకు ఉనికియే స్వరూపము. కావున, అతనికంటే భిన్నమగు పదార్థము ఏదియు నుండదు.

## ౨౮౩ శ్రీ దామాదులు

౧. ఈ లోకమునందు, సర్వదుఃఖములకు ఆశయే కారణము. నిరాశయే సుఖము. వాసనలు సర్వానర్థములను కలిగించును. రాక్షసులు వాసనలవల్ల ఆశకులోనై నశించిరి.

౨. ఆత్మసర్వవ్యాపకుడై యుండగా, అజ్ఞానులు నాకిదిలే దది లేదని తలంచు చుందురు. ఈ దౌర్భాగ్యప్రభావముచే తన యథార్థ స్వరూపము కానరాకుండును. ఎవడు సర్వము ఆత్మయేయని తలంచి అకాముడై ముల్లోకములను తృణప్రాయముగా జూచునో, అట్టివానిని సుఖదుఃఖములు విడుచును. ప్రజలందరును మరియు దేవతలును వానిని రక్షించు చుందురు.

౩. సంసారమును తరించుటకు, సజ్జనసేవ సత్సంగమే ముఖ్య సాధనము.

౪. ఏకాంతములో ఆత్మవిచారము చేయుచుండుము.

౫. నీవు చేయవలసినపని భోగేచ్ఛాపరిత్యాగ మొకటే. ఏది కన్నులకు రమ్యముగా దోచునో, దానిని విషముగా భావించి త్యజించుము. అట్లే ప్రతి ఇంద్రియము యొక్క కోరికలను త్యజించుము.

౬. నీవేది ఆచరించుదువో, నిన్నుజూచి ప్రజలు అట్లే వర్తించుదురు. కావున ఆత్మకు విరుద్ధమగు పనులు చేయుచు, లోకమును చెరుపకుము.

౭. ఈ ప్రపంచము ఎట్లుపుట్టెనని విచారించకుము. ప్రపంచమందలి మమతను ఎట్లు నిశింప చేయుదును, ఈ అజ్ఞానము ఎట్లు పోవునని మాత్రమే సర్వకాలములయందు విచారించు చుండుము. బ్రహ్మభావముచే గూడిన, విచారమువలన అజ్ఞానము క్రమ క్రమముగా క్షీణించి నశించునేని, అపుడు ప్రపంచము యొక్క పుట్టుకకు, నశించుటకు కారణము నీకు తెలియకలదు. కాన ప్రయత్నించుము.

౮. బాధపడుచుండు చిత్తమునందెవనికి దయ కలుగక దానిని ఉద్ధరింప ప్రయత్నింపడో వాడు మానవుడుకాడు, రాక్షసుడే సుమా.

౯. వాయువెట్లు తనకుతానే స్వయముగా చలించు చున్నదో అట్లే ఆత్మచిచ్ఛక్తిచే తనయందుతానే చలించు చున్నది.

౧౦. ఈ ప్రపంచము, కేవలము సంకల్పరూపమైనదే. పుట్టుట లేదు, నశించుటలేదు. సర్వము అసత్యమే. ఆశలచే నిండియున్న ఈ సంసారమును సంపూర్ణముగా విడచి, భగవంతుని స్మరించుము.

## ౨౮. శ్రీ బసవేశ్వరుడు

౧. జీవుడు పోయెననెదరు, కాని జీవుడు చచ్చెనని అనరు. ప్రాణము పోవును, శరీరము నశించును. జీవుడుండును.

౨. దొంగిలింపకుము, హింసించకుము, అబద్ధమాడకుము, కోపపడకుము, అసహ్యపడకుము, నిన్నునీవు పొగడుకొనకుము, అపకారికి ఉపకారము చేయుము.

౩. నీవు మృతినొందకమున్నే మృత్యువును జయించుము. సిరులు స్థిరములుగావు, కావున ఆశను త్యజించుము.

౪. ఏ జీవికిని హింసచేయకుము. పాము, తేలు, మొదలగు వాటిని కూడా చంపకుము.

౫. సత్యముగా నడుచుటే దేవలోకము. ఆచారమే స్వర్గము. అనాచారమే నరకము. అయ్యాఅని పిలుచుటే పుణ్యము! అరేయని పిలుచుటే పాపము. దయయే ధర్మము.

౬. పరస్త్రీ పరధనమునకు భయపడుడు. సమస్తకోరికలను త్యజించుడు, ద్రవ్యమును సంగ్రహము చేయకుడు.

౭. ఒక్కడే దేవుడున్నాడు. కావున ఇతర చిల్లర దేవతలను గొలువకుడు.

౮. ఎన్నిచదివిననేమి, ఆశనువిడువనిచో అంతావ్యర్థమే.

౯. మృత్యువునకు భయపడకుము, రేపురానున్నది ఇపుడే రానిమ్మని కోరుకొనుము.

౧౦. నీకొరకై ఏదియు రేపటికని యుంచకొనకుము. రేపు ఏమగునో ఎవరికెరుక ?

౧౧. ఆత్మను తెలిసికొనుటే మానవుని విధి. ఆత్మజ్ఞానమే గురువు కావున ఆత్మచెప్పినట్లు నడుచుకొనుము.

## ౨౮౫ శ్రీ కూరనాధుడు

[ వీరు తనఇంటిలో నుండిన సమస్తవస్తువులను దైవమునకై కర్చుపెట్టి, కేవలము పైనున్న వస్త్రములచే బయలుదేరి ఏకాకియై ఏకాంతములో, సదాభగవద్ధ్యానము చేయుచుండిరి. ]

## ౨౮౬ శ్రీ జ్ఞానదేవుడు

౧. సమస్త విషయ వాసనలను త్యజించుము. కామనాశనము కాగానే, సమస్త కర్మలయందలి మమత నశించును. అనగా, కర్మలు నిన్ను బంధించనేరవు.

౨. మోహమును త్యజించగానే, జ్ఞానోత్పత్తి కలుగును.

౩. శరీర సుఖభోగములకై ఆత్మను నాశనము చేయకుము. విరక్తుడవై సదా నిశ్చింతగా నుండుము.

౪. ఇదినాది, అది నీది, అని తలంచుటే, జన్మకు కారణము. అదే బంధము. ప్రతిజీవిలో దేవు డున్నాడు. కాన, భేదముండరాదు.

౫. ఏది నీనుండి తొలగిపోవునో దానినిగురించి చింతించుట వ్యర్థము. పోవునది నిలువదు.

౬. సంకల్ప వికల్పములు నశించగానే, జీవుడే దేవుడగును. కాన, ఏలాటి సంకల్పములు చేయకుము.

౭. ప్రతిపనిని, ప్రతిమాటను, ముందు విచారించియే, చేయు చుండుము. అవసరము లేనిదే మాట్లాడకుము.

౮. ఆకలి కానిదే తినకుము. సాత్త్వికాహారమునే మితముగా తినుము. ఆహార నియమమును అతిముఖ్యముగా పాటించుము.

౯. దేహాభిమానమును విడచి, పరమాత్మను స్మరించు చుండుము. దీనికై నీ శరీరము నశించినాసరే, భయపడకుము.

౧౦. ప్రతి జీవిలో ఈశ్వరుడున్నాడని అందరికి నమస్కారము చేయుచు అందరిని ప్రేమించుము. ఈర్ష్యా ద్వేషములను త్యజించుము.

౧౧. కీర్తి, ప్రతిష్ఠలకై ప్రాకులాడకుము. అందరికంటె నిన్ను నీవు తచ్చువానిగా దలంచుకొని, అందరికి సేవచేయుము. పదవులకు ఆసక్తుడవై, పరాధీనుడవు కాకుము. ఎవ్వరిని ఏదియు అడుగకుము.

౧౨. ప్రజలు వారి సంతోషము గురించి తమపిల్లలకు బంగారు ఆభరణములచే అలంకరించి తృప్తి పడుదురు. కాని, ఆపిల్లలకు ఏమి తెలియదు. అలంకారములను కోరరు, వారికి అవసరమునూ యుండదు. అట్లే ప్రజలు తమతమ కోరికలచే, తమలాభమునకై భగవంతునికి పూజలు మొదలగు అలంకారములు చేయుదురు, కాని ఆయనకోరడు. ఆయనకు అవసరమునూ లేదు.

# ౨౦౭. భక్త నామదేవుడు

[వీరికి సంసారముయొక్క జోలియే గిట్టకుండెను. తిండికి లేకున్నను చింతచేయువారుకారు. నిశ్చింతగా సదా భగవద్ధ్యానము చేయుచుండెడివారు. ఎపుడేది దొరికినా దానిని బీదలకు పంచి ఇచ్చుచుండెడివారు. ఎల్లపుడు దరిద్రదశలోనే కాలము గడుపువారు. కాని, లేదని ఎపుడును చింతించెడివారుకారు. ఒకరోజు కుక్క రొట్టెను ఎత్తుకపోగా చూచి ప్రతిజీవిలో భగవంతుడు గలడు, ఆ కుక్క నెయ్యి పెట్టని రొట్టెను ఎత్తుకపోయినదే అనుచు గిన్నెలో నెయ్యిపోసికొని ఆకుక్క వెనువెంట పోయి రొట్టెను, నేతిలో అద్ది ఆకుక్కకు తినిపించెను.

ఒకరోజు తల్లి ఆజ్ఞప్రకారము ఒక చెట్టు, నారను, తెచ్చుటకై, కత్తిచే చెట్టుయొక్క పైతోలును నరికి నార తీయుచుండగా ఆనరికిన కాటునుండి ద్రవము వెళ్లుచుండుట చూచి జాలిపడి, మనస్సు నొచ్చుకొని, అయ్యో ఈచెట్టుకు కూడా దుఃఖము కలుగవచ్చును కదా, అనుకొని, అదే కత్తిచే తన కాలుపై కాటుపెట్టుకొని చర్మము తీసెను. దానివల్ల తనకు బాధకలిగెను. సమస్త జీవులకు దుఃఖము సమానమేనని గ్రహించి తాను చేసిన తప్పునకు దుఃఖించి ఇల్లుచేరెను. అపుడు తల్లి కొడుకు కాలునకుగల గాయమును చూచి 'ఇదియేమని' అడుగగా, 'అమ్మా! సమస్త జీవులలో ఆత్మ సమానమే, కాన, ఏజీవికిని హాని చేయరాదు. కావున, నేను చేసిన తప్పుకై ప్రాయశ్చిత్తము చేసికొంటిని. ఇప్పుడే నేను సంతోషముగా నున్నాను' అనెను.]

౧. ద్రవ్యము మోహమునకు కారణము. మోహము నరకమునకు కారణము. ద్రవ్యమును త్యజించుడు. బంగారమును, మట్టిని సమముగా చూడుడు. మీకు దానధర్మములచే పనిలేదు.

ఈశ్వరుడే సమస్తము చేయును. సదా భగవంతుని ధ్యానించు చుండుడు. దీనిని మరువకుడు.

## ౨౭౭ భక్త తుకారాం

[వీరుత్యాగులు. ఎవరినేమియు అడిగెడివారు కారు. తన యొద్ద నేదియున్నా ఇతరులకిచ్చువారు, భగవద్విశ్వాసులు, చీమలకు. పిండిశర్కర పోయుచుండిరి. మేతలేని పశువులకు మేత తెచ్చి వేయుచుండెడివారు. గ్రామములో ఎవరు, ఏపని చెప్పినా కాదనక ప్రేమచే, చేయుచుండెడివారు. కుంటి, గ్రుడ్డి మొదలగువారికి సామానులు తెచ్చిపెట్టుచు, ఎల్లపుడు వారికి తగు సేవ చేయుచుండెడి వారు. వీరిభార్య క్రోధమువలన చెరుకుగడచే నెత్తిపై కొట్టినందున ఆచెరుకుగడ రెండుముక్కలాయెను. అందుకై వీరు నవ్వుచు, భార్యతో నిట్లనిరి. 'నీకొకముక్కను, నాకొకముక్కను నీవు న్యాయముగా పంచితివి. నా బాధ్యతను, నీవే నెరవేర్చితివి, కాన, నాకుచాలా సంతోష'మని, శాంతమువహించెను. వీరిని ఒకడు క్రోధముచే, ముండ్ల కంపతో, కొట్టినను ఆగ్రహపడక, కొట్టినవానికి శ్రమ, కలిగెనని చింతించి కొట్టినవానిని వేడుకొని, శాంతముగానుండెను. ఏలాటి అసూయపడలేదు. వీరికి శివాజీమహారాజు, బంగారు నగలు ధనమును ఈయబోగా. 'రాజా, చిన్నచీమయు,మహారాజులు, మాకుసమానులే!. బంగారము మరి మట్టియుసమానమే'నని, ఆ వస్తువులు తీసుకొనలేదు. రాజా, నీవుకూడా వీటిపై ఆశపెట్టుకొనకూడదని బోధించెను.]

౧. మీరు మీభార్యాపుత్రులమీద, దయచూపుచున్నట్లు,మీదాస దాసీజనులమీదకూడా దయజూపుడు.

౨. ద్రవ్యమును కోరకుడు. దానిచే, నాది యనుమమకారము కలుగును. నేను అనుభావముకలిగిన వెంటనే, నాది అను భావము కలుగును. దీనిచే నాశనమగుదురు. ద్రవ్యము దాచకుడు. దరిద్రుల కీయుడు. ఉంచుకోకుడు.

౩. ఎన్నాళ్లు బ్రతికినా, చావుతప్పదు. ఈ శరీరము పోయినచో సంతోషించుడు. ఎందుకన, ఈకర్మశరీరమనెడి కారాగృహమునుండి విముక్తులై బ్రహ్మానందమును అనుభవించవచ్చును. జన్మరాహిత్య మగును. చావునకు భయపడక సంతోషించుడు.

౪. దీపముగృహాధికారికిని, చోరునకును, సమముగాకాంతి నిచ్చునట్లు, నీవుకూడా, ప్రపంచముయెడ, సుఖ దుఃఖములయెడ సమదృష్టియుంచుము.

౫. ఆశ, తృష్ణ, ఈరెండింటిని, త్యజించితివా, ముక్తిదొరకును. కీర్తి, ప్రతిష్ఠలకై ఆశపడితివా, నరకమే! అభిమానమును విడువుము.

౬. ఎవని అంతఃకరణమందు ఈశ్వరునిపై ప్రేమయుండునో. వానికి అందరియందు ప్రేమయుండును.

## ౨౮౯ భక్త సూర్‌దాస్‌జీ

౧. ఓ భగవానుడా, మేమునిన్ను వరించిన, నీవుమమ్ములవరించె దవు. అనగా, సమస్తమును భగవదర్పితముచేసి స్మరించినచో, మన కార్యభారమంతయు తానే వహించును. ఇక, మనకు, చింతయేలా ?

౨. జపముచే, కర్మదోషములును, సత్సంగముచే సంగదోషము లును, దానముచే సమస్తదోషములు నివృత్తియగును.

## ౨౯౦ భక్త పోతన

౧. ఎవరిని ఏదియు అడుగకుము. భగవంతుడిచ్చినదానితోనే సంతోషించుము. దేనికి భయపడకుము. విరాగివి కమ్ము.

౨. ధనసంగ్రహములేనిచో మోక్షము కలుగును. ధనముచే పాపకార్యము లాచరించుటకు వీలుకలుగును. సంసారబంధమే నరక బంధము. సంసారము నతిక్రమించి, నిత్యానంద మనుభవించుము.

౩. సుఖ దుఃఖశీతోష్ణ పరితాపానందములకు లోనుగాకుము. వాటికి భయపడక, సహించుము.

౪. నీతిండికై అంబలి దొరకకున్నను దుఃఖించకుము. విశ్వాసము గలవాడవై భగవంతుని భజించుచుండుము.

౫. ఇతరులచే రాబడే క్షీరాన్నముకన్న నీస్వంత కష్టార్జితముచే సంపాదించిన గంజియే శ్రేష్ఠము. రుచులకై ఆశపడకుము. సర్వసంగ పరిత్యాగినైనచో, ముందునాగతియేమని, ఆలోచించకుము. అన్నిటికి భగవంతుడే కలడు.

౬. అందరిని ప్రేమించుము. ఎవరిని ద్వేషింపకుము. సర్వము భగవన్మయమేనని తలంచి, సేవించుము.

౭. సమస్తమును త్యజించితివా, ఈశ్వరకృప ద్విగుణీకృత మగును. కానికోరికయుండరాదు.

౮. ప్రపంచమును నమ్మక, ఈశ్వరునే నమ్మి నీసర్వస్వమును సమర్పించి, సదాస్మరించుచుండుము.

## ౨౯౧ శ్రీ మహాప్రభు చైతన్య

౧. వీరు త్యాగులు, మహోదయగలవారు. ఈగలు, దోమలు, చీమలు మొదలగునవి వీరిని, ఎంతబాధ పెట్టినను వాటిని అదలించక శాంతము వహించువారు.

౨. వీరు ఒకచాకలి వానిని, నామస్మరణ చేయమనగా, నేను బట్టలు ఉతుకవలెను, నాకు వ్యవధిలేదనెను. అపుడు వీరు ఆచాకలివాని బట్టలు స్వయముగా ఉతుకుచు, వానికి శ్రీకృష్ణనామస్మరణకు వ్యవధి నిచ్చిరి.

౩. నీవు, నీస్వలాభమునకై ప్రార్థనచేయక, ఇతరుల మంచికై వారికి ముక్తినిచ్చుటకై భగవంతుని ప్రార్థించుము.

౪. నిన్నునీవు గడ్డిపోచకంటే నీచముగా దలంచుకొనుము. ఇతరులకన్న తచ్చువాడనని తలంచుచు ఇతరులను గొప్పగా దలంచి వారిని గౌరవించుము. ఈసృష్టిలో నీవు అణుమాత్ర సమానుండవు.

కాన నిన్నెవరు లెక్క పెట్టుదురు? కావున అహంకారమును వీడుము.

౫. నీబాధ్యత ఎన్నిజీవులపై యున్నదో, నీవు తినకముందు, భగవంతుని కర్పించి, తదుపరి అన్నిటిని తృప్తిపరచి, ఆవెనుక నీవు మితముగాతినుము. నీపొట్టకే ప్రాకులాడకుము. పరాధీనుడవు కాకుము.

౬. కామినీ, కాంచనముల, కీర్తి గౌరవ, అసూయా, ప్రతిష్ఠల త్యజించుము. ఇతరులకే, కీర్తి ప్రతిష్ఠలు రావలెనని కోరుము.

౭. నీవు ఏపనియందైనా కర్తవుగాకుము. నిష్కామముగా, కర్మచేయుము. శరీరమును, ధనమును, ప్రజాసేవకై వినియోగించుము.

౮. ఇతరులు, నిన్నవమానించినా, కొట్టినా, తిట్టినా, వారికి ప్రతికూలము చేయక వీరు తెలియక చేయుచున్నారని, వారికై భగవంతుని ప్రార్థించుము.

౯. ఆత్మవిశ్వాసముగలవాడవై నీఆత్మచెప్పినట్లు ఆచరించుము. ఆత్మ నీమంచికే చెప్పును. దీనిని మరువకుము.

౧౦. భవంతుడు అందరి హృదయములో నుండి చూచు చుండును. అందరిని ప్రేమించుచు, నమ్రుడవై అందరికి దండము పెట్టుచుండుము.

౧౧. ఇతరులు తప్పుచేసినచో, వారిని బ్రతిమాలి ఆ తప్పులనుండి మరల్పుము. ఇతరుల కష్టములను నీకష్టములుగా భావించి వారికి సేవ చేయుచుండుము.

౧౨. భక్తి కావలెనన్నచో, మనోనిగ్రహము, మౌనము, ఏకాంతము, ఆహార నియమము, ఆత్మ విచారము, మొదలగునవి ముఖ్యావసరములు.

౧౩. ఇతరుల సొత్తుకాశపడక, నీకష్టార్జితపు సొత్తునే ఇతరుల కీయుము. పరాధీనుడవై ఇతరులకు ఋణగ్రస్థుడవు కాకుము. నీఆచరణ బాగుండునేని, నిన్నుచూచి ఇతరులు బాగుపడుదురు. లేనిచో ఇతరులను చెడగొట్టినవాడ వగుదువు.

౧౪. నీచుట్టు ప్రక్కలవారు తిండికి బట్టకు లేక బాధపడుచుండ నీవు సౌఖ్యముగా తినుట మహాపాపము.

౧౫. నీతప్పులెన్ను వారే నీకాత్మ ప్రియులు. నిన్ను మెచ్చుకొనువారు నీకు శత్రువులు. ఈప్రపంచ వ్యామోహములలో జిక్కి నీ జీవితమును పాడుచేసు కొనకుము.

౧౬. నీకర్మలు పూర్తికానిదే, నీజన్మ సఫలము కానేరదు. నీదుఃఖములు నీవుకోరి తెచ్చు కొనినవే. ప్రాప్తించిన సమస్త దుఃఖములనుభవించనిదే జన్మరాహిత్యము కాదు.

౧౭. ఇతరుల లోపములను తలంచక, నీలోయున్న లోపములను దిద్దుకొనుము. నీలోపములను ఇతరులు చూపినచో వారిని ద్వేషించక వారిని, నీకుపకారులుగా నెంచి ప్రేమించుము.

౧౮. ఈ ప్రపంచములో, నీవేకార్యము చేసినను, నీచర్యలకు, నీవే భగవంతుని ఎదుట సమాధానము చెప్పవలసి యుండును. అపుడు నీకు ఎవరును సహాయము చేయుటకు రారు. కావున కాలమును వ్యర్థపుచ్చక నీవిధిని నీవు నెరవేర్చుకొనుము.

౧౯. నీశరీరమును, నీభార్యాపుత్రాదులను, ప్రేమించునట్లు ఇతరులను ప్రేమించుము. మేలుకొనుము. ఆయుర్దాయ మల్పము. భయపడకుము. అన్నిటిని త్యజించుము. సమస్తము నశించునదే.

౨౦. భగవదాజ్ఞను పాలించుచు, సదా స్మరించుచుండుము.

## ౨౯౨ శ్రీ రామకృష్ణ పరమహంస

౧. సంసారములో రెండురకముల మనుష్యులుందురు. 1. ఒకరు చేట స్వభావము గలవారు, 2. ఇంకొకరు జల్లెడ స్వభావముగలవారు.

1. చేట స్వభావము గలవారు, చేట మంచిగింజలను యుంచుకొని, చెత్త చెదారమును క్రింద పడవేయును. అట్లే మంచివారు

మంచి గుణములను స్వీకరించి, చెడు గుణములను త్యజించుదురు.

2. జల్లెడ స్వభావముగలవారు, జల్లెడ మంచిగింజలను క్రింద పడ వేయుచు, చెడ్డగింజలు రాళ్లు, మట్టి మొదలగువాటిని యుంచుకొనును. అట్లే చెడ్డగుణములు గలవారు, మంచిని విడచి చెడును స్వీకరించుదురు.

౨. ఎవనిమాటలు, క్రియలు, నొకేరూపమున నొకేమార్గమున నుండునో, అతడే ఉత్తమ పురుషుడు.

౩. కామ, క్రోధములు, మనస్సున ఉదయించినపుడు పాప బీజాంకురములు మొలచును. మనస్సునందవి, తలఎత్తినపుడే వాని నణచివేయుటకు ప్రయత్నింపక వాటికి సహాయపడుచో పాపములు వృద్ధిబొందును.

౪. మానవుల పుణ్య పాప నిర్ణయము ననుసరించి భగవంతుడు విచారణ సలుపడు. వారి హృదయములను పరిశీలించియే విచారించును. గుణాగుణంబు లెరుంగును.

౫. నేను కర్తనని భావించునపుడు, ఇది నా భార్య, ఇది నా సొత్తు అను భావమేర్పడును. నేను కర్తనుగాను, ఈశ్వరుడే కర్త అను భావముండవలెను. నేను దాసుడను, ఈశ్వరుడు యజమాని, నాది ఏది లేదనునదే ముక్తి.

౬. ఊసరవెల్లియొక్క రంగులు ఎల్లప్పుడు మారుచుండును. ఒకరికి ఒకప్పుడు, ఒక రంగులో కనుపించును. వేరొకరికి ఇంకొకపుడు ఇంకొకరంగులో కనుపించును. అటులే భగవంతుని ఎవరెట్లు ఎపుడు ధ్యానింతురో అపుడు ఆవిధముగానే వారికి దర్శనమగును.

౭. జప తపములను ప్రజలు గౌరవించవలెనని కీర్తి కొరకు చేయరాదు. నిష్కామముగా చేయవలెను.

౮. నీకు భక్తి కావలయుచో ఒకసంవత్సరమైన లేక ఆరు మాసములైనా సత్సంగము, ఏకాంతవాసము చేయవలెను.

౯. ఈశ్వరుని శక్తివల్లనే నీవు కదులుచుందువు కదా. నేను, నాది అనే అహంకార మెందులకు? ఈశ్వరశక్తివల్ల కదులుచుండియు ఇది నాది, దీనిని నేను చేసితిని అనుటయే ప్రమాదము.

౧౦. వాద వివాదముల జోలికి పోకుము. ఎట్లు నీది నీవు సత్యమనుకొందువో, అట్లే నీ యెదటివారు సత్యమనుకొనియే మాట్లాడుదురు. అందుకు వారిపై ద్వేషమేల? దీనివల్ల దోషము సంభవించును.

౧౧. సుఖభోగముల కాశించి విషయచింతన చేయుచు ఎన్నాళ్లు ధ్యానించినా వ్యర్థమే.

౧౨. నీలో కొద్దిగా భక్తియున్నపుడు సంసార జోక్యము కలిగించుకొనక, సత్సంగము సేవించితివా దృఢభక్తి కలుగును. నీ భక్తి దృఢపడువరకు ప్రపంచ లంపటములో బడకుము.

౧౩. ధనమున్నదని అభిమానపడకుము. నీకంటె ఎందరో అధిక ధనికులున్నారు. ఇందులో నీ గొప్ప ఏల? చుక్కలకంటె చంద్రుడు, చంద్రునికంటె సూర్యుడు, ప్రకాశమున గొప్పకదా! కావున, ఎవరునూ నేనేగొప్ప అని తలంచుట తప్పు.

౧౪. కామినీ కాంచనములు, ఈ రెండే ఈ ప్రపంచమును, మోసపుచ్చుచుండును. నరుని, నారాయణుని నుండి వేరుచేయును. సంసారమున ముంచివేయును. వీటిని ఎవడు సంపూర్ణముగా త్యజించునో వాడే ముక్తినొందును.

౧౫. గీతా గీత అనుటచే లాభములేదు. గీతయొక్క అర్థము ఒక మాటలోనే యున్నది. ఓ జనులారా! సకలమును త్యాగముచేసి మీ హృదయములను భగవంతునికి హత్తించుడు. ఇదియే గీతయొక్క సారము.

౧౬. నరుడు ఈశ్వరానుగ్రహమును సంపాదించుకొనవలయు ననిన, ఈ కలియుగమున మూడు దినములు తీవ్రపరితాపముచాలును.

౧౭. భగవంతునికొరకై పరివేదనము చేయువాడు, ఏమి తిందును, ఏమిత్రాగుదునను స్వల్పవిషయములను గురించి ఎంతమాత్ర మాలోచించరాదు.

౧౮. సంసారపుజోలి నీదికాదు, అది భగవంతునిది. నీవు వాని సేవకుడవు. వాని ఆజ్ఞను పాలించుటకే నీవుఇక్కడికి వచ్చియున్నావు.

౧౯. మితముదప్పి మిఠాయీలను రుచిగల పదార్థములను తినకుము. మితముగా సాత్వికాహారమునే తినుము.

౨౦. నేననునది నశించెనా చిక్కులేదు, నేను కర్తనుగాను, అకర్తనను భావము హృదయమున నెలకొనెనా ఈజన్మ యుండగనే ముక్తికలుగును.

౨౧. బంధనమునకు, ముక్తికిని నీవేకారకుడవు. ఈశ్వర విధానముచే నడచితివా ముక్తి. నీమనస్సునకు దోచినట్లు నడచితివా నరకము.

౨౨. నీవు విరక్తిని కోరుదువేని ఆరు మాసములో లేక మూడు మాసములో తుదకు ఒకమాసమైన ఏకాంతమున మౌనముచే భగవంతుని ధ్యానించుము. అపుడు నీసమస్తమును నీవారిని సంపూర్ణముగా మరచి పోవలయును.

౨౩. సంపూర్ణముగా సంసారమున చిక్కువాడు అశుద్ధమున పుట్టి అశుద్ధమున చచ్చుపురుగు వంటివాడు సుమా.

౨౪. ఇతరులేమి చేయవలెనని నీవు కోరుదువో నీవు యితరుల కదే చేయుము.

౨౫. అందరికి నమ్రుడవై యుండుము. వారికంటె ముందే నీవు వారికి దండములు పెట్టుము.

౨౬. అద్దె ఇంటిలో కాపురమున్నచో బాడుగచెల్లించురీతి నీ శరీరమును వాడుకొనినందులకు, జీవుడు రోగపీడలు, అను బాడుగలను చెల్లించు కొనవలయును. కావున రోగములు సంభవించినచో భయ పడకు. దానికర్మ ఎంతోఅంత తీర్చుకొని పోవును.

౨౭. ధ్యానమునకు భంగకారణములు ద్వేషము, సిగ్గు, గర్వము, తెలివి, భయము, కీర్తి, జాతి, నామము, రూపము, అహంకారము. ఈ పది విధములగు బంధములు సాధనకు బంధకములు. నీకుండు శక్తులను తలంపకుము. దానిచే అహంకారము కలుగును.

౨౮. గడ్డిపోచకన్న నిన్నునీవు తచ్చువానిగా తలంచుకొనుము. గర్వించకుము. వృక్షములను చూచి ఓర్పు మొదలగునవి నేర్చుకొనుము.

౨౯. నీయందు నీకేమాత్ర మభిమానము ఆధారములున్నను, భగవంతుని తెలిసికొనలేవు సుమా.

౩౦. నీఇష్టము వచ్చినట్లు ధ్యానించుము. చీమ చిటుక్కుమని నను ఆయన వినగలడు. జాగ్రత్త!

౩౧. శాస్త్రవాసనలను లోకవాసనలను దేహవాసనలను బొత్తిగా విడనాడి భగవద్ధ్యానము చేయుము.

౩౨. బొందిలో జీవ మున్నంతవరకు ఒకే ఆదర్శముపై నిలువ వలయును.

[౧. వీరు పన్నెండు సంవత్సరములు అహోరాత్రములు నిద్రాహారములులేక విలపించిరి.

౨. వీరు అహంకారమును పోగొట్టుకొనుటకై పంచముల ఇండ్ల ముందర తన నెత్తివెంట్రుకలచే సంతోషముగా ఊడిచేవారు.

౩. వీరు మట్టిని బంగారమును నదిలో పారవేయుచు ఓ మన్నా నీచే గోడలు పెట్టవచ్చును. ఓ ధనమా, నీచేకొన్ని పనులు జరుగును. కాని మీ రిరువురునూ ఆత్మజ్ఞానమును యీయజాలరు, అని అనేవారు.

౪. వీరిని ఒక బ్రాహ్మణుడు కొట్టి తన్నినా మధురబాబునకు చెప్పకొనక, శాంతముగా నుండెను.

౫. వీరికి మధురబాబు ఒక శాలువను పైన కప్పగా దానిని తీసి బురదలో పడవేసిరి. కారణ మడుగగా చలికి గొంగడేచాలును ఇంత వెల గల శాలువను కప్పినచో గర్వము హెచ్చి భగవంతునికి దూరమగుదును అనెను.]

## ౨౯౩ ప్రభు శ్రీ జగత్ బంధు

౧. పరనిందవిషతుల్యముగా చూడుము. స్వయముగా చేయకుము, వినకుము. పరనిందను, బాహ్యదృష్టిని, ఎల్లప్పటికి త్యజింపుము. ఇతరులచింతనచే నీచిత్తము మలినమగును. అదినిన్ను నశింపజేయును.

౨. ముందునీవు పవిత్రుడవై, ఇతరులకు పవిత్ర తనేర్పుచు హరినామస్మరణ చేయుచుండుము.

## ౨౯౪ భక్త శ్రీరాందయాల్ మజూందార్

౧. చావు సత్యమే, కాని, కుక్కచావు చచ్చుట వ్యర్థము. భగవత్స్మరణచేయుచు, చచ్చుట శ్రేష్ఠము.

౨. గీతను, చదువుటమంచిదే, కాని, గీత ఉపదేశించినట్లు ఆచరించుచు అనుభవించుట శ్రేష్ఠము.

౩. దేనిలో నీకు అశుభమనుపించునో దానిని వెంటనే విడచి, భగవంతుని ధ్యానించుము.

౪. మానవునిఎదుట నీదుఃఖమును వెలిబుచ్చకుము. భగవంతునకే నీ దుఃఖమును నివేదించుకొనుము. అతడే అందరి దుఃఖములను పోగొట్టుటకు సమర్థుడు.

## ౨౯౫ భక్తరాజ్ శ్రీ యాదవ్‌జీ మహరాజ్

౧. నరకప్రాప్తికై యొక్కపాపమేచాలును. ఎవని హృదయములో అహంభావముండునో, వానిహృదయములో ఈశ్వరప్రేమకు అవకాశముండదు. కావున, నిర్మలహృదయుడవుకమ్ము.

౨. ఏవిశ్వాసముచే, నీకు, భగవంతుడు సంపత్తినిచ్చెనో, ఆవిశ్వాసముచేతనే, నీవుతిరిగి ఆ ధనమును ఈశ్వరసేవకై వినియోగించుము.

౩. శక్తికిమించి ఖర్చుపెట్టి తీర్థయాత్రలు తిరుగటకంటె ఇంటియొద్దనే ఉండి మనస్సును శుద్ధముచేసికొనుట మంచిది.

౪. మేలుచేయువారికి మేలుచేయుట సహజమే, కాని, కీడు చేయువారికి మేలుచేయుట సర్వశ్రేష్ఠము.

౫. ఈశ్వరుడు, మనుష్యులకొరకు అవతారమెత్తవలసివచ్చును కదా, కాని, మానవుడు తన్నుతాను ఈశ్వరునికి, అర్పించుకొనుటకు సాహసించడు, ఇది ఎంత అన్యాయము ? మీరే విచారించుకొనుడు.

౬. ఈసంసారమొకధర్మశాల, నిజమైనయిల్లు, ప్రభు ధామమే, పాపములచే తప్పించుకొనదలచువాడు, సదా ఈశ్వరుని స్మరించవలెను.

౭. కటికవాని, చేతిలోని గొఱ్ఱెపిల్లకు, ఎట్లు మృత్యువుతప్పదో, అట్లే విషయలోలుడు, నాశనముగాక తప్పదు.

## ౨౯౬ భక్త రాంచందర్

౧. భగవద్విధానమును సంతోషముగా పాటింపుము. ఏదియు కోరకుము. ధన సంపత్తిని నీదనుకోకుము. భగవంతునిదనే, భావముచే, బీదలకు, దుఃఖితులకు ఇమ్ము. సంగ్రహముచేయకుము. విషయములపై మమత, ఎంతవరకుండునో అంతవరకు భగవంతునిపై ప్రేమకలుగదు.

౨. కీర్తి, ప్రతిష్ఠల, కాశపడి సంసారముచే బంధించబడి నశించకుము. ముక్తికోరువాడు సమస్తమును త్యజించవలెను.

## ౨౯౭ భక్త శంతోబ, వారి ధర్మపత్ని

౧. భార్యాపుత్ర, కుటుంబ మోహములోపడి నశించకుము. ఏది నీభక్తికి విఘ్నకారియో దానిని వెంటనే త్యజించుము.

౨. సుఖభోగములకాశించి రుచిగల మంచిపదార్థములను తింటివా అవి నిన్ను నశింపచేయును. నీవుతినిన ఆరుగంటలలోపల ఆ మధురపదార్థములగతి ఏమగునో విచారించుము. మలమై దుర్గంధ మగును. కావున, అటువంటి తుచ్ఛపదార్థముల కాశించి భగవంతుని మరువకుము. నిరాడంబర జీవితమునే, గడుపుము. ఎండినరొట్టె తునుకలను తిని, మంచినీళ్లు త్రాగి జీవనము గడుపుచు, సదాధ్యానించు చుండుము.

## ౨౯౮ భక్త రఘునాథ్‌దాస్ పాత్ర

[ వీరు గొప్పకుటుంబము కలవారు. సమస్తమును త్యజించి భగవద్భజన చేయువారు. తన్నుతాను, భగవంతునకు, సమర్పించు కొనిరి. ]

౧. ఒకసారి, అర్పించుకొనబడిన తరువాత, శరీరముపై అధికారముండనేరదు. సమస్తము భగవంతునిదే. ఇక, నీకు మిగులున దేది? నేను, నాది అనుకొనుట, తప్పేకదా!

## ౨౯౯ భక్త నవీనచందర్

౧ భోగవాసనలున్న వానికి వైరాగ్యము కలుగదు; వైరాగ్యములేనిచో, త్యాగము చేయలేడు.

౨. ధన, మాన, కీర్తి, ప్రతిష్ఠలు మొదలగు భోగవాసనలు, మనస్సులో గుప్తముగా దాగియుండును, కావున వాటిని చాలా జాగ్రత్తగాచూచుచుండవలెను. లేనిచో, అవి నిన్ను నశింపచేయును.

## ౩౦౦ భక్త అనంత్ పంథీ

౧. సమస్త సంసార సంపదలను త్యజించి, హరి ధ్వజమును చేతబుచ్చుకొని ఇల్లిల్లు తిరుగుచు, భగవంతుని భక్తి ప్రచారము చేయుడు. సేవచేయుటే మానవునకు ముఖ్యమని మరువకుడు.

౨. సదా ధ్యానించుటకే జీవించుడు.

## ౩౦౧ భక్త గిరివర్

౧. భగవంతుడేది చేసినను మన కల్యాణమునకే చేయును. కావున, దిగులు జెందకుడు. సంతోషించుడు. తల్లిదండ్రుల సేయ చేయుటే ముఖ్యము. ఇదే నిజమైనభక్తి.

౨. జీవుడు చావడు. చావు, పుట్టుకలు కేవలము పరివర్తనములే. దీనికై దుఃఖించనేలా ? కర్మానుసారము జన్మవచ్చును.

౩. భగవద్విధాన ప్రకారమే, మన విధ్యుక్తధర్మమును నెరవేర్చుట ముఖ్యము. మన కర్తవ్యములను మనము నెరవేర్చుకొననిచో, దొంగలమే. మరియు విశ్వాసద్రోహుల మగుదుము. భగవంతుని సొత్తును నాది, నాది అనుటే ద్రోహము, పాపము.

## ౩౦౨ భక్త జయదేవుడు

౧. ధనము చాలాచెడ్డది. ధనవంతులు ముక్తి నొందుట దుస్తరము. ఇటువంటి పాపిష్ఠిధనమును ఎవరికిచ్చినను వారుకూడా నాశనమగుదురు. ఏ వస్తువు నీకు చెడ్డదో అది ఇతరులకు కూడా చెడ్డదే కదా. కావున, నీకేది చెడ్డదని తోచునో దానిని ఇతరుల కీయకుము. దానిని సంగ్రహించకుము.

౨. నిన్ను ద్వేషించినవారిని ప్రేమించుము. నమ్రుడవై సదా ధ్యానించుచుండుము.

౩. సమస్తమును, త్యజించుము. నాది అనేది యుండరాదు.

## ౩౦౩ భక్త రఘునాథ్‌దాస్

[ వీరు రాజవంశీకులు, గొప్ప ధనవంతులు. విరాగులు. సమస్తమును త్యజించి భిక్షావృత్తిచే, ఎండిన రొట్టెతునకలను తినుచు జీవించెడువారు. భిక్షనుకూడా అడుగుటమాని, వీధిలో అంగళ్లయొద్ద పడిన గింజలను యేరుకొని తినేవారు. అపుడపుడు చల్లను త్రాగియే తృప్తిపడేవారు. రాత్రి కేవలము రెండేగంటలు నిద్రించుచు సదా భజన సమాధిలోనే యుండెడివారు. ప్రతిరోజు ఒకలక్ష జపము చేయువారు. రుచులను కోరువారుకారు, నాలుక రుచి నెరుగరు. చిన్నచిన్న చినిగిన గుడ్డపేలికలనే ధరించి కాలము గడుపుచుండెడి వారు.]

౨. ఇతరులను చెడ్డగా తలంచకుము. ఇతరులు నిన్ను చెడ్డగా తలంచినచో అది నీ కర్మఫలమని తలంచుము.

౩. సంసారముయొక్క చింతలను విడచి నిరంతరము సత్సంగము చేయుచుండుము. సాధుసంతుల సేవచేయుము.

౪. పరనింద చేయకుము. నిన్ను ఇతరులు అవమానించినను, నీవు వారిని సన్మానించుము.

౫. ఇతరుల మనస్సును నొప్పించకుము. ఇతరులు నిన్ను కష్టపెట్టినను నీవు దుఃఖించకుము. వారిని ప్రేమించుము.

౬. కీర్తి ప్రతిష్ఠల కాశపడక, సరళ సచ్చరిత్రుడవై జీవయాత్ర గడుపుము.

## ౩౦౪ భక్త ప్రతాప్‌రాయ్

[వీరు గొప్పధనికులు. ఎండ వాన చలికి భయపడక వాటిని సంతోషముగా వహించేవారు. బట్టలు ఏమియు లేకుండెను. రుచికై తినేవారుకారు. దేనిని కోరువారును కారు.]

౧. ఎవనికి సంసార పదార్థములందాశ యుండునో వానికి మృత్యువనిన భయముండను.

౨. భగవంతుని ప్రార్థించి నీ కొరకై దేనిని యాచించకుము. తిండికుండగా ఇంకా అధికసంపాదనకై ప్రయాసపడి సంగ్రహము చేయుట పాపము. జీవించుటకే తినుము.

౩. ఇతరులు నిన్ను అవమానించినను కష్టపెట్టినను వారిని ప్రేమించుము. ఎందుకన వారిచే నీ దోషములను దిద్దుకోగలుగుదువు. వారు నీకు గురువులు, వారిచే నీవు పునీతుడవగుదువు. కావున వారిని సేవించుము.

## ౩౦౫ భక్త హరిదాస్

[వీరు బీద ముసల్మాను కుటుంబమునకు చెందినవారు. అడవిలో యుండేవారు. భజన చేయుచుండెడివారు. రోజు మూడులక్షల జపము చేయుచుండెడివారు. రేపటికని దేనిని యుంచుకునేవారుకారు. సదా మౌనముద్రలోయుండి ధ్యానించుచుండెడివారు.]

## ౩౦౬ భక్త మహేష్మండల్

[౧. వీరు హరిజన భక్తుడు. గొప్ప త్యాగి. ప్రతిరోజు కూలిచేసి జీవనము గడిపెడివారు. ఇంట్లో పిల్లలు మొదలగువారు ఉపవాసమున్నప్పటికిని, దొరకిన కూలిధనమును ఇతరులకు దానము ఇచ్చేవారు.]

౨. భగవంతు డేది చేసినా మంచికొరకే చేయును. భయపడకుడు, ఆయనను నమ్మి నిశ్చింతగా యుండుడు.

౩. ఏది కానున్నదో అది అయ్యే తీరును. కానిది కానేకాదు. వాటికై చింతించకుడు.

౪. నీ కపకారము చేసినవారికి, ఉపకారము చేయుము. వెత పడక వారిని ప్రేమించుము.

## ౩౦౭ భక్త పురుషోత్తం

[వీరు ఎవరిని ఏమియు అడుగువారు కారు. స్వయముగ కష్టించి సంపాదించియే తినువారు. ఇతరు లిచ్చినను, ముట్టక, ఎల్లపుడు నామజపము జరుపుచుండెడివారు. ఇంటింట నామజపము ప్రచారము చేయువారు. ఎపుడునూ సేవ చేయుచుండెడివారు. వృధా కాలము గడిపేవారుకారు. వారికి బాహ్యామెంతో, లోన అంతే. భేదము లేకుండును.]

## ౩౦౮ భక్త అంగద్ సింహా

౧. ఎక్కడ అమర్యాద, లోభము, దురాశ ఉండునో భగవద్భక్తి లేకుండునో, అక్కడ ఉండరాదు. భుజింపరాదు. ఏదేశపు రాజు లోభియో, దురాశాపరుడో, ఆదేశములోనే ఉండరాదు.

## ౩౦౯ భక్త విమల్ తీర్థ

౧. భగవద్విధానమును ఎవడు సంపూర్ణముగా విశ్వసించునో వాడు సదా శాంతముగా నుండును.

౨. నీకు ప్రాప్తించిన సమస్త పరిస్థితిని సంతోషముగా సదుపయోగము చేయుటే నీ ప్రథమ కర్తవ్యము.

౩. ఎవనికి జ్ఞానము, తత్త్వవిచారము కలుగునో, వానికి, నమ్రత, దయ కలుగును. అతడే భక్తుడనదగును.

౪. స్వార్థముచే ప్రేమ నాశనమగును. ఎచట త్యాగ ముండునో, అచట ప్రేమ యుండును. ఎచట ప్రేమ యుండునో, అచట ఆనంద ముండును.

## ౩౧౦ భక్త దన్నాజాట్

[వీరు ప్రతిజీవిలో భగవంతుడే గలడని, ప్రతిజీవిని ప్రేమించు చుండువారు.]

౧. ఎచట దీనులు, బీదలు, ఆకలిచే పీడితులై అన్నమును అడుగుచుందురో, అచట, స్వయముగా భగవానుడు మనచే సేవ చేయించుకొనుటకు వచ్చినాడని తలంచి, వారికి, ప్రేమచే నిష్కామ సేవ చేయుచుండుడు. దీనిని మరువకుడు. సమయము మించిన తిరిగి దొరకదు. రేపటికని వాయిదా వేయకుడు. రేపేమగునో ఎవరికెరుక? ఎవరేమి అడిగినను వారికి మీయొద్ద ఉన్నదానిని లేదనక ఇచ్చుచుండుడు. వెనుక ముందు, విచారించకుడు. భగవద్దాసులమని తలంచి జీవయాత్రను గడుపుడు.

## ౩౧౧ శ్రీ నాభ్రా

౧. నన్ను దూషించువాడు నాకు నా తల్లిదండ్రులకంటె అధిక ప్రియుడు. అతడు పాపము! తాను మునిగిపోయి నన్ను సంసారమునుండి తరింప చేయుచున్నాడు.

## ౩౧౨ భక్త నాగమహాశయుడు

౧. అసత్యమాడువారి స్నేహము చేయకుము. శాంతము, ఓర్పుగలగి, నిరాడంబరుడవై జీవించుము.

౨. భగవంతుడొకడే సత్యము. తక్కినదంతయు మిధ్య, దర్శన మగు వరకు, జీవితము బరువుగా నుండును.

౩. ఇతరులకు బట్టలులేనిచో, నీపైనున్న బట్టలనిచ్చి వారి అక్కరను దీర్పుము. నీకై చింతించకుము.

౪. ఎల్లపుడు పరమాత్ముని లక్ష్యముగా నుంచుకొనుము. గృహస్థుడుగా నుండుటనగా, అంతఃశత్రువులతో పోరాటము చేయుచుండుట అని తాత్పర్యము.

౫. తిండికై ప్రాకులాడక, తుదకు తవుడునైనా తిని తృప్తి పడుము. నీకున్నదానిలోనే ఇతరులకు పెట్టుము.

౬. ఎవరికైనను, నీచేహాని కలిగెనేని నీవు స్వయముగా నిన్ను నీవు, శిక్షించుకొనుము.

౭. ఇంద్రియ నిగ్రహముకొరకు, కఠినవ్రతములు, ఉపవాసములు చేసియైనను వాటిని నిగ్రహించుము.

౮. పరమేశ్వరుని సాక్షాత్కారము కానిదే ఈ దేహమునకు ఇంకాకూడు పెట్టవలయునా, అని భగవంతునిగూర్చి ఏడ్చి మొరపెట్టుకొనుము.

౯. తన అవసరములకైనను తాను యుంచుకోరాదు. ఇతరులకవసరమున్నపుడు తన అవసరములను లెక్కచేయరాదు.

౧౦. చీమలు, దోమలు, పిట్టలు, చెదలు మొదలగు సమస్తజీవులలో దేనిని చంపకుము. దేనికైనను హింసచేయకుము.

[౧. వీరు తనఇంటి స్తంభములకు చెదలు పట్టినచో దానిని చంపరు. తేళ్ళను, పాములను, కొట్టరు. అడవిలోని పిట్టలకై చెట్లకు నీళ్లగురుగులనుకట్టువారు. తనకు తిండికిలేకున్నను లేనివారి కిచ్చువారు.

౨. ఒకసారి తనఇల్లు కాలుచుండగా నిశ్చింతచే భగవదేచ్ఛ అనుచు సంతోషించెను. అగ్నిహోత్రునికి తృప్తికలుగ వలయునని కాలి మిగిలిన కట్టెలను ఆమంటలో బడవేసెను.

౩. వీరు ప్రపంచ విషయములే మాట్లాడెడివారు కారు. వీరికి ఇతరులపై ఆగ్రహము కలిగినపుడు, తననుతాను శిక్షించుకొనువారు. అపుడు దేహముపై దయాదాక్షిణ్యము చూపువారుకారు.

౪. వీరు బీదలయిండ్లకుపోయి వారికి ఉచితముగా వైద్యము చేయువారు. ధనికులగుచో వారిచే కేవలము ముందుఖరీదునే, తీసుకొనువారు. దేహకష్టమునకై ఏదియు తీసుకొనరు. నిష్కామసేవ చేయువారు.]

## ३ဂ३ భక్త పరమేష్టిదర్జీ

౧. కీర్తి, ప్రతిష్ఠలను కోరకుము. వీటిని విడువదలంచుకొనుచో అన్యప్రదేశమున ఏకాంతములో జప తప, ధ్యానములు చేయవలెను. ఈకీర్తి ప్రతిష్ఠలు చాలా బలవత్తరమైనవి. వీనిచేగొప్ప ప్రమాదము సంభవించును, కాన కడుజాగ్రత్తతో వీటిని జయించ వలయును. వీటిని జయించుటకై, నీసర్వమును మరి నీప్రాణమునైనా అర్పించుటకు వెనుదీయకుము.

## ३౧४ భక్త గోపాల్ చర్వాహ

[వీరు తన గురువుగారి మాటయందు శ్రద్ధవహించి యిరువైపదు దినములు భగవంతుని గూర్చి ఉపవాస దీక్షచేసి, ఆదీక్షను సంతోషముగా పూర్తిచేసిరి. భగవ దర్పితమైన ప్రసాదమును, ముందు ఇతరులకుపెట్టి మిగిలిన దానిని స్వీకరించువారు.]

౧. ఒకానొక దినము చావు తప్పదుకదా, కావున గురువాజ్ఞను తృణీకరించి, పాపముచేసి మరణించుటకంటె గురునాజ్ఞ ప్రకారము ధర్మసాధనలో మరణించుట శ్రేష్ఠము.

౨. అంతరాత్మ ఆజ్ఞను ఆలకించుచు, దానిప్రకారము వర్తించుట ముఖ్యము.

## ३౧५ భక్త మణిదాస్‌మాలి

[వీరు కీర్తనచేయుచు ఊరూరు ఇల్లిల్లు తిరుగుచు, ఇతరులకు ప్రబోధము చేయుచుండిరి. ఎవరిని ఏదియు అడిగెడువారు కారు.]

౧. దీనులను దరిద్రులను, ఆదరించి వారికి సేవచేయుడు. ఇతరుల కెపుడును చెడు చేయకుడు.

౨. సమస్త దోషములను, త్యజించి భగవంతుని స్మరించుచుండుడు.

## ౩౧౬ భక్త కూబాకుమార్

౧. ధనమునకు మూడు లక్షణాలు, (1) దానము. (2)భోగము. (3) నాశనము. (1) సుఖభోగములకై ధనములను వ్యవయము చేయుచో పాపము సంభవించును. లోభము వృద్ధియగును. (2) అది చెడుకార్యములకై వ్యయముచేసినచో పాపము ప్రాప్తించును. ధనము నాశనమగును. (3) దానముచే ధనము సద్వినియోగమై ధర్మము కలుగును.

౨. ధనమును సంగ్రహించకుడు. లేనివారికీయుడు, మీ కొరకై చింతించక భగవంతుని విశ్వసించుడు.

## ౩౧౭ భక్త దీనబంధూదాస్

౧. జీవునిచే ఎవరికేలాటి సంబంధముండదు. శరీరమే సంబంధమునకు కారణము. జన్మించక పూర్వము ఎవరితో ఎవరికి ఏలాటి సంబంధములేకుండెను. మృతినొందిన తదుపరి కూడా ఎవరికి ఏలాటి సంబంధముండదు. ఈ మధ్య కొలదికాలమే కించిత్ సంబంధముండి మరణించిన వెంటనే ఆ కాస్త శరీర సంబంధము సమాప్తమగును. ఈ సంసార మొక, సంత, ఇందు జీవులు వచ్చుచు పోవుచుందురు. ఈ లాంటి మాయా సంసారమును నశించే శరీరమును చూచుకొని భ్రమ జెంది నాశనమగుట వెఱ్ఱితనము. ఇదంతా అజ్ఞానమే.

## ౩౧౮ భక్త సదన్ కసాయి

[వీరు, ఎన్ని ఆపదలు వచ్చినను సంతోషముతో సహించి అనుభవించిరి. ఎవరు నిందించినను. చెడుచేసినను, తిట్టినను వీరు ప్రశాంతముగ నుండేవారు. నేను నిర్దోషినని రుజువు చేయువారుకారు. మౌనముగనుండువారు. ఏ అపరాధములేకయే, వీరి రెండు చేతులు ఖండింపబడినను, ఇది ప్రభువుయొక్క లీల అనుచు సంతోషించెను.

భగవదేచ్ఛయే, నా ఇచ్ఛ అనువారు. పూర్వజన్మ పాపముచే నా చేతులు ఖండింపబడి పాపనాశనమైనందుకు నాకు ఏలాంటి దుఃఖమును చింతయు లేదని శాంతము వహించిరి. భగవంతుని కృపచే అన్నియు చక్కబడును. ఇక భయమెందులకు.]

## ౩౧౯ భక్త సాల్ బేగ్

[వీరు, సన్న్యసించి దేశ, దేశములు తిరిగి భగవంతుని మహిమను, వారి ప్రబోధములను ప్రచారము చేయుచుండెడివారు. భగవంతుడే నన్ను ఈ సంసార రోగమునుండి కడతేర్చి నూతన జీవనమును ప్రసాదించినాడు, కావున, ఈ శరీరమును, నా జీవనమును, వారి సేవకే వినియోగించుట నా యొక్క ధర్మమనుచు అందరికి బోధించువారు, ప్రతి జీవిని ప్రేమించి సేవ చేయుచుండిరి.]

## ౩౨౦ భక్త శేఠ్ రమణ్‌లాల్

[వీరు గొప్పదయాపరులు, నౌకరులు చెడుచేసి ఎంత నష్టపరచినను, వారిని కోపించక క్షమించువారు.]

౧. నాచే స్వయముగా తప్పుజరుగుచుండ, ఇతరుల తప్పులడుగుటకు నాకు హక్కులేదు. ప్రతిమానవునిచే తప్పులు జర్గుచుండును. దీన్నికై కోపము, దుఃఖము, చింత ఏల ? ఎవడు తన జీవితములో ఎన్నడు తప్పుచేయలేదో ఎవడు నిర్దోషియో, వాడు ఇతరుల తప్పుల నడుగుటకు హక్కుదారుడగును.

౨. పాపసంచయము యొక్క ధనము ఎవని యొద్ద యుండునో వాడు చెడునదేగాక, తన ఇంటిని కూడా చెరుచును. ఇతరులకష్టార్జితపు సొత్తును ముట్టరాదు. అది నీకు పాపమై నిన్ను నశింపచేయును. ఇతరుల సొత్తు పాపమునకు హేతువగును.

౩. నీవు స్వయముగా కష్టించిసంపాదించిన ధనము నష్టమైనచో దుఃఖించకుము. ఎందుకన పాపము నశించినదని సంతసించుము.

పాపము నశించగానే ముక్తిలభించును. ధనము నశించినచో, అది భగవంతుని కృపచే జరిగినది. అది నీ మంచికే. పోవునది, నీదికాదు, అది పాపపు వస్తువు కాన, భగవంతుడు దానిని, నీనుండి తొలగించినాడని సంతోషించుము. భగద్విధానమును వ్యతిరేకించుటే దుఃఖమునకు కారణము.

౪. ధన, సంపత్తులను సంగ్రహము చేయకుము. లేని వారికిచ్చు చుండుము. ఎవరైనా, నిన్నడుగకనే ఏ వస్తువునైనను తీసికొనుచో, ఆగ్రహపడకుము. వారిది, వారికి చెందినదని సంతోషించుము. నేను ఇచ్చుట, ఇతరులు తీసుకొనుట అను ఒక పనియుండెను, అది తప్పినదని ఆ వస్తువు తీసికొనినవారిని గౌరవించుము. పోవునది దుఃఖించినా యుండనేరదు. కావున దుఃఖించుట వ్యర్థము.

## ౩౨౧ భక్త దత్తాత్రేయ అణ్ణాబోవ

[వీరు గొప్పవిరక్తులు. వీరికి బాహ్యదృష్టియే లేకుండెను. వీరు కట్టుకొనిన దోవతిని ఇతరులకిచ్చి దిగంబరులై, భజనచేసిరి. ఎవరో వీరి వీపుమీద అగ్ని వేసిరి. దానిచే వీపుకాలి పుండుపడి, దానిలో పురుగులు పడెను. అట్టి పురుగులను, తీయువారుకారు. కాకులు వీపుపై వ్రాలి ఆపురుగులను తినుచుండెను. అదిచూచి ఇతరులు 'ఇదియేమని' అడుగగా, "నాయనా ! ఈశరీరము, అతిథులైన కాకులకు ఆహారముగా ఆపురుగులను తినుపించుచుండ నేను వాటిని అదలించుటేలా ? దానికై నేను దుఃఖించుటెందులకు ?" అనుచు సంతోషముగా, నవ్వుచుండెడివారు.]

## ౩౨౨ భక్త దాదామేకన్ (కచ్ దేశము)

[వీరు ఎల్లపుడు ప్రజాసేవ చేయువారు. దీనులకు, ఆకలిచే బాధ పడువారికి అన్నముపెట్టి రక్షించువారు. బాటసారులగు వారికి తగు ఉపకారము చేయువారు. ఎవరిని ఏదియు అడుగరు. ఏది దొరికినను,

దానిని ఇతరుల కిచ్చువారు. "ఈ రోజుండి రేపు, చచ్చునట్టి నాకు సంగ్రహమెందుల"కని దేనిని ఉంచుకొను వారు కారు.]

౧. నీవు జీవించియుండు వరకు ఎవరిని ద్వేషించకుము. అందరిని ప్రేమించి సేవించుము. మృదుమధురముగా మాట్లాడుము. మానవుడు మృతినొందిననూ, మాటమాత్రముండి పోవును. నీవు వీటి నాచరించిన, చాలును.

## ౩౨౩ శ్రీ దార్‌సీ భక్త్

[వీరు, పాంచాల దేశభక్తులు. (1) కలియుగములో ముక్తి నొందుటకు, రెండుమార్గములు గలవు. (1) భగవద్భజన ధ్యానము. (2) బీదలకు, దీనులకు, అన్నార్తులకు, భోజనము పెట్టుట. లేనివారికి నీయొద్ద యున్న దానిని లేదనకుండా ఇచ్చుట. వీటిని ఎవడు వర్తించునో వానికి, ముక్తితప్పదు. అని వీరు చెప్పుచుండువారు.]

## ౩౨౪ భక్త షాః అబ్దులా లతీఫ్

[వీరు, ఎల్లపుడు శాంతముగా నుండువారు. సదా ఇతరులకు ప్రబోధము చేయుచుండు వారు.]

౧. భూత భవిష్యత్తులను గూర్చి చింతచేయకుడు. వర్తమాన కాలమును వ్యర్థపుచ్చకుడు.

౨. ధనాశను, స్వార్థకామమును వీడినచో సుఖము శాంతియు కలుగును.

౩. ప్రేమాగ్నిలో, వేడియుండదు. ప్రకాశముండును. ప్రేమతో స్వార్థము చేరెనేని, వేడిమితో మంటపుట్టును.

౪. నిజమైన భక్తుడవు కాదలచితివా, దేని జోలికిపోక, నిశ్శబ్దముగా, భగవద్ధ్యానము చేయుచుండుము.

౫. వాణినిబంధించి, మౌనివికమ్ము. ఎంతవరకు పూర్ణవిరక్తుడవు కావో అంతవరకు నీమనస్సు నిర్మలము కాదు.

౬. బాహ్యాడంబరములనుత్యజించుము. ఇతరులమెరమెప్పులకై ఏదియు చేయకుము.

## ౩౨౫ భక్త హరిదాస్ ఠాకూర్‌వాలా

౧. అసత్యమును పలుకకుము. ఎవరిని నిందించకుము. నీయొక్క ప్రశంసను నీవు చేసుకొనకుము. ఇతరులు చేసినను, వినకుము. ఏలాంటి వ్యసనములను పెట్టుకొనకుము.

౨. నీ ఆత్మ సమానులుగా ఇతరులను దలంచి వారికి ఏలాటి, హానియు, కలిగించకుము. ఇతరుల మనస్సుల నొప్పించరాదు.

౩. పరధనమును ముట్టకుము. అభిమానముచే హృదయమును మైలపరచకుము. పరస్త్రీలను కన్నెత్తి చూడకుము. మనస్సులో చెడు తలంపులు రానీయకుము.

౪. నీశక్త్యాను సారము ఇతరులకు మేలు చేయుచుండుము. భగవంతుడేది చేసినను, నామేలుకే చేయునని, సంతోషించుచుండుము.

౫. మొదలు నీవు భగవద్విధానము, ననుసరించి అనుభవించి తదుపరి ఇతరులకు, భగవద్విధానమును బోధించు చుండుము.

౬. ఆత్మతో జపించుటే ముఖ్యము. నిద్రనుండి లేవగనే, అన్నిటికంటె ముందు, చిత్తశుద్ధి చేసికొనుము.

## ౩౨౬ శ్రీ శంఖ్ - లిఖితులు

[వీరిద్దరు అన్నదమ్ములు. శంఖుడు పెద్దవాడు. లిఖితుడు చిన్న వాడు. వీరు విరక్తభక్తులు. వీరు. వేరు, వేరుగా ఆశ్రమముల ఏర్పాటు చేసికొని ధ్యానించుచుండిరి. ఒకరోజు లిఖితుడు అన్నగారి ఆశ్రమునకు వచ్చి ఆకలిచే అన్నగారి ఆజ్ఞలేకనే, యొక పండును తెంపి తినెను.

శంఖుడది చూచి "తమ్ముడా! నీవు, నా ఆజ్ఞలేనిదే పండును చెట్టు నుండి తెంపితివి. కావున, నీవు చోరుడవే! ఈ దోషము నీకు తప్పదు. కాన, నీవు రాజ్యసభకుపోయి, ఈ తప్పునకు తగిన శిక్షనుపొంది ప్రాయశ్చిత్తము చేసికొనుమని చెప్పగానే అపుడు లిఖితుడు సంతోషించుచు రాజసభకుపోయి, దొంగకు తగినశిక్ష విధించుడని వేడుకొనగా, విధాన ప్రకారము, లిఖితుని రెండు హస్తములు ఖండింపబడెను. ఆ శిక్షకు సంతోషించుచు వచ్చి అన్నగారికి నమస్కరించి ధ్యానమగ్నుడాయెను. బ్రహ్మముహూర్తమున. నిత్యవిధి ప్రకారము, సూర్యునకుఅర్ఘ్యమిడు సమయమున, అన్నగారి తపశ్శక్తిచే, తన భక్తిచే, భగవత్కృపచే యథాప్రకారము రెండు హస్తములు ప్రాప్తించెను. దానికై సంతోషించుచు నిశ్చింతగా సదా ధ్యానించుచుండెను.]

## ౩౨౭ భక్త మణివక్కా బ్రాహ్మణుడు (మగధదేశము)

[వీరు; వీరి పత్ని ఇద్దరు విరక్తులే. వీరిద్దరు సర్వస్వమును త్యజించి, సాధువేషధారులై వేరు, వేరుగా వెడలిపోయి లోకోపకారకులై ఇద్దరు కలసియుండక తపోనిష్ఠులైరి.]

౧. ఇతరుల దోషములను చూడకుము. నీవు దోషములను చేయకుము. నీదోషములను చూచి ఇతరులు నిన్ననుకరింతురు. దానిచే వారు పాపకార్యములు చేయుచో అట్టి పాపములకు నీవే బాధ్యుడవగుదువు.

౨. నీ జీవితమును దోషరహితముగా చేసికొనుము. దీనిని మరువకుము.

## ౩౨౮ శ్రీ శ్రేణిక్ మహారాజు

[వీరు సాధుస్వభావులు. ఒకడు కపటవేషధారియై యొక సాధురూపమున రాజును పరీక్షించుటకై చేపలు పట్టుచుండెను. రాజు,

అది చూచి 'ఇంత విపరీతకర్మ ఏల' అని అడుగగా 'ధర్మాధర్మములు నాకు తెలియవు. ఈ చేపలను విక్రయించి చలినుండి కాపాడు కొనుటకై గొంగడికొనెదననగా, ఆ రాజు నాయనా! నీవు జనన మరణ సంసారచక్ర బంధములోనివాడవే' అనుచు మౌనమువహించి రాజు వెడలిపోయెను.]

౧. వీడు చెడుపనిచేయుచున్నాడని ఎవరిని నిందించరాదు, ఎవనికర్మవానిది. అట్లు ఒరుల నిందించుటచే నేను మంచివాడనను భావమేర్పడి అహంకారముగలుగును. అందరిని సమదృష్టితో చూడ వలెను. ఒకటి మంచి వేరొకటి చెడ్డ అను భేదభావముండరాదు. భేద భావముండెనా పతనమగుదువు.

౨. తప్పుపనులు చేయువారికి, దుష్టులకు శాంతముగా చెప్ప వలెను. మీ చిత్తమని వారిపై దయచూపినచో వారి మనస్సు మారును. సదుపదేశముచే పతితులను దారికి తీసికొని రావలెను. చెడ్డ వారను ద్వేషముచేత వారు దారికిరారు. మరింతచెడుదురు. దుష్టులను క్షమించినచో వారికి మంచి బుద్ధికలుగును. శక్తిగలవాడు క్షమించుటే ధర్మము. వారికి అదే ప్రాయశ్చిత్తము.

౩. నీయొద్ద ధనములేకున్నచో కష్టపడి కట్టెల నమ్మి వచ్చిన డబ్బుచే లేనివారికి దుఃఖితులకు సహాయము చేయుము. ఇతరుల దుఃఖములను పోగొట్టదలంచువాడు తన్నుతాను సమర్పించుకొన వలయును. స్వర్గసుఖములను కూడా త్యజించవలెను.

౪. సదా ధర్మయుక్తమైన ప్రసంగములనే చేయుచుండుము కాని, సాంసారిక ప్రసంగములను కదాపిచేయకుము. లేదా, మౌనము వహించుము.

౫. నిరాశగలవాడే ముక్తుడు, స్త్రీ, ధనము, కీర్తి మొదలగు వాటికంటే మహత్తరమైనది, ఆత్మ. కావున, పైవాటినివిడచి, ఆత్మను వెదుకుము.

## ౩౨౯ భక్త శేక్‌మీగార్ (శ్రావంతీ నగరము)

[వీరు ఒకరోజు భోజనము చేయుచుండగా, యొక భిక్షుకుడు వచ్చి యాచించెను. భిక్షపెట్టకనే తాను భోజనము చేయుచుండగా తన కోడలు ఆ భిక్షుకునితో "ఓస్వామీ! మా మామగారు పాచిన అన్నమునే తినుచున్నారు, కావున పోయిరమ్మనెను". అదివిని వీరు కోడలిపై ఆగ్రహపడెను. అపుడు కోడలు మామనుచూచి "మామా! పూర్వజన్మ పుణ్యఫలముచేతనే మానవునికి ధన సంపత్తులు లభించును. కదా, ఈజన్మలో క్రొత్తపుణ్యముచేయక సంచితముచే లభించిన దానినే తినుట అది పాతదే కదా, అందుకే పాచినఅన్నమును తినుచున్నారని అంటిని. ఇందు తప్పున్నచో నన్ను క్షమింపుడు. అని సమాధానము చెప్పెను. వీరు కోడలుచెప్పిన జ్ఞానతత్త్వమునకు సంతసించిరి.]

౧. ఏది ఎవనిభాగ్యములో కలదో అది తప్పక వచ్చి తీరును. మరి చింతఏల ? సంగ్రహచింతను విడుడు.

## ౩౩౦ భక్త వాసుదేవుడు

[వీరు చైతన్యులవారి పాదములపైబడి 'స్వామీ! ప్రజల పాపములను, నా నెత్తిన వేసుకొనెదను. నేను నరకములో ఎన్నినాళ్లయినను బాధపడు చుందును, కాని ప్రజలదుఃఖములను చూచుచు నేను భరించలేను. కావున నాకోరికను ఫలింపచేయుడని' వేడుకొనెను.]

## ౩౩౧ శ్రీ త్యాగరాజులవారు

[వీరు భగవద్విశ్వాసులు. ఎవరియొద్ద నేదియు గ్రహించెడివారు కారు.]

౧. సమస్త సంసార ప్రలోభములనుండి చిత్తమును తొలగించి పరమాత్మవైపునకు త్రిప్పుము.

౨. తుచ్ఛమైన ధనసంపదలకు స్వర్గసుఖాదులకు ఆశపడి నశించకుము. వైరాగ్యమే సమస్త వికారములను భస్మము చేయును.

౩. కీర్తి, ప్రతిష్ఠా, పదవులకు ఆశపడి నీ జీవితమును పాడుచేసికొనకుము.

౪. నీహృదయములో ఏభావముండునో అదే బాహ్యమున దృశ్యమగును, కావున రాగద్వేషము లుండరాదు.

౫. పవిత్రమైన మనస్సు గలవాడవై భగవంతుని ధ్యానించుచుండుము.

## ౩౩౨ శ్రీ రవీంద్రనాథ్ ఠాగూర్

౧. నిరంతర త్యాగనిరతిలోనే జీవితముయొక్క నిజమైన స్థితి ఇమిడి యున్నది. త్యాగశీలము పరిపక్వమైనప్పుడే జీవితము పరిపూర్ణమగును.

౨. భాగ్యవంతులవద్ద నున్న ఐశ్వర్యమును చూచి మోసపోకుడు. అది వారిదికాదు బీదల రక్తమునుండి వచ్చినదే, ఆ సంపత్తి.

౩. న్యాయమే బలముగా, శాంతమే భూషణముగా దలంచి వాటి ననుకరించ వలెను.

## ౩౩౩ భక్తిమతి రబియా

౧. భగవదాజ్ఞానుసారము వర్తించక పోవుటే దుఃఖమునకు కారణము.

౨. నీతోసహా సర్వస్వము భగవదర్పితమైన తరువాత సంపద, ధన, ధాన్యములు, నీవెట్లగును? నాది అనుటకు నీకు హక్కు లేదు. శరీరమే నీదికానపుడు, శరీరమునకు సంబంధించిన సామాను నీదెట్లగును ?

౩. నీవు దరిద్రుడవైనను, ఇతరుల నేదియు అడుగకుము. అడుగుట లజ్జాకరమే. సమస్త జగత్తునకు పరమాత్ముడు ప్రభువైయుండ

నీవు ఇతరులను యాచించుట న్యాయమా ? నీకు కావలసిన దానిని వారే సమకూర్చెదరు. వారి ఇచ్ఛానుసారమే ఆచరించుట నీ విధి.

## ౩౩౪ భక్తిమతి కర్మవతీబాయి

౧. ప్రపంచమునకు నేను భక్తుడనని, ప్రదర్శించు కొనుటతప్పు. జీవముండగ చచ్చుటే, పురుషార్థము. అనగా (జీవన్మృతుడగుట) ఏ కోరికలు లేకుండుటే జీవన్మృతుడన బడును.

## ౩౩౫ భక్తిమతి గజదేవి, హరదేవి

౧. దుఃఖములను సహించుడు. ఇతరులు తిట్టినను అవమానించినను, వాటిని మీరు గ్రహించకుడు. ఆ తిట్లు మొదలగునవి తిరిగి ఎవరివి వారినే చేరును. దీనిగూర్చి చింతించక, వారి గుణ స్వభావమని తలంచి వారిని ప్రేమించుడు. అపకారము చేసినవారికి ఉపకారము చేయుడు.

## ౩౩౬ భక్తిమతి కుంవర్‌రాణి

[ఈమె ఎండిన రొట్టెతునుకలనే తిని జీవయాత్ర గడుపుచుండునది. ఏవస్తువును కోరునదికాదు. ప్రతి జీవిని ప్రేమించుచు సేవచేయుచుండెను. సదా సాధన, భజన చేయుచుండెను. కేవలము చాపమీదనే పరుండునది. రాత్రి కేవలము నాలుగు గంటలే నిద్రించుచు మిగిలిన సమయమును ధ్యానములో గడుపునది. ఇతరుల కెట్లుపదేశించుచుండునో అట్లే తన జీవయాత్ర గడుపుచుండెను.]

## ౩౩౭ భక్తిమతి కాన్హోపాత్ర

౧. ఈ లోకములో యున్న సమస్తపదార్థములు, దుఃఖచాయకములే. భోగములు అభాగ్యములు. ఏ పదార్థములయందును సుఖదుఃఖములు లేవు. మానవుల ఇచ్ఛ ఎట్లుండునో అట్లు భాసించును. ఒకవస్తు వొకనికొకప్పుడు సుఖము నిచ్చును, అదే వస్తువు ఇంకొక

పుడు దుఃఖము నిచ్చును. ఎట్లనగా, గొంగడి చలికాలములో కప్పు కొనిన సుఖము నిచ్చును, అదే గొంగడి ఎండకాలము కప్పుకొనిన దుఃఖము నిచ్చును. సుఖ దుఃఖములు మనలోనే యున్నవి. పదార్థములందు లేవు.

## ౩౩౪ భక్తిమతి జనాబాయి

౧. ఆత్మ పరీక్షచేయుచుండవలెను. మనము చిన్ననాడున్నట్లే ఇపుడులేముకదా, ఎట్లు శరీరము పెరిగినదో అట్లే భక్తి ప్రేమ పెరిగి నదా, లేదా అని పరీక్షించుచుండవలెను.

౨. భగవద్భక్తియున్నచో ప్రపంచములోయుండి పరమార్థమున తరించవచ్చును. నిష్కామకర్మ చేయవలెను.

౩. అందరిని సమానముగా చూడుడు. ఇదే విశ్వప్రేమ. దీనిని ఆచరించితిరా, చాలు.

౪. దృష్టిని మార్చుకొనుము. అపుడే విశ్వమంతయు బ్రహ్మ స్వరూపముగా గనిపించును.

౫. తమ తమ కర్మల ధర్మశాస్త్రానుసారముగ నడుచుకొనుచో జీవితము సఫలమగును.

## ౩౩౫ శ్రీ సాధూమాత

౧. తన్నుతాను తెలిసికొనిన తగవేమియుండదు. తన్ను తెలియక ప్రాపంచిక విషయముల మునుగునేని తగవులేర్పడి, అశాంతి కలుగును. తన్నుగాంచక ఎన్నిగాంచినను, ఆశ పెంపొందుచునే యుండును.

౨. ఆనందము కావలసియుండిన అహంకారమును విడవ వలయును. పుణ్యముకావలసియుండిన, కోపమును దరిజేరనీయరాదు. ముక్తి పొందవలయునని యున్న సమస్తబంధములను త్రెంచివేయ వలయును.

౩. పరులతప్పులనే, కనిపెట్టువారు, కాకివంటివారు. అందరిలో మంచినే వెదకువారు, హంసవంటివారు. చెడువాక్యములు చెప్పువారు, గుడ్లగూబవంటివారు.

౪. కాలునినోటిలో పటికబెల్లపుముక్కవలెనున్న ఈ జీవితము కొరకు ఆశించుట, చింతించుట, మోహించుట, కోపించుట మొదలగు వ్యసనములు, మనకు, దేనికి ?.

౫. అన్నహితవు లేనివారికి, స్థూలశరీరము కృశించును. ప్రపంచ విషయములలో హితవులేనివారికి, సూక్ష్మశరీరము శుష్కించును. దేహాభిమానము లేనివారికి, కారణదేహము నశించును. ఇదేముక్తి యనబడును.

౬. అన్నిభాషలలో, మితభాషమంచిది. యోగములలోకెల్ల, సమరసయోగము మంచిది. దానములలోకెల్ల, నిదానమే మంచిది.

౭. సుఖముకొరకు, గౌరవముకొరకు, ప్రయత్నించుట నిష్ఫలము. ప్రతిప్రాణిని దైవమనినమ్మి సేవించిన, సమస్త సుఖములు, గౌరవములు లభ్యపడును.

౮. మాటలు తగ్గించుకొనినగాని, మనస్సు నిలువదు. మనస్సు స్వాధీనమునందుంచు కొనుటయే, మాయను త్యజించుట.

౯. పరులసొమ్ము నాశించుటకన్న తన ప్రాణము తీసికొనుట మంచిది. ధర్మములు బోధించుచు, అధర్మముగా నడుచుట తప్పు.

౧౦. వినుట, వినోదమునకే. అనుట, ఆడంబరమునకే. అనుష్ఠించుట ఆత్మనుబొందుటకే.

౧౧. గాదెలో ఎలుకలుండిన, ధాన్యమును పొల్లుజేయును. అట్లేహృదయములో అహంకారముండిన ఆనందమును గుల్లజేయును.

౧౨. విశ్వప్రేమయే ఈశ్వరపూజయని, నమ్మవలయును.

౧౩. గర్వముచే చేయు ధర్మము, కోపముచే చేయు సేవయు, ప్రేమలేనిచోట చేయు భోజనము వ్యర్థములే.

౧౪. దృశ్యము కలదను వాసనను, గురుబోధచే తుడచివేయ గలుగునపుడే ముక్తియనెడు నిర్వాణ, స్థితి స్వయముగా సిద్ధించును.

## ౩౪౦ శ్రీ శారదామణిదేవి (పరమహంసగారి సతి)

౧. ఈ ప్రపంచమొక బురదగుంట సుమా! భ్రమపడకుము. భగవంతుని స్మరించుటచే నిర్మలుడవగుదువు.

౨. ఇతరుల బాధలను వహింపుము. పాపముల నొప్పుకొను వారికి పాపనాశన మగును.

౩. కామినీ, కాంచనము ఈ రెండింటిని వదలితివా వెంటనే ముక్తి లభించును.

౪. ఏకాగ్రతచే భగవంతుని రెండు నిమిషములైనను ప్రార్థించుట శ్రేష్ఠము. చంచలమగు మనస్సుచే గంటసేపు ప్రార్థించినను వ్యర్థమే.

౫. మానవుల కాశయున్నంత కాలము జన్మలుతప్పవు. తుదకొక కలకండ పలుకు తినవలెనని, ఆశయున్నా పునర్జన్మ తప్పదు. కోరికలులేని వానికి ముక్తి తప్పదు. ఏజన్మలో ఆశలు పూర్తిగా నశించునో అదే తుట్టతుది జన్మ.

౬. నీవు సత్కర్మలు చేయుదువేని, అవి నీ పూర్వకృత దుష్కర్మలను పోనాడును. ధ్యాన జప పారమార్థిక చింతనాదులచే పూర్వ పాపములు నశించును.

౭. ఏమితిందునా అని ఆలోచించకుము. ఏది దొరుకునో అదే తిని తృప్తిపడుము. కడుపులో పడగానే మలమే అగునుకదా, దానికై ఇంత ఆతురత ఏల? తిండికాసించి నశించకుము.

౮. ఇతరుల గురించి చెడుచెప్పకు, చెడు తలంచకుము. ఇతరులు నిన్నవమానించినను వారిని ద్వేషించక ప్రేమించుము.

౯. ప్రతిదినము భగవన్నామము పది ఇరవై వేలసార్లు ఉచ్చరించినచో మనస్సు స్థిరమగును. ఇది నా స్వానుభవము, ఇది నిశ్చయము.

౧౦. దేనినైనను సంగ్రహించి యుంచుకొంటివా నాశన మగుదువు. కోరికలే నాశనమునకు కారణము. కోరికలు కలిగినపుడెల్ల కన్నుల నీరునిండ భగవంతుని ప్రార్థించుము.

౧౧. ఎల్లపుడు ఆత్మవిచారముచేయుచుండుము. మమకారము, ఈర్ష్య, క్రోధము, లోభములను, త్యజించుము.

౧౨. ఒకనాటి క్రమభంగము వలన చాలనాళ్ల నిత్యాచరణ చెడిపోవును. ఓర్పు, పట్టుదల, నిష్ఠ విడువజనదు.

౧౩. ఈ లోకములోని దురవస్థలన్నిటికిని మూలకారణము, ధనమే. అది మీ మనస్సును భ్రమలోజిక్కించి నాశనము జేయును.

౧౪. ఎంత కొద్దిపాటి వస్తువైనను దానిని నిరాదరణ చేయరాదు. నీవు ఒకవస్తువును గౌరవించినచో, అదికూడా నిన్ను గౌరవించును.

౧౫. సంసారమున మునిగియుండు వారికి దేనిని సాధించుటకు వీలుపడదు. కావున సమస్త కోరికలను విడువుడు.

## ౩౪౧ శ్రీ కస్తూరిబా గాంధి

౧. నీవారందరు భుజించిన తరువాతనే నీవు భుజించుము. మిత జీవనము మితాహారముతో వర్తించుము.

౨. ధన సంగ్రహము చేయకుము. నీ తిండికి మాత్రమే యుంచుకొని తక్కినదానిని దానము చేయుము. రేపటికని దాచుకొనకుము.

౩. ఇతరులపైన ఆధారపడక నీపనిని నీవే చేసుకొనుము. పరాధీనుడవు కారాదు.

౪. రుచులనుకోరి ఘనపదార్థములను తినకుము. ఉప్పు పప్పును తినకుము. ఆడంబరములను వదలుము. సాధువృత్తి నవలంబించుము.

౫. భగవంతుడేది చేయదలచునో అదేచేయును, దానికై నీవు చింతించకుము. అన్నిటియం దాశలు వదలి ఈశ్వరుని ధ్యానించుము.

౬. వృథాగా మాట్లాడకుము. మితభాషివికమ్ము. భగవద్గీతను ఆచరణలో పెట్టక వృథాచదివినచో లాభములేదు. ఆచరించితివా ముక్తి తప్పదు.

## ౩౪౨ శ్రీ సోదరి సుశీలాదేవి

౧. శాంతిచే నీఊపిరితిత్తులను నిండించు చుండుము. ఎల్లపుడు ఓంకారమును జపించు చుండుము.

౨. నీవు గ్రహించునది ఆచరణయం దుంచుము, మౌనము వహించుము, అవసరముండుచో, జాగ్రత్తగా మాట్లాడుము.

౩. ఉపవసించుము, మితాహారమును తినుము. శాంతించుము చెడుకార్యము లన్నింటిని విడచి, ధ్యానించుము.

## ౩౪౩ శ్రీగోదావరీమాత

౧. శరీరమును, మనస్సును, ధనమును, ఈ మూడింటిని భగవంతుని కర్పించితివా తక్షణమే ముక్తి దొరుకును.

౨. భగవదర్పితముకాని జీవితము వ్యర్థము. దానిని కాపాడినను పాపమే. ప్రయోజనములేదు.

౩. మానావమానములను, సుఖదుఃఖములను సహించి, సమదృష్టిచే భరించుటే ముక్తికిదారి.

౪. నేనువేరు, నాది అనుటవేరు. నేను అనునది కనబడదు. నాది అనునది కనబడును. నేను అనునదే ఆత్మ, నాది అనునదే శరీరము. పామరులు నన్ను, నాది, అనుదానినే నమ్మి బంధించ బడుదురు.

## ౩౪౪ శ్రీ మాతా మదాలస

౧. పరులను నిందించకుము, వినకుము, ఇది చాలా గొప్ప పాపము. సమస్తకామములను త్యజించుము. సత్సంగము చేయుము.

౨. దేహము మలమూత్రముల కొంప. సంసారమా, క్షణ భంగురము, స్వప్నస్వరూపము. కావుననే, దేహాభిమానమును విడచి సమస్త విషయ వాసనలను త్యజించి నిస్సంగుడవై భగవంతుని ధ్యానించుచుండుము.

## ౩౪౫ శ్రీ సతీసుమన

౧. పాపమొక చెట్టువంటిది. దాని బీజమే లోభము. మోహామే దాని వేరు. కావున, మానవుడు చింతలను విడచి లోభ, మోహాము లను త్యజించవలెను. స్త్రీ, పుత్ర, ధన, చింతన చేయరాదు.

౨. మనస్సు, వాక్కు, క్రియలకు భేదముండరాదు. సమ దృష్టిచే వర్తించువాడే ధర్మాత్ముడు.

౩. ఇతరుల సొత్తు కాశపడక, నీయొద్ద యున్న దానిని నీకై దాచుకొనక, లేనివారి కిచ్చుటే ముక్తికి దారి.

## ౩౪౬ భక్త శ్రుతదేవ బ్రాహ్మణుడు

[వీరు, అయాచితముగా ఏది దొరికిన దానిచే తృప్తిజెందుచు, రెండవ పూటకై విచారించువారు కారు, అయాచితముగా రెండవ పూటకు దొరికినను ముట్టరు. నిశ్చింతచే సదా భగవద్ధ్యానము చేయు చుండువారు.]

౧. ఓ మానవులారా! భగవదాజ్ఞను మరచి, సంసార సుఖ భోగములకు దాసులై నశించకుడు. మిమ్ముల మీరు తెలిసికొనుడు.

## ౩౪౭ భక్త మునిరాంసిహ్మ

౧. ప్రథమమున జిహ్వా, ఉపస్థ అను ఈ రెండింటిని నిగ్రహించుము.

౨. నీ వేది చేసినను, ఈ నాలుగింటిని చేయకుము : 1. దోషమును చేయకుము. 2. రోషపడకుము. 3. క్రోధపడకుము. 4. మోహాపడకుము.

## ౩౪౮ శ్రీ హ్యాగాళ్వార్, శ్రీ ప్రేయాళ్వార్

[వీ రిద్దరు ఒక చిన్న గుడిసెలో ధ్యానించుచుండిరి. ఆ గుడిసెలో ఇద్దరే మనుష్యులు కూర్చుండుటకు స్థలముండెను. ఒక రోజు రాత్రి ఇద్దరు మనుష్యులు వచ్చి తలుపు తట్టి స్థల మడిగిరి. వారిని లోపలికి రమ్మని వీ రిద్దరు నిలబడి వచ్చిన వారిని కూర్చుండ బెట్టిరి. స్వయముగా కష్టపడి ఇతరులను సుఖ పెట్టుటే, ధర్మము త్యాగము.]

## ౩౪౯ భక్త శ్రీవైకుంఠనాథ్

[వీరు ఎవరిని ఏమియు అడుగువారు కారు. ఉంఛవృత్తిచే జీవయాత్ర గడుపువారు. ప్రజలకు ఆధ్యాత్మిక బోధ చేయువారు. ఏ కోరికలు లేక, నిశ్చలులై సదా భగవంతుని ధ్యానించువారు.]

౧. సంసార సుఖభోగములను హీనముగా దోషములుగా జూడుము. వాటికి దాసుడవు కాకుము. అవి నిన్ను నశింప జేయును.

౨. జీవనమును పవిత్రము చేసికొనుము. దేనిని నీ కొరకై సంగ్రహించి దాచుకొనకుము. నిస్పృహుడవై వర్తింపుము.

## ౩౫౦ భక్త శ్రీ జాణబోజి మహారాజ్

౧. పాలను, నీరును వడయబోసియే త్రాగుము. దురాచారము, దుష్టుల స్నేహము నుండి వైదొలగుము. నిందాభి

మానములను సహించుము. వ్యర్థసంభాషణ చేయకుము. వాద వివాదములకు దిగకుము. పచ్చనిచెట్లను నరకకుము, ఇతరులసొమ్మును ముట్టకుము, కోడెల వట్టలు కొట్టించకుము. ఏ జీవికిని హాని చేయకుము. ఎవరిని నిందించకుము. ఇతరుల నింద వినకుము.

## ౩౫౧ భక్త శ్రీవ్యాస్‌దాస్‌జీ

౧. సత్యాసత్యములను తెలిసికొని ఏది మానవునకు యోగ్యమో దానినే ఆచరించుట ముఖ్యము. పొట్టకూటికై విద్య నేర్చుట వ్యర్థమే.

౨. మనస్సును రెండింటియందుంచుట వ్యభిచారమనబడును. ఒకేసారి ఇహము, పరము సంభవించవు. కావున ఒకదానియందే లక్ష్యముంచుము.

౩. ఇతరులు తిట్టినను, కొట్టినను వారిని క్షమించి ప్రేమించుము. నిన్ను నీవు అందరికి దాసునిగా చేసికొనుము. కీర్తి ప్రతిష్ఠలను త్యజించుము.

## ౩౫౨ భక్త శ్రీ బంధూమహానిత్

[వీరు భిక్షావృత్తిచే జీవించుచుండిరి. క్షామముచే భిక్షము దొరకనందున, భార్యాపుత్రులతో సహా అయిదురోజు లుపవసించి, తుదకు జగన్నాథమునకు వెడలిపోయిరి.

ఈ పాపిష్టి పొట్టకై భగవంతుని భిక్షమడుగుట మంచిది కాదని, మరి, తిండి గురించి, గడప గడప తిరుగుట చెడ్డదని తలంచి, నిశ్చింతగానుండెను. అపుడు భగవంతుడు స్వయముగా అన్ని ఏర్పాట్లు కలిగించెను.]

౧. భగవంతుడు తన అపారమైన కృపచే, పాపములయొక్క ఫలమును అనుభవింపచేసి ముక్తుని చేయును. భగవంతుడేది చేసినను జీవ కళ్యాణము గురించియే చేయును, కాని సుదుఃఖములను సంతోషముచే అనుభవించ వలయును.

## ౩౫౩ భక్త శ్రీరూప్ సనాతనులు

[వీరిద్దరు గొప్ప భక్తులు. వీరు కలకత్తాలో మంత్రిపదవిలో యుండిరి. వీరు గొప్ప ధనవంతులు. తమ సర్వస్వమును బీదలకు పంచి పెట్టి, కౌపీనధారులై, బృందావనము చేరి, యొక చెట్టుక్రింద కాలము గడుపుచు, అడవిలోనుండి కట్టెలను దెచ్చి విక్రయించి దానిచే రాబడిన డబ్బుతో తమ జీవితము గడుపుచు మిగిలినదానిని బీదలకు ఇచ్చుచుండిరి.]

## ౩౫౪ భక్త శ్రీ రామూ చమార్

౧. నీ ఇంటి ప్రక్కవారు తిండిలేక ఉపవాసాలచే బాధపడుచు మృతి నొందు చుండగా, నీవు తీర్థయాత్రలు తిరుగుచు ద్రవ్యము ఖర్చుచేయుచు, మంచి రుచిగల పదార్థముల తినుచుందువు, దీనిచే ఏమిలాభమో నీవే విచారించుకొనుము.

౨. ఇతరుల ఋణములో బడి పోకుము. ఇతరులచే ఏలాటి సౌకర్యములను పొందరాదు. వారిచే సేవ చేయించు కొనకుము. అక్కరకొలది ఇతరులచే సేవ పొందినను తిరిగి వారికి నూరురెట్లు అధికముగా సేవచేసి వారి ఋణమును తీర్చుకొనుము. స్వార్థమును వీడుము.

## ౩౫౫ శ్రీ మహాదేవ్ గోవింద్ రానడే

౧. నీ జిహ్వను నీ వశములో నుంచుకొనుము. ఏ పదార్థములు, నాలుకకు రుచి అనిపించునో, వాటిని, అధికముగా తినకుము. రుచులకు లోబడి, వస్తువులకు దాసుడవు గాకుము.

౨. దరిద్రులను బాధపెట్టి వారి ధనసంపత్తులను తీసికొనకుము. నీకు బాకియున్నవారు బాకి తీర్చుటకు శక్తి లేనిచో వారినిఅడుగకుము. వదలి పెట్టుము. వారిని సంతోష పెట్టుము. బాధ పెట్టరాదు.

## ౬౫౬ భక్త మోచి

[వీరు ఒక ధనవంతుని మేడ ప్రక్కన చిన్న గుడిసెలో చెప్పులు కుట్టుకొని జీవయాత్ర గడుపుచు భగవద్భజన చేయుచుండెను. ఆ ధనవంతునికి వీరిపై దయగలిగి యాభైరూపాయలు దానమిచ్చెను. ఆరోజు వీరికి భజనలో మనస్సు లగ్నము కాలేదు. దీనికి ఆ రూపాయిలే కారణమని తలంచి, అట్టి రూపాయిలను తిరిగి ఆ ధనవంతున కిచ్చుచు, నాయనా! ఈ రూపాయలచే భగవంతుని చింత వదలి రూపాయిల చింత కలిగినది. కావున తమ రూపాయలు తమరు తీసుకొనుడు. నా స్వంతకష్టముచే ఏది దొరుకునో దానితోనే నాకు సంతోష మనెను.]

## ౬౫౭ భక్త శ్రీ పండిత్‌రాం అవతార్

౧. రుచిగల పదార్థములకు దాసుడవు గాకుము. సదా జాగరూకుడవై మెలంగుము.

౨. సంకల్పముల శూన్యత్వమే, సమాధి యనబడును. కాన దేనిని కోరకుము.

౩. దేహాభిమానమును త్యజించుము. ఇదే నిన్ను బంధించుచున్నది. నిన్ను నీవు తెలిసికొని, నీలోనీవు సంతోషించుచుండుము.

౪. సమస్త వాసనలను, సుఖ భోగములను వెంటనే త్యజించుము.

## ౬౫౮ సాధు శ్రీ జగన్నాథ్

౧. పాకీదొడ్డిలో ప్రవర్తి నివర్తికై కూర్చొనియుండు నరుడు ఈ అశుభ్ర స్థలమునుండి తొందరగ ఎపుడు బైటపడుదునని యెట్లు తలంచునో, అట్లే జ్ఞాని, ఈ సంసార దుర్గంధ దుఃఖములనుండి తొందరగా విడిపోవలయునని ఎదురుచూచుచు, ప్రారబ్ధకర్మల విధి అని తలంచి అనుభవించుచు, నిశ్చింతగా యుండును.

౨. అజ్ఞాని సంసారమే సుఖమని తలంచి, సుఖభోగములలో బడి నశించును.

## ౩౪౯ శ్రీబాగ్‌మల్‌జీ సాయినీ

౧. సమస్త పాపములకు నిన్ను నీవు మరచుటే కారణము. ఇదే ప్రమాదము. ఈ ప్రమాదమునకు చికిత్స ఆత్మచింతనయే.

౨. ఇంద్రియ మనోబుద్ధులకు ఏలాటి స్వశక్తి లేదు. నీశక్తి వల్లనే అవి నిన్ను బంధించుచున్నవి. అవి నీకు దాసులు. కాని ఆశకు లోబడి నీవు వాటికి దాసుడవై బంధింపబడుచున్నావు.

౩. అంతర్దృష్టి గలవాడవై ఆత్మ చెప్పినట్లు వర్తించితివా బాహ్యాదృష్టి నశించును.

౪. అందరికి హితమొనర్చుము. అందరిని ప్రేమించి సేవించుము. ఇతరులకు చేయబడు సేవ, నీకు నీవే చేసుకున్నట్లు సుమా. ఎట్లన, అందరిలోనున్న ఆత్మయొకటే, భేదమెందులకు ?

౫. నీ కొరకై దేనిని ఉంచుకొనక, ఇతరుల యుపకారమునకై వినియోగించుము.

## ౩౫౦ శ్రీ చక్రవర్తి మహారాజ్ (బృందావనము)

౧. ఈ జగత్తులోని గడ్డిపోచకూడా. నీదికాదు. కాన, అది నాది, ఇదినాది, అనుచు దాచుకొనుటయే దొంగతనము. ఇది చాలా పాపము. సమస్తము భగవంతునిదే.

## ౩౫౧ శ్రీ ప్రకాశానంద్‌జీ

౧. సింహము గొప్పశక్తిశాలి. అది మాంసభక్షణ చేయును. కాని, సంవత్సరమునకు ఒకేసారి, సింహము సంగమము చేయును. పావురము, రాయి రప్ప తినును, కాని అది నిరంతరము రతిక్రీడలోనే

మగ్నమగుచున్నది. కావున తిండిలో ఏమియు లేదు. ఇంద్రియ నిగ్రహము చేయుటే ముఖ్యము.

## ౨౬౨ శ్రీ ఠాకూర్ మేఘసింహ్జీ

౧. ఏ జీవికిని హాని కలిగించకుము. ప్రతి జీవిని ప్రేమించి సేవచేయుము. సదా భగవద్ధ్యానము చేయుచుండుము.

౨. వాక్కుచే కటుశబ్దముల పలుకకుము. మృదుమధురముగా మాట్లాడుము. వ్యర్థ సంభాషణలను త్యజించుము. ఉద్దేశపూర్వకముగా ఇతరుల మనస్సును నొప్పించకుము. దీనినే త్రిదండమందురు.

౩. ఏది నీకు ప్రాప్తించునో అది నీమేలుకొరకే భగవంతుడు దయచే నీకొరకై ప్రసాదించెనని తలంచుము.

౪. విషయచింతనలే నీ నాశనమునకు హేతువు. నీవు స్వయముగా సంతోషించుచు, ఇతరులను సంతోషపెట్టుము.

౫. నీవు నవ్వుచు సంతోషముగా మృతినొందుటే నీకు ముక్తి. ఏడ్చుచు జన్మించితివి, నవ్వుచు మృతినొందుము.

## ౨౬౩ శ్రీ సువంశనాథ్‌జీ త్రిపాఠి

[వీరు వ్యవసాయము చేయుచు, లేనివారికి ఇచ్చుచు కాలమును గడుపుచుండిరి. ప్రతివారిని ప్రేమించి ఆదరించువారు. ఇతరుల ఇండ్లకుపోయి వారికి తగు సహాయముచేసి వారి ఆపదలను తీర్చువారు. సదా నామస్మరణజప, తప, ధ్యానములలో నిమగ్నులై యుండువారు.]

౧. అహింస, సత్యము, త్యాగము, తపము, పరోపకారము, వీటిని ఆచరించితిరా చాలు, మరేమి చేయనక్కరలేదు.

## ౨౬౪ శ్రీ భగవత్ శ్యామ్‌సుందర చక్రవర్తి

౧. పుష్పమును చూడుము. అది దాని చింతవిడచి ఇతరులకై వినియోగపడి, వారిని సంతోషపెట్టును. అట్లే మానవుడు తన్ను తా పోషించుకొనైనను ఇతరులకు మేలు కలుగ చేయవలెను.

౨. ఏకాంతవాసమున నిశ్చలుడవై సంకల్పములను నశింప చేసి శాంతి వహింపుము.

## ౩౬౫ శ్రీ రాందాస్‌జీ మహరాజ్

౧. ఓ మానవులారా, మీరెందులకు చింతించెదరు? లోభులెందు కగుదురు? మీచే ఏమి కాగలదు? మీచే, లేక, మాచే, ఏదైనా తృణమెత్తు పనియైనా కాగలదా? వృధా అహంకార పడుటేల? సమస్తమును, చేయువాడు ఇచ్చువాడు, భగవంతుడే. వృధా ఆశలో బడి, విషయ భోగములలో చిక్కి నశించకుడు.

## ౩౬౬ భక్త శ్రీ మహేశ్ జీ

[వీరు స్వయముగా కష్టించి ఇతరులకు ఉపకారము చేయు చుండువారు. తన ఇంటిలో పిల్లలు ఉపవసించు చున్నను తనకు దొరకిన కూలిగింజలను, మూడురోజులనుండి యుపవాసమున్న కేపునకు ఇచ్చి ఇంటికి ఉత్తచేతులతో వచ్చిరి. తనకై చింతించ నెరుగడు.]

౧. నీవు ప్రాణముల నిచ్చియైనా ఇతరులను రక్షించుము.

౨. నీ నౌకరులను ప్రేమించుము. ఇతరుల తప్పిదములను సద్భావముచే క్షమించుము.

## ౩౬౭ భక్త శ్రీ డాంగ్రేదత్తుజీ

[వీరు నిష్కామసేవ చేయుచుండువారు. ఎవరిని ఏమియు అడుగువారు కారు. అయాచితముగా దొరికిన దానిచే జీవయాత్రను గడుపువారు. ప్రతిరోజు పిల్లలకు చదువు నేర్పువారు. సదా ఇతరుల సేవలో నిమగ్నులగు చుండెడివారు. ఒకరోజు ఒకసాధువు బంగారము ఇచ్చిరి. దానిని గంగలో పారవైచి నిశ్చింతగా, భగవద్ధ్యానము చేయుచుండిరి.]

## ౩౭౦ శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్

౧. ఎంతవరకు కోరికలుండునో, అంతవరకు నేను, అను భావముచే అహంకార ముండును. అహంకారమును త్యజించగానే, భక్తి కలుగును, భక్తిచే ముక్తి దొరుకును.

౨. మానవుడు జీవించుట మోక్షమునకే, కాని, భోగమునకు కాదు.

౩. ప్రపంచముతో సమత, భగవంతునితో మమత, చేకూర్చుకొనుము.

౪. నాది, అనుట రాగము. నీది, అనుట ద్వేషము. దేనిని నీవు మంచిదనుకుందువో దానిని మొదలు, ఇతరులకిమ్ము.

౫. ఎవరిని అవమానించకుము. అందరిని సన్మానించుము. ఎందుకన, సమస్త జీవులలో పరమాత్ముడు గలడు, కాన, అందరికి నమస్కరించుము.

౬. నీలో కపట ముండరాదు. సన్మానముతోపాటు, సత్య ప్రేమ లుండవలెను. ఇతరులయెడ ఉపకారభావ ముండవలెను. నీవు మొదలు వీటిని ఆచరించి, తదుపరి ఇతరులకు బోధించుము.

౭. ఇతరుల దోషములను చూడరాదు, స్మరించరాదు. నీ మనసెట్లు పోవుచుండునో వివేకముచే కనిపెట్టుచుండి దానిని మంచి మార్గమునకు త్రిప్పుచుండుము. ఇతరులవైపు చూడకుము.

౮. నీవు చావకముందే నీలోనుండు ద్వేషములను, భేదములను, విడనాడుము. ఇది ప్రతి మానవునియొక్క ప్రథమ ముఖ్య కర్తవ్యము.

౯. ఇచ్చుచుండుము, కాని, తీసికొనకుము. రాగమునుండి ద్వేషము కలుగును. దేనిని కోరకుము. ఇతరులపై ఆశ పెట్టుకొనకుము.

౧౦. ఇతరులచే నీకు దుఃఖము, హాని కలిగినచో, మరచి పొమ్ము. ఇతరులచే సుఖము కలిగినచో, మరవకుము. నీవుచేసిన తప్పులను, మరవకుము. నీవుచేసిన మంచిని మరచిపొమ్ము.

౧౧. భగవంతుని సంతోషపెట్ట దలంచు కొంటివా, మొదలు సమస్త జీవులను సంతోష పెట్టుము. ఎందుకన, అందరిలో ఈశ్వరుడు కలడు.

౧౨. బాగా జ్ఞాపక ముంచుకొనుము. ఏది నీకు లభించ వలయునో, అది తప్పక లభించును. ఏది పోవలసి యుండునో అది తప్పక పోవును. దీనికై భయపడనేల? చింతించవలదు. విరాగివి కమ్ము.

౧౩. ఎవడు నిన్ను ప్రశంసించునో వాడు నీకు హితుడుకాడు. ఎవడు నీ దోషములను ప్రకటించునో వాడు నీకు స్నేహితుడు. వాడు నిన్ను సచేతునిగా చేయును. పాపములనుండి రక్షించును. కావున వానిని ప్రేమించుము.

౧౪. పెద్దలకు నమస్కరించుము. చిన్నలను ఆదరించుము. ఎవరి మనస్సులను నొప్పించకుము. ఎవరినైనా నీకంటె తచ్చువారని తలంచకుము. వారిని నీచముగా చూడకుము. నీ నౌకర్లను కూడా చిన్నచూపు చూడకు. వారిని దీనులని తలంచకుము.

౧౫. అవసరములేనిదే వ్యర్థముగా మాట్లాడకుము. మౌనము వహించుము.

౧౬. మంచికొరకై చెడు చేయకుము. ఎవరినైనా బాగు చేయదలచినచో, నీలో ద్వేషముండరాదు. ప్రేమచే బోధించుము. వారు వినినా వినకపోయినా, దానికై చింతపడకుము. నీ కర్తవ్యము నీది, వారి కర్తవ్యము వారిది.

౧౭. ఓ నా ప్రియసోదరులారా! మృత్యువునకై సిద్ధపడుడు. సంసారములోని ఋణబంధములను నీవు చావకముందే పూర్తిగా తీర్చు కొనుము. అణుమాత్రము ఋణశేషమున్ననూ జన్మ తప్పదు. నాది

అను దానిని దేనినైనను నీవు యుంచుకొనకుము. నాది లేనినాడే నీవు లేకుందువు.

## ౩౬౯ శ్రీ భక్త రాయచరణ్‌జీ

[వీరు పన్నెండు సంవత్సరముల ప్రాయము గలవారు. విద్య నేర్చుకొనుటకై పాఠశాలకు పోవుచు, వీధిలో బీదలను చూచి జాలి పడి తనయొద్ద ఉన్నది ఇచ్చువారు. వర్షమున తడియుచున్న వారికి, తన గొడుగును ఇచ్చి తాను వర్షమున తడియుచు ఇంటికి వచ్చువారు. బట్టలు లేనివారికి తన బట్టలిచ్చి ఆదరించుచుండెను. శక్తి లేనివారికి శరీరముచే కష్టపడి వారికి సహాయము చేయువారు. ఇట్లు ప్రతి జీవిని ప్రేమించి తగు సహాయము చేయుచుండిరి.]

## ౩౭౦ శ్రీ జయదయాల్ గోయిందకా

౧. ధనమును వృద్ధిచేయకుము. ఉన్నదానినే బీదలకు, దుఃఖితులకిచ్చి వారికి సేవచేయుము.

౨. నీతోసహా నీ సర్వస్వమును ఈశ్వరునికి సమర్పించుకుంటివా, లాభనష్టములకై విచారపడ నవసరముండదు.

౩. నీకున్నదాని నంతయు దానము చేయుచో రేపు నీగతి ఏమగునో యని, విచారించకుము. నీది అను భావము లేనినాడు లోకమంతయు నీదేయగును.

౪. అది చూడవలె, ఇది చూడవలెనని కోరిక ఉండకూడదు. ఆశ ఇచ్ఛ ఉండరాదు. వీనితో నేత్రేంద్రియ దోషము కలుగును.

౫. డబ్బులేనిచో సత్సంగము ఎట్లు సంభవించునని ఆలోచించకుము. నీ ప్రారబ్ధ వశమున, ఈశ్వరేచ్ఛచే అంత ప్రయత్నము స్వాయముగా జరిగితీరును.

౬. కాలము జరిగినదేమో జరిగినది. ఇప్పటినుండి మరణ పర్యంతరము పరమాత్మను సదా స్మరణచేయుము.

౭. తలిదండ్రులను గురువును అతిథులను పూజింపుము. అన్ని జీవులను ప్రేమించుము. దేనికిని హాని చేయకుము.

౮. రాత్రి నిదురించు సమయములో సంసారము యొక్క స్మరణ విడచి, భగవంతుని స్మరణ చేయుచు నిదురించుము.

౯. జీవుడు నిరాకారుడు. పరమాత్మయు నిరాకారుడే కావున, జీవుని పరమాత్మకు సమర్పించుము. శరీరము తల్లిదండ్రులది, లోకముది. కాన, శరీరమును లోకమునకు అర్పించుము. మనస్సును ఈశ్వరునకు శరీరము లోకసేవకు అర్పించినచో ముక్తి దొరుకును.

౧౦. వ్యవహారబుద్ధితో కొడుకు, తండ్రి భావము ఉండవలెను. పరమాత్మ బుద్ధితో అన్ని ఆత్మలు పరమాత్మలే అని భావించవలెను.

౧౧. పూర్వ పుణ్య పాపముల వల్లనే మనకు సుఖదుఃఖములు కలుగుచుండును. దానికై ఇతరులపై దోషము పెట్టుట తప్పు. మన దుఃఖములకు ఇతరులు కారకులుకారు. మనకర్మలే కారణము.

౧౨ క్రియకంటె మనోభావమే ప్రధానము. కావున, నీ భావములో దోషముండరాదు.

౧౩. మనోవాక్కాయ, కర్మలచే ఎంత చిన్నప్రాణికైనను ఏమాత్రమైన హింస, దుఃఖము కలిగించరాదు.

౧౪. ప్రియవచనమువల్ల సమస్త ప్రపంచము నీ వశమగును. ఇతరుల మనస్సు నొప్పించకుము.

౧౫. నీయొద్ద ఉన్నదంతయు ప్రజల సొత్తే. అదిప్రజలకే వినియోగము కావలెను. లేనిచో పాపము సంభవించును. ఇతరులకు నష్టము, ద్వేషము, ఈర్ష్య కలిగించిన వాడవగుదువు. దీనిచే నీకు సుఖ ముండదు, భయము, దుఃఖము, లోభము, ఆశ, మొదలగునవి సంభ వించును.

౧౮. సమస్తేంద్రియ నిగ్రహమువల్ల వాటిశక్తి అభివృద్ధిజెంది దివ్యదృష్టి కలుగును.

౧౬. ఇతరుల దూషణచేయక వ్యర్థసంకల్పములను వదలినచో మనస్సుశుద్ధి యగును. ఈశ్వరునిపై విశ్వాసమున్నచో మనస్సునకు శక్తి కలుగును.

౧౭. ఇతరులపై ఆధారపడి జీవించువాడు పరాధీనుడు. భోగములను కోరువాడు కూడా పరాధీనుడే.

౧౯. ప్రపంచములోని సమస్త రోగములకు, దుఃఖములకు, ద్వేషములకు, కారణము భోగములే.

౨౦. అందరూ, ముక్తి కావలెనని విచారపడుదురు. కాని నాది మాది అనుటచే ముక్తి దూరమగును. నాది నేను అనుట త్యజించి, నీతిండి చింతను, శరీరచింతను, విడిచినరోజే ముక్తి నీదరిజేరును.

౨౧. ఎన్నియో గ్రంథములను చదివితివి. కాని దానివల్ల ప్రయోజనమేమి? ఒకస్వార్థమును విడచితివా, జ్ఞానము దానంతటదే నిన్ను చేరును.

౨౨. శుద్ధ సాత్విక ఆహారమునే తినవలయును. వెల్లి, ఉల్లి, గాజర గడ్డ,మసాల నూనె,పులుపు, మిఠాయి,పచ్చళ్లు,నెయ్యి, నూనె,లో గోలించినవి వేగించినవి పూరీలు, హల్వా, పేడా, లడ్డూ, మీగడ, రబ్డి మొదలగునవి అన్నియు త్యజించవలెను.

౨౩. ఒక రసనేంద్రియమును జయించితివా, మోక్షము సిద్ధించును. మితిమీరి తినకుము.

౨౪. ఆసక్తిలేనిచో ఇంటిలో ఉన్నను, బయట ఉన్నను బాధ యుండదు. గృహస్థుడైనను, సన్యాసియైనను చింతయుండదు.

౨౫. ముక్తిని కోరువాడు భోగములను కోరికలను త్యజించవలెను.

౨౬. కీర్తి, ప్రతిష్ఠలకై దానమిచ్చుట, ప్రతిఫలము తీసుకున్నట్లే ధనమిచ్చి కీర్తిని కొనుట యగును. దీనికై జన్మతప్పదు. కావున నిష్కామముగా దానము చేయుము.

౨౭. కొందరికి దయచే కంటికి నీరు వచ్చుచుండును. కాని సేవ చేయుటకు కార్యరూపము దాల్చరు. వృథాగా ఆలోచింతురు. దీనిచే లాభముండదు. సేవచేయుటకు సిద్ధము కావలెను.

## ౩౭౧ శ్రీ యాదవచందర్‌రాయ్

[వీరి ఇంటికి ఒకరోజురాత్రి దొంగలు వచ్చిరి. కాని వారికి ఏమియు దొరుకలేదు. అపుడు వీరు స్వయముగా, హుక్కా నింపు కొని వారి ఎదుటికిపోయి, "అయ్యా! మీరుచాలా శ్రమపడితిరి, కాని ఏమియు దొరుకలేదు. మీకష్టము వ్యర్థమాయెను. కావున ఈ హుక్కాను త్రాగిపొం"డని వారితో అనెను.

## ౩౭౨ పండిత్ శ్రీరాంజీ మహారాజ్

[వీరు ఎవరు ఏది ఇచ్చినను తీసికొనువారు కారు. కేవలము ఒక ఎండినరొట్టె తునుకను భిక్షు అడిగి దానిని తిని సంతోషించి సదా భగవద్ధ్యానము చేయుచుండిరి.

ఒకరోజు రాజుగారు వీరిని సన్మానించి ధనరాసులను సమర్పించిరి కాని వాటిని ముట్టక కేవలము ఒకేరొట్టె కోసము పిండిని అడిగి ఆ పిండిని తీసుక వెడలిపోయిరి.]

## ౩౭౩ పండిత్ శ్రీ కౌట్‌జీ

౧. వీరు చాలా బీదబ్రాహ్మణుడు. గ్రామమునకు దూరమున చిన్న గుడిసెలో నివసించుచుండిరి. ఒక చాప, ఒక కమండలము తప్ప మరేసామాను లేకుండెను. ఎవరిని ఏమియు అడుగువారు కారు. ఏవరేమిచ్చినను తీసుకొనరు. ఎల్లపుడు గ్రంథపఠనము చేయుచుండు

వారు. వీరి పత్ని వీరి సేవ చేయుచు కూలి నాలి చేసి కుటుంబ జీవనమును నడుపుచుండెడిది. ఇది లే దది లేదని అడుగునది కాదు. ఇట్లుండగా ఒక రోజు ఆ దేశపు రాజు వచ్చి "స్వామీ మీరు నిజముగా చాలా కష్టపడుచున్నారు. ఇట్లు మీరు, నా రాజ్యములో కష్టపడుచుండుట వలన నాకు చాలా పాపము సంభవించును. కావున, తమ సేవ చేయుటకు వచ్చినా"నని అనగా అది విని వీరు తన కమండలమును తీసికొని భార్యతో సహా ప్రయాణమై "మేముండుటచే రాజునకు పాపము సంభవించును. మా వలన ఏ జీవికీ కష్టము కలుగరా"దని వెడలసాగెను. అపుడు రాజు దుఃఖించి ప్రార్థించగా, దయగలవాడై, "నాయనా, నాకు మీరేమి సేవ చేయవలదు. మీరు నావద్దకి రాక పోవుటే నాకు సేవ చేసినట్లగును. నాకేమియు అవసరములే"దనెను.

౨. మృతినొందినా సరేకాని, ఇతరుల ఋణములో పడకుము. ఋణవిముక్తుడవు కానిదే జన్మరాహిత్యముకాదు.

౩. త్యాగముచేయ తలంచితివా, ఆలస్యముచేయక ఆలోచించక వెంటనే సమస్తమును త్యజించుము.

౪. ఇతరుల తృప్తిలోనే నీవు తృప్తిపొందుము. ఇతరుల దోషములను చూడకుము.

౫. అందరిని గొప్పగా దలంచుము. నిన్ను నీవు అందరికంటె తచ్చుగా దలంచుకొనుము. నీ మనస్సులో ఎపుడును దోషభావములను రానీయకుము.

౬. మనస్సులో వికారభావములు ఉత్పత్తి కాగానే, పాపములు వృద్ధినొందును. అన్యాయపు సొత్తును ఇతరుల కష్టార్జితపు అన్నమును తినకుము. దానిచే మనస్సున దోషములు ఉత్పత్తియగును.

౭. ఏది పూర్వ ముండెనో అది ఇపుడు లేదు. ఇపుడున్నది, ఇక ముందుండబోదు. పరివర్తనలుగల అవస్థల గురించి, చింతించుటేలా?

పరిస్థితి ఎట్లు పరివర్తన మగునో అట్లే సంతసించుట మానవునియొక్క ధర్మము.

౮. స్వయముగా కష్టించి సంపాదించిన ఒక పైసా దానమే శ్రేష్ఠము. ఇతరుల కష్టార్జితమగు నూరులకొలది రూపాయల దానమైనను దానికి సరికాదు. ఆ ఒకపైసా దానముచేతనే నీకు పుణ్యము. తీసికొనిన వారికి లాభము కలుగును.

## ౩౬౫ ఖుదీరాం చటర్జీ

[వీరు జమీందారుని వైపు అబద్ధసాక్ష్యమివ్వనందున, తన ఇల్లు మొదలగు ఆస్తి నంతయు జమీందారు జప్తి చేయించి తీసికొనగా, తన కుటుంబముతో సహా కట్టుగుడ్డలతోనే ఇల్లు వెడలి, చెట్టుక్రింద నిలబడి, 'ఓ రామచంద్రా నీవిచ్చిన ఐశ్వర్యమును, నీవే తీసికుంటివి. ఇక నాకేలచింత' అని ఆనందముతో నిశ్చింతగా ఉండెను.]

౧. ఏ భూతములనైనను, శత్రువునైనను ద్వేషింపకుము. అందరిని దైవస్వరూపులుగా ప్రేమించుము.

౨. కొమార్తెల నమ్మువారు, వరకట్నములిచ్చి పుచ్చుకొను వారు, అధర్మప్రవర్తకులు, గాన, దుఃఖములను పొందుదురు.

## ౩౬౬ శ్రీ నందకిశోర్ ముఖోపాధ్యాయ్

౧. ఒకపశువు చచ్చి పడియుండ, రెండవపశువు దాని సమీపముననే మేయుచుండును. అట్లే ఎందరో మానవులు మృతినొందుచుండుతోడి మనుష్యుల చూచుచుకూడా, అనిత్యమైన సంసార లంపటములో పడి పోవుచున్నారు. కావున, జాగ్రత్త! మానవశరీరము దొరుకుట దుర్లభము. జన్మరాహిత్యము గురించి వెంటనే ప్రయత్నించుట శ్రేష్ఠము.

## ౩౭౬ శ్రీ గోస్వామి హరిరాయెజీ మహరాజ్

౧. ఎవరితో విరోధము పెట్టుకొనకుము. మధురముగా మాట్లాడుము. నీ దేహ మనిత్యమని మరువకుము. సత్సంగము చేయుము.

౨. సాత్వికాహారమును మితముగా తినుము. అధికనిద్ర బోకుము. నీ బుద్ధిని ఎల్లపుడు స్థిరముగా నుంచుము.

౩. ఇతరులను అవమానము చేయకుము. ఇతరులపై క్రోధ పడకుము. నీ హృదయములో క్రోధము ప్రవేశించగానే భగవదాదేశము వెడలిపోవును.

౪. మౌనము వహింపుము. ధర్మ విరుద్ధము జరుగుచోట ఉండకుము. సేవ చేయగలనని, చేసినానని, ప్రలాపములు చేయకుము.

౫. లౌకిక సుఖ దుఃఖములకై హర్షము శోకములు పనికిరావు. స్త్రీ పుత్రాదులపైని మమతచే నీవు దుఃఖించరాదు,

౬. ఏ వస్తువుపైన కూడా ఆసక్తి పనికిరాదు. ప్రాప్తించిన దానితోనే సంతోషించుము. మనస్సులో గర్వము, అహంకారము ఎంతమాత్ర ముండరాదు.

౭. అంతఃకరణమును కోమలముగా నుంచుము.

## ౩౭౭ శ్రీ రాంవల్లభ శరణ్ జీ మహారాజ్

౧. ఈ ప్రపంచములో ఎల్లపుడు ఉండము. కొన్నాళ్లేకదా? ఉండునది. కావున, ఎవరియందును మోహము, ద్వేషము ఉంచరాదు.

౨. భగవంతుని సేవయే జీవునియొక్క ముఖ్యధర్మము. సమస్త జీవులను ప్రేమించి, సేవించుటే భగవత్పూజ అనబడును.

౩. అన్నదోషము, సంగదోషముల నుండి సర్వదా వైదొలగుము. పాపాన్నమును తినరాదు.

## ౩౨౮ శ్రీ రఘుపతి దాస్‌జీ మహారాజ్

౧. శరీరమును పనిలో మనస్సును జపములో నుంచుము.

౨. నీ సంబంధమైనట్టివారు, మరియు పశువులు, కుక్కలు, పిల్లులు, అన్ని తృప్తి చెందుచున్నవా, లేదా చూచుచుండుము. వాటిని కష్టపెట్టకుము.

## ౩౩౯ శ్రీ దేవనాయకాచార్యజీ మహరాజ్

౧. అందరు మృతినొందువారే కాని, భగవద్భక్తులు, నిష్కామ దేశసేవాసక్తులు, దానకర్ణులు చచ్చినను, బ్రతికినవారే! వారు మృత జీవులు.

౨. మానవజన్మమెత్తి వేదశాస్త్రముల ననుసరించనివాడు పశువుకంటె హీనుడు.

౩. నీవు స్వయము దుఃఖము లనుభవించుచు ఇతరులను సుఖ పెట్టుము. పరుల హితమునకై నిన్ను నీవు నశింపచేసికొనుము.

## ౩౪౦ శ్రీ మగన్‌లాల్ హరిబాయివ్యాస్

౧. ఇతరుల వస్తువులను వారిచ్చినను ప్రతిఫలము లేక తీసి కొనకుము. ఇతరులయొద్ద వృధా తినకుము. వారికి ఋణగ్రస్థుడవు కాకుము. ఋణమును తీర్చుటకై జన్మ తప్పదు.

౨. నీవు కష్టపడి సంపాదించినదే తినుము. మిగిలినది ఇతరులకు దానమిమ్ము.

౩. నీ ధ్యానమునకు ఏది అడ్డు తగులునో దానిని త్యజించుము.

౪. ప్రతిరోజు ఆత్మ విచారము చేయుచుండుము. నీమనస్సును కడుజాగ్రత్తతో కనిపెట్టుచుండుము.

౫. ఇతరుల నిందించకుము. ఇతరులు నిన్ను నిందించినను వారిని ద్వేషించకుము.

౬. వృధా కాలక్షేపము చేయక, కష్టపడి లోకసేవచేయుము. లేదేని ఆత్మచింతన ఈశ్వరధ్యానము చేయుచుండుము.

## ౩౮౧ శ్రీరాం తనులాయిడీ

[వీరి యొద్ద ఒకరు అప్పుతీసికొని ఇచ్చుటకు శక్తిలేక, కష్టపడుచు,వీరినిచూచినపుడెల్ల వీరడుగకున్నను,వారే,ఫలానారోజున డబ్బు చెల్లింపగలనని పలుసార్లుగా వాగ్దానములు చేయుచుండెను. కాని ఒక వాగ్దానమైనను చెల్లింపలేడయ్యెను. ఒకరోజు వీరుకొందరు స్నేహితుల యుక్తముగా వీధిలోపోవుచుండగా, ఆబాకీదారుడు వీరికి ఎదురుగా వచ్చుచుండుటచూచి, వీరే ఆబాకీదారునకు కనబడకుండా వైదొలగిరి. అందుకై, వెంట నున్న స్నేహితులు కారణమడుగగా ఆవచ్చువారు నన్నుచూచి లజ్జించి మళ్లీ, కానిపోని వాగ్దానము చేయగలరు. వారు నావలన అసత్యమాడవలసి వచ్చునని, నేను వైదొలగితి'నని వారికి బదులుచెప్పెను.]

౨. నీ విచ్చిన అప్పుకొరకు ఎవరిని బాధించకుము. వారి పరిస్థితి బాగుండునేని తప్పక ఇత్తురు. నీవలన ఇతరులు అసత్యమాడుటకు అవకాశము కల్పించకుము.

## ౩౮౨ శ్రీ రజినికాంత్ జీ మహరాజ్

౧. భగవంతుడిచ్చిన స్వతంత్రమును, పరతంత్రతకై వినియోగించకుము. అనగా, నీజీవితమును సంసార సుఖభోగములకై వినియోగించి వ్యర్థముగా పాడుచేయకుము.

౨. ప్రారబ్ధమునైనను విశ్వసించుము లేక, భగవంతునైనను విశ్వసించుము. ఏదోఒకటి నిర్ణయించుకుంటివా శాంతికలుగును.

౩. ఎద్దుల బండికంటె, రైలుబండి శక్తివంతముగలది కదా? అందుకే దానిని నియంతృత్వముతో జాగ్రత్తగా నడిపించవలసివచ్చును,

అట్లేమానవుడు అన్నిజీవులకంటె బుద్ధిమంతుడు, శక్తిశాలి. కాన, యమ, నియమబద్ధముగా, శాస్త్రానుసారముగా వర్తించుట ధర్మము.

## ౭౮౩ శ్రీ ఈశ్వరచంద్ర విద్యాసాగర్

[వీరుగొప్ప విద్వాంసులు. ప్రతివారికి ప్రతిఫలము లేకయే సేవచేయుచుండిరి. రైలు ఒద్దనుండి సామానులు తననెత్తిపైపెట్టుకొని తెచ్చి ఇచ్చుచుండిరి, కాని, కూలి తీసికొనువారు కారు.

ఇతరులు, అభిమానముచే సిగ్గుపడి చేయలేకపోవు పనులన్నియు వీరు స్వయముగా, సేవాభావముతో చేయుచుండెడివారు. ఏలాటి కోరిక, ఆశయు, లేనివారు.

వీరు బాటనడుచునపుడు, ఎవరికైనను సేవ అవసరమున్నదా యని అటునిటు చూచుచుండువారు. సదా పరోపకార చింతనయే చేయుచుండు వారు]

౧. మానవుడు, శక్తియుండి కూడా, అభిమానము, అహంకారమువల్ల తనపనిని తాను చేసికొనకపోవుట పాపము.

౨. ఇతరుల పాపములను దాచి, నీ పాపములను వ్యక్తపరుచుటే ధర్మము. నేను సదాచారిని, ఇతరులు చెడ్డవారని తలంచి గర్వించకుము.

౩. ఏ వ్యక్తిపైనను వైరము చూపకుము.వారి చెడుగుణములపై వైరముచూపి వాటిని నివారింపుము.

౪. ఏ వస్తువునైనను,వ్యర్థముగా పారవేయకుడు.నష్టపరచకుడు. అది ఇతర జీవులకు అక్కరకు వచ్చును.

౫. అతిథిని సన్మానించిన వానిని, ఈశ్వరుడు సన్మానించును, లోభులు కాకుడు. అదేపాపము.

## ౩౨౪ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

౧. ఈ శరీరమే, నే నని భ్రమించి, నశించు సంసారవస్తువుల కాశపడి, వ్యవసాయము, వాణిజ్యము మొదలగు కర్మలద్వారా ఈ దేహమును పెంచుచుంటివి, అట్లే ఈ దేహమనే పరికరము ద్వారా అంతరింద్రియముల సాహాయ్యముచే, ఆత్మను బలపరుచుము. అదే శాశ్వతము సుమా.

౨. ఎవడు ఒక బ్రహ్మమును చూచునో వాడు సమస్తమును చూచును. ఎవడు సమస్తమును బ్రహ్మభావముతో చూచునో, వాడు ఒకే బ్రహ్మమును చూచిన వాడగును.

## ౩౨౫ శ్రీ భగత్ జీ

౧. ధన, సంపత్తి, పరివారము మొదలగువాటినన్నింటి యందలి మమతను త్యజించుము. భగవంతుని ఆజ్ఞప్రకారమే వర్తించుము.

౨. ఎంతవరకు నీలో విషయ భోగములపై ఆశవుండునో అంత వరకు ఆత్మకు శాంతి చేకూరదు.

౩. మనస్సునకు కొద్ది అవకాశమిచ్చినను, అదిశక్తివంతమై నిన్ను నశింపచేయును. కాన జాగ్రత్త! మనస్సునకు విషయభోగములపై అలవాటునేర్పి దానిని చెడగొట్టినది నీవే కదా! కావున, తిరిగి దానిని మంచిమార్గములో పెట్టుటకు ప్రయత్నించుట నీవిధి. ఆలసించకుము.

౪. కర్మలు నశించగానే, శరీరము నశించును. కావున, సమస్త కోరికలను త్యజించుము.

౫. జిహ్వాచాపల్యమును వీడుము. రుచి, అరుచి, పదార్థములలో లేదు. అది, నీయిచ్ఛలోనే ఉన్నది.

౬. కీర్తిప్రతిష్ఠలకై, పదవులకై ప్రాకులాడకుము. అభిమాన పడకుము. స్వార్థమును వీడుము. ఇంద్రియములను నీవశములో నుంచు కొనుము.

౭. నీవు సంసారమును పరిపాలించుటకై రాలేదు. సేవ చేయుటకే వచ్చితివి. కాన, సంసారమందలి సుఖభోగవాంఛలను వీడుము.

౮. ఆత్మకు విరుద్ధమైన పనులు చేయకుము. దేనిని తెలిసికొని మంచిదని నమ్ముచుందువో దానిని ఆచరించి త్యజించుము. అనగా, ఫలాపేక్షను వదలుము.

## ౧౮౬ శ్రీ పండిత వాసుదేవదత్తు

౧. సౌందర్యమును, ధనసంపత్తులను చూచుకొని, అహంకార పడకుము. నీయొద్ద వున్నదంతయు లేనివారికిమ్ము. నీకొరకై ఉంచు కొనకుము. ఒకరోజు నీ సౌందర్యము, ధనము, నశించును. అపుడు దుఃఖించవలసివచ్చును. కావున, ఇపుడే జాగ్రత పడుము.

౨. ప్రతిజీవిలో భగవంతుడు గలడు. మరియు, మన తల్లితండ్రి తాత, మొదలగువారి ఆత్మలు జీవరూపములో ఏదో ఒక శరీరములో ఉండవచ్చును. కావున ఏజీవిని కష్టపెట్టరాదు.

౩. నీకు బాకివున్నవారిని పదేపదే అడగి లజ్జింపజేయకుము. వారు యివ్వనిచో చింతించకుము. వారికి ఇచ్చుటకు శక్తియుండుచో తప్పక ఇత్తురు. కావున. ద్రవ్యమందలి మమతను త్యజించి, జీవులను ప్రేమించుము.

## ౧౮౭ శ్రీ శేక్ లాల్ బల్ దేవుజీ

[ వీరు గొప్పభక్తిపరులు. ఒకరోజు ఒకదొంగలజట్టు మేము, మీయింటికి దొంగతతమునకై వచ్చుచున్నామని వీరికి తెల్పిరి. అందుకు వీరు సంతోషించి, ఆదొంగల జట్టునకు ఎదురుపోయి వారిని ఆహ్వానించి తన ఇంటికి తీసికొనివచ్చి వారికి అతిథిసత్కారముచేసిరి. దానికి ఆదొంగలు లజ్జించి ఇకమీద మేము దొంగతనము చేయమని వీరిని వేడు

కొని వెడలిపోయిరి. ఈ వింతనుచూచి అక్కడనున్నవారు వీరినికారణ మడుగగా, 'నాయనలారా! దొంగల రూపముతో భగవంతుడు వచ్చి నాడో, లేక నా తండ్రి, తాతల యొక్క ఆత్మలే ఈ రూపముతో వచ్చి నారో అని భావించి వారికి స్వాగతమిచ్చితిని. ఎవరిసొత్తు వారికే చెందును ఇందుకు విచారమేల?' అని చెప్పెను.]

౧. ప్రజారూపములో భగవంతుడు దర్శనమిచ్చుచుండును. కావున, ఏజీవికి హానిచేయక ప్రేమించి సేవించవలయును.

## ౩౮౭ శ్రీ రాంచందర్ దాస్‌జీ

౧. స్వధర్మమనగా, జ్ఞాన వివేకములద్వారా భగవంతుని విధాన ప్రకారము వర్తించుటయే. పరధర్మమనగా, వివేకవిరుద్ధముగా భగవద్విధానమునకు విరుద్ధముగా వర్తించుటయే పరధర్మము.

౨. సమతను ఆచరించుము, మమతను త్యజించుము. అందరికి సేవచేయుటే పూజ. కేవలము జపమాల పట్టుకొని జపము చేయుట కాదు. సంగ్రహము చేయక ప్రాప్తించిన వస్తువులను ఇతరుల సేవకై వినియోగించుము.

౩. సమస్త ధర్మములను త్యజించి, భగవంతుని ఆజ్ఞను పాలించుము. ఏవరిని ఏదియు కోరకుము. భగవద్భజన నైనను కోరికలేకుండ చేయుము.

## ౩౮౮ భక్త శ్రీ నర్సయ్య

[వీరు మొదలు చాలా బీదవారు. తదుపరి దైవానుగ్రహముచే గొప్పధనవంతులైరి. వీరు ప్రతిరోజు కట్టెలు తెచ్చి అమ్మి దానిచే జీవయాత్ర గడుపువారు. వీరు కట్టెలకు పోవునపుడు వీరివెంట ఒక వృద్ధుడు కట్టెలకుపోవు చుండెడివాడు. వీరు అవృద్ధునకు (రూపాయి న్నర) విలువగల్గ కట్టెలుకొట్టి యిచ్చువారు. వీరి స్వంతమునకై పావలా

కట్టెలు తెచ్చుకొనువారు. ఇట్లే ఎల్లపుడు ఇతరులకు సేవచేయు చుండు వారు. ఒకరోజు ఒకచేనుకాపరి ఒకపక్షిని వడిసేలతో కొట్టెను. వీరు జాలిపడి, ఆ చేనువానికి అందులో పండునట్టి ధాన్యమునుఇచ్చి ఆ చేనును పక్షులకు విడిపించిరి. అడిగినవారికి లేదనక తన యొద్దనున్నది ఇచ్చుచుండిరి. ఎల్లపుడు బీదలకు ధాన్యమును పంచిపెట్టు చుండిరి. అవసరమున్న వారికి రూపాయలు చేబదులుగా ఇచ్చుచుండిరి. కాని వడ్డీ తీసుకొనువారు కారు.]

౨. సత్యమును పలుకుడు, పరుల మనస్సును నొప్పింపకుడు. పరులసొత్తును అపహరింపకుడు. వీటిని ఆచరించుడు. అని సదాచెప్పు చుండెడివారు.

## ౩౯౦ భక్త శ్రీ వెంకట్రావు

౧. ఎవడు తనప్రతిపనిని ఏరోజునియమముచేధర్మానుసారముగా చేయడో, ఆరోజు వానికి శాంతి ఉండదు. ధ్యానము కుదురదు. ధర్మ ముగా విధిప్రకారము పనిని పూర్తి చేసిననాడే, ధ్యానము కుదురును. ఏమాత్రము దోషమున్నను, ధ్యానసమయములో మనస్సు బాధించును. పశ్చాత్తాప పడవలసి వచ్చును.

౨. ధ్యానములో భగవత్సేవ, జాగ్రతలో లోక సేవచేయుము.

౩. బాహ్యావస్తువులను అనుకూలము ప్రతికూలము చేయుశక్తి మనలోనే ఉన్నది. మన భావమెట్లుండునో అవి అట్లే మారును. వాటికి స్వశక్తిలేదు. మనశక్తిచే మనల బంధించును.

౪. నేను గొప్పవాడనని అనుకొంటివా, ఒకప్పుడు నీ గొప్పతన మునకు అపకీర్తి వచ్చినచో అపుడు, నీవు బాధపడవలసి వచ్చును. కావున నిన్ను నీవు అందరికంటె తచ్చువానిగా తలంచుకొనుము.

౫. మీరు కొన్ని చిత్రపటములను చూచియుందురు. అందలి చిత్రమును ఎవరు చూచినను, అదివారినే చూచినట్లుండును. ప్రతివాడు

ఆచిత్రము తనను చూచుచున్నట్లుగానే భావించును. అటులే భగవం తుడు కూడా ప్రతిజీవిని చూచుచుండును.

## ౬౯౧ సాధు శ్రీ శ్రీనివాసశాస్త్రి

౧. ప్రతిరోజు మనచే అయిదు హత్యానేరములు జరుగు చుండును. అవి సూన దోషము లనబడును.

(1) సూనదోషములు అయిదు.

(1) కందని (రోలు), (2) పేషణి (సన్నెకల్లు-విసుర్రాయి) (3) చుల్లి (పొయ్యి), (4) ఉదకుంభి (నీళ్లకడవ), (5) మార్జని (పొరక) వీటిని ఉపయోగించుటచేత ఎన్నియో కనబడని ప్రాణులను చంపుదుము. దానిచే పాపములు సంభవించును. ఆ పాపములు పంచమహాయజ్ఞము లద్వారా నశించును.

(2) పంచమహాయజ్ఞములు.

(1) బ్రహ్మయజ్ఞము, (2) పితృయజ్ఞము, (3) దేవయజ్ఞము (4) భూతయజ్ఞము, (5) మనుష్యయజ్ఞము.

౨. ధాన్యములోని ప్రతిగింజలో జీవము కలదు. వాటిని మనము దంచి వండి చంపుదుము. అది దోషము. మరియొక జన్మలో ఆధాన్యపుగింజ మనుష్య జన్మమెత్తును. నీకర్మచేత నీవు ధాన్యపుగింజ జన్మమెత్తగలవు. నీవు మనుష్యజన్మములో యెట్లు ధాన్యపు గింజలను చంపి నమిలితింటివో అటులే అపుడు అవి ముందుజన్మలో ధాన్యపు గింజగా ఉండు నిన్ను, తినగలవు.

౩. మహాపాపమువలన పుట్టినవి జడపదార్థములు. అవి రాళ్లు, యినుము, బంగారము, రత్నములు మొదలగునవి. ప్రపంచములో వీటికి చాలా విలువకలదు. దీనినే నీవు ధనము, డబ్బు, పైసా అను పేర్లతో పిలచుచు దానికై వ్యామోహపడుచున్నావు. కాని,

నిజమునకు ఇవి పాపవస్తువులే కదా! ఈ పాపవస్తువులు ఈ నశించు నట్టి శరీరము కోసము కోరబడుచున్నవి. వాటిని నీవు కోరకుము. అథవా అవి నీకు నీ కర్మానుసారముగా లభించినను వాటిని ఆశించక మంచి కార్యములకై దానము చేయుము. అవి పాపపు వస్తువులైనను వాటిని నీవు మంచిపనులయందు వినియోగించితివా, వాటికి పుణ్యము నీకు మేలు కలుగును. వాటికి ఇట్లు కలిగిన పుణ్యమువలన జడత్వము నశించి, భవిష్యత్తులో మంచి జన్మము లభించును.

౪. ప్రతిరోజు భగవంతుని స్మరించుచు వంటచేసి ఆయనకు అర్పించి నమస్కరించి ఆ తరువాత అతిథులకు బీదలకు పెట్టి ఆ తదుపరి నీవు మితముగా తినుము.

౫. నీవు చదువునది స్వరముతో అక్షరము పోకుండా స్ఫుటముగా చదువవలెను. తప్పు చదివినచో ఘాతుకము తప్పదు. పుణ్యమునకు బదులు పాపము సంభవించును.

౬. బ్రతుకునది ఎందులకో ఆలోచించుము. తినుట కొరకు కాదు గదా ? అయినచో తినుట యెందులకు ? పరుండుట యెందులకు ? అని ప్రశ్నించుకొనుము. దానికి ప్రత్యుత్తరము వచ్చును. ఇటులే ఒక్కొక్క విషయమును తీసికొని ప్రత్యుత్తరము లేకుండా పోవువరకు ప్రశ్నించుకొనుచుండుము. దీనితో నిజముగా నీవు చేయు ప్రతిపని యెందులకో తెలియగలదు. అది తెలిసికొని భావిజీవితములో నిన్ను నీవు చక్కపెట్టుకో గలవు.

౭. సర్పదష్టునకు చేదు ఎట్లు తీపిగానుండునో అట్లే సంసార విషసర్పదష్టునకు నరకహేతువగు వస్తువులు భోగ్యములుగా కనుపించును.

౮. ప్రపంచములో ఉన్న మంచి వస్తువులన్నియు నాకే కావలయునని కోరికలు పెట్టుకొని, శ్రమపడుచుందువు దేనికొరకు ? అది ఎక్కడ ఉన్నది ? దేనిని సంతోష పెట్టుటకు ఆయాసపడు

చున్నావు? అది నీలోనే ఉన్నది! 'నేను', 'నేనని' అనునదే ఆత్మ దానినే నీవు అన్నిటికంటే అధికముగా ప్రేమించుచుందువు. 'నాకు కావలయు' ననునది నీ ఆత్మయే, నీవు ప్రేమించుచుండునది నీ ఆత్మనే. నిన్ను నీవే ప్రేమించుకొనుచుందువు. నీలో ఉన్నదానిని మరచి, శరీరమునే 'నేన' నుకొని భ్రమించి మోహములోపడి చెడి పోవుచున్నావు. కావున, దేహాభిమానమును విడువుము.

౯. చిత్తములో చాంచల్యముండుటచే ఈప్రపంచవస్తువులు, నానారకములుగా భాసించుచున్నవి. ఆభ్రమచేతనే మనుష్యుడు తననే చూచుకొని, నేనుపురుషుడను, నేనుస్త్రీని అనిభావించును. 'శాస్త్రములలో వ్రాసినారు, ఇతరులు అనుచున్నారు, కాబట్టియే, నేనునమ్ముచున్నా'నని, అనును. కాని, నిజస్థితి ఏమిటో, తెలియదు. ఎవనిశరీరమును వాడుచూచుకొని వాడే, "నేను, పురుషుడను, స్త్రీని" అనుకొని భ్రమపడుచుందురు. ఇదంతయు భ్రమయే. పచ్చకామెర్ల రోగగ్రస్థునకు కనబడువస్తులన్నియు పచ్చగనే కనిపించునట్లు భ్రాంతి చేత ఎవడెట్లుభావించుకొనునో వానికట్లుభాసించును.

౧౦. మనకు ఇష్టములేకున్నను శరీరదశలుమారుచుండును. దృష్టిచెడిపోవుట, పండ్లురాలిపోవుట, చెవులువినరాకుండుట, వృద్ధాప్యముచేకృశించుట, మృతినొందుట, మొదలగునవి మనకు ఇష్టము లేకున్నను వచ్చుచుండును. కావున, మనకు స్వతంత్రత అనునదిలేదు. పరతంత్రులమే, కదా! మొదలు మనశరీరమును స్వతంత్రముగా చేసికొని తరువాత బాహ్యాస్వతంత్రతకై ప్రయత్నించుటమంచిది. పశు పక్ష్యాదులుకూడా స్వతంత్రత కోరుచుండును. ప్రతిజీవికి స్వతంత్రత ముఖ్యము.

౧౧. పరతంత్రత పోవుటకు గీత చెప్పినట్లు ఆచరించుటే ముఖ్యము.

౧౨. మనుష్యతత్వమును సంపాదించుటకై, జరామరణ భయమును విడనాడుట, సమస్తకోరికలను త్యజించుట నిష్కామకర్మల నాచరించుట ముఖ్యము. ఇవేఆత్మజ్ఞానమునకు సూత్రములు. ఫలత్యాగ ముచే రజోగుణము తగ్గుచు సత్వగుణము వృద్ధిబొందును. అందుచేచిత్త చాంచల్యము నశించి మనస్సు నిస్సంకల్పమగును.

౧౩. బట్టలు ఎందుకు కట్టవలెను? మానము కాపాడుటకు కట్టవలెను.

మానవునకుగల సమస్తేంద్రియములలో కొన్ని ఇంద్రియము లందు వానికి ప్రీతిఎక్కువగనుండును. నేత్రేంద్రియము మొదలగువాటి కంటె గుహ్యేంద్రియమందు ఎక్కువ ప్రీతి. దేనియందు ఎక్కువ ప్రీతియో దానిని గుప్తముగానుంచును. దేనిని గుప్తముగానుంచునో దానియందలి ప్రేమచే మనస్సుదానియందుండును. అందుకే గుహ్యేం ద్రియములను రహస్యముగా నుంచుదురు. (ఉదాహరణ) అది యెట్లన, ప్రాపంచకపు వస్తువులలో ఇత్తడి, ఇనుము, మొదలగువాటి కంటె బంగారునందు ప్రీతి ఎక్కువ. అందుకే ఆవస్తువులను లోపలగదిలో త్రిజోరీలోపెట్టి భద్రపరుచుదురు. వాటిపై మమతఉండును. కాన, మనస్సుదానియందేయుండును. అట్లే గుహ్యేంద్రియములపై ప్రీతి ఉండుటవలన వాటిని మరుగున భద్రముగా నుంచుటకే బట్టలు కట్టుదురు.

బంగారముపై ఉన్నంత మమత, జ్ఞాపకము, ఇత్తడి మొదలగు వాటిపైనుండదు. అట్లే శరీరములోని కాళ్లు, చేతులు, మొదలగు అవయవములపై ఎక్కువమమత జ్ఞాపకముండదు. దాచిఉంచిన గుహ్యేంద్రియముపై ఎక్కువమమత యుండును.

బట్టలుకట్టుట ఇంద్రిములకై కాదు.విషయములను భోగించుటకై విషయములయందు ప్రేమచేత కట్టుచున్నారు, ఇంద్రియములు వట్టి గోళములు. విషయవాంఛ లేనిచో ఇంద్రియములతో పనిలేదు. అవి

వట్టి రంధ్రములు. విషయవాంఛకొరకే ఇంద్రియముల ఉపయోగము. విషయాచ్ఛాదనకే బట్టలుకట్టుట.

౧౪. ముందు విషయములను తెలిసికో, అవి ఏమిటో, తదుపరి ఇంద్రియములను తెలిసికొనవచ్చును.

౧౫. నీకు యివ్వబడిన ఆయువు నూరు సంవత్సరములు కదా! ఇంతవ్యవధిలో కూడా నీసంగతి నీవు తెలిసికొనకపోవుట చాలా పాపము. నీకు యివ్వబడిన ఆయువు నిన్ను నీవు తెలుసికొని బాగుపడుటకే దాని విలువను గ్రహించక వ్యర్థముగా చెడిపోవు చున్నావు. నిన్ను నీవు తెలిసికొననిదే ఎన్ని నేర్చినను, ఎంతసంపాదించినను వ్యర్థమే. సుమా? జాగ్రత్త పడుము, ఆలసించకుము.

౧౬. నీవు ఒకసారి 'నేను', అనెదవు. ఒకసారి, 'నాది' అనెదవు ఈ రెంటిలో 'నీవు' దేనివి. 'నేను' వా, లేక 'నాది' వా. 'నేను' అనుట ఏమిటో 'నాది' అనుట ఏమిటో, ఈరెండింటి తారత్యమును తెలిసి కొనుము. 'నాది' అనునది నీ శరీరము, ప్రపంచవస్తువులు. 'నేను' అను నది ఆత్మ నిరాకారము, కనబడనిది. కావున 'నేను' వేరు 'నాది' వేరు. ఇట్లె శరీరమువేరు, 'నీవు' వేరు. కావున 'నేను' 'నాది' అని భావించుట వట్టిభ్రమ.

౧౭. మనిష్యునిశరీరములో ఉండు జ్ఞానేంద్రియములు కర్మేంద్రి యము లనబడు నవరంధ్రముల ద్వారా విషయములను భోగించు చుండును. ఈ శరీరము వట్టి జడము. లోపలఉండు జీవునికి, బయటఉండు ప్రకృతికి మధ్యన ఈ శరీరము ఒక పనిముట్టు. లోపలి జీవుడు బయటి వస్తువులను, కన్ను ముక్కు చెవి, మొదలగు ఇంద్రియముల ద్వారా భోగించు చుండును.

౧౮. ముందు విషయవాంఛలను వీడుడు. ఇంద్రియములు తమంతటతామే తగ్గును. విషయములను ఇంద్రియముల ద్వారా భోగింతురు. ఇందులో ముఖ్యమేది ? విషయములే గదా ! కావున

విషయ వాంఛలను వీడుటయే ఇంద్రియ నిగ్రహమునకు పరమ సాధనము.

## ౩౯-౨ శ్రీ కేశవ చంద్రసేన్ (మాతృభక్తి)

[మీరు అమ్మా నీదగ్గరగల సద్గుణములన్నియు నాకు సంక్రమించినవి. నావి అని చెప్పదగిన వన్నియు నీవేయై యున్నవని చెప్పుచు ఆమె పాదధూళిని తనశిరస్సుపై ధరించెడివారు.]

౧. స్త్రీలను చూచుట, బాగున్నారనుట వారిని తలచుట వారి గుణములను కీర్తించుట, మొదలగునవి త్యజించవలెను.

## ౩౯-౩ ఒక భక్తుని ప్రబోధము

౧. నీవేమికోరుదువో ఇతరులకదే చేయుము. నీనుండి ఇతరులకు కష్టముకలుగరాదు.

౨. మొండెమునకు గుడ్డ, పిండమునకు, పిడుచ, ఈ రెండే కావలయును కదా! దీనికై ఇంత తహతహ పడనేల.

౩. చెట్లుపశువులు ఇతరులకు సహాయముచేయును. మానవుడు ఇతరులను కష్టపెట్టి జీవించుట ఎంతహీనము.

౪. మనము జన్మించినదెందులకో ఆలోచింపుడు. ఏ ఉద్దేశ్యము లేనిది మనము ఏపనిని చేయముకదా! ముందు ఆపనియొక్క లాభ నష్టములనుగురించి విచారించియే ఆ పనిని ప్రారంభించెదము. అటులే మన జీవిత, ఉద్దేశ్యమేమని, విచారించవలెను. దీనిని మరువకుడు.

౫. ఇతరులు చెడ్డవారని నీవు, వారిని ఒక వ్రేలుతో చూయించుచో, తతిమ్మ నీ మూడువ్రేళ్లు నీవైపు చూయించును. కావున, మొదలునిన్ను నీవు దోషరహితునిగా చేసికొనుము. ఇతరుల దోషముల జోలి నీకేల!

౬. పొట్టకూటికై దేవునిపని పాడుచేయకుడు.

౭. దీపముయొక్క సంసర్గమువల్ల ఎట్లు వత్తికూడా దీపము యొక్కరూపమునుపొందునో, అట్లేనీవుకూడా, భగవంతుని స్మరణవల్ల ఆయనరూపమునే పొందుదువు.

౮. సమస్త జగమును భగవంతునిగా తలంచినపుడే నిజమైన భక్తిఅనబడును.

౯. సామాన్యభక్తి అనగా, దేవాలయమునకు పోయి విగ్ర హములను చూచినపుడు భగవంతుని తలంచుట గుడి ఆవరణదాటగానే మళ్లి చెడువర్తనల ఆచరించుటతప్పు. ఏప్రాణిని, బాధించినను అది పాపమేకదా, ప్రతిజీవిలో ఈశ్వరుడు ఆత్మస్వరూపుడై యుండగా అప్రమత్తులై వర్తించుట, ద్రోహము.

౧౦. గోమాత, తనబిడ్డకు పాలిచ్చుచు, ప్రజలకు పాలిచ్చి పోషించి, కోడెల, ఎద్దులనిచ్చి వ్యవసాయము చేయించి అన్నమును పుట్టించును. చచ్చికూడా, చెప్పులకు, ఇంకాఎన్నియో పనుల కక్క రకువచ్చును. కదా మనతల్లి, తనబిడ్డలకే పాలిచ్చును. కాన,గోమాతయే గొప్పది.

౧౧. మబ్బులు ఎటులవృథాగా తిరుగుచుండునో, అటులే రజో గుణముగలవాడు, తృష్ణకై వృథాగా కార్యములు చేయుచుండును. లాభమా సూన్యమే.

౧౨. రాత్రియే పాపము. పగలే పుణ్యము. రాత్రి అజ్ఞానము పగలు సూర్యరస్మి, జ్ఞానము.

౧౩. అజ్ఞానము వల్ల భేదబుద్ధివల్ల ద్వేషముకలుగును.

౧౪. నీరక్షణకొరకు ఇతరులను యాచించకుము. ఈశ్వరుడు నీతో ఎన్నిపనులు తీసికొనవలయునో అన్నిపనులు తీసికొనియే, నిన్ను తీసుకపోవును. అంతవరకు, నీకు భయములేదు, నిశ్చితగానుండుము. అకాలమరణమ్మునుదిలేదు.

౧౫. సూర్యుడొకే స్థానములోనుండి ఎటుల లోకమును ప్రకాశింపచేయునో, అటులే సిద్ధ పురుషుడు కూడా ఏకాంతములో నుండి ప్రపంచము యొక్క కల్యాణమును చేయకలుగును.

౧౬. శ్రాద్ధములనగా, ఇతరులపై ఆధారపడక ఈశ్వరాజ్ఞ చొప్పున వర్తించుట. పవిత్ర ప్రేమ సాధన ద్వారా తలిదండ్రుల సేవ, మరి, మానవ సేవచేయుట, ఏ ధార్మికులగు తలిదండ్రులు సమాజమునకు ఈ వ్యక్తిని ప్రసాదించిరో అనునట్లు బ్రతుక కలుగుటయే పితృదేవతలకు ప్రియమైన విషయము. ఇదియే శ్రాద్ధము యొక్కరూపము.

౧౭. ప్రపంచము రెప్పపాటులోనిది. కన్ను తెరచినచో ప్రపంచము. కన్నుమూసినచో, ఉత్తదే. కనపడదు. కావున ప్రపంచము క్షణికము. రెప్పపాటులోనిదే, దేవతల కంటిరెప్పలు కొట్టుకొనవు. వారిదికొన్ని నాళ్ల ప్రపంచము. మనది రెప్పపాటులోనిది. రాత్రి నిద్రలో ప్రపంచము సున్నయేకదా! ఇక, మిగిలినదేది. మానవుని శరీరము దుర్గంధమైనది కదా! ప్రపంచవస్తువులు దుఃఖ కారణమేకదా! ద్రవ్యముదుఃఖమే. శరీరముదుఃఖమే. ఇకసుఖమనునదేది. దీనికై ఇంత తహ తహాపడనేల. బాగావిచారించి సమస్తము నందలి మమతను త్యజించి ఈశ్వరుని స్మరించుటే ముఖ్యము.

౧౮. శ్రీమంతులకును, బీదలకును, సుఖదుఃఖములు సమానమే ఏలాటి భేధముండదు.

౧౯. మనదృష్టి ఎటులుండునో సృష్టి అటులే గోచరించును. ఎటులనగా, చేతిలో అంజనము వేసికొనినవాడు రెప్పకొట్టక బాగా దృష్టి నిలిపి చూచినచో ఆ అంజనము వేసికొనినవాని చెయ్యికూడా కానరాక ఒక వెలుతురు కనుపించి అందులో ఏమేమో దృశ్యములు కనుపించును కదా! అటులే, జ్ఞానముచే విచారించినచో జగత్తు లేనే లేదు. అంతయు తేజస్సే, బ్రహ్మమయమే.

౨౦. బీదలు, పీడితులు, వికలాంగులు మొదలగువారు వారివారి కర్మానుసారము జన్మించుదురు. కావున, ఈశ్వరాజ్ఞను ఉల్లంఘించి వర్తించరాదు. స్వధర్మమును విడవక ధర్మాచరణ గలవారై భగవంతుని స్మరించుచుండవలెను. ముందుజన్మలో మంచి రావచ్చును.

౨౧. స్థూలశరీరావస్థనగా, సుఖ దుఃఖము లందలి ఆభాస ఎంతవర కుండునో అంతవరకు, శరీరమునందు మమత ఉండితీరును.

సూక్ష్మ శరీరావస్థనగా, నా ఇంద్రియములు, నా బుద్ధి మొదలగునవి నావి, నావి, అను భావ మెంతవర కుండునో అంతవరకు సూక్ష్మ శరీరమునందు మమత ఉండి తీరును.

కారణ శరీరావస్థనగా, నాకు నిద్ర చాలలేదు. నిద్ర లేనిచో బ్రతుకలేను మొదలగునవి, నేను అను భావ మెంతవర కుండునో అంతవరకు కారణశరీరమందు మమత ఉండితీరును. కావున, ఈ మూడు శరీరముల యొక్క బంధనమును సాధనచే విడగొట్టుకోవలయును.

## ౩౯౪ భక్త లతీపుసాహెబు

౧. ఓ మానవులారా, ఇంతవర కెందరో అజ్ఞానముచే అంధులై హేయమైన త్యాజ్యమగు శరీరమున విశేషాభిమానముచే ఈ భూమి నాకెట్లు వశపడును, నా పుత్రమిత్రుల కెట్లు వశమగును, సమస్తము నాకే కావలయును. దీనికి దగిన యుపాయమును జేయవలయునను చింతతో గూడినవారయి గతించిరి. మీకు కూడా అదేగతి పట్టును. నీటిబుగ్గకు సమమగు శరీరస్థితిని శాశ్వతమని తలంచకుడు.

౨. మొదలు తమను జయించక లోకమును జయించ దలంచకుడు. తమకు మృత్యువు తప్పదని ఎరుంగకున్నారా !

౩. ఇదివరకు పోయినవారివలెనే మీరు కూడా వుత్తచేతులతో పోవువారేగదా! మీరే ఆలోచించుకొనుడు. కావున సమస్త కోరికలను త్యజించి మోక్షమునకై పాటుబడుడు. ఆలసించకుడు.

౭. ఇదివరకెందరో మహారాజులు చక్రవర్తులు ప్రపంచమంతయు జయించి కీర్తి వహించినవారి శరీరములు సైతము కాల్పబడి బూడిద యయ్యెను గదా! ఛీ, ఛీ, ఏమిసంపదలు? వీటి కాశపడి నశించకుడు.

౫. బుద్ధిశాలియగు మనుజుడు తనయందు మమతను వర్జింపవలయును. పుత్ర దార గృహ క్షేత్రాదుల యందు మమత గూడదని వేరుగ చెప్పవలసినదిలేదు కదా? అనగా, సమస్తమును వీడవలెను.

౬. ఈ హితోపదేశంబును మీమనంబున నూని మీ ఆత్మ భారమును భగవదధీనముచేసి, నిర్భయులై యుంటిరేని మీకు మోక్షము కరతలామలకమయి యుండును.

## ౩౯౫ భక్త గణేశనాథుడు

౧. శరీరమునకు సుఖము కలుగచేసినచో ఇంద్రియములు విషయ సుఖము నపేక్షించును. విషయములు విషమునకంటె క్రూరములు. విషమును భుజించుటచే శరీరమునకు మాత్రము హానిగలుగును. విషయములను స్మరించినంత మాత్రముననే ఆత్మకు నరకము ప్రాప్తమగును. కాన బుద్ధిమంతులు శరీరమునకు సుఖము కలుగ చేయరాదు.

౨. మానవుడు సుఖము ననుభవించునపుడు భగవంతుని స్మరింపక విషయ సుఖమున తనివితీరక కామాతురుడై కాలమును గడుపుచుండును. కావున, ఇట్టివానికి నరకము తప్పదు.

౩. తప్పుసాక్ష్యము చెప్పువాడును, పక్షపాతముచే వ్యవహారమున అన్యాయము పలుకువాడును, అబద్ధమాడు వాడును, రౌరవమను నరకమును, జెందుదురు. శిశుహత్య చేయువాడును, గ్రామములను జెరుచువాడును, గోవులను జంపువాడును, ప్రాణులకు శ్వాసబంధము చేయువాడును, రోధమను నరకమును జెందుదురు. మద్య

పానము చేయువారును, బ్రహ్మహత్య చేయువారును, స్వర్ణము నపహరించు వారును, సూకరమను నరకమును జెందుదురు.

తన్ను నమ్మి కాచియుండువారి నుపేక్షించు వాడును, శరణాగతులను కొట్టి తరుమువాడును, తప్తలోహమను నరకమును జెందుదురు. కోడలు కొమార్తె మొదలగు వారల జెందువాడును, గురువు నవమానించు వాడును, కోపించి పరులను దిట్టువాడును మహాజ్వాలఅను నరకమును జెందుదురు. వేదదూషణము చేయు వాడును, వేద విక్రయము చేయువాడును, పరస్త్రీలను జెందు వాడును, లవణమను నరకమును జెందుదురు. దొంగిలించు వాడును, లోక మర్యాదను చెరుచువాడును, విలోమమను నరకమును జెందుదురు. దేవదూషణము చేయువాడును, ఉత్తమ వస్తువులను దూషించు వాడును, పరులకు కీడుచేయు వాడును, క్షుద్రమాంత్రికుడును క్రిమి భక్షణమను నరకమును జెందుదురు. పితరులను, అతిథులను విడచి ముందుగా భుజించు వారును, వేటకాడు మొదలగు వారికి ఆయుధములను జేసి ఇచ్చు వారును, లాలాభక్షణమను నరకమును జెందుదురు. క్రూరములగు బాణములు కత్తులు మొదలగు నాయుధములను అయోగ్యులకు జేసి యిచ్చు వారు విశసనమను నరకమును జెందుదురు. మంచి పదార్థములను పరులు చూచుచుండ వారల కీయక తానొక్కడే భుజించు వాడును, పిల్లి, కోడి, మేక, కుక్క, పంది, పక్షులు మొదలగు వాటిని నెప్పుడును మిగుల నుపలాలనము చేయు వాడును, పూయవహమను నరకమును జెందుదురు.

నాటకమాడి జీవించు బ్రాహ్మణుడును, మల్ల యుద్ధము చేసి జీవించు వాడును, గాలము మొదలగు వానిచే మత్స్యములను బట్టువాడును, విషము పెట్టువాడును, కొండెము చెప్పువాడును, భార్యను పరులకు దార్చియిచ్చి జీవించు వాడును, అపర్వకాలముల యందు ద్రవ్యాశచే పర్వకాలంబులను జేయించు వాడును, ఇండ్లను

గాల్చు వాడును, స్నేహితుని చెరుచు వాడును, పశులను జంపు వాడును, విక్రయించు వాడును, రుధిరాంభమను నరకమును జెందురు. ధన యౌవనాదులచే గర్వమును జెంది గ్రామము యొక్క యెల్లను మార్చు వాడును, శుద్ధిలేని వాడును, మోసముచేసి జీవించు వాడును, కృష్ణమను కార్ష్ణాయసమను నరకమును జెందుదురు. వైదికోపయోగము లేక వ్యర్థముగా పలాశాది వృక్షములను ఛేదించు వాడును మేకలను విక్రయించు వాడును, మృగములను జంపువాడును, అగ్నిజ్వాలమను నరకమును జెందుదురు. వ్రతలోపము చేయువాడును, ఆశ్రమ ధర్మములను విడిచిన వాడును, సందంశమున బాధపడుదురు. మద్య మాంసాది శాస్త్రదుష్టములగు పదార్థములను గుడుచువారు మల మూత్ర క్రిమిభోజనము చేయుదురు. ఏకాదశినాడు భుజించువారు పంచమహాపాతకములఫలమును జెందుదురు. తమతమ వర్ణాశ్రమములకు విరోధముగ నడుచు వారును, మనోవాక్కాయములచే పాతకములను జేయువారును, వారి వారి పాపములకు తగిన నరకములను జెందుదురు. ఇట్లనేక విధములగు పాపములు చేయువారికి యాతనలను జెందు నరకములు అనేకములున్నవి. పాపులు నరకానుభవము చేసిన పిదప క్రమముగ, స్థావరములై, పురుగులై, జలచరములై, పశులై, మృగములై, మనుష్యులై, ధర్మశీలురై, దేవతలలై, కడపట ముముక్షువు లగుదురు.

౪. పైన చెప్పబడిన నరకము లన్నియు ఇంద్రియ లోలుర చేతనే జీవించి యున్నవి. జితేంద్రియుడగు వానికి నరక భయముండదు.

౫. శరీరమునకు సుఖముకలుగ జేసిన ఇంద్రియములు బలిష్ఠములై విషయ వీధియందు సంచరించును. కావున ఇంద్రియ నిగ్రహమును కోరువాడు శరీరసుఖము నపేక్షింపక, మితాహారమిత నిద్రలతో గూడి మితభాషియైనిర్జన స్థలమున వసించుచు, సాధుజన సంగతి నపేక్షించుచు, నిరంతరభగవద్గుణాను భవకీర్తనములచే కాలముగడుపవలయును.

౬. సమస్త కోరికలను త్యజించి ప్రతిజీవిలో ఈశ్వరుడు గల డని భావించి, వివేకులై సత్పథంబున వర్తింతురేని భగవదనుగ్రహము జెంది పునరావృత్తి రహితమైన మోక్షమును జెందుదురు.

## ౩౫౬ శ్రీ సాయీబాబా

౧. ప్రతిఫలము లేకుండా ఒకనినుండి, సేవా రూపకముగ కాని, వస్తురూపకముగా కాని ఏదైనను పరిగ్రహించుట వలన ఆపరిగ్రహించిన వాని యొక్క పూర్వపుణ్యము పోవును.

౨. నాది, అని, నీవద్ద ఒకవస్తువును కూడా నిల్పుంచరాదు. సమస్తమును ఈశ్వర దత్తముచేయుము. అడిగినవారికి లేదనకుండా యిమ్ము. ప్రతిజీవిలో ఈశ్వరుడుగలడని వారిని ప్రేమించి సేవించుము. ఎవరిని ద్వేషించకుము. గర్వమును, అహంకారమును వీడి, నమ్రుడవై మెలంగుము.

౩. సమస్తకోరికలను విడనాడి, సదా భగవంతుని స్మరించు చుండుము.

## ౩౫౭ శ్రీ ఉపాసనీబాబా

౧. పూర్వ కర్మానుసారముగ, శుభా శుభములు గలుగుచుం డును. కష్టములు శాశ్వతములు కావు భయపడకుడు.

౨. ఈ పాడుపొట్టకై పలువిద్యల నభ్యసింపవలయునా? ఈ పొట్ట కూటికేకదా, ఒకరికి లొంగునది. అధర్మ కార్యములు చేయునది అప్రయత్నముగ దొరికినదానితోనే తృప్తిపడుము.

౩. నీవు చావనున్నను ఇతరులు అడగిన దానిని నీకై ఉంచు కొనక వారికిమ్ము.

౪. దురదృష్టమును భరింపుము. అదృష్టమొనగూడిన, త్యజిం పుము. నీకోరికల నరికట్టుము. మహాత్ములచెలిమిని వీడకుము, ఏమియు

దొరుకకపోయినను, జలము గ్రోలియైనను, జీవితమును గడుపుము. పరమేశ్వరుని ప్రేమింపుము. ఇతరులను యాచించకుము. నీవుకష్టించి ఇతరుల కుపకారముచేయుము.

౫. భగవంతుని పరిశోధింప నహంకారపడకుము. ఏకాంతము, మితభాషణము,అలవాటు చేసుకొనుము ప్రాపంచకేచ్ఛలను విడువుము.

౬. మానవునకు ఐహికేచ్ఛలు, పరమేశ్వర దర్శనమునకు, అవరోధములు.

౭. శరీరమును సుఖపెట్టకుము. కష్టకార్యములందు పాల్గొనచేయుము. ఈ శరీరము తనసౌఖ్యము కొరకైనిన్ను నీచకార్యములందు పాల్గొనచేయుచుండును. కమ్మని భోజనములు, భోగములు కోరును, తుదకు విశ్వాస విహీనునిచేసి, కష్టముల పాలుచేసి, పోయి దహించబడును.

౮. నిన్ను ఇతరులు అవమానపరచినను, కష్టపెట్టినను, వారిని ద్వేషించక ప్రేమించుచు వారికి మేలుచేయుము. ఓర్పుమహాగొప్పది, క్షమగలిగి ఉండుము.

౯. చీమలు, నల్లులు, తేళ్లు మొదలగు వాటిని ఏలచంపెదరు. అవికూడా నీవలే ఆత్మలే కదా, భగవంతుడు వాటిలోకలడు. జాగ్రత్త.

౧౦. ఎవడెంత కష్ట పరంపరల బొందునో, అతడంత భగవదంశము నొందును.

౧౧. ఏది ఎటులజరుగునో, అదిఅటుల జరుగనిమ్ము. జానెడు పొట్ట, జానెడు బట్టకై ఏలప్రయాస పడెదవు.

౧౨. ఆత్మశక్తిని పెంపొందించుకొనుము. గాఢవిశ్వాసముచే సత్కర్మలొనర్చుచు వాసనల నణచి శాంతి నొందుము.

౧౩. యజ్ఞము వాతావరణమును కూడా పరిశుద్ధమొనర్చును.

౧౪. నీ విషయమై ఇతరులను బాధపెట్టకుము. పరాధీనుడవు కాకుము.

౧౫. సాత్వికాహారమును మితముగా తినుచు దుర్విషయము లందు పాల్గొనకుండుటచే కామమును జయించవచ్చును.

౧౬. నే చెప్పిన చొప్పున, ఆచరించినచో, ముక్తి దొరుకును.

## ౩౯. శ్రీ గ్యార్యాబాబా

[వీరు కూలిపని చేయుచు వచ్చిన డబ్బును బీదల కిచ్చుచుండు వారు. కోతులకు, పక్షులకు పుట్నాలు మొదలగు వాటిని కొని వాటికి పెట్టి ఆనందించువారు. ప్రతిజీవిని ప్రేమించి సేవించువారు. వీరి మంచిప్రవర్తన వలన ఎందరో బాగుపడిరి. వీరు ప్రతివారికి ఉపకారము చేయుచుండిరి.]

ఒకరోజు రాత్రి కొందరు వీరిని వెంటతీసుకపోయి ఒక ఇంటి ముందర వీరిని కూర్చుండపెట్టి మేము తిరిగి వచ్చువరకు నీవు ఇక్కడనే ఉండమని వీరికి చెప్పి వారు ఆ యింటిలోనికి పోయి సామానులను దొంగిలించు చుండగా, ఆఇంటివారు మేల్కొనుటచే ఆదొంగలు పారిపోయిరి. ఆఇంటివారు వీరిని ఇంటిముందర ఉండుట చూచి వీరిని బాగా దెబ్బలు కొట్టి బంధించిరి. దానికై ఏమియు బదులుచెప్పక వారివెంట వచ్చినందుకు తగుశిక్ష అయినదని సంతోషించి నిశ్చింతగా ఉండిరి. ఉదయమున ఆ ఇంటివారు వీరిని గుర్తించి, చాలా చింతించిరి. దానికై వీరు, నాయనా, మీతప్పేమున్నది నేను చేసిన తప్పునకు శిక్ష అగుట న్యాయము. మీరు నాకు మేలుచేసితిరనుచు వారిని దీవించి వెళ్లిపోయిరి.

వీరు తన మృత్యువునకు పదిహేను దినముల ముందే తెలిపి నేను జీవించి యుండగనే నాయొక్క శోకసభ, నాముందరనే జరుపుడు. నేను చచ్చిన తరువాత దుఃఖించవలదు అనిరి.

## ౩౯౯ శ్రీ హరిహర్‌బాబా

౧. ఉదయము సాయంత్రము సదా భగవంతుని నామము జపించుచుండుము. నిరంతరము సత్సంగము చేయుచుండుము. ఇదే నిన్ను ముక్తికి తీసుక పోవును.

౨. బాహ్యాంతరశుద్ధిచే పరిశుద్ధుడవై భజించుటచే భక్తి కుదురును. భక్తిచే ముక్తి కలుగును.

## ౪౦౦ శ్రీ ఉడ్యాబాబా

౧. ఆసక్తిని విడచి, నిష్కామముగా సేవచేయుటే,భగవద్భజన. దీనికై ఎన్నికష్టములు వచ్చినను శాంతముగా సహించుము.

౨. క్రోధము, లోభము కలవాడు పాపాత్ముడే. లోభునిపై ఈశ్వరుడు క్రోధపడును. భక్తుడై కూడా అహంకారపడు వానిపై ఈశ్వరుడు అధికముగా కోపపడును.

౩. ఏకాంత వాసములో ఈశ్వరుని ధ్యానించుము. పగలు నిద్రపోరాదు. నిద్ర వచ్చునేని జపముచేయుము.

౪. పెండ్లి పేరంటాలు జనసమూహాములోకి పోకుము. వృథా మాట్లాడకుము. ప్రపంచ వస్తులనుకోరి వాటియందలి మమతచే బంధించ బడకుము. కీర్తి ప్రతిష్ఠలను కోరకు. గర్వపడకుము. నిన్ను నీవు అందరికంటె తచ్చువానినిగా తలంచుము. అందరికి దీనుడవై సేవచేయు చుండుము. ధనము, స్త్రీ ఈరెంటిని గురించి చాలా జాగ్రత్తగా మెలుంగుము. ఇవి నిన్ను నాశనము చేయును. దీనిని మరువకుము.

౫. క్రోధము, ద్వేషము, కపటము, స్వార్థము, అభిమానము, లోకనిందకు భయము, మొదలగునవి నీమనస్సులో నుండునంతవరకు నీవు ఎంత తపస్సు చేసినను వ్యర్థమే సుమా! ఇది మరువకుము.

౬. జిహ్వాచాపల్యమునకు లోబడి భోజనము చేయుచో తమోగుణము వృద్ధియగును. రసనేంద్రియములు వశముకానిది తక్కిన ఇంద్రియములు వశముకావు. కావున, మొదలు జిహ్వేంద్రియమును జయించుము.

౭. నిరాడంబర జీవనము గడుపుము. నీకొరకై ఎక్కువ ఖర్చు పెట్టుకొనకుము. ఇతరులను యాచించకుము. పరాధీనుడవై జీవించుట హీనము.

౮. పరనింద చేయకుము. ఇతరులను ద్వేషించకుము. నిన్ను ద్వేషించిన వారిని ప్రేమించుము.

౯. వాద వివాదములకు దిగకుము. శాంతముగా నుండుము.

౧౦. విషయ వాంఛల కాశించి నశించకుము. సమస్త కోరికలను త్యజించుటే ముఖ్యము.

## ౪౦౧ శ్రీ కాత్యాబాబా

[వీరు వీరిగురువుగారి ఆజ్ఞకు జవదాటువారుకారు. సదా సేవ చేయుచుండెడివారు. ఒకరోజు చలికి శరీరము వణకుబట్టి స్తంభించి పోయెను. తుదకుభరించలేక చలిబాధను తీర్చుకొనుటకై మంటపెట్టు కొనుటకు గురువుగారిని ఆజ్ఞనడగిరి. అందుకు గురువుగారు ఇట్లనిరి. నీసుఖముకొరకే తల్లితండ్రుల ఏడిపించి ఇల్లువాకిలి విడచి ఇక్కడికి వచ్చుతివా? అదిచాలా పాపము. స్వసుఖముకొరకు, నియమభంగము చేయుటకంటే మృతినొందుటమేలు. కావున, జాగ్రత్త. అని గురువు గారు అనగా, వీరు మారుపలుకక, నిశ్చింతగలవారై సమస్త కోరికలను త్యజించిరి.]

## ౪౦౨ శ్రీ కాచిబాబా

[వీరు గొప్పభక్తులు. వీరు నిద్రించినను, నిద్రలో శ్వాస స్వయముగా, రామ రామ. అని జపించుచుండెడిది. ఒకరోజు వీరు మిఠాయిని,

తినుటచే ఆరోజుజపము ధ్యానము సక్రమముగా జరుగలేదు. దానికై పశ్చాత్తాపపడి, తనజీవితపర్యంతము ఎన్నడు మిఠాయిని తినలేదు.]

౧. ఏజీవియైనా బాధపడుచుండుటజూచి జాలిపడివాటికి సేవ చేయుము. కుక్క, పిల్లి మొదలగు జంతువులు రోగపీడితులగుచో వాటికి తగుమందు, ఆహారపానీయమునిచ్చి కాపాడుట ధర్మము.

౨. ఎవడు దేనికి హానిచేయడో వానికి ఏదియు హానిచేయదు.

౩. పరోపకారమునకై నీశరీరముయొక్క మాంసమునైనను ఇచ్చి ఇతరుల ఆపత్తులను తీర్చుము.

## ౪౦౩ శ్రీ రఘునాథ్‌బాబా

౧. అణువంత సుఖముకోసము, మేరుపర్వతమంత పాపము చేయుట ధర్మమా!

## ౪౦౪ శ్రీ పయోహారిబాబా

౧. రాత్రీ, పగలు, నిద్రలోనే నీజీవితమును గడపకుము. ఎన్నియో జన్మలు ఎంతయోకాలమునుండి, నిద్రలోనేగడపితివి. ఇక నైననుజాగ్రత పడుము. భగవంతుని తెలిసికొనుము. లేనిచోదుఃఖము తప్పదు. చావుతప్పదు.

౨. మనస్సును, వాణిని, శరీరమును ఈమూడింటిని పవిత్రము చేయుము. ఇది నీ విధి, దీనిని మరువకుము.

## ౪౦౫ శ్రీ పహ్వారిబాబా

[వీరి ఇంటికి ఒకరోజుదొంగలు వచ్చి, సొమ్ములు మొదలగునవి తీసుకొనుసమయములో, వీరు మేల్కొనుటచే ఆదొంగలు సొమ్ములను విడచి పారిపోవుచుండగా వారివెంటబడి, అయ్యా, నేను మేల్కొనుట

నాదితప్పు, అందుకునన్ను క్షమించి దయచేసి మీ సొమ్ములను మీరు తీసుకపోండని, వారిని ప్రార్థించిరి.

వీరిని ఒకరోజు పాము కాటువేసెను. దానికై విచారించక, నాప్రియుని నుండి సందేశము తెచ్చిన, రాయబారి అనుచు ఈశ్వర భావముతో ప్రేమించిరి. అంతయు ఈశ్వరేచ్ఛే అని అనేవారు.]

౧. సత్యమునే పలుకుము.ఇతరులకు కష్టమగునట్లు పలుకకుము. ఇతరులకిష్టమని అసత్యము పలుకకుము.

౨. పుష్పములను, ఆకులను, కొమ్మలను, త్రెంచకుము. కాయలను, పండ్లను, కోయకుము. కాలపరిపక్వమై వాటంతటవి క్రిందపడినచో తీసికొనుము.

౩. ఏజీవికిని హానిచేయకుము. ప్రతిజీనిని ప్రేమించి, సేవించుము.

## ౪౦౭ శ్రీ భోలేబాబాజీ

౧. దేహాభిమానమే నిన్ను బంధించి నరకకూపములోబడవేయు చున్నది. దేహాసక్తిని విడచితివా, సమస్త బ్రహ్మాండము నీవశమగును, సదాముక్తుడవే.

౨. కామమునకు వశుడవై నశించకుము. ఈరోజు ఉండిరేపు నశించునట్టి క్షణికవస్తువులకై ఆశపడి బంధింప బడుట ఎంత వెఱ్ఱితనము.

౩. నేను, నాది, అనుభావమున్నంత వరకు నరకముతప్పదు.

౪. తినుటకై ఆసించకుము. తినుచూ తినుచూ ఎందరో చని పోవుచున్నారు. కదా! అదేగతి, నీకుపట్టును.

౫. ఇదిచేయుదునా, అదిచేయుదునా, అనువిచారము త్యజించుము. ఏది ఎటులజర్గునో అటులే జరుగనిమ్ము. ఈశ్వర విధానమునకు విరుద్ధముగ ఏదిచేయకుము. ఇచ్ఛారహితుడవుకమ్ము. అకర్తవుకమ్ము. అభిమానమును వదులుము. కర్మచేయు భావమున్నంతవరకు, అహంకారముండితీరును. కావున, సమస్తకోరికలను త్యాజించుము.

౬. సమస్త విషయభోగములను త్యజించుము. రాగ, ద్వేష ములను విడువుము.

౭. సమస్త జీవులలో ఈశ్వరుడు గలడని అందరిని ప్రేమించి సేవించుము.

౮. కీర్తి, ప్రతిష్ఠలు, పదవులకై ఆశపడకుము. మానావమాన ములనుసహించి, అనుభవించుము.

౯. జీవించుటకై ఆశపడకుము. మరణించుటకై భయపడకుము సదాసంతుష్టుడవై ఉండుము.

౧౦. ఈశ్వర సృష్టిలో అన్నియుమంచివే. ఒకటి మంచి వేరొకటి చెడ్డఅనునది ఉండదు. నీమనస్సంకల్ప మెటులుండునో అటులే బాహ్య సృష్టిగోచరించును. నీదృష్టియే, సృష్టి, కావున? ఇచ్ఛా నిచ్ఛాఅనునది ఉండరాదు. సమదృష్టినవలంబింపుము.

౧౧. హాని, లాభములను, సుఖ దుఃఖములను, సమముగా సహించుచు, అనుభవించుచుండుము.

౧౨. ఇతరులదోషములను చూడకుము. ఇతరులను దోషులని భావించకుము. శత్రు మిత్రులను భేదములేక అందరిని ప్రేమించి, సేవించుము.

౧౩. ధన, సంపత్తులను సంగ్రహించకుము. నీవద్ద ఉన్నదానిని లేనివారికిమ్ము. పరాధీనుడవు కాకుము. ఎవరికి ఋణగ్రస్తుడవుకాకుము. ఇచ్చుచుండుము కాని, తీసికొనకుము.

౧౪. నే,నే, గొప్పకావలయునని. ఆశపడకుము. ఎవరికి లేని సుకమును నీవు ఆసించకుము. తీసికొను ఆశయున్నను విడుచు ఆశ యున్నను బంధమే సుమా! నిరాశయేసుఖము.

౧౫. ఇంద్రియములను నిగ్రహించుము, ఇంద్రియములు కోరిన వాటిని త్యజించుము. సంకల్పరహితుడవు కమ్ము.

౧౬. నీదేహముండనీ, లేక యిపుడేపోని, వచ్చినదిపోక తప్పదు కదా! దాని కై దుఃఖమెందులకు. భయపడనేలా ?

## ౪౦౭ శ్రీహరీబాబా

౧. సంసార సంబంధములను త్యజించుము. ఇతరుల దోషములను చూడకుము. సుఖభోగములను కోరకుము, దుఃఖములను సంతోషముగా సహించుచు అనుభవింపుము. దేనినిమమతచే మోహించకుము.

౨. ధనవంతునికి ముక్తి లంభిచుట దుర్లభము. కాన, ధనమును సంగ్రహించకుము. దానియందు మమత నుంచకుము.

౩. ప్రతిజీవిలో, ప్రతివస్తువుయందు భగవంతుని దర్శించుము.

## ౪౦౮ శ్రీ ఠక్కరుబాబా

౧. అవకాశము చిక్కినపుడు, తీరికదొరికినప్పుడే కాక జీవితాంతమువరకు సేవచేయువారు దేశమునకు అవసరము. అట్టి సేవాభిలాషులు దొరకనంతవరకు దేశము ముందునకు నడువదు.

౨. మనము, మన మధాంధత, తామసమునుండి వెంటనే మేలుకొననిఎడల, దీనుల, అనాథుల, ఆర్తనాదములనుండి పుట్టునట్టి ఆవిరిలోపడి మ్రగ్గిపోవక తప్పదు.

౩. భూగర్భములో ఈశ్వరనిర్మితమైన నీటినే త్రాగకుండా చేయుచు, హరిజనులకు ప్రత్యేకముగ, బావులను త్రవ్వించడము విచారకరము. పాపము.

౪. విద్యావంతులము, నవనాగరికులమైన మనము, హరిజనుల వాడలలో నివసించనంతవరకు, రేయింబవలు వారితో ఉండి వారిదైనందిన కష్టసుఖాలలో పాలుగొననంతవరకు హరిజనులను, ఆనరక, కూపములనుండి తప్పించజాలము.

౫. తల్లి ఏవిధముగా మలమూత్రాదులను, శుభ్రపరచి శిశువును పెంచుచున్నదో, అదేవిధము హరిజనులనబడు, తల్లి సమస్తమైన మలమూత్రాదులను యెత్తి సమాజమనే శిశువును రక్షించుచున్నది. కావున, మనము వారిని, తల్లినిగా తలంచవలెను. వారికి మనము కృతజ్ఞులముగా నుండవలెను.

౬. రయితును, చూడుడు తాను, కడుపు కట్టుకొని,ఇతరులను పెంచును. కావున, ఈశ్వరుడిచ్చినదానితోనే తృప్తి పొందవలెను. మన శ్రమశక్తుల ద్వారా సరిపడునంతనే సంపాదించుట మంచిది.

౭. శరీరము తునక, తునకలై పోయిననూ సరే, కాని, ప్రతిజ్ఞా భంగము ఏమాత్రము కాకూడదు.

౮. ఆకలిగొనినవారికి అన్నమిడక, పశుప్రాయముగ తన కడుపునింపుకొనుట పాపము.

౯. దేశముకొరకు మనమందరము పరమార్థముచేసిన నాడే మనస్వరాజ్యము మనకు దక్కగలదు. నోరుకట్టుకొని కడుపుకట్టుకొని ద్విగుణీకృతోత్సాహముతో పనిచేయవలెను. ఇప్పుడు అట్టితరుణ మాసన్నమైనది.

౧౦. మాన, వేచ్ఛకంటే, ఈశ్వరేచ్ఛే ప్రబలమైనది. కాన, దానిని, కించిత్తైనను ఉపేక్షచేయరాదు.

## ౪౦. శ్రీ కుసుమహరనాథ్ బాబా

౧. భగవన్నామస్మరణచే సంతోషము ఆత్మయందు ప్రసన్న భావమేర్పడును. సంతోషముతో కామనలు నశించును. వాంఛా రహితముచే పరమసుఖప్రాప్తి కలుగును.

౨. ఉన్నదానిని ఈశ్వరప్రీతికొరకై వినియోగించుచు, లేని దానికై కోరకుండినచో వాంఛారహితమై వైరాగ్యముకలుగును.

౩. కోరికలున్నంతవరకు, ఆనందము కలుగదు. అది ఆత్మస్థితు డైనపుడే లభించును.

౪. నాయనా ఇది, ఆటలతో ప్రొద్దుపుచ్చుకొను సమయము కాదు. భగవంతుని స్మరించుము.

౫. కొత్తపాపములను చేయకుము. పాతవాటినే వదిలించు కొనుము. సమయముమీరినచో పశ్చాత్తాప పడవలసివచ్చును.

౬. ప్రపంచబంధములను పెంచువాడే శత్రువు. వాటినిత్రుంచు వాడే మిత్రుడు.

౭. మనమెన్నియో మారులు మనభక్తిప్రేమలను, ఇతరులకు చూపుకొని వారినిందాస్తోత్రములలోబడి మోసపోవుచున్నాము. మనమితరుల మెప్పులకులోబడి కులుకుచున్నపుడు మనప్రభువు మన వెనుకనే ఉండి, వీరిమెప్పులకే సంతోషించుచున్నావా ? నామాటయే మరచితివా, అని నవ్వుచుండును. కావున, కీర్తికాశించి నశించకుము.

౮. ఏ వ్యక్తి మంచివాడో; ఏవ్యక్తిచెడ్డవాడో. నీవునిజముగా నిర్ణయించజాలవు. కాన, సమభావముంచుము.

౯. నీవు ఏపనిచేయబూనినను, ఆలోచించినను, మాట్లాడినను, ముందు, నీ ఆత్మతో విచారించుము. ఇదిమంచిదా, అవసరమా, లేదా నాకు మేలా, కాదా, అని విచారించియే, కార్యమాచరించుము.

౧౦. దినదినము, నేనుప్రాపంచిక బంధములనుండి విముక్తి పొందుచున్నానా, లేక, కొత్తబంధములను, తగిలించుకొనుచున్నానా నాకుండబడు జీవితవస్తువులు హెచ్చుచున్నవా, తగ్గుచున్నవా, ప్రాపంచిక వస్తుసముదాయముపై మరియు బంధువులపై ప్రీతిగలదా అని ప్రతిరోజు నిన్నునీవు ప్రశ్నించుకొనుచుండుము.

౧౧. నీలోఉన్న తప్పిదములనువెదకి త్యజించుము. నీదశను నీవుచూచుచుకూడా పశ్చాత్తాప పడవా ?

౧౨. భక్తుడు భగవానుని అంశమే. కాన, ఆయన గుణములే అలవడ వలెను. విషయలోలురై కుటుంభరులై భక్తులవలె నటించుట భగవానునికి, కళంకము కలిగించుటే యగును. భక్తుల నడవడియే భగవానుని కీర్తికి పునాది.

౧౩. ఇపుడు నీవు గడుపు జీవితముతో తృప్తిపడుచు కొంత నామజపమో భజన పూజనో చేసిన చాలు ననుకొనుట విచారింప దగిన విషయము. నీ జీవితమే మార్పు చెంద వలయును.

౧౪. పవిత్రత, అలిప్తత, ఈరెండు భక్తునియొక్క ముఖ్య లక్షణములు.

౧౫. అత్తరుయందు పరిమళము లేదనుట, అది నీ ముక్కు లోని దోషమే యగును. అట్లే పరమాత్మ జగత్తులో నిండియుండగా ఆనందానుభవము లేదనుట, నీ మనస్సులోని దోషమే యగును.

౧౬. మనము మనచింత విడిచితిమేని భగవానుడే మన చింత పూనుకొనును.

౧౭. నీకు గొప్పతనమును, చిన్నలే ఇచ్చినారు. కావున, వారిని అసహ్యించు కొనకుము.

౧౮. లక్షాధికారి యైననూ, అర్థించెనేని, భిక్షుకుడే కదా!

౧౯. నీ మనస్సే నీ ఆధీనములో ఉండదే, మరి, ఇతరుల మనస్సెటుల నీ ఆధీనమగును.

౨౦. జగత్తునంత నీవు ఉద్ధరించజాలవు. నిన్ను నీవు ఉద్ధరించు కొనిన చాలు.

౨౧. అల్ప రుచులకై ఆరాట పడకుము. కోరికలు తగ్గిన కొలది కొరతలు తమకు తామే తగ్గును.

౨౨. సత్యముపైన హృదయాంతర్ గతమైన ఆత్మశక్తిపైన ఆధారపడి యుండువారికి సందేహములు, భయములు ఉండనేరవు.

౨౩. పలువిషయములలో నిరికి, వృథాకాలమును వ్యర్థము చేయకుము.

౨౪. దానము చేయుచో ధనము తగ్గునని భయపడకుము.

౨౫. తన మనస్సుతో నెవడు సదా ఘర్షణ చేయుచుండునో వానికి ఇతరులతో నెపుడును ఘర్షణ పర్పడదు.

౨౬. దివ్యజీవనమునకు ముఖ్యముగా కావలసినది పవిత్ర హృదయమే.

## వ్రత దీక్ష

1. వీలైనంతవరకు అనవసరముగ మాట్లాడక మౌనముగా ఉండుము.

2. ఎన్నికష్టములు వచ్చినను ఎల్లపుడు సంతోషముతో కాలము గడుపుము.

3. ఎదటివానియొక్క విమర్శగాని మరిఎవరి విమర్శగాని చేయక, నీ పొరపాటులను విచారించి దిద్దుకొనుము.

4. నాలుకకు మధుర పదార్థముల రుచి చూపకుము.

5. వీలైనంతవరకు ఎవరికిని, ఏవిషయములలోను మాట నివ్వకుము. ఇచ్చినచో దానిని పూర్తిచేయుము.

6. నేటినుండియే భోగలాలసత్వమును త్యజించుము.

7. ఇతరుల సుఖములోనే ఆనందము చూడుము.

8. అవసర మున్నంత మాత్రమే ఆహార నిద్రలు గ్రహించుము.

9. డబ్బువిషయమున అతి జాగ్రతతో మెలుంగుము. ఇతరుల అన్యాయమైన డబ్బునుండి జీవించక నీవు కష్టించి సంపాదించి ఇతరులకు పెట్టి శేషించిన దానినే నీవు తినుము.

10. ఏపనినైనను చేయుటకు బయలుదేరునపుడు ౨౧ మారు భగవన్నామము చేసి మరి బయలుదేరుము.

11. నీవద్దకి వచ్చినవారి అవసరములను తీర్చి మధురముగా మాట్లాడుము.

12. ఎవరివాక్కు నుండియు, మన చెడుగు పేర్కొన పడకుండా ప్రయత్నించెద, పరనింద చేయను. స్వనిందల లెక్కచేయను, నా లక్ష్యముపట్లనే దృష్టి యుంచుదును. అని ప్రతిజ్ఞచేసి ఆచరింపుము.

13. కొత్తఅప్పు చేయక పాత అప్పును తీర్చుట అనగా, సంచిత కర్మల భస్మము చేయుచు ప్రారబ్ధకర్మ లనుభవించుట యని అర్థము.

౨౭. లోకమునకు ఉపయోగపడువాని బ్రతుకే నిజమైన బ్రతుకు.

౨౮. అప్పుతీసికొనినవారు తిరిగియివ్వకపోయినచో పదే పదే వారినడగి వారిమనస్సు నొప్పించకుము. అడిగినచో ఏమనుకొందురో అను, ప్రేమభావముండవలెను. భేదభావ ముండరాదు. ఇటులాచరించినచో తగువులుండనేరవు.

౨౯. నీకు ఎన్నికష్టములు సంభవించినను, డాక్టరుచికిత్సచేయునపుడు బాధ నోర్చుకొనురోగివలె సహించుము.

౩౦. కాయ మస్థిరము, నీచేతిలోనిదికాదు, చేయదగినదేదో ఇపుడే చేయుము. తరువాతచింతించిన లాభములేదు.

౩౧. ఎవరి కొరకైనను ఎక్కువగా ఆలోచించకుము. ఏపదార్థమును గాంచియైనను ముగ్ధుడవుగాకుము. మనుజులను ఎక్కువగాప్రేమించి మోసపోకుము. ప్రస్తుతపరిస్థిలోనే సంతుష్టుడవై ఉండుము అగామికై విచారించకుము.

౩౨. తల్లిని ప్రేమించుము. ఆమె మనస్సును నొప్పించకుము. ప్రతిరోజు నమస్కారముచేయుము. నీవెక్కడున్నను నీతల్లినిధ్యానించి నమస్కారము చేయుచుండుము.

౩౩. ఏ కార్యము చేయుటచే నీకు సిగ్గు లజ్జ జనించునో ఆకార్యమును ఎప్పుడు చేయకుము.

౩౪. ఈ సంసారమొక సత్రమువంటిది. వచ్చుచు పోవుచుందురు. నీవుకూడా ఈ సత్రములోదిగి తిరిగిపోవువాడవే కదా! దీనికై, చింత ఎందులకు, నాది, నాది, అనుటెందులకు.

౩౫. ఇంతచక్కని ఈశ్వరపరిపాలనలో విప్లవము తెచ్చి పెట్టకుము. దానివల్ల ఇతరులకు బాధకలుగును. నీ తప్పునకై ఇతరులు బాధపడవలసివచ్చును. ఎట్లన, నీవుతప్పుచేసి బాధపడుచుండిన నీవారు నిన్నుగూర్చి కష్టపడవలెను కదా, అది హింసకాదా, కావున, సమస్తమును మరచి ఈశ్వరుని శరణుగొనుము.

౩౬. నీవు నిన్ను భగవత్సేవకుడవని మరచితివా, మాయనిన్ను బంధించును.

౩౭. మనస్సు పరుగెత్తుచున్నదని విచారించకుము. నీవు మాత్రము దానివెంటపరుగెత్తకుము. దానివైపుచూడక నిశ్చలముగా నామస్మరణచేయు చుండుము.

౩౮. ప్రతివానిని తన ఆటను తాను ఆడుకోనిమ్ము. నీ ఆటను నీవు ఆడుకొనుము.

౩౯. ఈలోకములో ప్రతిది ఒక శాసనముచే పాలింపబడు చున్నది. కాబట్టి ఇక్కడ జరుగుదానికి, దేనికిని నీవు విచారింప పనిలేదు. నీ పనిని మాత్రము నీవు జాగ్రతగా చూచుకొనుము.

౪౦. నీ హృదయమును మరచిపొమ్ము. నీ హృదయములో ప్రేమ ప్రవేశించును. దేహచింతన ప్రేమను శుష్కింప చేయును.

౪౧.గొప్పవాడవుకావలెనని,ఎప్పుడూకోరకుము.ఇదేనాప్రార్థన.

౪౨. పతితుల నెప్పుడు తృణీకరించకుము, ఏ జీవినికూడా తృణీకరించకుము. అసహ్యించుకొనకుము. పాపులు, క్రూరులు కూడ భగవంతునివారే. శత్రువులనుకూడా ప్రేమించుము.

౪౩. నీకు బలము వచ్చువరకు పతితులను లేవనెత్తుటకు బహిరంగముగ ఎప్పుడు వెళ్లకుము. నీ హృదయములో ఇతరుల శ్రేయస్సుకొరకై ఈశ్వరుని ప్రార్థించుము.

౪౪. ఏకాంత స్థలమున పవిత్ర హృదయుడవై సంసార తాపత్రయముల మరచి మౌనముద్ర వహించుము.

౪౫. నీవు భగవంతుని ఏమియు అడుగ నక్కరలేదు. నీ మనస్సును తెలిసికొని అతడే సమస్తము సమకూర్చుచుండును.

౪౬. నీ జీవితములో చేసిన మంచిపని అంతా ఒక్కమాటలోనే పాడైపోవును. కావున, ఆలోచించియే మాట్లాడుము.

౪౭. నిన్ను నీవు తృణముకంటే తచ్చుగా తలంచి అందరికి దాసుడవై అందరిని సేవించుము.

౪౮. సదా సత్సంగము చేయుచుండుము. కండ్లు, నోరు, చెవులు, మూసికొని పనిచేయుము. బాహ్యదృష్టిని త్యజించుము.

౪౯. ఏమి తిందును, ఏమి కట్టుదును, అను ఆలోచన మరచి పొమ్ము. ఆ కోరికలే జన్మకు కారణము. కాన రుచులను కోరకుము.

౫౦. ముందు ఏమిజరుగునో అను భావమును త్యజించుము. ఇప్పటి కాలమును వ్యర్థపరచకుము. జరుగబోవుదానిని భవిష్యత్తునకు వదలిపెట్టుము. వర్తమానమే, నీది. దీనిని తెలిసికొని, దానిని సద్వినియోగము చేయుము.

౫౧. భగవదేచ్ఛయే నెరవేరుగాక, యని ఎవడు నిర్మల భక్తితో ఆత్మార్పణము చేయునో, అతడు శీఘ్రముగా సాక్షాత్కారము చెందును.

౫౨. భగవంతుని చేరుటకు ఏతపస్సు అక్కరకురాదు. నీయొక్క తీవ్రవాంఛ, శరణాగతి మాత్రమే అక్కరకొచ్చును.

౫౩. దానము లన్నింటిలో విద్యాదానమే గొప్పది. ఆత్మకు నిజమైన శాంతిని చేకూర్చు ఆత్మజ్ఞాన దానమే అన్నిటికన్న గొప్పది.

౫౪. క్షణకాలపు సుఖదుఃఖముల, పుత్రమిత్రులను మనవా రనుకొని మమతలోపడి శాశ్వతమును మరచి నశించకుము.

౫౫. జగత్తుయొక్క శరీరమును, జగత్తునకే అర్పించుము. ఈశ్వరునియొక్క ప్రాణము మనస్సులను ఈశ్వరునికే అర్పించుము. కాని, ఇతరులకు అర్పించుటకు నీకు అధికారములేదు.

౫౬. ఎవడు ఈశ్వరుని ఎల్లపుడు మరువకుండునో, ఈశ్వరుడు వానిని మరవకుండును. దీనిని మరువకుడు.

౫౭. సంసారవిచారము శరీరమును నాశనము చేయును. ఈశ్వర విచారము, హృదయమును, శరీరమును, ఆత్మను, ప్రసన్నముచేయును.

౫౮. పరుల పాపములను నీభుజములపై నిడుకొని వారి బాధలను తప్పించుము. వారికొరకు భగవంతుని ప్రార్థించుము.

౫౯. ఇతరులకు దుఃఖములు, హానికలుగునటువంటి పనులు చేయకుము. స్వార్థమును వీడుము.

౬౦. దినమూ, దినమంతయు పాడుచేసికొని, ప్రధానమైన కార్యమును చేయక మరచిపోయితిని కదా యనుచు సాయంకాల సమయమున పశ్చాత్తాప పడుటచే లాభమేమి, కాన, జాగ్రత !

౬౧. ఒక్కమారు సర్వమును మరచి ప్రేమించుము. ప్రేమిం చుట వల్ల నీకేమియు ఖర్చుకాదు, నీ హృదయమును విశాలము చేసిన చాలు. సమస్త జీవులను ప్రేమించుము.

౬౨. కార్యములకంటె ఆలోచనలే శ్రేష్ఠము. మంచి ఆలోచనలే చేయుచుండుము. ఇతరుల కపచారము చేయునట్టి ఆలోచనలను నీ దరికి రానీయకుము.

## ౪౧౦ శ్రీ వినోబా భావే

౧. పెత్తనమును వదలుకోవడమే ముక్తి. అన్ని దోషములకు, అన్ని చిక్కులకు, అన్ని తగాదాలకు, మూలకారణము పెత్తనమే. కావున, దీనిని వెంటనే త్యజించుము.

౨. ఆత్మోపలబ్ధి కవరోధము కలిగించు కొనుటయే ప్రత్యక్ష పాపము.

౩. పాటుపడనిదే సాపాటు చేయకూడదని నిశ్చయించుడు. శారీరక కష్టమును చేయుడు.

౪. ప్రజలు నామాట వినరే అని అనుకొందుము. కాని, ఆలోచించినచో, మనము ఏమంత తపస్సుచేసితిమి. ప్రజలకు ఏమి ఉపకారము చేసితిమి. నాది, అనునది, మనలోలేదా, అను విషయము నొకసారి విచారించుము. అదిలేనిది మనమాట ఎవరు వినగలరు. కావున, నాది, అనునది మనలోలేనినాడే, మనమాట అందరు వినగలరు.

౫. దొంగతనము చేయుట ఎంత పాపమో, కూడపెట్టుట కూడా అంత పాపమే. కూడపెట్టుట, ధార్మిక, నైతిక దృష్ట్యా తప్పే.

౬. నిన్నటి కేది జరిగినదో జరిగినది. నిన్నటిదానిని మరచి, ఇప్పటిదేదో అది పూర్తి చేయుము.

౭. ఇతరులను మంచివారినిగా చేయదలంచుకొనుచో నీవు ఇతరులకంటె చాలా మంచివాడవ్వకమ్ము. నీమంచి అతని చెడ్డను జయించు శక్తి నీలో ఉండవలెను. నీవు చెప్పిన మాటను అతడు వినలేదని, విచారించుటకంటె నీలో ఏదో లోపమున్నదని చింతించి ఆ లోపములను సరిదిద్దుకొనుట మంచిది.

౮. ఉపవాసములవల్ల వ్యక్తిగతశుద్ధి అగును. త్యాగమువల్ల సమాజశుద్ధి, దేశశుద్ధియగును.

౯ ప్రతివాడు భూమిమీద, సంపత్తిమీద, వ్యక్తిగతమైన పెత్తనమును వదలుకొనుటయే ధర్మము.

౧౦. రేపటికని నిలువపెట్టు కొనని వానికి ప్రపంచ ప్రళయ మైనప్పటికిని భయముండదు.

౧౧. తన పొరుగింటివాని సుఖదుఃఖములలో పాలుగొనని వాఁడు మానవుడు కాడు, పశువు.

౧౨. నీవు తినుటకు పూర్వము తినుపించుము. తీసుకొనుటకు పూర్వము ఇమ్ము.

౧౩. బీదవారికి అన్నము పెట్టుట, బట్టలిచ్చుట, పుణ్యమనుకుందురు. కాని, మీరు రేపటికని కూడ పెట్టుకొనక పోవడమే చాలా పుణ్యము. ఇతరులకు లేనపుడు, మనవద్ద సంగ్రహముండుటే చాలా తప్పు.

౧౪. బిచ్చగాడు బిచ్చమడుగుచో బిచ్చము పెట్టుదురు. కాని, వాడు బిచ్చమడుగుటకు కారణమును తెలిసికొనరు. వాడు మళ్లీ బిచ్చము నడగకుండునట్టి ప్రయత్నము చేయవలెను. అదే నిజమైన ధర్మము, న్యాయము. మీలో ఏశక్తి యున్నదో దానిని ధారబోయవలెను.

౧౫. మనము చెప్పిన ప్రకారము ఇతరులు ఆచరించవలెనని వారిపై అధికారము చూపరాదు. వారిని అవమానించరాదు.

౧౬. నీకు తెలిసిన మంచిదానిని ఇతరులకు బోధించుము సోమరివి కాకుము.

౧౭. మనకు కలుగుచుండు కరువు కాటకము లన్నిటికి కారణము, మనము చేసుకున్న పాపమే సుమా!

౧౮. ఉన్నదంతయు ఇచ్చినచో అంతకంత లభించునని ప్రమాణము కలదు.

౧౯. నీ అంతర్వాణి చెప్పినటుల నడుచుకొనుము. దీనిచే ఆత్మ సుఖము కలుగును.

౨౦. ఆచార్యునికంటె తండ్రి పదిరెట్లు గొప్ప. తండ్రికంటె తల్లి వేయిరెట్లు గొప్ప.

౨౧. దారికిని ఇంటికిని గల సంబంధమే, ధర్మమునకు మోక్షమునకు గలదు.

౨౨. అనంతసృష్టిలో మన శరీరము తుచ్ఛమైనది. సూర్యుడు, గాలి, నీరు, ఎంత ఉపకారము చేయుచున్నవి. చెట్లు నీడను, పండ్లను ఇచ్చుచున్నవి. వాటిని నరికినను ఎవరితో చెప్పుకొనవు.

౨౩. నీవు తిని ఆనందపడుటకంటె, ఇతరులకు పెట్టి వారు, తినుచుండ ఆనందపడుట చాలా శ్రేష్ఠము.

౨౪. ఆత్మజ్ఞాన మనగా, ఆత్మను దర్శించడమే. ఆత్మను దర్శించిన తదుపరి వేరేముండదు.

౨౫. మోక్షమనగా, తన సంకుచితమైన అహంకారమును విడచి, మానవసంఘముయొక్క సర్వాత్మలతో మగ్నమై పోవుటయే.

౨౬. కొందరు కూటికి గుడ్డకులేక గిజగిజ తన్నుకొనుచుండ, చుట్ట, బీడీ, సిగరెట్లు త్రాగుడు చాలా దుష్టమైనపని, త్రాగుడు, భోగక్రియ, వినోదము మొదలగునవి పాపమునకు హేతువు.

౨౭. ఏకాంతములో నీఅంతఃకరణను పరిశీలించుకొనుచుండుము.

౨౮. సర్వోదయమనగా, చిన్నా పెద్ద, మంచి చెడ్డ, అను భేదముండరాదు. సంగ్రహము చేయరాదు. నాది అనునది ఉండరాదు. సమస్త జీవులను ప్రేమించుచు వాటి ఉన్నతికై పాటుపడవలెను.

౨౯. భోగములో, త్యాగములో, చిక్కుకొనవద్దు. ఈ రెండూ, జన్మకు కారణమే. నిస్సంగుడై ఉండుటే మంచిది.

౩౦. సమస్త ప్రాణులందు ప్రేమగలిగి యున్నచో మనపై అక్రమదాడి సలుపువాడెవడుండడు.

౩౧. ఒకరికొకరు చెడ్డయినను నీవుమాత్రము ఎవరికి చెడ్డ కారాదు. అందరికి బిడ్డవలె మెలుంగుము.

౩౨. కాకికి తినువస్తువు దొరకగానే, అన్నికాకులను, కా, కా, అని పిలచి అన్ని కలసి తినునుకదా. మానవుడవైన నీవు, స్వార్థమును వీడక పాపివైనావా, కాస్త, నిన్ను నీవే విచారించుకో, స్వార్థ త్యాగివైతివా, పూజ్యుడవే.

౩౩. ప్రయోజనములేనిపని ఏదియు చేయరాదు.

౩౪. ఈశ్వర నియమమును పాలించుటే స్వధర్మము. అనగా, ఆత్మధర్మము. పరధర్మమనగా, శరీర ఇంద్రియ, ప్రకృతి ధర్మము. ఆత్మ ధర్మమనగా ఆత్మ చెప్పినట్లు ఆచరించుట. పరధర్మమనగా, ఇంద్రియ ములకు బద్ధుడగుట.

౩౫. దైవము మాట్లాడడు. కాని, ప్రతి జీవిలో అంతరాత్మ కలదు. అదే మనకు సలహా నిచ్చుచుండును. దానిని నిదానముగవిని, అది చెప్పినట్లాచరించితిరా బాగుపడుదురు.

౩౬. దుఃఖమునకు కారణము జన్మ, జన్మకు కారణము నాది, నాది అనుకొనుట భార్యా పుత్రులు, ధనము మొదలగునవి అన్నియు నావే అని అనుకొనుటయే బంధము. కాన, సమస్తమును ఈశ్వరార్పణ చేసినచో తక్షణమే ముక్తి.

౩౭. పాతబాకీని తీర్చుకొని, క్రొత్తబాకీని చేయకుండుటయే జన్మరాహిత్యము.

౩౮. భగవంతుడు, నిరాకారుడు, సాకారుడు, ఎట్లనగా,మంచు గడ్డ (బరఫ్) నీరు, నీరునుండి, మంచుగడ్డగా తయారగును. తిరిగి, నీరగును, నీరు, నిరాకారము. మంచుగడ్డ సాకారము.

౩౯. పరమేశ్వరుడు రెండుచేతులు, ఒకనోరు ఇచ్చినాడు. చేతులతోపనిచేసి, నోటితో తినవలెను. పనిచేయకుండా తినుటపాపము. రెండుచేతులతో సంపాదించి ఒక నోటితో తినుము.

౪౦. వృత్తులుమారినపుడే కులాలుమారినవి కావున, ఇపుడు కులములకై ప్రాకులాడరాదు.

౪౧. సమస్తకార్యములు ప్రభుత్వమే చేయవలయునంటె, నీ ఆస్తినంతయు ప్రభుత్వమునకే ఇవ్వవలెను. నీకడుపులో పట్టుదానికంటె ఒక్కమెతుకును ఎక్కువతిను అధికారము నీకుండరాదు. నీ దనునది ఉండరాదు.

౪౨. లోకములో ఒకటి కార్మికవర్గము రెండవది ధనికవర్గము కలవు. ధనికవర్గము సదా కార్మికవర్గముపైన ఆధారపడి జీవించుదురు. ఇది చాలాపాపము.

౪౩. నీవు సమాజమునకు సేవకుడవుకమ్ము. అపుడు నిన్ను సమాజమే కాపాడును. ఇకనీకు చింత ఎందులకు ?

౪౪. వేద, పురాణములయొక్క సారముపమన, ఇతరుల సేవ చేయుటేపుణ్యము. తనకొరకు ఇతరుల బాధించుటే పాపము.

౪౫. సృష్టిలోని అన్నివస్తువులు మంచివే, చెడ్డదొకటిలేదు. వాటిని వివేకముతో ఉపయోగించుకొనవలయును. కత్తితో పండ్లను కోయవచ్చును, గొంతుకోసుకొనవచ్చును. విషమును మందుగా, మార్చవచ్చును. విషముగా తినిచావవచ్చును, కావున సృష్టిలోని వాటిని దేనిని ద్వేషించకుము. భేదభావ ముండరాదు.

౪౬. మృతినొందునపుడు అన్నివిడచి పోవుదురు. అటులే ప్రాణ ముండగనే సమస్తమును దానముచేయుడు. విచారించకుడు.

౪౭. ఈశ్వరుని ప్రేమించదలచితె, ముందు నీ యిరుగు పొరుగు వారిని ప్రేమించుము.

౪౮. నీవు ఈశ్వరుని మరచినను, నిన్నుఈశ్వరుడు మరువడు. తల్లి తనపిల్లను మరువదు. పిల్ల తల్లిని ఒకప్పుడు మరచును.

౪౯. నాస్తికుడుకూడా భక్తుడే. ఎట్లు విష్ణుభక్తులు, శివ భక్తులెట్లో, అట్లే, నాస్తిక భక్తులు, ఆస్తికుడు.నేను ఆస్తికుడననిఅనును, కాని ఈశ్వరునిపై విశ్వాసముండదు. ఆయన ఆజ్ఞప్రకారము ఆచరించడు ఇక ఆస్తికుడెట్లగును. పేరునకు ఆస్తికుడ ననుట తప్పు.

౫౦. పండుకొనువాడు కలియుగమువాడు. జాగ్రతగలవాడు ద్వాపరయుగమువాడు. నిలబడువాడు త్రేతాయుగమువాడు. నడుచు వాడు. కృతయుగమువాడు.

౫౧. ప్రపంచములో దుష్టుడున్నాడా లేడా యను నిర్ణయము ఎవరుచేయగలరు. నిజముగా దుష్టుడే ఎదుటికొచ్చినచో వానిని పరమాత్మ స్వరూపునిగ భావింపుము. వాడు దుష్టుడైనను మహాత్ముడై పోవును.

౫౨. శరీరమునకు అవసరమైనవి లభించనపుడు అశాంతి ఉన్నట్లే, అవసరమునకు మించియున్నను అశాంతియే ఉండును.

౫౩. తాను జీవించియుండగనే (చచ్చినవానివలె) సమస్త వాంఛలను వీడవలెను.

౫౪. జిహ్వా పతివ్రత కానందున దాచుకొని తినవలసివచ్చును. ఇది చాలా తప్పు, పాపము.

౫౫. మనస్సు చెప్పినటుల వినకుడు. బుద్ధిచెప్పినటుల వినుడు.

౫౬. మృత్యువు ఆసన్నమైనపుడు ఎట్టిచింతలులేకుండా, చని పోగలుగవలెను. భగవంతునిముందు నిలబడి, మేము మానవజన్మనెత్తి జన్మను సార్థకము చేసికొనినామని ధైర్యముగా చెప్పుకోగలుగవలెను.

౫౭. ఒక్క చిల్లిగవ్వయైనను అవసరములేకుండ నిరాడంబర జీవనము గడుపుడు. అన్నము, వస్త్రము ఈ రెండేకద కావలసినది. దీనికై చింతించుటెందులకు ?

౫౮. ఈ యుగములో కఠినతపస్సు చేయవలసిన పనిలేదు. వికారములు ఎవనిమనస్సులో ఎక్కువగానుండునో వాడు కఠినతపస్సు చేయవలసియుండును. కావున, సమస్తవికారములను వీడుడు.

౫౯. అందరిని ప్రేమించుట, పరులకొరకై జీవించుట, పరుల దుఃఖములలో దుఃఖించి, సుఖములలో సుఖపడుటయే కలియుగ ధర్మము. 'స్వ' ఉన్నంతవరకు, 'పర' ఉండును.

౬౦. నిద్రలో సర్వమును, మరుతురుకదా ! నేను, బీదను, నేను రాజును, తుదకు నేను, అనునది కూడా మరుతురు, అట్లే జాగ్ర తావస్థలోకూడా భేదభావము మరచినచో దేవుని జేరుదురు.

౬౧. ఎచ్చుగా పనిచేయించుకొని తచ్చుగా ప్రతిఫలము ఇచ్చుట పాపము. ఇతరుల హక్కులను అపహరించరాదు.

౬౨. నీవు ప్రతిరోజు సాయంకాలము అందరికి భగవత్ కథలు వినుపించుము. జ్ఞానబోధచేయుము. ప్రతిఫలము కోరకుము. దీనివలన సేవయు, ప్రేమకలుగును.

౬౩. పుణ్యాత్ముడవైనా, కమ్ము, లేక, అహంకార రహితుడవైనా కమ్ము. ఈ రెంటిలో ఏదైనను మంచిదే.

౬౪. మద్దెలను రెండు ప్రక్కల వాయించనిదే మనోహరమైన ధ్వనిరాదు. అదేవిధముగ జీవితమనే మద్దెలను చావు, పుట్టుక, అను రెండు వైపుల వాయించనిదే, జీవిత మను ఉద్దేశ్యముండదు. కనుక, కష్టసుఖములను కూడా సమముగా ఎంచవలెను, ఈ రెండింటికి సంతోషించవలెను, లేదా, వీటికి దూరస్తుడవై ఉండవలెను.

౬౫. పాప మధికమైనచో, నరకము, పుణ్యా మధికమైనచో స్వర్గము. పాపము, పుణ్యాము, సమానమగుచో మానవజన్మ. పాపము పుణ్యాము ఈ రెండులేనిచో, ముక్తి, జన్మరాహిత్యమగును.

౬౬. నీకు దొరకినదానిని సంఘమున కర్పించి, భగవంతుని ఆశ్రితుడవై ప్రవర్తింపుము.

౬౭. మనముచేయు పాపపుణ్యాముల ఫలము మరణించిన తరువాతనే లభించును. కాని అత్యధికమైన పుణ్యాములేక పాపము చేయుచో దానిఫలము ఇక్కడనే లభించును.

౬౮. దేహశక్తికంటె ఆత్మశక్తిగొప్పది. కాని, మనము దేహబుద్ధితో విషయ పరిశీలన చేయుచున్నాము. దేహమనె వెలుపలి ఆవరణమునువీడి, లోనికివెళ్లి అక్కడివస్తువును కనుగొనినచో ఆకథ వేరు, అపుడుమనమాట, మన నడక, మనతీరు, అంతయు మారిపోవును.

౬౯. అబద్ధము పలికిన, నష్టమువచ్చును. హింసచేసిన ప్రపంచ నాశనమగును.

౭౦. మానవునకు ప్రకృతి, వికృతి సంస్కృతి అను మూడు విధములగు వర్తనములుండును.

1. ఆకలిగొనినప్పుడు భుజించుట ప్రకృతి. ఆకలిలేక పోయినను భుజించుట వికృతి. ఏకాదశి మొదలగు పుణ్యదినములందు ఉపవసించి దైవచింతన జరుపుట సంస్కృతి.

2. మరియు కష్టపడి పనిచేసి భుజించుట ప్రకృతి. ఏమియుపని చేయక ఇతరుల శ్రమనుదోచుకొని తినుట వికృతి. తన శ్రమచే సంపాదించిన దానిని ఇతరులకిచ్చి ఇతరులు విడచిన పదార్థములను తినుట సంస్కృతి.

3. తనకొరకు ఇల్లునుకట్టుకొనుట ప్రకృతి. ఇరుగుపొరుగు పేదవారి గృహములను చూడక, తనకొరకు గొప్పభవనములు నిర్మించుకొనుట వికృతి. ఇతరుల గృహములను నలంకరించి తన గృహమును,సామాన్యముగనుంచు కొనుట సంస్కృతి. భోజనమును భగవంతునికర్పించుట సంస్కృతి.సంస్కృతి శబ్ధమునకు, అర్థమేమన, ప్రతిదానినికృష్ణార్పణము చేయవలెను. ప్రతివస్తువును ఆయనకు అర్పించి తదుపరి ఆయనను స్మరించుచు తినవలెను. ఇదియేభక్తి, భగవంతుడు బీదలలో ఉండును.

౭౧. నీలోనున్న లోభాసురుని పారద్రోలుము. ఉన్నదానిని లేనివారికిచ్చి సేవచేయుము. శరీరపోషణ వరకే తీసికొనవలెను. అదియు భగవంతుని నుండి ఉపకారముగపొందు చుంటినని భావింప వలయును.

౭౨. నిధి ముక్తివలన ఈశ్వరసన్నిధి. తంత్రముక్తివలన మంత్ర సిద్ధి యగును.

౭౩. మితమనగా పేదలను అనాధులను సేవించుటయే.

౭౪. పొట్టనింపు కాని పెట్టె నింపకు. ఎంతతినగలవో అంతతిను పొట్టనిండాతిను, పొట్టబాగానింపు కాని పెట్టెను మాత్రము నింపకుము. అదిపాపము, గురువాక్యము వింటివా? నేడు నేడే, రేపు రేపే, రేపటికని ఈరోజు కూడపెట్టుట తప్పు.

౨౫. మనము కలియుగములో ఉన్నామని అనకుడు. ఏయుగములో నీవుండదలంచుకుంటే ఆయుగము నీకు సిద్ధముగా యుండును. యుగము మనకు స్వరూప మివ్వదు. మనము యుగస్వరూప నిర్మాతలము, మనము కాలపురుషులము. మనవర్తన ఎటులుండునో అటులే యుగము మారును.

౨౬. చోరులు, లోభులకు, ఔరసపుత్రులు. మనము ఔరస పుత్రులను జైలుకు పంపుచున్నాము. శిష్టులవలె సమాజములో తిరుగుచున్నాము. గౌరవాసనముల నలంకరించు చున్నాము. ఇదేనా న్యాయము.

౨౭. చక్కగా ప్రజలమధ్యలో ప్రవేశించి సేవచేయువారు, శంకరునివంటి వారు. ప్రభుత్వములోచేరి సేవించువారు, విష్ణువంటి వారు. విష్ణువు అధికారము నందు, సంపత్తి నందు విరక్తుడు. లక్ష్మి యందు కూడా మమకారము లేనివాడు, ఇది గమనార్హము.

౨౮. ఎవరిమీద నీకు ద్వేషము కలదో వానిని పిలిచి మాట్లాడి తదుపరి ప్రార్థన చేయుము.

౨౯. మొదలు ఆకలిగొనిన వారికి, తదుపరి శోకార్తులకు, ఆ తదుపరి సుఖజీవులకు సహాయము చేయుము.

౩౦. అధికారములో ఉన్నవారు జనకునివలె వర్తించవలెను. అధికారములో లేనివారు, శుకునివలె వర్తించవలెను.

౩౧. ఎవరైనను బాటసారులు సమయము మించిన తదుపరి కనబడినచో, నాయనా అని పిలిచి వారిని ఆదరించుము. అపుడు వారి హృదయము ద్రవించును. ఆబాటసారి దొంగయైనను పవిత్రుడగును. ప్రేమతో సత్కరించుము.

౩౨. నీ వెట్టివాడవో, ఎదుటిసృష్టిలో నీ ప్రతిబింబము అట్లేకన బడు చుండును. మన దృష్టిఎట్టిదో సృష్టియొక్క రూపమట్టిదే. ఈసృష్టి మంచిదని పవిత్రమని భావించి, ఆపైన చమత్కారమును చూడుము.

౮౩. ఏదైనను, కొంచెము కష్టము కలుగుచో కంటనీరు పెట్టుదురు. కాని భగవంతుని నామ ముచ్చరించు చుండగా కన్నీరు బొట్లైన్నను రాలవు, ఇదేమి ఆశ్చర్యమో.

౮౪. నీవు వుండునట్టి గ్రామములో, నీ ఇరుగు పొరుగు వారే దరిద్రనారాయణులు. వారికి ప్రేమతో సేవచేసితివా ఈశ్వరుని పూజించి నటులే.

౮౫. రాముని అన్నమును తినుడు. రాక్షసుని అన్నమును తినకుడు. పొరుగు వారికి అన్నములేక ఏడుచుచుండ మీరు మిఠాయీలుతిని లావెక్కుట రాముని అన్నముకాదు. అది రాక్షసుని అన్నమే అగును. ఈశ్వరుడు చూచుచు పరీక్షించు చున్నాడు.

౮౬. మన శుద్ధాశుద్ధ సంకల్పములు కూడా వాన రాకడ పోకడలకు బలవత్తర కారణములై ఉన్నవి. కావున మంచిపనులు చేయుడు. సంకల్పములవల్లనే ఋతుధర్మములు నడుచు చుండును.

౮౭. చీమకుకూడా కష్టము కలిగించకుము. ఇతరుల మనస్సును నొప్పించకుము.

౮౮. కష్టపడక దొరకినదొంగ వస్తువు యొక్కధర చౌకగా ఉండును. కాయకష్టములవల్ల లభించిన వస్తువుయొక్క ధర అధికముగా నుండును. అట్లే విషముయొక్క ధరచౌక, అమృతముయొక్క ధర ప్రియము.

౮౯. పాదములో ఒకకురుపు బాధపెట్టుచుండగా, శరీరమునకు సుఖముశాంతి ఎటులనుండదో అటులనే ప్రపంచములో కొందరు కష్ట పడుచుండ, నీవు ఎటులసుఖపడుదువు. అది నీకు ధర్మమా.

౯౦. రాట్నములో నూనెవేసిన ఆనూనెరాట్నము కొరకు గాక నూలువడకుటకుపయోగపడునటుల శరీరమునిలుచుటకుతిండికాని తిండికొరకు శరీరముకాదు. శరీరనిర్మాణము ధర్మసాధన కొరకు. పరోప

కారముచేయుట, మానవునియొక్క ధర్మము. ఇతరులకోసమే తిన వలెను. జన్మరాహిత్యమునకై తినవలెను.

౯౧. మన ప్రయత్నము ఆత్మదర్శనముతో పూర్ణమగును. అందులో పరమపురుషార్థమున్నది. ఆడుచు పాడుచు దొరికించుకొను వస్తువుకాదది, ప్రయత్న ప్రవాహముచేతనే సాధ్యమగును.

౯౨. ఓ మానవులారా, ప్రజాసృష్టిని తగ్గించుడు. (బర్త్ కంట్రోల్) చేయుడు. విజ్ఞానమును ప్రజలలో ప్రవేశపెట్టుడు. సమస్తము శాంతించును.

౯౩. ఆకలిని వ్యాధిగా భావించి ఔషధము వతుగ యిచ్చి శాంతింపచేయుము. తియ్యానిరుచులకై ప్రాకులాడకుము. దొరకిన దానితోనే తృప్తిపడుము.

౯౪. లోపల ఈశ్వరస్మరణ, బయట స్వధర్మాచరణ, చేతితో సేవాకర్మ, మనస్సునందు విరక్తిభావ ముండవలెను.

౯౫. మీ మీదమనస్సుయొక్క అధికారము చలామణి కాకుం డునటుల ప్రతిక్షణము జాగ్రతతో చూచుచుండవలెను.

౯౬. మనస్సునకు దాసులుకాని వారేస్వతంత్రులు. ఇచ్ఛ నశించగానే స్వాతంత్ర్యము లభించును.

౯౭. త్వం అసి, నీవు, వాడు, అయినావు. ఇదే నిజమైన వాక్యము భేదములేదు. తత్, త్వంఅసి, నీవు వాడివి. వాడు అనగా, ఈశ్వరుడే, నీవు అనగా, ఎవడుతనను గుర్తించుచున్నాడో, వాడు నీవే, అదేఆత్మ. ఆత్మయొక్క శక్తి ఆభాసమైనపుడే శాసనముక్తి కలుగును. తత్వమసిఅను మహావాక్య చింతనవల్ల ఆత్మశక్తికలుగును. అనగా, నేను, వేరు, శరీరము వేరు నేను శరీరమును కాను. నేను బ్రహ్మాను.

౯౮. వెలుతురున్నపుడే నీ కర్తవ్యమును చక్కపెట్టుకొనుము. ఇంద్రియములు ఏమిచేయుటలేదు. లోపలనుండు ఆత్మశక్తియే అన్ని

చేయుచుండును. నాకన్నులు కనబడుటలేదని దిగులుజెందకుము. ఒక ఆత్మశక్తిని గుర్తించితివా, ఏ ఇంద్రియములతో పని ఉండదు.

౯౯. ఆడంబరములు కోలాహలములు లేనివాడే ముక్తుడు.

౧౦౦. ఏకాగ్రత, సమాధికొరకై చేయునది ఏమిలేదు. ఏ కోరికలులేక నిశ్చింతగా ఉండుటే సమాధి అనబడును.

౧౦౧. సాధన సామూహికముగానే ఉండవలె తనకొరకై ఏదియు చేయరాదు. నాకేముక్తికావలెననుట తప్పు. నేను, అనునది ఉన్నచోట, ముక్తిఉండదు. ముక్తిఉన్నచోట, నేను, ఉండదు. నీవు అందరిలోనున్నావు. నీలో అందరున్నారు.

౧౦౨. ప్రజలను తిరస్కరించి వెక్కిరించకుము. డాంబికమును వదలుము వినయము, నమ్రత, శాంతముగలిగి ఉండుము.

౧౦౩. ఎవరైనను అవిశ్వాసులైనచో వారి అవిశ్వాసముగురించి నీవుదుఃఖపడకుము. భగవంతుని ధ్యానించుము.

౧౦౪. ప్రకృతిలో ఏదియుచెడ్డదిలేదు. కాకి నల్లగాయుండును. దానిప్రకృతిఅటులే కొంగ తెల్లగానుండును, దాని ప్రకృతియు అట్లే సింహము మాంసముతినును. అదిదానిప్రకృతియే. ఆవు మాంసమును తినదు. అదియు దానిప్రకృతి స్వభావమే. అటులే చెడు, మంచి, వాని వాని ప్రకృతినిబట్టి వర్తించును. కావున, ఒకటి, మంచిదని, పొగడవలదు, ఒకటిచెడ్డదని ద్వేషించవలదు. దేనిస్వభావము వల్ల అదిజరుగుచుండును. ఇందులో నీకు భేదభావమెందుకు.

౧౦౫. కీర్తి ప్రతిష్ఠల కాశపడని వానికే గొప్ప కీర్తివచ్చును. అందరికంటెనిన్నునీవు తచ్చువానిగా తలంచుకొనుము.

౧౦౬. మృత్యువు నిన్ను జుట్టుబట్టి లాగుచున్నదని భావించి ధర్మకార్యములు చేయుము. అటులేశాస్త్రములు ఘోషించుచున్నవి.

౧౦౭. సంఘమునకు తనతోసహా, సర్వము అర్పించుకొనుటయే సన్యాస మనబడును.

౧౦౮. మనకుచావు ఇష్టములేనిచో, పుట్టకనుకూడా ఆశించ వలదు. అ గౌరవము ఇష్టములేనిచో, గౌరవమును కూడా ఆశించ రాదు.

౧౦౯. నీపనులను ఇతరులతో చేయించుకొనకుము. పరాధీను డవుకాకుము.

౧౧౦. ధనముయొక్క బరువుక్రింద మానవుడు చితికి పోవు చున్నాడు. దానిని త్యాగముచేసి ఆబరువును తగ్గించు కొనుము.

౧౧౧. మీరు మీ హృదయములను కాస్త విశాల పరచుకొని నచో నష్టములను లాభములుగా మార్చు కొనగలరు.

౧౧౨. ద్రవ్యమును కూడ పెట్టుట పాపమెటులో,పుణ్యమునకై దాన ధర్మములు చేయుచు పుణ్యమును కూడపెట్టుట పాపమటులే. కావున పుణ్యమునకై ఆశించకుము. అన్నిటినుండి ముక్తి చెందుటే మానవుని కర్తవ్యము.

౧౧౩. నీవలన ఇతరులకు సుఖము దొరుకుచో, ఇక ఈశ్వరు డెందులకు? నావలన ఇతరులకు సుఖము దొరుకును, వారి దుఃఖము లను నేను నివారింప చేయుదునను కొనుటయే అహంకారము పాపము.

౧౧౪. నీవు సుఖముకోరిన ఇతరులకు దుఃఖము సంభవించును. ఇతరుల సుఖమునే నీవు నీసుఖముగా భావించితివా అంతయు సుఖమే సుఖము, ముక్తిసిద్ధము.

౧౧౫. చిత్తమును అంకుశముచే మదించుచుండవలెను. విషయ వాసనలకు లొంగరాదు. వాటిని జయించవలెను.

౧౧౬. మానవుడు యాభై సంవత్సరములు దాటిన తదుపరి గృహస్థాశ్రమములో ఉండరాదు. వాన ప్రస్థాశ్రమము స్వీకరించి లోక సేవ చేయుట ధర్మము. నాది నా వారనచు ఇంటిలో ఉండుట అధర్మము.

౧౧౭. ఎపుడును నీ దోషములను ఇతరుల గుణములను చూచు చుండుము. శత్రువులను ప్రేమించువాడే మానవుడు.

౧౧౮. నీ అధికారమును ఇతరులపై చూపి వారిని లొంగ దీయ ప్రయత్నించుట పాపము. నిన్ను నీవు శాసించు కొనుము.

౧౧౯. నీజీవిత మంతయు ప్రజాసేవ చేయుము. ఇతరులు నీ కొరకై తహ తహ పడునటుల వర్తించుము.

౧౨౦. పిల్లలు చెప్పినచో వినరు. చేసిచూపితే గ్రహించుదురు. అటులే నీవు మొదలుచేసి ఇతరులకు చూపుము వారు నిన్ననుకరింతురు.

౧౨౧. సంగదోషము వల్లనే అహంకారము కలుగును. జీవు నిది తప్పేమిలేదు. సంగము ఎలాఉండునో అటులే జీవి వర్తించును.

## ౪౧౧ శ్రీ మెహర్ బాబా

౧. మనలో మనకు తెలియకుండ క్రొత్త సంస్కారములను కలిగించు ప్రవృత్తులు కొన్ని ఉన్నవి. వానిని అడుచుచో క్రొత్తసంస్కార ములు పుట్టవు. అవి రాకుండునటుల కడుజాగ్రతగాచూచు చుండవలెను.

౨. పాత సంస్కారములను విడనాడుచు, క్రొత్త సంస్కారములను రానీయక, సంస్కారములందు బంధింపబడిన చిత్తశక్తిని శుద్ధిచేసి ఇతర మార్గములకు త్రిప్పినచో నవి చెదిరి కనబడకుండ పోవును.

౩. సన్యాసముచే సంస్కారములు ఆగగలవు. ఆలుబిడ్డలు సంపద మొదలగునవి త్యజించుట బాహ్యసన్యాస మనబడును. కోరికలు సంకల్పము మొదలగునవి విడనాడుట అంతరంగిక సన్యాస మనబడును. బాహ్యసన్యాసము మానసిక సన్యాసమునకుదారి చేయును. మానసిక సన్యాసము వలననే ముక్తి దొరుకును. కావున సర్వసంగపరిత్యాగివి కమ్ము.

౪. అధికారముగల వాడును, ధనవంతుడును, సుఖభోగముల కలవడును, మరియు ప్రలోభములలో జిక్కును.

౫. నీతిశీలుడు ప్రలోభములలో చిక్కుకొనడు. సుఖభోగములను త్యజించినచో మంచి జీవన మేర్పడును.

౬. నీచుట్టు ప్రక్కలనున్న లోకుల జీవితోద్దేశ్యములకు లోను గాకుము. నీ పరిసరములలోని చెడ్డను అతిక్రమింపుము. నీతిశీలుడవు కమ్ము. లోకుల మాటలకు వారి అభిప్రాయములకు వశుడవు కాకుము. నిందావ మానములకు లోనుగాకుము. దుఃఖించకుము. ఇతరుల ప్రభావములకు లొంగకుము, లోభివి కాకుము, ఇతరలకు వశుడవై వారికి పరాధీనుడవు కాకుము.

౭. అనవసరములగు అడంబరములను త్యజించుము. ఆధ్యాత్మిక జీవనమును జ్ఞానప్రబోధమును వర్తించుము. నిరాడంబర జీవితమును గడపుము.

౮. కస్తూరి మృగము తనలోనున్న సువాసనను తెలిసికొనక తిరుగునటుల మానవుడు తనలోనున్న ఈశ్వరుని తెలిసికొనలేక తిరుగు చుండును.

౯. బాహ్యసన్యాసమునకు రెండు అంగములు. (1) ఏకాంత వాసము. (2) ఉపవాసము. ప్రాపంచిక వ్యవహారములనుండి విడబడి నపుడే ఏకాంత వాసము కుదురును. అటులే భోగమునకుగాక శరీర పోషణకు మాత్రమే మితముగా తినుట, మానసిక ఉపవాస మనబడును. ప్రలోభమునకు లోబడి, రుచికై ఆశపడి ఉపవసించినచో లాభములేదు. అది బాహ్యోపవాస మనబడును. బాహ్యోపవాసముచే అంతఃశుద్ధికి సహాయ్యమగును. మానసికోపాసన, ప్రయోజన సిద్ధికి, బాహ్యో పాసనము, తత్సిద్ధికి ఆహారముతో సాక్షాత్సంబంధ విసర్జనమును యిమిడి యున్నవి. పేరునకై ఉపవసించరాదు.

౧౦. అహంకారము నశించగానే ముక్తి దొరకును. తనలోని దోషములను తాను తెలిసికొనుటే ముక్తికిదారి.

౧౧. మాయాబంధము నుండి విముక్తి అగుటే ముక్తి.

౧౨. కర్మలు మంచివైనను, చెడ్డవైనను, అన్నియు మాయా బంధములే, సంపూర్ణ నైష్కర్మ్య సిద్ధి నొందుటయే మన జీవితము యొక్క ముఖ్యలక్ష్యము. అనగా, అకర్తవ్యము, స్వార్థరహితము, నిష్కామకర్మ, దీనికై సర్వార్పణము చేయుట ముఖ్యము.

౧౩. పేరు ప్రతిష్ఠలను త్యజించుము. ఇతరులకు హితవుగాని ఏపనిని చేయకుము. అనవసరముగా మాట్లాడకుము. మితభాషివికమ్ము.

## ౪౧౨ శ్రీ బాబా వైష్ణవదాస్‌జీ

[వీరు గొప్ప త్యాగులు. ఒకరోజు రాత్రి వీరి నిద్రలో వీరు స్వయముగా ఒక కోతిని చంపినటుల కలగని దానిచే మనస్సునకు బాధకలిగి, అన్నమును, నీరును, పూర్తిగా విడచి దుఃఖించి, దుఃఖించి మరణాసన్నులైరి. ఒకరు వీరి స్థితిని చూచి కారణమడుగగా. అందుకు, నాయనా నేను మంచివాడనైనచో, నాకు ఇటువంటి కల ఎందులకు పడును. కాన, ఈపాపమును నేను భరించలేను, ఇక జీవించుట వ్యర్థ మని తలంచినానని, బదులు చెప్పిరి.]

## ౪౧౩ శ్రీ బాబా మనోహర్‌దాస్

[వీరు పిండిని నీటిలో కలిపి అదే త్రాగి తృప్తిజెంది సదా భజన చేయుచుండువారు. ఒకరోజు వీరిశిష్యుడు వీరిని కత్తితో నరకుటకై వీరిమీదికి పోయెను. వీరు ఆవింతను చూచి అతనిని ఏమియు అనక మందహాసముతో మౌనమువహించిరి. అపుడు అక్కడ ఉన్న శిష్యులందరు ఆగ్రులై ఈఘాతకుని ఆశ్రమమునుండి తక్షణమే వెడలగొట్టుడని గురువుగారిని వేడుకొనిరి. అది వీరు విని ఓ బాలులారా, నేను ఆ పిల్లవానిని వెడలగొట్టినచో అతనిని ఎవరు ఆదరింతురు? వాడెక్కడికి పోగలడు, వానిగతి ఏమగును. మీరే విచారించుడు. కావున, క్షమించి ఆదరించిరి. వీరికి ఇతరులు దండము పెట్టినచో వారికి సాష్టాంగ దండప్రణామము చేయుచుండెడివారు.]

౧. పవిత్రమైన స్వావలంబనచే సంపాదించి జీవించవలెను. పరాధీనులు కారాదు. సోమరులు కాకుడు.

## ౪౧౪ శ్రీ విద్యారణ్యస్వామి

౧. కామక్రోధాలచే పీడితులైనవారికిని అమేధ్య భక్ష్యము చేయు కుక్కలకును, భేదములేదు. కాన, కోరికలను త్యజించుము.

౨. కామక్రోధములను విసర్జించి, చిత్తదోషములను పోగొట్టుకొనినవాడు, సమస్త లోకములచే పూజింపబడును.

౩. మనస్సునుండి దృశ్యములను వారించెదవేని, మోక్షము లభించును. ఒకవేళ నీబుద్ధి ప్రారబ్ధవశముచే చలించినను అభ్యాసముచే తిరిగి నిరోధించుము.

౪. నిర్వికల్ప సమాధి ఒక్కక్షణకాల మాచరించువాడు వేయి మహాయజ్ఞములు చేసిన ఫలమును బొందును.

౫. ఎల్లపుడు సంసార విషయములను చింత చేయరాదు. వాక్కుతో ఉచ్చరించరాదు. దీనివల్ల మనస్సునకు వాక్కునకు శ్రమ కలిగి శక్తి తగ్గును.

౬. బ్రహ్మాభ్యాసమునకు, కృషి, వాణిజ్యాదులవలన భంగము కలుగును. కావున, వాటిని త్యజించుము.

౭. స్త్రీ పుత్రాదుల యందలి మమతను వెంటనే త్యజించుము. ధనసంపత్తులను సంగ్రహాము చేయకుము.

౮. సుఖభోగములను విడుము. నీకు ప్రియమగు దానిని వెంటనే త్యజించుము. కామమే తృష్ణకు మూలము. నీమనస్సు ఏది కోరునో దానిని నెరవేర్చకుము. ఇచ్ఛకు దాసుడవు కాకుము.

౯. భోగమందిచ్ఛవుండి సుఖమును కోరితివా, జన్మ తప్పదు. ఇదియే భ్రాంతి.

౧౦. ఏదికాదో అది కానేకాదు. కాదగినది కాకమానదు. కావున, చింత చేయకుము. జరుగనున్నది జరిగియే తీరును.

౧౧. వ్యాధులు దుర్గంధాది దోషములు, స్థూల దేహ తాపములు. కామక్రోధములు మొదలగునవి, సూక్ష్మదేహతాపములు.

౧౨. సమస్త సంసార విషయవాసనలను త్యజించి, భగవంతుని శరణు బొందుము.

## ౪౧౫ శ్రీ స్వామి దయానందసరస్వతి

౧. ధ్యానసమయమున మనస్సులో బాహ్య విషయములు చెడు సంకల్పములు రాకుండా జాగ్రతతో కనిపెట్టుచుండవలెను. అధవా వచ్చిన వెంటనే తరిమివేయుము. ఇందుకై దీక్ష వహించుము.

౨. పాపమును చేయకపోవుట కూడా, సంసారమున కుపకారము చేసినటులే. చెడ్డచేయకుము. పరనింద చేయకుము.

౩. పరస్త్రీని కన్నెత్తి చూడకుము. క్రిందచూచుచు నడువుము. ఇటునటు వ్యర్థముగా చూడకుము. స్త్రీ మాతృశక్తి జగన్మాతగా తలంచుము. చెడుతలంపు రానీయకుము.

౪. ఈశ్వర భజన ధ్యానములో నిద్రవచ్చుచుండును. ఎందుకన ధ్యానము పట్టుపరుపుతో సమానమైనది. వినోదము, జూదము, నృత్యము, వేశ్యాగానము మొదలగునవి, ముండ్లకంప, రాళ్లు, రప్పల పరపుతో సమానమైనది.

౫. నీవు తినకముందె ఇతర జీవులకు పెట్టి తదుపరి నీవు తినుము. కుక్క పిల్లి మొదలగువాటికి పెట్టక నీవు మొదలే తినినచో దొంగతన మగును. పాపము సంభవించును.

౬. ప్రేమతో సదా దానమిచ్చుచుండుడు. విద్యాదానము అన్నిటికంటె గొప్పది. ప్రతి ఇంటికిపోయి ప్రతివానికి సత్యవిద్య

నుపదేశించుచుండుడు. ఇదే ఉత్తమమైన ధర్మము. ప్రతిగ్రహించకుడు. ఇచ్చుచుండుడు.

౭. అన్నిటిని త్యజించి ఈశ్వరుని సదాభక్తితో ధ్యానించుడు. ఎవడు తన వివేకముచే ఈశ్వరుని తెలిసికొనునో వాడే ఈశ్వరునిపొందును.

౮. ఆత్మవిచారము చేయుచుండుము. నే నెక్కడినుండి తిరిగి ఎక్కడికి పోవుదును. నా స్థితి ఏమిటి, నే నెవ్వడను, అనుచు విచారించు చుండుము.

౯. దుష్కామములకు దూరము కానంతవరకు ఏదియు సాధ్యముకాదు. అన్నిటియందు పూర్ణవిరక్తుడై ఈశ్వరాజ్ఞనుపాలించు వాడే ముక్తుడగును.

౧౦. సుఖభోగములన్నిటిని త్యజించినపుడే రాగమునశించును. రుచికై ఎక్కువ తినరాదు. సగము కడుపునిండువరకే తినవలెను.

౧౧. ముక్తజీవుడు సంకల్ప మాత్రముననే దివ్య శరీరమును రచించుకొనును. తలచినపుడు వదలివేయును.

౧౨. చిత్తవృత్తులన్నియు ఎపుడు నిరోధింపబడునో అపుడే ఆత్మయందు మనస్సు స్థిరపడును.

౧౩. పెద్దలను చిన్నలను ప్రేమతో సేవింపుడు. ప్రతివానిలో ఈశ్వరుడు గలడని నమస్కారము చేయుడు. సేవచేయుడు. నమ్రతచే మెలంగుడు.

## ౪౧౬ శ్రీ స్వామి వివేకానంద

౧. ప్రతి దేహములోని ఆత్మదేవుని ఆత్మయని ప్రతి వానిని దేవునిగా జూడుము.

౨. కాయమును, వాక్కును, మనస్సును పవిత్రముగా నుంచుము. దుఃఖములకు, కష్టములకు మనము సిద్ధముగా నున్నపుడే ముక్తి లభించును.

౩. బయటి ఆధారములన్నియు నశించినపుడే అంతర్జ్యోతి ప్రకాశింప మొదలిడును.

౪. నిరంతరము పవిత్రభావమును సంకల్పించుచు పరోపకారము చేయుచుండుము. దురాచార దురాలోచనము లణచుటకు అదియే మంచిమార్గము.

౫. పన్నెండు సంవత్సరములు బ్రహ్మచర్యము సలిపితివేని శక్తి సంపన్నుడవగుదువు.

౬. స్వాతంత్ర్యమనగా, శారీరక స్వాతంత్రము, మానసిక స్వాతంత్ర్యము, అధ్యాత్మిక స్వాతంత్ర్యము ఇదే ముఖ్యము.

౭. ప్రజల సహాయమున విద్యనేర్చి వారిని గూర్చి శ్రద్ధవహింపని వాడు హీనుడు, ద్రోహి, కావున ఆధ్యాత్మికమైన బోధచేయుము. జ్ఞానముకలుగుటకై అందరికి బోధించుము.

౮. హృదయపూర్వకమైన భావము, భావమునకు తగిన నిష్ఠ నిష్ఠకు తగిన ఇచ్ఛాశక్తి ఇవి కలగినచో కార్యము నిర్వహించబడును.

౯. ఈ దేశములో, అజ్ఞానములో దారిద్ర్యములో మునిగి యున్న స్త్రీ, పురుషులకై ఎవరు ఆవేదనపడుచుందురో వారు మహాత్ములే సుమా? ఈ ప్రజలనే నీవు దేవునిగా దలంచి వారికై యోచించి కష్టించుము. వారిని గూర్చి దైవమును ప్రార్థించుము.

౧౦. భిక్షుకునకు ఎపుడు సుఖముండదు, ఎపుడు దుఃఖమే. ఎందుకనయాచించుట దుఃఖమే, దొరకనందుకు దుఃఖమే. అటులనే కర్మలనాచరించి ఫలమున కాశించువానికి దుఃఖమే కాన, నిష్కామ కర్మయే శ్రేష్ఠము.

౧౧. నీకు జన్మవచ్చినది, ఇచ్చుటకు గాని, తీసికొనుటకు కాదు. కావున, ఇతరుల కిమ్ము. ఒకరినుండి మరొకరికి చెందుచుండుటయే, సృష్టియొక్క నియమము దీనిని మరవకుము. నీవు ఎంత ఇత్తువో అంత అధికఫలము నీకు వచ్చును. చూడుడు, శ్వాసకోశము కూడా ఇచ్చుచు

తీసికొనుచుండును అటులే నీ యొద్దవున్నదానిని దాచుకొనక ఇచ్చుచుండుము. అదే ధర్మము.

౧౨. నిన్ను నీవు ప్రథమము నుద్ధరించుకొనుము. నీవర్తన బాగుపడెనా ఇతరులను బాగుచేసినట్లే. ఇతరులపై ఆధారపడకుము. పరాధీనుడవు కాకుము.

౧౩. ఇతరుల ఆచరణ బాగులేదు. ఇతరులు చెడగొట్టినారు, నేను మంచివాడను, త్యాగిని, ఇతరులు లోభులు, ఇతరులు మంచి వారుకారు అని తలంచకుము. ఇది చాలా తప్పు. నిన్ను నాశనము చేయునది ఇదియే.

౧౪. పవిత్రతవలన, నీతివలన మనోనిగ్రహము కాగలదు. మనోనిగ్రహముకలవాడు ఇతరులను కూడా అనుగ్రహించవచ్చును.

౧౫. సంసారము దుఃఖనిలయము. దానిని విడనాడుము. కోరిక లుడిగిన మానవుల కీ ప్రపంచము ఆనందనిలయము.

౧౬. సంపద యొకరి హక్కుకాదు. నేనీ సంపద కధికారినని భావింపకుము. మనము నిమిత్త మాత్రులము. భగవంతుడే జగత్ ప్రభువు యజమానుడు.

౧౭. ఎల్లెడలను అన్నిటియందు దేవునిగనుము. మాయా సంసారమును సత్యమని తలంపకుము.

౧౮. దానధర్మములకై ధనములేదని విచారపడకుము. బీదలు వికలాంగులు, ఆకలిచే బాధపడుచుండువారు. ఎందరో దిక్కులేక దుఃఖించుచుందురు. నీవు వైద్యశాలలకు వెళ్లి వారికి ఔషధము తెచ్చి ఇచ్చుచుండుము. ఇల్లు ఇల్లు తిరిగి భిక్షమెత్తి అన్నార్తులకు శక్తి హీనులకు అన్నము తెచ్చిపెట్టుము. శరీరమును దాచిపెట్టక స్వార్థమును వీడి అనాథులసేవ చేయుము. అదియే ముఖ్యమైన ధర్మము.

౧౯. ఈశ్వరుడే నీకు కావలసిన దానిని సమకూర్చును. అందు గురించి నీవు శ్రమపడ నక్కరలేదు. బీదలను, దుఃఖితులను ప్రేమతో చూడుము.

౨౦. కర్మకు తగినట్లనుభవించునపుడు భయమేల? పశ్చాత్తాప పడుటేల? ఫలాపేక్షలేని వానినే ఈలోకము ప్రేమించును. మరియు భగవంతుడు ప్రేమించును.

౨౧. తన తల్లిని భగవంతునివలె చూడనివాడు గొప్పవాడు కాడు. స్త్రీలను చూడగానే భగవద్బుద్ధితో నమస్కరించుము.

౨౨. మీకు భక్తి, వైరాగ్యములున్న యెడల, నిర్భయముగా పనిచేయుడు. ప్రజల విమర్శలను లక్ష్యము చేయకుడు, ధనాపేక్షను వదలుడు.

౨౩. ఎవడు తన భక్తి ముక్తినే చూచుకొనక, ఇతరుల భక్తి ముక్తికై, ఫలాపేక్షను వదలి సేవచేయుచుండునో, వానికే నేను దాసుడనని, భగవద్వాక్యము సుమా !

౨౪. మిత్రమా, నా హృదయమును విప్పి చెప్పుచున్నాను వినుము. సంసార దుఃఖమునుండి విడబడుటకు దివ్యనామ మొకటే కలదు. అదేది ప్రేమ. నీవు పరమాత్మ సంభూతుడవు పరమాత్మకు వారసుడవు సుమా? చూచుకొనుము. నీ హృదయమందు ప్రేమ సముద్రమున్నది. దానిని అందరికి పంచియిమ్ము. ప్రతిఫలమును కోరితివా, ప్రేమసముద్ర మింకిపోవును. చిన్న చీమ మొదలుకొని బ్రహ్మవరకు భగవత్స్వరూపమె కావున అన్ని జీవులను ప్రేమించుము. అనంతరూపుడగు భగవంతుడు నీ ముందే అనేక రూపములలో యున్నాడు. వాటిని కాదని భగవంతుని వేరే ఎచట వెదుకు చున్నావు. భేదభావమును వదులుము.

౨౫. బాహ్యసహాయమును కోరకుము, సత్య ఆచరణద్వారా సచ్ఛీలమును అలవరచుకొనుము.

[వీరు అతిథులను ఆదరించి, వారి కాళ్లు కడిగెడివారు. వారికి సేవచేయుచుండువారు. నిరాడంబరులు, నిగర్వి, వీరు తిండికై యాచిం చెడివారుకారు. భగవంతునిపై భారమువైచి నిశ్చింతతో నుండెడి వారు. అయాచితముగ లభించినచో తినుచుండువారు.]

## ౪౧౭ శ్రీ స్వామి రామతీర్థ

౧. ఈ క్షణములో నీవు సాక్షాత్కారము పొందవచ్చును. మోహమును పరిత్యజించుము. అసూయా ద్వేషములను పెరికి పారవేయుము.

౨. ప్రపంచములోని మహాపురుషులు లేక భగవంతుడైనా ఎంత ఉపదేశము చేసినను, లాభములేదు. ఎంతవరకు తన్ను తా నుప దేశించు కొనడో, అంతయు నిష్ప్రయోజనమే. ఇతరుల ఉపదేశము ఏ మాత్రము లాభకారికాదు.

౩. మీ ఆత్మను మీరు గౌరవించినచో ప్రతివ్యక్తి మిమ్ములను గౌరవించును.

౪. బాహ్యాధారముల యందలి విశ్వాసము మిమ్ములరక్షించదు. మీలోని ఆత్మపైన విశ్వాసమే మిమ్ము రక్షించును.

౫. ఇతరుల దోషములను చూడకుము. నీ దోషములనే చూచుచుండుము. ఇతరుల నుద్ధరించుదునను విచారము విడువుము. ఇతరుల మంచిగుణములనే చూడుము. క్షణభంగురమైన జీవితములో అహంకారముండరాదు.

౬. తనతోటి మానవునిపై అసూయపడువాడు, నిజముగా నరహత్య చేసినవానితో సమానుడైన నరహంతకుడే.

౭. ఇతరులపై ఆధారపడకుము. ఏకాంతమే శ్రేష్ఠము, వాంఛింపదగిన వస్తువు, అంతరాత్మయే సుమా!

౮. ధర్మప్రసంగము తప్ప ఇతరులతో ప్రాపంచిక ప్రసంగము చేయకుము. మౌనమే మంచిది.

౯. నీ మనస్సు నెపుడు సోమరిగా నుంచకుము. పనిచేయించుచుండుము.

౧౦. మోహమునకు కారణములు, 1. అజీర్ణరోగము 2. మనస్సుయొక్క సోమరితనము, 3. విషయచింతన.

౧౧. గుడ్డలేని దిగంబర ప్రజలందరు విశ్వరూపులు. అన్నార్తులందరు, హరిస్వరూపులు. వీరిని సేవించుటయే నాయొక్క మతము.

౧౨. అంతర్ విచారము, ఆత్మసంస్కరణ, ఇది మహోన్నత సాధన. పొరపాటులను సవరించుకోలేనివాడు, మూర్ఖుడే.

౧౩. నీవు గురువువు కాకుము. అందరకు శిష్యుడవు దాసుడవు కమ్ము.

౧౪. నీ ఇంద్రియము దేనిని మోహించునో, దానిని ఆ పదార్థమును వెంటనే త్యజించుము. లోచూపుతో అంతరాన్వేషణము చేయుచుండుము. తృష్ణను ఇంద్రియ భోగములను వదలిపెట్టుము.

౧౫. వీధిలో వెళ్లునపుడు ఇటునటు చూడక నాసికాగ్రమునే చూచుచు వెళ్లుము.

౧౬. మిఠాయీలు, మసాలా పదార్థములను తినకుము. వారమున కొకరోజు, వుప్పు, బెల్లమును తినకుము.

౧౭. ప్రాపంచిక అభిలాషలను త్యజించినపుడే భక్తి కలుగును. పేరు, కీర్తులను, ప్రజాభిప్రాయములను, బాహ్యాభూషణములను వదులుడు.

౧౮. విశ్వమునందలి దుఃఖములు నశించుటకు, ఆత్మజ్ఞానము తప్ప వేరొకటి లేదు.

౧౯. నాది, నాదనుచు ప్రోగుచేయుతనమును వదలుడు. సమస్తమైన అధికారములను ఇపుడే త్యజించుడు.

౨౦. పాపునిమిషమునకు ఏమిజరుగునది నీకు తెలియదు. రేపటికై వస్తుసంచయము చేసికొనుట ఎంత వెఱ్ఱితనము.

౨౧. నిద్రలో రాత్రి గడచిపోవుచున్నది. కూటికై పగలెల్ల సరిపోవుచున్నది. అమూల్యమగు జీవితమును వృథా పాడుచేయకుడు.

౨౨. గర్వించకుము. నేడు నీ నివాసము ఉన్నతమైనదే కావచ్చును. కాని రేపు నీవు భూమిలో నుండగా పైన గడ్డి మొలచును.

౨౩. ఇతరుల దృష్టికి ఎంతయో మంచిగ కనబడవలెనని కోరకుడు. అది మహాపాపము. ఇతరుల మన్ననలకు పాత్రులము కావలయునని ఎంతయో కాలమును వినియోగించుచు నాశనము కాకుడు.

౨౪. సుఖముగలవారితో మిత్రుత్వమును, దుఃఖితులయెడ దయను, పుణ్యాత్ములయందు సంతోషమును, చెడ్డవారియందు, ఉదాసీనమును గలిగి యుండుము.

౨౫. నిన్ను ఇతరులు తిట్టినను, నిందించినను మంచిదే. కాని, నీవు మాత్రము వారికి అపకారము చేయకుము. వారిని ప్రేమించుము. నీ మనస్సులోనైనను వారియందు ద్వేషబుద్ధి జనించనీయకుము.

౨౬. సంపదల, బంధువుల, స్నేహితులయొక్క సంబంధములను విడచి, స్వస్వరూప దర్శనము గురించి, సత్సంగము, సద్గ్రంథ పఠనము, ఏకాంతవాసము మొదలగునవి చేయుచుండుము.

౨౭. ఇతరుల నుద్ధరించవలెనని ఆశపడకుము. మొదలు నిన్ను నీవు ఉద్ధరించుకొని, మంచి నడవడితో వర్తించితివా చాలా మేలు. నీశక్తి ఇతరులపై చూపించకుము. మొదలు నీశక్తిని నీపై వినియోగించుకొనుము. నిన్ను నీవు దిద్దుకొనుము.

౨౮. లోకులు నిన్ను శ్లాఘించినచో దానికి సంతోషపడకుము. ముందు నీకు దుఃఖము ప్రాప్తించును. నీవు ఏకాంతమున రహస్యముగ,

పాపసంకల్పనలు, చేసినను, ప్రకృతి నిన్ను విడువదు. అది సాక్ష్యము చెప్పును.

౨౯. ధనమును సంపాదించునపుడు దుఃఖమే. అది పోవునపుడు దుఃఖమే. ఇది ఎంత వెఱ్ఱితనము. కాన, ధనమును త్యజించుము.

౩౦. తన ఆస్తి దొంగిలింపబడినవాడు ఎంత ధన్యుడో, భార్యచే వదలిపెట్ట బడినవాడు, అంతకంటె మూడురెట్లు ధన్యుడు. అందుచేత అతనికి విశ్వప్రేమ స్వరూపుడగు పరమాత్మతో అపరోక్ష పరిచయము ఏర్పడును.

౩౧. శ్రీహరిని సర్వజీవులలో సందర్శించినపుడే ఆ ఈశ్వరునికి ప్రేమపాత్రు లగుదురు. కాన దరిద్ర నారాయణులను సేవించుడు.

౩౨. విగ్రహముల ప్రతిష్ఠించి, అగ్నిలో హోమము చేసినంత మాత్రమున శాంతి కలుగదు. దరిద్రులను కాపాడి వారి సేవచేయుచు అన్నమును పెట్టుడు. వారి జఠరాగ్నిలో పట్టెడన్నమును ఆహుతి చేయుడు.

౩౩. ఇనుపపెట్టెలోని ధనముపై నమ్మకముంచకుడు. విశ్వ నియంతపై నమ్మకముంచుడు.

౩౪. అందరికంటె నిన్నునీవు తచ్చుగా తలంచి, బీదలు ఏమి పనిచేసి జీవించుచుందురో, నీవు అదేపని చేయుచు జీవించుము. పని చేయుచో సిగ్గు, లజ్జ అను అహంకార ముండరాదు.అందరకు దాసాను దాసుడవై జీవయాత్రను గడుపుము.

౩౫. భగవంతుడు రాతిలో నిద్రించుచున్నాడు. వృక్షములలో నిశ్వసిస్తున్నాడు. (ఊపిరితీసుకొనుచు విడుచుచుండును.) జంతువులలో సంచలించుచుండును. మానవులలో ప్రబుద్ధుడై యుండును. ఎన్నియో రూపములతో అంతట నిండియున్నాడు.

౩౬. ప్రార్థననగా వాంఛాతీత స్థితిని అధిగమించడము. భగవదిచ్ఛయే నెరవేరుగాక, అనుట భగవంతునిపై భారము వేయుట.

౩౭. కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు మొదలగువారు, ప్రపంచము లోకి వచ్చి చేయవలసిన దంతయు చేసిరి. కాని ప్రపంచము యొక్క బాధలు శోకములు తప్పలేదు. ఏనిమిషములో మనము ప్రపంచ సంస్కర్తలమని తలంచుకొందుమో ఆ నిమిషములోనే, మనము ప్రపంచమును వికారపరచు వారలమగుదుము. సమస్త ప్రపంచము భగవంతుడై నపుడు, మీరు సంస్కారమునకు పూనుకొనినచో, మీరు వారందరిని పతితులనుగా తలంచుచు మీరు వారికంటె గొప్ప పవిత్రులుగా తలంచి వారి నుద్ధరించ దలంచినటులే కదా! మీ సహాయము కొరకై దేబరించునట్టి దౌర్భాగ్యము వారికి ఎందుకు పట్ట వలెను. సమస్తము భగవన్మయమే కదా! కాన మీ కర్తవ్యమునే మీరు చూచుకొనుడు.

౩౮. నీ మనస్సు, సత్యములో మగ్నమైనపుడు ప్రాణా యామము దానంతటదే జరుగు చుండును.

౩౯. ఓంకారోచ్చారణచే, నిర్వికల్ప సమాధిని పొందుదువు. సమస్త వాసనలు వీడిపోగానే యోగము సిద్ధించును.

౪౦. ఓంకారోచ్చారణ చేయునపుడు ఏ నిబంధనములు అవసరము లేదు. అధికారములేదని మానవలదు. వాక్కుద్వారా ఉచ్చరించినను మంచిదే నీ జీవితములో ఓంకారమును అనుష్టించవలెను. శరీరమును గురించి నీవు పట్టించుకో నవసరములేదు. ప్రజాభిప్రాయములకు నీవు లొంగ నవసరములేదు. సదా సర్వదా ఓంను మరచిపోక స్మరించు చుండుము. ఈ సాధనచేసి చూడుము. కొలదిరోజులకే దాని ఆనందము నీకే తెలియగలదు. ఏకమేవాద్వితీయం బ్రహ్మ ఒకే పరమసత్యము. ఓం, ఓం, ఓం, దీనినే ధ్యానించుము.

౪౧. మన ఆత్మను మనము గౌరవించినచో ప్రతి వ్యక్తి మన లను గౌరవించును. దీనిని మరువకుడు.

౪౨. భూషించు వారిలో ద్వేషించు వారిలో ఒకే ఆత్మఉన్నది. కాన నీకు క్రోధమేల ఎవరిని విమర్శించకుము. బాహ్యవిధానములను బట్టి దోషులనుట పాపము.

౪౩. అజ్ఞానమును అణచి జ్ఞానసంపాదన కాంక్షను కూడా నీ హృదయములో నుంచి తీసివేయుము. జ్ఞానమురానీ రాకపోనీ, నేను ఆత్మను అఖండుడనని భావించుము.

౪౪. సాక్షాత్కారమును పొందుటకు, రెండు మార్గములు. 1. విశ్వాసము 2. జ్ఞానము.

౪౫. ఒకసారి యావత్ జీవమును భగవంతునకు సమర్పించి, అంతయు నీదేనని నేను నీవాడనేనని తిరిగి నాది నేను అని భావించుట మోసము. గొప్ప పాపము.

౪౬. పశువులు మొదలగు జంతువులు మనకు బానిసలను కొందుము. కాని మనమే వాటికి బానిసలము. ఎటులన, వాటిని కాపాడుటవాటికి సేవచేయుట, అవిపోవుచో వాటికై దుఃఖించుట. అవి మనకై దుఃఖించవు. మనమే వాటికి దాసులము. వాటిని మనము వెతుకుచుందుము. మనల అవి వెతకవు.

౪౭. పక్షులు ఒక చిన్నకొమ్మపై కూర్చుందును. కాని ఆ కొమ్మ ఆధారముపై అవి కూర్చొనవు. వాటిరెక్కల ఆధారముపై కూర్చొని ఇచ్ఛకలిగినపుడు ఎరిగిపోవును. వాటికి ఆ కొమ్మ నిమిత్త మాత్రమే. అటులే నీవు ఈ సంసారమును నిమిత్తమని భావించి సేవ చేయుచు భగవంతునిపై భారమువైచి స్మరించుచుండుము.

౪౮. భోజనముచేయునపుడు మాట్లాడక మౌనముచే ఈశ్వరుని స్మరించుచు మితముగా తినుము. ఆకలికానిదే తినకుము. అదేనిజమైన ఉపవాసము. స్వార్థవాంఛలను త్యజించుము. జిహ్వాచాపల్యమే బంధము.

౪౯. ఆవగింజంత విశ్వాసము నీలోనున్నట్లైన పర్వతమును రమ్మని ఆజ్ఞాపించినచో అది నీ వద్దకువచ్చి తీరును.

౫౦. మతి ఎంతో గతి అంతే. నేను పాపినని అనుకొనుటయే పాపము. కావున నేను బ్రహ్మను పరిపూర్ణుడనని అనుకొనుము.

౫౧. ఎపుడు ఒంటరిగా నుండుము. ఒంటరిగా నడువుము. నడుచునపుడు శ్వాసలద్వారా ఓంకారోచ్ఛారణ చేయుచు నడువుము. పామర జనులతో కలిసి ఉండరాదు. సదా స్మరించుచుండుము. గాలిని ముక్కుతో పీల్చుచుండుము. నోటితో పీల్చరాదు.

౫౨. పాపమును ద్వేషించుకాని పాపిని ద్వేషించకుము. ఇతరుల దోషముల నెన్నినచో నీలో దోషములు అధికమగును. ఈ నాటిపాపి మరొకరోజు మహాత్ముడు కావచ్చును. ఎవరిని దోషి అని అనకుము. దోషి అని అనుటకు నీకు హక్కులేదు. అందరిలో భగవంతుడు గలడు. నిన్ను ద్వేషించినవారిని భగవత్స్వరూపులుగా ప్రేమించుము.

౫౩. సత్యముకొరకై శరీరమును వదలవలసి వచ్చినచో వదలి వేయుము. పోనీ ఈ చిట్టచివర బంధము తెగిపోనీ!

౫౪. ప్రాపంచిక భోగములు ప్రాణములేని పీనుగులవంటివి. ఇట్టి శవములకొరకు ఆశించువారు కుక్కలతో సమానము సుమా కాన, సాక్షాత్కారము పొందుటకై సమస్త వ్యామోహములను త్యజించుము.

౫౫. సమస్త వస్తువులను బ్రహ్మస్వరూపముగా దలంచుము. లేనిచో, అవి నిన్ను విడచిపోవును. అపుడు దుఃఖమే. స్వయం విచారణకు స్వస్తిచెప్పి బాహ్యశక్తులమీద ఆధారపడుటే దుఃఖమునకు కారణము. కావున, పేరు, కీర్తులను జనాభిప్రాయములను, బాహ్య భూషణములను వదులుము.

౫౬. నీలో అహంకృతికి చోటు నివ్వకుము. నీ ద్వారా భగవంతుని మాట్లాడనిమ్ము. నీద్వారా చేయుచున్నాడని భావించుము,

నేను శరీరమును కాను నేను, ఆత్మను అనుచు సదా భావించుము. దేనిని ఆసించకుము, సమస్తము ఈశ్వరునిదే.

౪౭. నీ విద్యుక్త ధర్మమును నిష్కాముడవై, నిస్సంగుడవై నిర్వర్తించమని, రాముని సందేశము. దీనిని మరువకుము.

౪౮. విధి విధి అని అందువు. విధి బద్ధుడనని కర్తవు గాకుము. విధి నీ స్వయముసృష్టియే. ఎందులకు ఆ విధి నిన్ను పరిపాలించవలెను. నీవు ఎవరికిని బాధ్యుడవైనటుల భావించకుము. నీకు నీవే ప్రభువు. దేనికి బద్ధుడవు గాకుము. నిర్భయుడవుకమ్ము.

౪౯. ప్రతిరోజు నీ దినచర్య వ్రాయుచుండుము. నీలోనున్న దోషములు బయటపడును. వెంటనే వాటిని, నిర్మూలించుము.

౫౦. సోహంను, నియతమైన సమశ్రుతిలో నడుపుము. శ్వాస ద్వారా సోహంను, సదా మానసికముగా జపించుము. దీనిచే ఇంద్రియ వ్యాపారము నశించి, బ్రహ్మప్రాప్తి కలిగించును. ఇదేసాధన మంచిది.

౫౧. సోహం, మంత్రస్మరణ, ఓంకారోచ్చారణ, మీరు సత్య నిష్ఠులగుటకే.

౫౨. పరిపూర్ణుడైన మానవుడు, వాంఛలు లేనివాడు, పునరావృతిని పొందడు. అతడు చనిపోగా, ఆత్మ సూర్యుని గాఢముగా తనలో ఐక్యము చేసికొని సూక్ష్మశరీరము జగత్తులో తన స్థానమును ఖాళీచేసి, తేలికయైన గాలిలాగా ఈ జగత్తును అధికమించి పైకి పోవును. అతనిచోటు ఖాళీ అయినందువలన అతడు పునరావృత్తి పొందక పోవడమువలన, దగ్గరవారందరు దైవిక ధర్మముచేత అతని ఖాళీచోటును ఆక్రమించుటకు అధిరోహింతురు. ఇదే విధానము.

౫౩. విమర్శ నీకు త్రాసువంటిది. కత్తిరించుటవలన పూల కంచెలు మరింత శోభాయమానమగునటుల విమర్శవలన మనము ప్రకాశించుదుము. విమర్శ అను కత్తెర, నీమీద ప్రయోగింపబడునపు

డొకసారి పరీక్షించుకొనుము. అపుడు నీలో అల్పభావాలకు స్పంద నము కలుగవచ్చును. అపుడు జాగ్రత్తగలిగి మెలుంగుము. అనగా, నీలోఉన్న దోషములు కనిపించును. వాటిని త్యజించవలెను.

౬౪. ముక్తపురుషుని ప్రేమశక్తిచే అడవిమృగములు కూడా సాధుస్వభావము గలవగును.

౬౫. అన్ని దానములకంటె జ్ఞానదానము మహత్తరమైనది. ఒకరోజు అన్నముపెట్టుదువు. రేపటికి మళ్లీ ఆకలిఅగును. కాన, దరిద్రునకు బ్రతుకు విధానము నేర్పుము. సక్రమముగా బ్రతుకుటకు ఆ విధానము ఉండితీరవలెను. చెప్పులుకుట్టు విధానమైనను మంచిదే, అదియు అవసరమే.

౬౬. యజ్ఞమనగా విశ్వశ్రేయస్సు కొరకు తన్ను తానర్పించు కొనుటయే.

౬౭. స్త్రీలకు పిల్లలకు కార్మికసంఘములకు విద్యనేర్పక పోవ డము, మనము కూర్చున్న చెట్టుకొమ్మలను మనమే నరకుకొనుట. అంత యేకాదు జాతీయత వృక్షమును సమూలముగా తెగగొట్టడము.

౬౮. స్వామి అనగా నిరంతరము ఇచ్చువాడు. సత్యమును మాత్రముంచుకొని మిగిలినది యావత్తు విడచిపెట్టుము.

౬౯. ప్రశ్న : చచ్చినతదుపరి మానవుడు తిరిగి ఎంతకాలమునకు పునర్జన్మ ఎత్తును.

1. ఉత్తరము : ప్రతివాడు నిదురించితిరిగి మరునాడు ప్రొద్దున లేచును. నిదురపోవుకాలము మరణమువంటిది. మేలుకొనుట యనునది పునర్జన్మవంటిది. నిదురపోయిన క్షణమునకు మేలు కొను క్షణమునకు మధ్యగడచుకాలము, స్వర్గ నరకములలోను, ప్రేతజగత్తులలోను గడుచుకాలము వంటిది. కావున, ఆయా మనుష్యులపైనను, వారి ఆధ్యాత్మికాభివృద్ధిపైనను ఆధారపడి యుండును. వారి వారి కర్మలనుబట్టి పునర్జన్మకలుగును.

౨౦. పిల్లవాడు, నీశరీరమునుండి, నీ రక్తమునుండి పుట్టిన వాడను కారణముచేత వానికి నీకుగలసంబంధము ఎప్పటికి ఉండవలెనని కోరుదువు. అటులే, పేలు నీ శరీరమునుండియే వచ్చినవి, కదా? అవి నీ చెమటవలన పుట్టినవి కావా? అని నీకు పుత్రులవంటివి కావా? అవి నీ నెత్తురులో నెత్తురు కాదా? వాటి ప్రాణమంతము నీ ప్రాణము కాదా? ఒకరకపు పుత్రులచంపి, మరొకరకపు పుత్రులను ముద్దాడి వారిపై ప్రేమనంతయు చూపించుట ఎంతటి అన్యాయము. కావున, అందరిని సమానముగా ప్రేమించుము. లేదా ఎవరితోను సంబంధము పెట్టుకొనకుము. నీ కుటుంబ బంధములను, నీ ప్రగతికి అడ్డుపడనీయకుము, అవినిన్ను నరకములోపడద్రోయును.

౨౧. ఉపన్యాసములు భోధనలు చేయనవసరము లేదు. మీ పరివర్తనయే, మీవైఖరియే, మీశీలమే, ఇతరులను సంస్కరించును.

౨౨. సాధువనగా, స్వామిఅని అర్థముకాదు. ఎవరికిడబ్బు, కట్టుకొనుటకైననూ గుడ్డలుండవో, వారందరూ సాధువులే.

౨౩. దుఃఖములను, నిరోధించకుము. మహాత్యాగివిగా ఆనందముతో కష్టముల నాహ్వానించుము.

౨౪. తనజీవితమును రక్షించుకోదలచిన వ్యక్తి తన జీవితమును పోగొట్టుకొనవలెను.

౨౫. పరిశోధించు, చూడు, కనిపెట్టు, ఏమైననుచేయు, కాని ఏమిచేసినను, నీ సత్యాత్మతేజముతోనే చేయుము. ఆత్మను మరచి పోకుము. నిజముగా నీ కే కోరికయు అవసరము లేదు. కోరిక అనునది ఎపుడూ పెట్టుకొనవలదు. వలదు. వలదు.

౨౬. రాళ్లు రప్పలను, సమానముగా పంచుకొనుటకేనా, మనము కీచులాడునది? ధనమనే రోగమును, నాది, నాదనుచు కౌగలించుకొని అవస్థపడుచున్న ధనికు లనబడు మానవులు తెలివి తక్కువవారు,

౭౭. అహంకారదృష్టితో, దేహదృష్టితో ఏపనియుచేయకూడదు. ఈ దేహమనునది అసలు ఎపుడు పుట్టనే పుట్టియుండలేదని నటుల మనము జీవించవలెను.

౭౮. ప్రియా, నీ వేమియుచేయవలదు. నీ ఇంటిని చక్కపెట్టు కొనుము, తలపునుతెరచివెయ్యి అందరిని రానిమ్ము. దరిద్రులను నీ ధనమును తీసికోనిమ్ము. లోపలికిచూడుము లోపల అన్వేషించుము. నీకు ప్రత్యుత్తరములు దొరుకును.

౭౯. నీ నిత్య జీవితములో వేదాంతమును ఆచరించుటే వేదాంతము. పుస్తకములను చదువుటచే, వేదాంతులుకారు.

౮౦. రాముడు రెండు ముఖ్యవిషయములను చెప్పుచున్నాడు. (౧) అహంకారవర్జన, (౨) సత్యాత్మ ప్రతిష్ఠాపన. వీటిని ఆచరించవలెను దీనికై, వేదాంతము చెప్పునదేమన, సంపూర్ణముగ సమస్తమును వదలివేయడము. విడచినవాటినితిరిగి స్మరించకూడదు.

౮౧. వేదాంత ప్రకారము, నీ అందమును, నీలోని దివ్య సంతోషమును చెడగొట్టునది ఏదియైనను పాపమే. ఇటుల నీ పాపముల కన్నిటికి ముఖ్యముగా నీ ఆహారమే కారణము. రాముడీ విషయమును స్వానుభవమువలన చెప్పుచున్నాడు. మన పొట్ట సరియైన స్థితిలో నుండునేని, మనము మంచి ఆరోగ్యములో నుంటిమేని మనము మన స్వభావమును స్వాధీనము నందుంచుకొనగలము. మన ఇంద్రియము లను మన వాసనలను హద్దులో ఉంచుకొనగలుగుదుము. కాన, నీవు తిను ఆహారమును గూర్చి జాగ్రతపడుము. మితిమీరి తినరాదు. కడుపునందు తీపియే అనేక జన్మలకు కారణమగుచున్నది.

౮౨. మీరు జబ్బుపడినచో చింతచేయకుడు. నేను సంపూర్ణ ఆరోగ్యవంతుడనని భావించి ఆత్మవిశ్వాసులు కండు. ఇది పరమ రహస్యము. ప్రయత్నించి చూడుడు. ఓదేవుడా నన్ను బాగుచేయమని ధేభరింపును వదలుడు.

౮౩. ప్రశ్న:-తమప్రాణములను తామే తీసికొనువారి ఆత్మల కేమగును.

1. ఉత్తరము :- ప్రతివాడు తన ప్రాణమును తానే తీసి కొనునని రాముడు చెప్పుచున్నాడు. తమ కోరికలద్వారానో లేక తమ అజ్ఞానము ద్వారానో చిక్కులోబడి ఈ దేహము పోవుగాకయని కొందరు కోరుకొనెదరు. వారి అంతరహృదయములో వారు చావు కావలెనని కోరుదురు. కావున, వారికి చావువచ్చును. అది నియమము. తమ కోరికలవలననే రోగములను తెచ్చి పెట్టికొనుదురు. అటులే ఈ జన్మలో ఏది కోరుకొనెదరో, మరుజన్మలో అటులే ఫలించును. ఆత్మ హత్యచేసికొనినారని తలంపబడువారికి గూడా విశేషమేమి జరుగదు. వారు పూర్వము ఏది కోరికొని తెచ్చుకొనిరో అదే జరుగును. ఈ జీవితములో నీపని పూర్తి అగుదాక నీవు చావనేరవు. ఇక మరణ మెటుల సంభవించును.

[ వీరు రోజుమూడు కానులడబ్బుతో కాలముగడుపువారు. శారీరక సుఖములు ప్రాపంచక ఆడంబరములు, వీరు ఎన్నడు కోరలేదు. ఎవరేదడిగిన వారికి తన వద్దనున్నదిచ్చువారు. అమెరికావంటి శీతల ప్రదేశములోకూడా ఏక వస్త్రముతో నుండువారు. కాళ్లకు చెప్పులను వేసికొనువారుకారు. ఎంత యెండయున్నను వర్షము పడుచున్నను గొడుగు పట్టుకొనువారుకారు. మైదానములోనే ఎక్కువకాలము గడుపువారు, చలికి భయపడువారుకారు.]

## ౪౧౮ శ్రీ సచ్చిదానందస్వామి

౧. ఓమనసా, ప్రపంచములోని చిత్రములనుచూడ తాపత్రయ పడుచుందువు. కాని ఆ చిత్రములను, నిన్ను ఈ ప్రపంచమును సృష్టించిన ఈశ్వరుని చిత్రశాల ఎటులుండునో ఆయన స్వరూప మెట్టిదో, నే నెక్కనుండి వచ్చి తిరిగి ఎక్కడకి పోవుచున్నానో అని యొకసారి అయినను అలోచించవేలా ?

౨. శాంతము,ఆత్మవిచారము,సంతోషము సాధుసాంగత్యము, ఈ నాలుగు మోక్షమునకు మార్గములు.

౩. కీర్తి ప్రతిష్ఠల మొదలగువాటికి ఆశపడకుము. ప్రతిఫలాపేక్షలేకుండ నిష్కామకర్మచేయుము.

౪. నీ వేదికోరుదువో ఇతరులకదియేకోరుము.

౫. నీకొరకై ఇతరులను కష్టపెట్టుకొనకుము. పరాధీనుడవు కాకుము.

౬. ఎంతస్వల్పమగు ఆశయున్నను ముక్తిదొరకదు. కావున, అన్నిటియందలి ఆశనువిడచి భగవంతుని విశ్వసించుము.

౭. గృహస్థుడుండు విధము : (౧) దొంగతనములేకుండుట. (౨) ఓర్పు,(౩) ధైర్యము. (౪) సుచిత్వము, (౫) ఇంద్రియ నిగ్రహము. (౬) లోకజ్ఞానము. (౭) వేదాంతవిచారము. (౮) సత్యము. (౯) ధర్మము. (౧౦) న్యాయము మొదలగునవి కలగియుండుట క్రోధము, గర్వము, దంభము, మదము, లోభము మొదలగునవిలేకుండుట.

౮. మనోవాక్కాయముల ద్వారా ఏలాటి దుష్కార్యములు చేయకుము. పాపము, నరకము సంభవించును.

౯. ఇది నాది, నాకు కావలయునని దేనిని కోరకుము. నాది అను వస్తువు ఈ ప్రపంచములో నీకు ఉండరాదు. నాది, లేని నాడే నీకు ముక్తి.

౧౦. దేహము నీటివలన మనస్సు సత్యమువలన జీవుడు భగవద్ధ్యానమువలన, నిష్కామ్యము బ్రహ్మనిష్ఠవలన, బుద్ధియదార్థ జ్ఞానమువలన పరిశుద్ధమగును. జ్ఞానదానమే శ్రేష్ఠము.

౧౧. నీవు ముక్తినికోరుచో నీకుగల సకలాస్తిని భగవదర్పితము చేసి నిష్కామకర్మచేయుము. అన్నిటియందలి ఆశనువిడవవలెను.

౧౨. నిన్నెవరైనను, నిందించినను, వారినిద్వేషించక ప్రేమించుము. నీలోపమైనను దోషములున్నచో వాటినిదిద్దుకొనుము.

౧౩. సత్ప్రవర్తనవలననే బ్రహ్మపదము సిద్ధించును.

౧౪. పూర్వకర్మానుసారమే నీకు జన్మలభించినది. కావున కష్టములకు భయపడకుము. అవి నీవు తెచ్చుకొనినవేకదా ! కర్మలు మిగిలినచో మల్లీజన్మకు కారణమగును. కష్టములను సహించి అనుభవించి ముగించుము,

౧౫. రుచికై మితిమీరి తినకుము. రోజుతిండికై చింతించకుము. ఎంతతినినను తృప్తిఉండదు.

౧౬. తలంపులు బొడ్డునుండి బయలుదేరును. కావున, తలంపు పుట్టగానే విచారించి అణచివేయుము.

౧౭, నీప్రాణవాయువు,లోనికి బయిటికి తిరుగుచుండును.కదా, బయిటికివెళ్ళినశ్వాస తిరిగి లోనికిపోనిచో, నీజీవయాత్ర సమాప్తమగును. కావున, కాలమును వ్యర్థపుచ్చక ఈ స్వల్పకాలముననే నీకర్తవ్యము నెరవేర్చుకొనుము. ఆలసించినచో లాభములేదు.

౧౮. సోహమును జపించువారు సత్యము, నిరాశ, ఉపకారము, పరస్త్రీవర్జితము, యమనియమములను పాటించవలెను. ఇతరులపై ఆధారపడి జీవించరాదు. కావలయునని ఏదియుకోరరాదు.

## ౪౧౭ శ్రీ స్వామి శ్రద్ధానందజీ

౧. సర్వస్వమును త్యజించి కష్టములను సహించి నీవిద్యుక్త ధర్మమును నెరవేర్చుకొనుము.

౨. కులభేదములను పాటింపకుము. అది మహాపాపము. ఈశ్వరుడు అందరిలో ఉన్నాడు.

౩. ఏజీవిని హింసించకుము. ఇతరులమనస్సును నొప్పింపకుము. మాంసభక్షణము మహాపాపము.

౪. నోటితో ఏమందువో, క్రియలో అదే ఉండవలెను. భేదముండరాదు. ఆత్మగౌరవమును వదలకుము,

౫. ముందునీవు బాగుపడి, తరువాత ఇతరులను బాగుచేయుటకు పాటుపడుము.

౬. సహజనిర్మాణమునకు, ప్రజాసంస్కారణమునకు, ముఖ్యావసరమైనవి. ఆత్మవిశ్వాసము, నిర్భయము. మనోదృఢత్వ మవసరములు. పరమేశ్వరునిపై దృఢవిశ్వాసమేర్పడి, సత్యముచేత అసత్యమును జయించినపుడే, ఈ నిర్భయత్వ ముత్పన్నమగును.

౭. పిరికిపంద నిష్కామ సేవ చేయలేడు. కాన, తలపోవనున్నను, నీవు భయపడకుము. నీవిధిఎటులుండునో అటులే జరుగును కదా, ఇక భయమెందులకు.

౮. సంసారమొక యాత్రవంటిది, కాన, మమతనువీడుము, దానిలోబడి బంధింపబడకుము.

౯. కీర్తి, ప్రతిష్ఠల, అధికారపదవులకు ఆశపడకుము. అవినిన్ను అధోగతిపాలుచేయును. సత్యవ్రతుడవుకమ్ము, ధర్మమార్గమవలంబింపుము.

౧౦. నీరక్షణకై ప్రపంచములోని దేనిపై ఎవరిపై ఆధారపడకుము. నీరక్షకుడు భగవంతుడే. కాన దృఢవిశ్వాసివై యుండుము.

౧౧. నాయనా, మానవశరీరము నీటిబుగ్గవంటిది. ఎపుడో, ఏక్షణమో మృతినొందక తప్పదు. కావున, జీవమున్నపుడే జీవన్ముక్తుడవుకమ్ము.

౧౨. రాజ్యసుఖములను, స్వర్గసుఖములను ఆసించక కేవలము మనుజుల దుఃఖములను నాశనమొనర్చు మార్గము నన్వేషించుచుండుటయే మానవునియొక్క ముఖ్యధర్మము.

౧౩. సదా సత్పురుషుల సాంగత్యము చేయుడు. దుష్టుల సాంగత్యము వదలుడు. శరీరమును ఆత్మను పవిత్రము చేసికొనుడు. సత్యమును వీడకుడు. తొందరగ మేలుకొనుడు.

౧౪. మీ కెప్పుడైనను ఆత్మికబలసూర్య తేజము దృష్టిగోచరము కాలేదా! మీరు పాపకర్మలు చేయునపుడు వాటిని, మీశరీరములొప్పు కొనినచో, మీ అంతరాత్మలుకూడా ఒప్పుకొనినవా! మీ అంతరాత్మ చెప్పినటుల మీరు నడచితిరా ముక్తులే లేనిచో మీకంటె మూర్ఖుడు మరెవ్వడుగలడు?

౧౫. భగవంతుని మరచి మనఉద్దేశ్యములను సఫలముగావించు కొనగలమా అని విచారించుడు. కాన, సమయమును వ్యర్థపుచ్చకుడు.

౧౬. మేలుకొనుడు, సర్వప్రపంచ జనకుడగు పరమేశ్వరుడు దండనమను శక్తిని ప్రయోగించి ఎల్లపుడు మనకుబుద్ధి జెప్పుచునే యున్నాడు. కాన, ఆ పరమేశ్వరుడే దిక్కనితలంచి మన జీవితములను పవిత్రము చేసికొనవలెను.

౧౭. పరమాత్మ సర్వజీవులలోయున్నాడు. ఇతరులను పాపు లని, చెడ్డవారని, నిందించకుడు. ఇతరుల దోషముల నెన్నకుడు. దైవభీతి గలిగియుండుడు.

౧౮. నేను గొప్పవాడను, భక్తుడనని గర్వించకుము. ఇది చాలా పాపము. నరకములో బడద్రోయును.

౧౯. కనులుమూసికొని జ్ఞాననేత్రమును తెరచి చూడుడు, అంతఃశక్తి మీజ్ఞాన రక్షణార్థమై నిలుచున్నటుల కనుపించును.

౨౦. ప్రతిరోజు పంచమహాయజ్ఞములను తప్పక చేయుడు. ఇతరులకు ముందు పెట్టి తదుపరి మీరుతినుడు.

౨౧. దేశసేవకులు కండు. నాయకులై పదవులను సంపాదించు కోరికలను కోరకుడు. ధనసంగ్రహము చేయకుడు.

౨౨. ఎన్నికష్టములొచ్చినను భయపడక, మీకర్తవ్యములను కొనసాగించుడు. ధర్మప్రచారము చేయుచుండుడు.

౨౩. మన పరమపిత పరమేశ్వరుని ఆజ్ఞలను పాలించుడు. ఆత్మశక్తిని ప్రసాదింపమని ప్రార్థింపుడు. ఆశక్తిచే సాంసారిక విషయ

వాంఛలను విడిచుటకై ప్రయత్నింపుడు. సర్వదా భగవంతుని ధ్యానింపు చుండుడు.

## ౪౨౦ శ్రీ స్వామి ఏకరసానందజీ

౧. సంసారమును స్వప్నతుల్యముగా తలంచుము. దృఢమైన ధైర్యముగలవాడవు కమ్ము.

౨. అతిదుఃఖములోనైనను అఖండ సంతోషముగా నుండుము. అయినంతవరకు భగవంతుని ధ్యానించుచుండుము.

౩. ఎవరికిని దుఃఖములను కలిగించకుము. వీలైనంత సుఖమును కలిగించుము. అందరను ప్రేమించి సేవించుము.

౪. చంటిపిల్లవాని స్వభావముకలిగి వర్తించుము. మర్యాద మన్నలతో ప్రవర్తించుము.

౫. సోమరివి కాకుము. గంగ ప్రవహించినటుల అఖండ పురుషార్థివి కమ్ము. ఏపనిలో, లజ్జా, శంక, దోషముండునో ఆ పనిని చేయకుము.

## ౪౨౧ శ్రీ స్వామి అద్వైతానందజీ మహారాజ్

౧. వేదశాస్త్ర ప్రకార మాచరించుటయే మానవుని యొక్క ధర్మము.

౨. తామస ఆహారపదార్థములను విసర్జించుము.

౩. ఏ జీవికిని ఏలాటి హానిచేయకుము. పచ్చనిచెట్టునకైనను హానిచేయకుము. ఎవరి మనస్సును నొప్పింపకుము. నమ్రుడవై అందరిని ప్రేమించి సేవించుము.

౪. అప్రమత్తుడవై యుంటివా, మునుముందు నీకుగొప్ప ఆపద సంభవించును. కాన, జాగ్రతతో మెలంగుము. కాలమును వ్యర్థపుచ్చకుము.

౫. సమస్త విషయ వాసనలను త్యజించి, నిరాడంబర జీవివై, సదాచారుడవై, సదా భగవంతుని ధ్యానించుచుండుము.

## ౪౨౨ స్వామి శ్రీ యుగలానన్యశరణ్‌జీ

౧. మనస్సును సదా నీ వశములో నుంచుకొనుము. మృత్యు వెల్లపుడు నీ వెనువెంటనే నున్నదని జ్ఞాపక ముంచుకొనుము. సదా ఈశ్వరానుకూలమగు పనులనే చేయుచుండుము. ఎల్లపుడు నీవు చేయుచుండు కర్మలను ఈశ్వరుడు చూచుచున్నాడని తలంచుము. దృశ్యమగు పదార్థములకై మోహించి వాటిచే బంధింప బడకుము, విరక్తుడవు కమ్ము.

౨. దుఃఖములను సుఖములకంటే శ్రేష్ఠములని నమ్ముము. భోజనమునకై చింతించకుము. ఇతరులను ద్వేషించకుము. నీ పుత్ర మిత్ర సుఖ దుఃఖములకై నీవు ఆలోచించకుము. ఈశ్వరనిందను ఎపుడును చేయకుము.

౩. ఈ క్రింద వ్రాయబడు పదిగుణములు కుక్కలో ఉండును. వీటిని ఆచరించుట మంచిది. 1. (కుక్కకు) తిండికి దొరుకకున్నచో తాపత్రయ పడదు. 2. ఇల్లు నాదని ఉండదు. 3. అతిజాగ్రత్తతో నిద్రించును. 4. చచ్చిన తరువాత దానియొద్ద ఏవస్తువు ఉండదు. 5. ఎల్లపుడు తన యజమాని ద్వారమును విడువదు. 6. కొద్ది స్థలము లోనే నివసించును. 7. ఎక్కడినుండి ఎవరు వెళ్లగొట్టినను వెళ్ళి పోవును. 8. పిలచినచో వచ్చును. 9. పొమ్మనగానే పోవును. 9. ఇంటి యజమానుడు పెట్టినపుడే తినును, కాని అడుగదు. 10. ఎవరైనను దానివైపు చూచుచున్నచో అది క్రిందభూమిని చూచుచుండును.

## ౪౨౩ స్వామి శ్రీ భోలానంద గిర్‌జీ

౧. ఎపుడును అబద్ధము మాట్లాడకుము. ఇతరుల నిందించకుము. శపథము చేయకుము. నీ చరిత్రను నాశనము చేసికొనకుము.

## ౪౨౪ స్వామి శ్రీ ప్రకాశానంద్ పుర్‌జీ

[వీరు రైలులో ప్రయాణము చేయుచుండగా, ఒక నవయువకుడు సిగరెట్టు త్రాగుచు వీరిపై పొగ నూదుచుండెను. అపుడు వీరు నాయనా, సిగరెట్టు త్రాగుట మంచిది కాదనిరి. అందుకు ఆయువకుడు సిగరెట్టునాది, నేను త్రాగుదుననెను. అందుకు వీరు నాయనా, సిగరెట్టు నీదే, పొగమావద్దకి వచ్చుచున్నది కదా, ఇదిఎవ్వరిది,ఇది నీదేకదా ఈ పొగను కూడా నీయొద్దనే ఉంచుకొనుము. లేనిచో ఇతరులకు కష్టము కలుగును. లేదా సిగరెట్టును త్రాగుట మానుమనెను. అందుకు ఆ యువకుడు లజ్జించి వీరిని వేడుకొని, సిగరెట్టును త్రాగుట మానుకొనెను.

## ౪౨౫ స్వామి శ్రీ బ్రహ్మానంద్‌జీ

1. శుద్ధభావ మెటులగును ? మమత త్యాగముచే.
2. బంధమునకు కారణమేమి ? ధృఢాసక్తియే.
3. శ్రేష్ఠుడెవడు ? అహంకారరహితుడు.
4. బంధించునవేవి ? భోగవాసనలు.
5. సుఖమెటుల ప్రాప్తమగును ? త్యాగమువలన.
6. జన్మకు హేతువేమిటి ? అజ్ఞానము.
7. నరకము దేనిచే ? క్రోధము మరియు చెడువృత్తులచే.
8. స్వర్గము ఎటులదొరుకును ? జీవులయందు దయవల్ల.
9. సదా జాగ్రతు డెవడు ? వివేకము గలవాడు.
10. శత్రుడెవడు ? విషయేంద్రియములు.
11. దరిద్రతకు హేతువేమిటి ? తృష్ణ.
12. జ్ఞానమెటుల దొరుకును ? వైరాగ్యమువల్ల.
13. దృఢబంధమేమిటి ? విషయాసక్తి.
14. విషమేది ? ద్రవ్యము.

15. అంధకారుడెవడు ? కామాతురుడు.
16. ధర్మముయొక్క మూలమేది ? దయ.
17. జగత్తును జయించిన వాడెవడు ? తన మనస్సును జయించినవాడు.
18. సుఖమున కుపాయమేది ? అనాసక్తి.
19. గొప్పవిషమేది ? విషయభోగము.
20. ధన్యుడెవడు ? పరోపకారి.
21. తప్పుడు కర్మ ఏది ? కామముతో కూడినది.
22. పాపము లెటులవచ్చును ? కామముచే.
23. సాత్విక తపస్సేది ? ఇంద్రియ నిగ్రహము.
24. బ్రాహ్మణుల ధర్మమేది ? సర్వదా సంతోషము.
25. క్షత్రియ ధర్మమేది ? దీనరక్షణ.
26. వైశ్యులధర్మమేది ? పరోపకారము.
27. శూద్ర ధర్మమేది ? నిష్కామ సేవ.
28. దుఃఖమేది ? భోగలంపటము.
29. భక్తిక్షీణమునకు కారణమేది ? భోగేచ్ఛ.
30. సాధన జ్ఞానము ఎటుల తగ్గును ? అహంకారము వలన.
31. సంసార మమతకు కారణమేది ? అతిరాగము.
32. సత్యజ్ఞానుడెవడు ? సంశయరహితుడు.
33. గొప్పపాపమేమిటి ? స్త్రీయందు దృష్టిపెట్టుట.
34. జీవన్మృతుడెవడు ? సోమరి.
35. మానవునకు ఉరిపేది ? విషయసుఖములయందాశ.
36. సుఖమైన ఆహారమేది ? సాత్వికాహారమే.
37. ఉత్తమప్రకృతి ఎటులగును ? శాంతివృత్తిచే.
38. మహాత్మ్యమునకు కారణమేమిటి ? అపరిగ్రహణమే కారణము.
39. స్వర్గమునకు హేతువేమిటి ? తృష్ణ లేకుండుటయే.
40. కష్టములకు హేతువేమిటి ? మనస్సుయొక్క దుర్బోధ.

41. భగవంతుడెటుల ప్రసన్నుడగును ? సత్యప్రార్థన వలన.
42. ధర్మసాధన ఎట్లు ? నిష్కపట వ్యవహారము వలన.
43. సాధకుడు దేనిని త్యాగము చేయవలెను ? కుతర్కదృష్టిని.
44. ప్రబలశత్రువేది ? జయించని మనస్సు.
45. మనస్సెటుల వశమగును ? అభ్యాస వైరాగ్యములచే.
46. జ్ఞానలక్షణమేమిటి ? ఏకత, మరియు సమత.
47. పాపములకు మూలమేది ? స్వార్థము.
48. స్వార్థమునకు హేతువేమిటి ? అజ్ఞానము.
49. కర్మలకు ప్రేరకుడెవడు ? మనసంస్కారములే.
50. ఈశ్వరుడేమి చేయును ? కర్మలయొక్క ఫలములు గలుగునట్టి సూత్రమును నిర్ణయించును.
51. ధర్మము ఎటుల సఫలమగును ? సద్భావముచే.
52. ఉత్తమగతి ఎటుల ప్రాప్తించును ? సత్సంగముచే.
53. వాణి పవిత్ర మెటులగును ? సత్యభాషణముచే.
54. సదాభయము దేనితో ? దుర్వ్యసనములచే.
55. మోక్షమునకు సాధనమేది ? సదా అభ్యాసము.
56. హానికి కారణమేది ? ఆడంబరములు.
57. దుఃఖములకు కారణమేమిటి ? అధికవ్యయము.
58. తపస్సు క్షీణము దేనివలన ? క్రోధము, దంభము వలన.
59. పరాక్రమము దేనివలన వృద్ధిఅగును ? బ్రహ్మచర్యమువలన.
60. దేహమునకు దుఃఖకారణమేమిటి ? మిథ్యాహార విహారము.
61. బుద్ధి నిర్మల మెటులగును ? స్వాధ్యాయముచే.
62. ఆరోగ్య మెటులగలుగును ? సదాచారమువలన.

## ౪౨. స్వామి శ్రీ రామదాసు (దక్షిణము)

౧. భగవంతుని గురించి మనము వ్రాసిన మాటలుగాని పలికిన పలుకులుగాని కాలమను పత్రముపైన శాశ్వతముగా ముద్రింపబడును.

౨. ఈలోకము నశించునది, కాన, సమస్త పదార్థమునందలి ఆశను విడచి, భగవద్ధ్యానము చేయుచుండుము.

౩. బుద్ధిని దృఢముగావించి, నే నెవడను, ఇటునుండి ఎటు పోవుదనని ఆత్మవిచారముచేసి తెలిసికొనుము.

## ౪౨౭ శ్రీ స్వామి శివానంద సరస్వతి

౧. పరాత్పరుని అనుంగుతనయా! శాశ్వతమగు నీ స్వాత్మ శ్రేయస్సును గోరి నీవు దీని నాచరింపవా? అప్రమత్త అంతర్నిగ్రహ సాహాయ్యమున దేవుని సాక్షాత్కరించుకొని, ఇహమున యోగివై, మహాఋషివై, భాగవతుడవై భాసింపవా! ఇది నీ ప్రథమకర్తవ్యము. ఈ దుర్లభమైన మానవజన్మను, దేవుడు నీకు ప్రసాదించినది తన్నిమిత్తమే! మీ రెల్లరు ఈజన్మముననే, ఈక్షణముననే జీవిత మహాద్గమ్యమును పొందుదురుగాక.

౨. తాను జీవించినను, మరణించినను, ఫలచింతలయందు ఆశలు వదలి కార్యనిమగ్నుడై ధీరత్వముతో సాధించు నెడల ఆరు మాసములకే యోగి కాగలడు.

౩. మనస్సులో నున్నటుల చెప్పి, చెప్పినటుల చేయువానికి దైవత్వము సిద్ధించును. కావున, దీనిని అలవరచుకొనుము.

౪. జనసంఘమునకు దూరముగా, ఏకాంత వాసమున, మౌనముగా ధ్యానించుచుండుము.

౫. నీకేమి తెలిసియున్నను ఆచరణ యందుంచుము. అది నీ ఆర్జవగుణమును ధృవపరచి నిన్ను శక్తివంతుని చేయును.

౬. దానమొసంగుము. యిమ్ము, యిమ్ము. మరి, మరి, యిమ్ము. నీ హృదయము విశాలమగును. వెంటనే ముక్తి దొరకును.

౭. ప్రపంచమునకు నీకు సుషుప్తిలో సంబంధములేదు.

౮. ప్రకృతి గుణమును దాని బలమును, తగ్గించితివా, ఆత్మ బలము హెచ్చును. అపుడు నీమనస్సు నీవు చెప్పినటుల వినును.

౯. ఆత్మ అను యజమానుడు, శరీరమను గృహమును తన ఉపయోగమునకై అద్దెకు తీసికొనెను. ఈశరీరమను గృహమును చెడగొట్టినచో, యజమానునకు కోపమువచ్చును. కాన, భోగముల కాశపడి రోగములపాలు చేయకుము.

౧౦. బాగా ఆకలికానిదే తినవలదు. సాత్వికాహారమే మితముగా, బాగా నమిలి తినవలెను. రుచులకై బహువిధములగు పదార్థములు చేర్చి తినరాదు. ఎక్కువ తినుటవలన ప్రాణశక్తి నశించును. ఏదో ఒకేవస్తువు తినవలెను. రెండుమూడు కలిపి తినవలదు. వుప్పు, కారము, మసాల, పూరీలు, మిఠాయీలు తినవలదు. భోగములే రోగములకు కారణములు.

౧౧. ఏదేని ఒక సాధనచేయుము. ఇపుడే ప్రారంభించుము. ఆలసించకుము, ధ్యానింపుము, వెంటనే శాంతి చేకూరును. నీ అనుభవములో చూడుము. ఎల్లర ప్రేమింపుము. అందరిని సేవింపుము. సర్వమును ఈశ్వరమయముగా చూడుము. సదా ఆత్మ సంధానము చేయుచు స్మరించుచు ధ్యానించుచుండుము. ఈ జీవితములోనే జీవితైక్యమును అనుభవింతువు.

౧౨. వ్యర్థసంభాషణములకు తర్కములకు తావీయకుము. అశ్రద్ధచేయకుము. సోమరివి కాకుము.

౧౩. సర్వము త్యజించుము. ఏలాటి కోరికలుండరాదు. ఇతరులతో పని తీసికొనరాదు. పరాధీనుడవు కారాదు.

౧౪. భూతభవిష్యత్ కాలమును మరచి వర్తమానములో ఏది చేయవలనో దానినే చేయుము. కాని, చింతించరాదు. ఏది ఎటుల జరుగవలసియుండునో అది అటులే జరిగితీరును. వృథా చింతవలదు,

౧౫. నీవు పరమాత్ముని చేతిలోని యంత్రమవు. నిన్ను పుట్టించక ముందే నీ కర్మను బట్టి అన్నియు నిర్మించి యున్నాడు. కావున, ఇపుడు నీవు చింతించుట తగదు. నీకున్న దానిని త్యజించి భగవంతుని శరణుబొందుము.

౧౬. నీ ప్రతిజ్ఞకు భంగము కలిగెనేని, ఏదైనను పాపము చేసితివేని, దానికై శిక్ష విధించుకొనవలెను. ఎటుల ? ఆరోజు భోజనము చేయరాదు. మొదటి తప్పునకు వంద జపమాలలు రెండవ తప్పునకు రెండువందల మాలలు జపము ఇటులే ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

౧౭. ఏవస్తువునైనను త్యజించినచో తిరిగి దానిని స్మరించుటకైనను మనస్సున రానీయవలదు.

౧౮. నీ ఉద్ధారమునకై సంసారమును త్యజించి, ఐహిక సుఖములను వీడి, జన్మరాహిత్యమునకు పాటుపడుము.

౧౯. నీ సుఖదుఃఖములకు నీవే కారకుడవు. వాటికై ఇతరులపై ఆరోపణ చేయకుము.

౨౦. ఒక చెడ్డతలంపురాగానే వెంటనే దానిని నిర్మూలింపుము. చూచిన దానిని కావలెనని కోరకుము. ఇచ్ఛలను త్యజించుము.

౨౧. జీవాత్మ చెప్పునటుల బుద్ధినడుచుకొనుచో జ్ఞానము కలుగును. ఎందుకన, జీవుడు యజమానుడు.

౨౨. కుత్సితపు వార్తలను వినక, కుత్సిత వ్యవహారములను త్యజించి, సాత్విక ఆహారమును స్వీకరించుచు, సత్సంగముచేయుచు దృశ్యమును రహితమొనర్చి, బ్రహ్మచింతనము చేయుచుండుము.

౨౩. ఇతరులు, సంతోషములో పాలుగొందురు, కాని, దుఃఖములో పాలుగొనరు పాపములను నీవు ఒక్కడవే అనుభవించవలెను.

౨౪. ధన, సంపత్తులు, కీర్తి, గౌరవములు నిన్ను నాశనము చేయును. దీనికి కారణము కోరికలే,

౨౫. సత్యము వచింపుము. అందరిని ప్రేమింపుము. సర్వులను సేవించుము. నీ హృదయమును పవిత్రమొనరింపుము. ఇతరులమనస్సు నొప్పింపకుము. ఏ జీవినైనను హింసింపకుము. నిర్మలుడవై ఉండుము. బ్రహ్మచర్యమును సలుపుము. ఉదారుడవై కరుణగలిగి యుండుము. దానబుద్ధికలగి ఉండుము. ఇతరుల తప్పులను క్షమింపుము. సహనము కలిగి ఉండుము. ఇంద్రియ మనస్సుల నిగ్రహింపుము. ధారణసలుపుము. ధ్యానింపుము. ఇటుల ఆచరించితివేని ముక్తిసిద్ధము.

౨౬. మౌనముచే శాంతిచేకూరును. మనస్సునకు మౌనము కావలెను. మనస్సుయొక్క చలనముడుగగానే మోహమంతరించును.

౨౭. శాంతికి శత్రువైన అసూయను సంహరింపుము. కష్ట జీవులపై కరుణ, దుర్మార్గులయెడ ఉపేక్షజూపుము. అందరితో మైత్రిగా నుండుము. ఇతరులకు ద్వేషివి కాకుము. ఇటు లాచరించినచో శాంతి చేకూరును.

౨౮. నమ్రుడవై, పవిత్రుడవై, క్షముడవై సహనవంతుడవై, స్వార్థ రహితుడవై, అహం,మమతల వివర్జితుడవై, ఉదారుడవై, దాతవై యుంటివా, శాంతిచేకూరును.

౨౯. నేను, నాది, అనునది ఉన్నంతవరకు అజ్ఞానమే ఉండును.

౩౦. దైవచింతన ఉత్తమము. శాస్త్రచింతన మధ్యమము. కామ్యచింతన అధమము. కీర్తిచింతన అధమాధమము.

౩౧. సృష్టి సమస్తము భగవానుడే. కావున, నీవు ఎవరిని ఏవగించుకొనరాదు. అసూయపడరాదు. ఎవరికిని అపకారము చేయరాదు. ఇతరుల నిందించరాదు. ఈర్ష్యఉండరాదు. లోకమున ఆదర్శపాత్రుడవుకమ్ము.

## ౪౨౮ స్వామి శ్రీ తత్వానంద సరస్వతి

౧. సత్యమును అవలంబించిన యడల కోటితప్పులుకూడా బద్దలగును.

౨. యోగ్యులైనవారు సంపాదించిన విత్తము పరులకొరకే గాని తమకొరకుగాదు.

౩. ఉచితమగుదానిని గ్రహించువాడొక్కడే జీవించువాడన దగును.

౪. దయారసముగలవాని ద్రవ్యము గ్రామమధ్యమున ఫల వృద్ధితో నలరారుచుండును.

౫. కొద్దివైనను మంచిమాటలు విని ఆచరించుము. నేను బీద వాడనను నెపముతో దుర్మార్గముచేయరాదు.

౬. నీ హృదయమునుండి క్రోధమునుపారదోలిన మరుక్షణమే నీ కోరికలన్నియు నేరవేరును.

౭. నేను,నాది, అనుభావమును, దంభాహంకారములను అణచినవాడు, దేవలోకము చేరును.

౮. నిరంతరము సాధుసాంగత్యముచేయుచు మితముగా ప్రియముగా మాట్లాడుము.

౯. నీకున్నదానిని బీదలకు దానముచేయుము. ఇతరులసొత్తు నపహరించుగుణము నీమనస్సులోనున్నను పాపమే.

౧౦. నీకున్న తృణమో, కణమో, ఫలమో లేనివారికిచ్చి తదుపరి నీవుతినుము. భగవత్‌చింతన నిరంతరముచేయుము.

౧౧. దంభమును మానుము. నిరాడంబరముగా, వినయముగా నుండుము.

౧౨. ఇతరుల అపరాధములను క్షమించి మరచిపొమ్ము. నిన్ను ద్వేషించువారికి మేలుచేయుము.

## ౪౨౯ స్వామి శ్రీ కృష్ణానంద్‌జీ మహరాజ్

౧. ముక్తికై మనస్సు, వాక్కుయొక్క నిరోధము ముఖ్యము. మనస్సును సదా సద్విచారములో నుంచుము.

౨. ఇహలోకసుఖమునే గొప్పదనుకొనువాడు, నశించును. జన్మలకు పాలుబడును.

## ౪౩౦ స్వామి శ్రీ విద్యానంద సరస్వతి

౧. రామేశ్వరము, రాముడే ఈశ్వరుడు, ఈశ్వరుడే రాముడు, భేదములేదు. (రాం ఈశ్వరం రామేశ్వరం)

౨. నాదనే వస్తువు నీకుండరాదు. నాది, అనునది విడచితివా, ఆత్మసుఖము దొరకును.

౩. ఇతరుల వస్తువులను తీసికొనకుము. తీసికొని పరాధీనుడవై, ఋణగ్రస్థుడవుకాకుము.

౪. మనస్సున మోహము జనించ నీయకుము. నీవుదేనిని మోహింతువో అదినిన్ను నాశనము చేయును.

౫. పరుల హితముకోరుము. స్వార్థమును వీడుము.

## ౪౩౧ శ్రీ ఓంకార స్వామి

౧. లోకములోగల అన్నివస్తువులకంటె కాలమొక్కటియే మిక్కిలి అమూల్యమైనది. కాలమును వృధాపుచ్చక కోరికల యందలి ఆశలను విడచి ఈశ్వరుని ధ్యానించుము. నేడేమనది, రేపుమనదిగాదు.

౨. నీఅంతరాత్మనే నమ్ముము, మరెవరిపై ఆధారపడకుము. నీకునీవే బోధించుకొనుము. దైవమును మరువకుము.

౩. ఎవడుతెలియనివాడై తనకు తెలియదని తెలిసికొనలేడో, అతడు మూర్ఖుడు. అతనిని త్యజింపుము. ఎవడుతెలియనివాడై తనకు తెలియదని, తెలిసికొనునో, అతడు, మూఢుడు, అతనికినేర్పుము. ఎవడు తెలిసినవాడై తనకుతెలియునని తెలిసికొనలేడో అతడు సుప్తుడు అతనిమేలుకొలుపుము. ఎవడుతెలిసినవాడై తనకు తెలియునని తెలిసి కొనునో అతడుజ్ఞాని. అతనిని అనుసరింపుము.

౪. తినినది జీర్ణముకాకముందే, తినుట మహాపాపము. అటులే వినినదానిని ఆచరించక మళ్లీవినుట సంగ్రహముచేయుట మహాపాపమే.

## ౪౩౨ స్వామి శ్రీ అఖండానంద్ జీ

౧. శాస్త్రానుసారము వర్తించుటయే ప్రథమ కర్తవ్యము. సంసార పదార్థములను త్యజించుటచే మనస్సు నీ అధీనమగును. మమతను త్యజించగానే భక్తి కలుగును. అప్పుడే ప్రాపంచిక మమత నిన్ను విడచును.

౨. భక్తితో ఈశ్వరుని సదాస్మరణ చేయుచుండుము. ఆనంద స్రవము, రోమాంచితము కలిగెనేని అపుడు భక్తి కుదురుచున్నదని గ్రహించుము.

౩. ఇల్లు, భార్యాబిడ్డలు నావారని తలంచుటయే బంధము. సమస్త విషయ సుఖములను విడచి, నిష్కామభావముతో ఈశ్వరుని ధ్యానించుము. తపస్సునుండి అంతఃకరణ శుద్ధియగును.

౪. భోగేచ్ఛ, మోక్షేచ్ఛ లేకుండుటయే నిజమైన భక్తి.

౫. కోరికలే నిన్ను నాశనము చేయును. ఇచ్ఛను త్యజించితివా భగవద్దర్శనమగును.

౬. నీ ఇల్లును ధర్మశాలగా భావించి, నీవొక బాటసారివిగా దలంచి వర్తించుము. ఉన్నదానితోనే, సంతోషించుచు లేనిదానిని కోరకుము. జిహ్వా చాపల్యమునకు దాసుడవై నిన్ను నీవు నశింప చేసుకొనకుము.

౭. ఎవరు తన జీవితములో ప్రమాదము చేయరో, ఎవరిబుద్ధి సమత శాంతముగా నుండునో, వారిబుద్ధి మృత్యుసమయములో శాంతముగా నుండును, కావున, ఎవ్విధమగు పాపకార్యములకు లోనుగాకుము. జాగ్రతగా మెలంగుము.

## ౪౩౩ స్వామి శ్రీ శరణానంద్‌జీ మహరాజ్

౧. భగవంతు డేది చేయవలయునో అదిచేసినాడు. ప్రకృతి ఏది చేయవలసియుండెనో అదిచేసినది. ఇక మన కర్తవ్యమేమో దాని నాచరించుటయే మనవిధి.

౨. ఏది చేయవలయునో అదిచేయుట, ఏది చేయరానిదో దానిని చేయకపోవుటయే మనపని. ఏది చేయగలుగుదుమో దానిని పూర్తిచేసి ముగించుటే ముఖ్యము. ఎపుడు మనకర్తవ్యము పూర్తి అగునో అపుడే మనబాధ్యత పూర్తిఅగును. దీనితరువాత మనకు చేయవలసినదేది మిగిలియుండదు. ఏది కానున్నదో అది స్వయముగా దానంతటదే అయితీరును.

౩. మనము మనయొక్క వర్తమానకాలమున మనలో ఏలాటిదోషములు లేకుండా ఉంచుకొనుటయే ముఖ్యము. చేసిన తప్పును తిరిగి మరల చేయకుందుమేని జీవితము పవిత్రమగును.

౪. తెలిసిన దోషములను వెంటనే త్యజించుడు. వివేక విరుద్ధ మగు ఏపనిని చేయకుడు.

౫. నీకు ప్రాప్తించిన వస్తువులను పరిస్థితులను సదుపయోగము చేయుము. నీ కొరకై యుంచుకొనక లేనివారికిమ్ము.

౬. సుఖభోగములవలన పరాధీనము, హీనము, దుఃఖము సంభవించును. కాన, భోగములను విడువుము.

౭. జగత్తును చెడ్డదనకుము. జగత్తునుండి ఏది తీసికొనకుము. భగవంతుని నమ్ముము. భగవంతుని ఏది కోరకుము.

౮. ఇతరులను దోషులని భావించకుము. వారిని నిందించకుము, ద్వేషించకుము. వారిని ప్రేమించి సేవించుము.

౯. ప్రపంచమునుండి నిజమైన నిరాశ ఎపుడు కలుగునో అపుడే, జీవన్ముక్తియొక్క అనుభవము కలుగును.

౧౦. త్యాగమువలన దుఃఖనాశనమగును. సేవవలన ప్రేమ ప్రాప్తించును. ప్రేమవలన భగవత్ప్రాప్తి కలుగును.

౧౧. ఎవనికి జీవించుటకాశ, మృతినొందుటకు భయముండదో వానికి ముక్తి మరియు భగవత్ప్రాప్తి సిద్ధించును.

౧౨. నిన్ను నీవు చెడగొట్టుకొనకుము. ఇది మొదటి పురుషార్థము. ప్రపంచమును చెడ్డగా దలంచకపోవుట రెండవ పురుషార్థము. భగవంతుని నమ్మి విశ్వసించుట మూడవ పురుషార్థము. వీటిని నీ జీవితములో ఆచరించుము.

౧౩. ప్రపంచము యొక్కయు వస్తువులయొక్కయు వ్యక్తుల యొక్కయు, ఆశ్రయమువలన అహంకారమునకు బలము హెచ్చును. ఎవరి ఆశ్రయములేనిచో 'అహం' గడగడ వణకును. కాన, నీవు భయపడక నిరాశ్రయుడవై ఏకాంతమున మౌనము వహించి ఆత్మవిచారము చేయుము.

౧౪. త్యాగములో శ్రమ ఉండదు. ఇచ్చుటలో శ్రమలేదు. పుచ్చుకొనుటలో మరియు నాదని ఇచ్చుటలో శ్రమయుండును. కాన. దేనిని కోరకయుండినచో శ్రమరహితమగును.

౧౫. కర్మచేయుటకు ఇచ్ఛ ఉన్నచో ఫలాశ ఉండితీరును. దీని వలన శ్రమకలుగును. ఏమైన పొందవలెనన్నను దేనినైనను వెతుకవలెనన్నను కోరికలుండి తీరును, దీనిచే శ్రమకలుగును.

౧౬. కామముయొక్క పూర్తి కర్మనుండి అగును. కామము యొక్క నివృత్తి వివేకమునుండి అగును. భగవంతుని ప్రాప్తి ప్రేమ నుంచి కలుగును.

౧౭. ఎవడు ప్రాణముండగనే కామమును జయించునో వానికి పునర్జన్మముండదు. కామము నశించగానే ప్రేమ కలుగును.

౧౮. మమత ఎల్లపుడు పరాయి వస్తువులపై కలుగును. ప్రేమ తనపై ఉండును. ఎట్లన శరీరము నీది కాదు. ప్రపంచవస్తు

వులు నీవి కావు. నీవు వేరు, శరీరము వేరు. నీకొఱకై వాటిని కోరుదువు.

౧౯. ఏ వస్తువైనను మరియు ఏ వ్యక్తియైనను నీవు లేకున్నను ఉండగలుగునో, అవి లేకున్నచో నీవు ఉండలేవా? ఏవి లేకున్నచో నీవు జీవించగలుగుదువో వాటిని కోరకుము. ఇచ్చువారు ప్రేమచే ఇచ్చుచో వారి సంతోషమునకై తీసికొని దానిని ఇతరులకు సదుపయోగము చేయుము.

౨౦. ఈ సంసారము వలన సుఖపడితివి. కాన, సంసారము యొక్క ఋణము తొందరగ నీ ప్రాణముండగానే తీర్పుము. మమత మరియు సంబంధములను త్యజించుము. వర్తమానకాలములోనే సమస్తకామములను త్యజించి ముక్తిని పొందుము.

౨౧. నాకు, ఏది అవసరములే దనునదే, మహాసాధనము. నాదనే దేదియు ఉండరాదు. భగవంతుని ఆజ్ఞ ప్రకారము వర్తించుటే గొప్పసాధన, నాదేది, లేదు, అంతా నీదే, నీ ఇష్ట ప్రకారమే వర్తించుట నావిధి.

౨౨. నీ అధికారమును త్యజించి ఇతరుల అధికారమును రక్షించుము. ఇదే నిజమైన సాధన.

౨౩. ఎవడు కీర్తి ప్రతిష్ఠలు, పదవుల కాశపడునో వాడు ఎన్నటికిని ముక్తిని బడయుడు.

౨౪. కోరికలకై పరాధీనుడవు కాకుము. నీ నిజశక్తిని అమ్ముకొనకుము, ఎవరికి భయపడకుము. ఎవరిని భయపెట్టకొనకుము.

౨౫. ప్రపంచములో నీకే దోషము కనిపించుచున్నదో అది నీలోని దోషమే సుమా?

౨౬. ఎవడు స్వయముగా కష్టపడి సంపాదించడో వాడు వాని ఇష్ట ప్రకారము తినుటకు హక్కు ఉండదు.

౨౭. దేనిని చేయలేవో దానికై చింతించుటే దుఃఖము. హర్షవిషాదములకు లోనుగాకుము. నిందావమానములకు దుఃఖించకుము. ఏది జరిగినదో, ఏది జరుగనున్నదో వాటినుండి మమత సంబంధములను త్యజించుము. విచారించకుము. అవి నీవనుకొనకుము.

౨౮. ధనసంగ్రహము చాలాపాపము. నీ శక్తి సామర్థ్యములను దురపయోగము చేయకుము.

౨౯. ఎవని దృష్టిలో తృష్ణయుండదో వాడే భక్తుడు. సుఖభోగములందలి ఆశను విడువుము.

౩౦. ఎవని దృష్టిలో భేదభావముండక సమత ఉండునో వాడే ముక్తుడు.

౩౧. ఎవడు భోగమును మోక్షమును కోరడో వాడు భగవంతునకు ప్రియుడు.

౩౨. ఎవడు సంసారబంధములనుండి ముక్తుడుకాడో వాడు భక్తుడెటులగును?

౩౩. ఇతరులను దోషులని తలంచకున్నచో నీలో ప్రేమ జనించును. మంచివారనుకొనుచో మమతచే సంబంధమేర్పడును. చెడ్డవారనుకొనుచో ద్వేషముచే సంబంధమేర్పడును. కావున, ఎవరిని, దేనిని, నాది, నావారు, ఒకటి చెడ్డ, ఒకటి మంచి అని అనుకొనుటే బంధమునకు కారణము. సమభావముతో వర్తించవలెను.

౩౪. నీవు ప్రపంచమునకు అక్కరపడితివా, ప్రపంచము నీవైపు చూచును. లేక ఈశ్వరునకు అక్కరపడితివా ఈశ్వరుడు నీవైపు చూచును.

౩౫. ఏది కోరుదువో అదికాదు. ఏది అగునో అది నీకు ఇష్టముండదు. ఏది నీకిష్టముండునో అది ఉండదు.

౩౬. దేనియందు ఆశ లేనినాడే కోరికలు నశించును. కావున, సమస్త వస్తువులనుండి, వ్యక్తులనుండి వైదొలగి తటస్థుడవుకమ్ము.

3౭. హరిపాదముల నాశ్రయించితివా ముక్తుడవే. ఎట్లన, వలలో జిక్కిన చేపలు, చేపలుపట్టువాని కాళ్లవైపు పోవుచో, వల ముఖద్వారమున, చేపలు బయటపడును. అటులే భగవంతుని పాదములను నమ్మినవారు ముక్తు లగుదురు.

3౮. దరిద్రము వచ్చునని భయపడకుము. దరిద్రులనుండియే ధనవంతులకు పుణ్యము మరియు స్వర్గమునకు రహదారి.

3౯. సంసారమొక నాటకశాల. నీకు లభించిన వేషము నీవిధిననుసరించియే నీకు దొరికినది. ఆ వేషముయొక్క అనురూపముగా వర్తించుటే నీ కర్తవ్యము.

౪౦. తెలిసికొనిన మరియు తెలిసిన జ్ఞానమును ఆచరించక ఇతరులవెంట తిరుగుట వ్యర్థమే.

౪౧. మానమును కోరితివా! వెంటనే అవమానము కలుగును. అది విధానము. మరువకుము.

౪౨. నీవెవడవో తెలిసికొనుము. భగవంతుని నమ్ముము. ఈరెండే నీ ముక్తికిదారి.

౪3. తినిపించువారి సంతోషమునకే తినుము. తినిపించువారు లేనిచో సంతోషముగ ఆకలిని సహించుము. కాని నీవు తిండిలేక బాధపడుచున్నట్లు ఇతరులకు తెలియునటుల వర్తించకుము. నిశ్చింతుడవై యుండుము.

౪౪. దుఃఖితులు త్యాగులు కావలెను. సుఖవంతులు సేవకులు కావలెను. అపుడు వారికి ఏలాటి దుఃఖములు లేక ముక్తులగుదురు.

౪౫. నాదని దానము చేయుటే కర్మకు కారణము. భగవంతుని దని దానము చేయుటే, పూజ అనబడును. ఎవడు దానమడుగునో వానిసొత్తేనని ఇచ్చుటే సేవ అనబడును.

౪౬. భోగప్రాప్తికై ఎంతో కృషి చేయవలసి వచ్చును. యోగమునకై కేవలము సమర్పితమైన చాలును. దీనికై సమస్త

కోరికలను విడువవలెను. సమర్పణలో ముందు భయము కలుగును. ఎందుకన, జీవితమే నశించునని తోచును. భయపడకుము. ముక్తి లభించును.

౪౭. జ్ఞానమనగా తెలిసినదానిని ఆచరించుటే. తనకు తెలిసినట్లాచరించినచో సాధన ఫలించును.

౪౮. నీకు జీవించుట కాశ ఉండుటే ఇతరులకు హింస కారణ మగును. ఎచట కోరికలుండునో అచట హింస ఉండితీరును.

౪౯. ఎవడు తన దుఃఖములకు ఇతరులు కారణ మనుకొనునో వానిలో ద్వేషముండి తీరును.

౫౦. ఏది జరుగుచున్నదో దానిలో జోక్యము తీసుకొనుటచే రాగము, ద్వేషము కలుగును.

౫౧. నీవు పరాధీనుడవు కాకుము. ఇతరులను పరాధీనుల చేయకుము. ఎవరిది వారికిచ్చి ఎవరిని ఏది అడగకుము. చింతించకుము.

౫౨. ఎవడు తనకు తాను చెరుపు చేసికొనునో వాడు ప్రపంచమునకే చెరుపుచేసిన వాడగును.

౫౩. ఒకక్షణమైనను చూడకుండా, వినకుండా, మాట్లాడకుండా, సంకల్పరహితముగా ఉండలేనపుడు సమాధి ఎటులకలుగును? ముక్తి ఎటుల లభించును?

౫౪. సమస్త వస్తువులందలి మమతను త్యజించి నిద్రించుము. లేవగానే నీ అధికారమును త్యజించి వ్యవహరించుము. నిద్రకొరకు నీ సంపత్తిని, భార్యాపుత్రాదులను విడుతువు. అటులే నీ ముక్తికొరకై అన్నిటిని విడువుము. నిద్రలో దేనితో సంబంధములేక ఎటులుందువో అటులే జాగ్రదావస్థలో దేనితో సంబంధములేక తటస్థుడవై యుండుము.

౫౫. చెడ్డచేసినవానికి చెడ్డచేయుటకు మానవునికి అధికారము లేదు. సమాజము లేక ప్రకృతి విధానమువలన, దండన లభించును.

మానవుడొక యంత్రవిధముగా ఆచరించుటే ధర్మము. నేను కర్తనని భావించుటే అధర్మము.

౫౬. తిండికి లేకున్నను భయపడకుము. ఈ ప్రపంచములో అందరూ తింటూ, తింటూ, మృతినొందుచున్నారు, కదా నీకు తిండి లేక మరణించినచో మంచిదే. ఎందుకన, తినుచు మరణించువారు, మిగిలించరు, తినక మరణించువారు, లోకమునకు మిగిలించి, ఉపకారము చేయుదురు. కాన భయపడకుము.

౫౭. నీకంటే ధనమును గొప్పగా భావించకుము. నిన్ను నీవు చెడగొట్టుకొని ధనమును సంపాదించకుము.

౫౮. నేను గుణవంతుడనని తలంచితివా, అహం వృద్ధి అగును. గుణములు నీవికావు. అవి ఇతరుల నుండే వచ్చినవి. వాటిని, నీవి, అని అనుకొనుట ద్రోహమే. కాన అభిమానమును వీడుము.

౫౯. ఏది జరుగుచున్నదో అది భగవానుని విధానమువలన జరుగుచున్నది. ఏది చేయబడుచున్నదో అది వాని వాని కర్మఫలమే. చేయుచున్నానని చేయుపనులన్నియు కర్తపైయుండును. కాన, చేయుదుననే భావము విడువుము. కర్తవుగాకుము.

౬౦. నీ మనోసంకల్పములను ఇతరు లాచరించవలెనని తలంచకుము.

౬౧. నామ రూపములకు మోహితుడవై దుఃఖించకుము. నీకుండునట్టి పేరు ఈ ప్రపంచములో ఎందరికో కలదు. అది, నేనే, అనుకొనుటే ప్రమాదము.

౬౨. ఈ ప్రపంచముయొక్క క్షుద్రవస్తువులకంటే నీ ఆత్మశక్తిని హీనముగా దలంచకుము. దేనికి దాసుడవు కాకుము.

౬౩. ఈ ప్రపంచములో ఏ కర్మ చేయబడినను అది ఎందరి సాహాయ్యముతోనో చేయబడుచున్నది. దానిని నాది, నేనే, చేసితినని అనుకొనుట పాపము. ద్రోహము.

౬౪. నీ అంతరాత్మ చెప్పినట్లు వివేకపూర్వకముగా వర్తించితివా, ముక్తి సిద్ధించును. బాహ్యమును విడచినచో, అంతఃర్ముఖుడ వగుదువు.

౬౫. ధ్యానము నీవు స్వయముగా చేయుము. మనస్సు మరి ఇంద్రియములతో చేయించకుము. ఎట్లనగా, నామనస్సు ధ్యానములో నిలవదు, స్థాయి లేదందువుకదా! పరాధీనత వలదు. మనస్సు వేరు, నీవు వేరు, మనస్సును నియమించుము. ఆలోచించుము. మనస్సు వెంట నీవు పోకుము. దానితో సంబంధము త్యజించుము. దానికి దాసుడవు కాక, యజమానుడవు కమ్ము.

౬౬. సాకారమే నిరాకారము, నిరాకారమే సాకారము. భేదములేదు. ఎటులన, నిరాకారమే సాకారరూపముతో జీవుడు జన్మించును. జీవుడు నిరాకారుడు, శరీరమనే రూపము సాకారము. జీవుడు కనబడడు, శరీరము కనబడును. అటులే ఈశ్వర అవతారము, సాకార, నిరాకారము. పాలలో వెన్న ఉన్నటుల అంతట నిండి యున్నాడు.

## ౪౩౪ స్వామి శ్రీరాంసుఖ్‌దాస్‌జీ

౧. శరీరమును పరాధీనముచేయుము, కాని, నీవు పరాధీనుడవు కాకుము. శరీరసుఖమునుకోరక ఇతరుల సేవచేయుము. దేనినైనను నాదని తలంచకుము. ధర్మవర్తనుడవు కమ్ము.

౨. ఈ ప్రపంచములో దేహ పీడల నివారణకై అనేక చిత్ర విచిత్ర చికిత్సాలయములున్నవి. కాని మనోవ్యాధి చికిత్సకై ఏలాటి చికిత్సాలయములు లేవు. కేవలము ఒక సత్సంగమే కలదు. ముక్తికి ఇదే మార్గము.

౩. ఏ స్థలములో నీకు అశుభ్రమని తోచునో, వెంటనే దానిని స్వయముగా పరిశుభ్రపరచుము. ఇతరులకై ఎదురుచూడకుము. ఇటు

వంటి సమయము మళ్లీ దొరుకదను భావముతో సేవచేయుటే నీవిధి. నీవేచేయకపోయినచో యింకెవరు చేయుదురు?

౪. మూడంగుళములజిహ్వారుచికై మూడుమూరల శరీరమును చెడగొట్టుకొనకుము. పశువు తన శరీరమును మాత్రమే చూచు కొనును. మానవుడు కూడా పశువు కారాదు. మానవుడు సుఖభోగము లనుభవించు సమయములో, దాని పరిణామమును విచారించి వివేకముతో వర్తించునేని, నరుడే నారాయణుడగును.

౫. పనికి దొంగవుగాకుము. నీ నౌకరు పనిచేయనిచో, అతనిపై క్రోధపడి జీతమివ్వవుకదా, నీవు నీ విద్యుక్త ధర్మమును నెరవేర్చక పోయినచో, దానికై విచారించవేల! అది పాపముకాదా? శిక్ష తప్పదు.

౬. చలికి, వానకు, ఎండకు భయపడి దుఃఖించకుము. భయ పడితివా, అవి అధికమగును. వాటిని ధృడచిత్తముతో సహించుము. ఏకాలమునకు ఏది కావలసియుండునో అదే అగును. కావున, దేనిని కోరకుము. ద్వేషించకుము. ఈర్ష్య రాగములను విడువుము.

౭. సాకారస్మరణకై, రామనామము, నిరాకారస్మరణకై ఓంకారము. యోగమునకై, సోహమును స్మరించుము.

౮. కడుపు అశుభ్రముగా, అజీర్ణముగా నుండునేని ఆకలి కాదు. అటులే అంతఃకరణ శుద్ధిలేకున్నచో, శాంతి ఉండదు. భగవంతునిపై ప్రేమకలుగదు.

౯. ఒకసారి విచారించుకొనుము. ప్రపంచములో నీవు చేయ దలంచినదంతయు చేసితివి. ఇక బాకీ ఏమున్నది. ఇకనైనా జీవన్ముక్తు డవు కమ్ము, ఆలసించకుము.

౧౦. ఏకాంతమున మౌనముగా నుండుము. ఎవరిని ఏదియు కోరకుము. ఇతరుల వస్తువులపై ఆధారపడకుము. నీవు చావనున్నను

నిన్నెవరడిగే దిక్కు లేకున్నను, దుఃఖించకుము. భగవంతునిపై భారము వైచి నిశ్చింతతోనుండుము. నీకు ఏ ఆధారము లేనినాడే భగవద్దర్శన మగును.

౧౧. రుచికై మితిమీరి తినుచో శక్తి తగ్గును. నిద్రవచ్చును. కడుపు బరువుగా నుండును. సాధన కుదరదు. మధ్య మధ్య ఏమియు తినరాదు. సాత్వికాహారమే మితముగా జీవించుటకే తినుము.

౧౨. నాది నాదనుచు, సంగ్రహము చేయుదువు. కొంచము విచారించుకొనుము. దేనిని నాదనుకొనుచున్నావో అది ఇతరులవద్ద నుండే నీ వద్దకొచ్చినదికదా! అయినచో, లోభగుణమెందులకు? దీని వలన పాపమే సుమా! ఒకరోజు నీవు, నీ వస్తువులన్నియు నశించునవే కదా! అపుడు నీ వస్తువులు ఎవరి పాలగునో, విచారించుకొనుము.

౧౩. ఈ సృష్టిని భగవంతుడు ఏలాటి దుర్గుణములు లేకుండా పరిశుద్ధముగా సృష్టించినాడు. మనమే దానిని, మనయొక్క రాగ, ద్వేషములచేత, చెడగొట్టుకొనుచున్నాము. ఆ పాపమునకు కారకులము మనమే సుమా!

౧౪. ఏ జీవికిని హింసచేయకుము. చిన్న గరికపోచలో కూడా జీవమున్నది. కాన, జాగ్రత్తగా క్రిందకి చూచుచు నడువుము. ఎందుకన, అణుప్రమాణమగు చిన్న జీవులు నీ కాలితాకిడికి నశించును. వాటి నాశనమునకు నీవు కారకుడవైతివా నీకు శిక్ష తప్పదు.

౧౫. సమస్త జీవులలో భగవానుడు గలడని విశ్వసించుము, ఎటులన, నోటు ఒక కాగితపు ముక్కేకదా! కాని, దానిలో నూరు రూపాయల విలువ గలదని విశ్వాసముండి, దానికడు జాగ్రత్తగా కాపాడుచు ఎల్లపుడు దానినే స్మరించుచుందువు కదా! అటులే భగవంతుడు సమస్త జీవులలో గలడని, విశ్వాసముంచి అందరిని ప్రేమించుము.

౧౬. నదిని దాటువాడు తన రెండుచేతులతో ఆ నీటిని దూరము చేయుచు ఆవలిగట్టు చేరును. అటులచేయక, ఆ నీటిని తన రెండుచేతులతో తన పొట్ట క్రిందికేగుంజు కొనెనా? నీటిలో మునిగి నశించును. అటులే నీవు నీ ధన సంపత్తులను ఇతరులకీయక సంగ్ర హించుకుంటివా నశింతువు. యిచ్చుచుంటివా ముక్తి దొరుకును.

౧౭. సుఖేచ్ఛ చాలా చెడ్డది. సుఖములో పుణ్యము క్షీణించును. పాపము హెచ్చును. ఇంద్రియముల శక్తిక్షీణించును, పదార్థములు నశిం చును. దుఃఖములో ఇంద్రియములశక్తి నశించదు. పాపములు నాశన మగును. సుఖములనుండి పాపములు వృద్ధియగును. దుఃఖములనుండి పాపములు నశించును.

౧౮. ధనవంతుడేకాని, లేక బీదవాడేకాని ఇల్లు విడచి తిరుగు వాడు ప్రయాణీకుడే కదా! (ముసాఫిర్) అటులే, ఎనుబైనాలుగు లక్షల యోనులలో జనన, మరణ చక్రములోబడి తిరుగువాడు, బాట సారియే కదా! ఎపుడు తన నిజమగు స్థానమునకు పోగలుగునో అపుడే ముక్తుడగును. అనగా, భగవంతునిచేరుటే మన నిజస్థానము.

౧౯. ఇది ప్రారబ్ధకర్మయని సహించి అనుభవించినచో, కేవలము శరీరమునకే నొప్పికలుగును. ఆ నొప్పిని అజ్ఞానమువలన, నాది, నాకే కలుగుచున్నదని అనుకొనుచో, మనస్సులో దుఃఖము కలుగును. నొప్పివేరు, దుఃఖమువేరు. నొప్పి శరీరమునకు కలుగును, దుఃఖము మనస్సునకు కలుగును. నాది అను సంబంధము పెట్టు కొనుటయే దుఃఖమునకు కారణము. ఎటులనగా పొరుగింటివారి పిల్లవాడు చనిపోవుచో నీకు దుఃఖము కలుగదు. కాని నీ పిల్లవాడు చనిపోవుచో దుఃఖించుదువు. దుఃఖమంతయు నాది నేను అను మమతలోనే యున్నది. ఇదే నరకము.

౨౦. జీవుడు పరమాత్మ మరియు జగత్తునకు మధ్యన ఉన్నాడు. జీవుడు జగత్తుయొక్క బాహ్యసుఖ భోగముల కాశపడుచో బంధింప బడును. లేక, ఆత్మ సుఖమును కోరుచో ముక్తుడగును.

౨౧. ఎవడు ధనవంతుడో వాడు నిర్ధనులకు ఋణగ్రస్థుడు. ఎవడు వివేకవంతుడో వాడు అవివేకులకు ఋణగ్రస్థుడు. ఎవడు జ్ఞానియో, వాడు అజ్ఞానులకు ఋణగ్రస్థుడు. కావున, మీవద్ద ఏ శక్తి యుండునో ఆ శక్తిని ఇతరులకు ధారబోసి మీ ఋణములను తీర్చు కొనుడు.

౨౨. నీ పిల్లవాడు తప్పుచేసినచో మంచికొరకే శిక్షించుదువు కదా ! అటులే ఇతరులు తప్పుచేసినచో వారి మంచికొరకే వారికి చెప్పుము. కాని, వారియెడ చెడ్డభావ ముంచకుము. క్షమించుము. ప్రేమ జూపుము.

౨౩. జీవుడు సంసారముయొక్క మమతలో బడి సుఖ భోగము లనుభవించుచుండును. ఇదియే వ్యభిచారము. ఎటులనగా భార్య తన భర్తను విడచి, ఇతరులతో భోగించుచో వ్యభిచారిణియే కదా ! అటులే భగవదంశ గల జీవుడు, దేహాభావము వలన సంసార సుఖములో బంధింపబడినచో వ్యభిచారుడే, సంసారముయొక్క సేవ చేయవచ్చును గాని, దానిని, నాది, అని, అనుభవించుటయే బంధము. ప్రతి స్త్రీ కూడా తన ఇంటిలో వారందరకు సేవ చేయును. కాని, సుఖభోగములను, తన భర్తను తప్ప ఇతరులతో భోగించదు. అటులే, శరీరముచే సంసారము యొక్క కార్యములు చేయుచు, మనస్సు నుండి భగవంతుని స్మరించుచుండుము ఇదియే నిజమైన నిష్కామ కర్మ.

౨౪. ఏది చేయబడునో, ఏది చేయబడవలెనో చేయునదంతయు మిథ్యయే. ఏది స్వయముగా జరుగునో, అది సత్యము. సంసారము యొక్క స్మరణ స్వయముగా జరుగును. భగవంతునియొక్క స్మరణ చేయవలయునని చేయుదురు. ఇది ఎంత అన్యాయము. మీరే విచా రించుడు. సంసారముపై మమత లేని నాడే, భగవంతుని స్మరణ స్వయముగా జరుగును. చేయునదంతయు బాహ్య ఇంద్రియ క్రియలే,

ఏది స్వయముగా జరుగునో అది మనస్సునుండి జరుగును. సమస్త ప్రపంచమును, నాది అని అనుకొనినినాడు యావత్ ప్రపంచము నుండి నీవు ముక్తుడవే. నిన్నది బంధించలేదు. కేవలము కొలది అణు మాత్రమైన చిన్న వస్తువులనే, నాది, నావి, అనుకొనుచో వాటిచే బంధింపబడుదువు, కాన దేనిని, నాదనుకొనకుము.

౨౫. నీ కనుకూలమున్నవారు నిన్నుద్ధరించరు. కాని, నీకు ప్రతికూలురే నిన్నుద్ధరింతురు. ఎటులనగా, నీ అవగుణములను నీ యెదుట పెట్టుదురు. దానివలన, నీ వర్తనము మంచిదగును. కావున, వారిని ప్రేమించుము. నిన్ను నీ వారు చెరుపుదురు. శత్రువులే నిన్నుద్ధరింతురు. ఎందుకన, వారికి భయపడి చెడ్డపనులు చేయవు.

౨౬. నిన్ను నీవు మొదలు బాగుపర్చునొనుము. ఇతరుల బాగుపరుతునని అహంభావ పడకుము.

## ౪౩౫ స్వామి శ్రీ నిత్యానందజీ

౧ నీ వేది కోరుదువో ఇతరులకై అదే కోరుము. ఆత్మ వత్సర్వ భూతాని, కదా?

౨. భగవద్గీతను నీ ఆచరణలో పెట్టి అది చెప్పినటుల నడుచు కొనవలయును.

౩. చెడు గుణములను నీ జీవితముండగానే, విడచి, వైరాగ్య మును పొందుము. అదియే నిజమైన మానవత్వము.

## ౪౩౬ స్వామి శ్రీ సుఖదేవానంద్ జీ

౧. నీ బుద్ధిని ఇంద్రియముల వశము చేయకుము. ఇంద్రియ ములు కోరిన దానిని త్యజించుము.

౨. ఈశ్వరాజ్ఞను పాలించుము, నిరాడంబర జీవనము గడుపుము,

౩. నీవు సుఖపడవలయునని తలంచకుము. ఎందుకన, నీ సుఖమువల్ల ఇతరులకు దుఃఖము సంభవించును. ఇతరులను సుఖ పెట్టుము. నీ సుఖమును త్యజించుము, ఇదియే మానవుని యొక్క ముఖ్యలక్షణము.

౪. శరీరముతో ప్రజా సేవ, మనస్సుతో ఈశ్వర స్మరణ చేయు చుండుము. మనస్సు శాంతముగ యుండునేని శరీరముతో ఎంత కష్టము చేసినను శరీరము క్షీణించదు. కాన, సోమరివి కాకుము.

౫. నీ పరివారమును నీ గ్రామములోని వారిని దైవప్రార్థన చేయమని ప్రార్థించుము. మంచిపనులు చేయమని అందరికి నమ స్కారములు చేయుచుండుము.

౬. సేవ చేయుచు, చచ్చినను, మంచిదే, చెట్లు, గుట్టలు, ఎల్లపుడు నిద్రలోనే వుండును. నీవు అటులే నిద్రలోపడి నశించకుము. ఎల్లపుడు ఇతరులకు మేలు చేయుచుండుము.

౭. నిన్నెవరైనను బాధపెట్టినను, అవమానపరచినను, నీవు దుఃఖింపకుము. ఎందుకన, వారిలో కూడా ఈశ్వరుడు కలడు. ఆ రూపమున నీ కర్మఫలము నిన్ను బాధ పెట్టుచున్నదని తలంచి పాపము తగ్గినదని సంతోషించి వారిని ప్రేమించుము. ఎటులనగా ప్రభుత్వవిధాన ప్రకారము (మునిసిఫ్) పాపము చేసినవారికి శిక్ష విధించును. ఇందులో మునిసిఫ్, తప్పేమున్నది. అటులే నీ పాపకర్మ ఫలితము, ఒక వ్యక్తి రూపమున ఈశ్వరుడే నిన్ను శిక్షించుచున్నాడని తలంచి సంతోషించుము.

౮. భార్య భర్తను ప్రేమించుట, సాకారమునా, లేక నిరా కారమునా, సాకారమునే ప్రేమించినటులగుచో భర్త మృతినొంది నచో దుఃఖమెందులకు. దేనికొరకు సాకారశరీరము కనిపించుచునే యుండెను. ఇక నిరాకారమా, అదికనబడదు, ఈ రెండింటిలో దేని

కొరకు దుఃఖించుచున్నట్లు నిరాకారుడు పోయినాడనేదుఃఖించుచున్నది. అజ్ఞానమువలన, దేహమే నా భర్త అని నమ్ముటచేదుఃఖము ప్రాప్తించినది.

౯. అన్నివస్తువులలో ఈశ్వరుడు గలడను భావముచే పూర్వులు సాకారపూజ ప్రారంభించిరి. వృక్షములను, పాములను, పందిని, ఎద్దులను, మొదలగు వాటినన్నిటిని పూజించిరి. సాకారములోనే నిరాకారుడుగలడు. అందరు నిరాకార, సాకారముల నమ్ముచున్నారు. నీ భావమెటులుండునో అటులే దృశ్యమగును. కావున, సాకార నిరాకారమునకు భేదమేమియు లేదు.

౧౦. నీవు కోరినది దొరికినచో సుఖము. దొరకనిచో దుఃఖము కలుగును. కావున, దేనిని కోరకుము.

౧౧. జీవుడు నిరాకారుడు. శరీరము సాకారము. జీవుడు లేనిచో శరీరముండనేరదు. శరీరము లేనిచో జీవుడుండలేడు. అనగా, ప్రత్యక్షముగా కనబడలేడు. కావున, సాకార, నిరాకారముల రెండింటిని నమ్మవలెను. ప్రపంచ మంతయు నిరాకార స్వరూపమే, కాని, సాకారరూపమున, ప్రత్యక్షమగు చున్నది.

## ౪౩౭ స్వామి శ్రీ భజనానంద్ జీ

౧. రాముడు, రాజ్యమును, త్యజించి ధర్మమును పరిపాలించి నందువలన ప్రపంచమంతయు వారిని పూజించుచున్నారు.

౨. పిల్లవాడు జన్మించగానే ఏడ్చును. తల్లి దండ్రులు నవ్వుదురు. సంతోషపడుదురు. అటులే నీజీవనమును, సంతోషముగా గడపి నవ్వుచు, మృతినొందితివా, ముక్తుడవేకాన, ఆశను త్యజించుము.

౩. సాధు సంగమము, లేక, ఈశ్వర సంబంధము పెట్టుకుంటివా, నీజన్మ ఫలించును. నిన్ను ప్రజలు మరువరు. ఎటులన, యినుము, పరుసవేది సంబంధముచే బంగారమగును. దానిని ప్రజలు ప్రియముతో భద్రపరుచుకొనెదరు. ఎపుడు దానిని మరవరు. కావున, సమస్తమును విడచి ఈశ్వరుని ప్రేమించి స్మరించుచుండుము,

౪. మోహముపలన క్రోధమువచ్చును. కాన, సమస్త కోరికలను విడువుము. ఈశ్వరుని బంటునని, సేవచేయుము దేనిని, నాది, అను కొనకుము. విధి అని, కర్మచేయుము.

౫. నీ సంపత్తిని, లేనివారికి వినియోగించుము. నీ కొరకై రేపటికిని ఉంచుకొనకుము. లోభివి కాకుము.

౬. ఏదినీకు ఎక్కువప్రీతియో దానిని వెంటనే త్యజించుము. సాధకుడు, మిఠాయీలను మిరపకాయలను, తినవలదు.

౭. మనస్సును ఇంద్రియములను, ప్రతిరోజు జాగ్రతగా పరీక్షించుచుండుము. లేనిచో అవి నిన్ను నాశనముచేయును. వాటిని నియమబద్ధములో నుంచుము.

౮. నీ ఇంటి వారిని ఎటుల ప్రేమించుదువో ఇతరుల నటులే ప్రేమించుము. అందరను అన్నదములు, మరియు అక్క, చెల్లెలనుగా, భావించుము. సమస్త జీవులలో ఈశ్వరుడుగలడని అందరను ప్రేమించుచు సేవించుచుండుము.

౯. మనస్సు యొక్క కోరికలను అణచివాటిని పూర్తిచేయక పోవుటే, నిజమైన సాధన విరాగివికమ్ము.

## ౪౩౮ స్వామి శ్రీ అభేదానంద్ జీ

౧. మునుముందు నిన్ను నీవు ఉద్ధరించుకొనుము. నీతి మంతుడవుకమ్ము. పిదప, నీ ఇంటిని, ఆ పిదప నీ గ్రామమును ఉద్ధరించుము. తదుపరి ఇతరులకు భోదించుము.

౨. నీకు నీవే యజమానుడవనుకొనకుము. యజమానుడు భగవంతుడేయని మరువకుము. నీవు సంసారమునకు సేవకుడవని మరువకుము.

౩. ఇతరులను చెడ్డవారినిగా తలంచకుము. వారిని, మైత్రితో దయతో ప్రసన్నతతో సేవింపుము. సుఖవంతుల జూచి వారికి మిత్రు

డవుకమ్ము. దుఃఖితులను జూచి వారిపై దయగలవాడవై వారికి సేవ చేయుము. పుణ్యకర్మలను జేయువారిని జూచి, సంతోషించుము. సాధు సంతులకు సేవచేయుచుండుము.

౪. నీవెవరినైనను వ్రేలుపెట్టి చూపించినచో, తతిమ్మ నీ మూడు వ్రేళ్లు నీవైపు చూచుచుండును. ఎందుకన ఇతరులలో ఒక దోషముండుచో నీలో మూడు దోషములున్నవని చూపుచున్నవి. కావున, ముందు నిన్ను నీవు దోషరహితునిగా చేసికొనుము. ఇతరుల దోషములను చూడకుము. ఇతరులు దోషులని అనుకొనకుము.

౫. పరీక్షా సమయమున, పిల్లలు తప్పు వ్రాయుచున్నను, ఉపాధ్యాయుడు చూచుచుకూడా, వ్రాయుచున్నది తప్పని చెప్పడు. ఎందుకన, ఆ సమయము పరీక్షా సమయము. ఇంతకుముందే సమస్తము ఉపదేశించినదేకదా, దానికే ఇపుడు పరీక్ష. అటులే, మానవుడు పాప కార్యములు చేయుచుండగా, భగవంతుడు సాక్షిమాత్రుడుగా తటస్థుడుగా యుండును. ఎందుకన, ప్రతి మానవునకు, మంచి చెడ్డలను గ్రహించుటకు, వివేకశక్తి నిచ్చియున్నాడు. మరియు అనేక శాస్త్రములద్వారా, దాని విధివిధానము మొదలగు వాటిని ప్రసాదించియున్నాడు. ఎవడేమి చేయునో వాడది అనుభవించవలసి యుండును. కేవలము భగవానుడున్యాయకర్త.

౬. చిన్న పిల్లలు మాటలాడలేరు. వారికెన్ని కష్టములు కలగినప్పటికిని, చెప్పుకొను శక్తి ఉండదు. అటులే, పశువులు మొదలగు వాటికి మాట్లాడి చెప్పుకొనుశక్తి ఉండదు. కాన, మానవులు నోరు లేని జీవులపై దయచూపుట ధర్మము. న్యాయము.

## ౪౩౯ స్వామి శ్రీ ఓంకారానంద్ జీ

౧. ఈర్ష్య చాలా చెడ్డది. దీనినుంచి చాలా గొప్ప పాపము సంభవించును,

౨. ఇతరుల మేలుగురించి నీ ధనసంపత్తిని త్యజించుము. వారికి ప్రేమతో సేవచేయుచు వారిని సంతోషపెట్టుము.

౩. భగవంతుని యందు విశ్వాసముంచుము. మృత్యువు నిన్ను సమీపించుచున్నది. కాన, ప్రయాణమునకై, సిద్ధముగా నుండుము. ఆలసించకుము.

౪. ప్రతివాడు వాని వివేక విచారములవలన తనను తానుద్ధరించుకొనవలెను.

## ౪౪౦ స్వామి శ్రీ ఇంద్రకాంత్ తీర్థజీ

౧. ధర్మముకొరకే ధనమును సంపాదించవలెను. మోక్షము కొరకే కోరిక ఉంచవలెను. వీటిచే జీవితము సార్థకమగును. యథార్థ ధర్మాచరణచే మనస్సు శుద్ధమగును. మరియు, కామమును జయించవచ్చును. కావున, సమస్త విషయవాంఛలను విడచి, ధర్మమును ఆచరించుడు.

౨. జీవన్ముక్తి సంపాదించుటకు భక్తియే విశిష్టమైన సాధన.

## ౪౪౧ స్వామి శ్రీ మహామండలేశ్వర్‌జీ

౧. ఇతరులకొరకు జీవించుము. సమాజమునుండి అన్నమును తినుచున్నావు. కావున, సమాజమునకు సేవచేయుచుండుము. సమాజమునకు ఋణగ్రస్థుడవు కాకుము.

౨. తనువును, మనస్సును, ధనమును, సమస్త పరిస్థితులలో ప్రజాసేవకే వినియోగించుట, మానవుని యొక్క ముఖ్య ధర్మము.

## ౪౪౨ స్వామి శ్రీ బ్రహ్మానంద్‌జీ

౧. నీ జీవితములో ఎవరినైనను ఏ వస్తువునైనను యాచించకుము. ప్రారబ్ధము పై లేక పరమేశ్వరుని పై విశ్వాసముంచుము,

నీ తిండి తిప్పలకై విచారించవలదు. ఏది ప్రారబ్ధములో నుండునో అది తప్పక నీ వద్దకు వచ్చితీరును. దానికై వెతకవలసిన పని లేదు. కాన, రేపటికెటులని చింతించకుము.

౨. అకాలమృత్యువనునది ఉండదు. శాస్త్రములో మానవునికి నూరేండ్లు ఆయుః ప్రమాణముగలదు. కాన, దానిలోపల మృత్యువు సంభవించునేని, దానిని అకాలమృత్యువను చుందురు. శాస్త్ర ప్రకారము మానవుడు నడచుకొనినచో నూరేండ్లు ఆయువు ఉండితీరును. ఎవడెంత కర్మ చేసికొనునో అంతే ఆయుపు ఉండును ఎవడెంత కష్టపడునో అంతయే ఫలము.

౩. దేవుడెటు లుండును? నీవు గాఢ నిద్రలో ఉన్నటుల. మరియు పాలలో నెయ్యి, నువ్వులలో నూనే, పుష్పములలో వాసన ఉన్నటులుండును.

౪. తండ్రి ముందర కొడుకు మరణించుట పాపమే. మన కంటె చెట్లు మంచివి. ఎందుకన, మొదలు వెళ్లిన ఆకు మొదలే రాలును. మొదలు పూసిన పువ్వు మొదలే కాయగును. మొదలు కాచిన కాయ మొదలే పండుపండి మొదలే క్రిందపడును. క్రిందాకు రాలనిది మీదాకు రాలదని వాడుక. ఇక మనము ఈశ్వరుని నియమమును పాటింపక నాశనమగు చున్నాము. ఇది అంతయు పాపమే.

## ౪౪౩ స్వామి శ్రీ నారదానంద్‌జీ

౧. ఇంతవరకు ఎనుబైనాలుగు లక్షల జీవులలో పుట్టుచు చచ్చుచు, సుఖము కొరకై వెతకితిరి, ఎక్కడ సుఖము దొరకెను. ఒక వేళ సుఖమె దొరుకుచో మళ్లీ దుఃఖించుచు సుఖమును ఎందులకు వెతకు చున్నారు. విచారించుడు బాహ్యా వస్తువులలో ఎందులో ఏమి సుఖములేదు. సుఖము మీలోనే యున్నది. అంతఃశుద్ధి కలవా

రత్లై మీలోనే మిమ్ములను చూచుకొనుడు. దేనియందు ఆశనుంచకుడు.

౨. తనవును మనస్సును ధనమును, సంపత్తులను, కీర్తి ప్రతిష్ఠలను మానావ మానములను, సుఖ భోగములు మొదలగు సమస్త సంసార సంబంధములను త్యజించుము. లేనిచో, అవి నిన్ను విడచి వెళ్లిపోగలవు. అపుడు నీవు దుఃఖించెదవు. కావున, సమస్త వస్తు సముదాయము నుండి మమతను వీడి, భగవంతునిస్మరించుము.

౩. మారీచుడు రాక్షసుడైనను, రామునిచే చచ్చుటయే మంచిదని తలంచెను. ఎందుకన, రాక్షసుడైన రావణాసురునిచే చచ్చుట కంటె, మానవోత్తముడైన రామునిచే చచ్చుట శ్రేష్ఠము. రాక్షసుడే అట్లువర్తింప, మనము, మానవులమని బిరుదు వహించి సంసార మోహములో బడి నశించుట చాలాలజ్జాకరము. ఇకనైనను విచారించి, భగవంతుని శరణు జొచ్చినచో ముక్తులమగుదుము.

## ౪౪౪ స్వామి శ్రీ ప్రణవానంద్‌జీ మహారాజ్

౧. మొదలు నీ ఇంద్రియములను నీవు వశపరచుకొనుము. ఇది ముఖ్యము. రాగము, ద్వేషమును త్యజించుము. మనస్సును నీ అదుపులో పెట్టుకొనుము. కేవలము శాస్త్రములను చదువుటచే లాభము లేదు, త్యాగము, సంయమము. సత్యము ఇంద్రియ నిగ్రహము మొదలగునవి వర్తించుటే లాభము.

౨. యత్ర జీవస్తత్రశివః, ఈ మహా మంత్రమును సాధించుటచే ముక్తి సిద్ధించును.

[వీరు ప్రయోజనములేని ఏ ఒక మాటనైనను, మాట్లాడు వారు కారు. అవసరములేనిదే, దేనిని చూచువారు కారు, ఘన పదార్థములను తినువారు కారు. సాత్విక భోజనము కేవలము జీవమునిలుచుటకే తినువారు.]

౪౪౫ స్వామి శ్రీ పథక్‌జీమహారాజు

౧. పరమార్థమార్గము ననుసరించువారు సన్మార్గములో నడవని వారిని నిందించరాదు. వారిని తుచ్ఛులనుగా, పాపులనుగా తలంచ రాదు. మేమే భక్తులమనుచు అహంకార పడరాదు.

౨. సంపూర్తి శాంతిని కోరుదువేని ఎట్టివిధమైన కోరికలను కోరకుము. భోగములను త్యజించుము.

౩. భయమునుండి విముక్తుడవు కాదలచుకొనుచో ఆసక్తిని త్యజించుము.

౪. పశ్చాత్తాపముల నుండి విముక్తుడవు కాదలంచుకొనినచో మితభాషివి కమ్ము.

౫. పరాధీనమునుండి విముక్తుడవు కాదలచు కొనినచో భోగాసక్తిని త్యజించుము. సంపూర్ణ స్వాధీనుడవు కాగోరుచో రాగమును త్యజించుము.

౬. మహాత్ముల ఆజ్ఞ ప్రకారము వర్తించ దలంచినచో, బాహ్యదృష్టిని విడచి, అంతరదృష్టిని కలిగించుకొనుము.

౭. దుఃఖముల నుండి విముక్తుడవు కాదలంచుకొనుచో, సంయోగ, వియోగములను, మోహమును వీడుము.

౮. అవమానములనుండి విముక్తుడవు కాదలచినచో, పదవుల పైన ధనసంపత్తులమీది ఆశలను త్యజించుము.

౯. సంసారమునుండి ఋణవిముక్తుడవు కాదలంచుకొనుచో, ఇచ్చుచుండుము. సంగ్రహము చేయకుము. నాదనునది నుండరాదు.

౧౦. భగవంతుని ప్రేమ కావలయుననుచో, వాసనలను త్యజించుము. నిరాశ్రయుడవుకమ్ము.

౧౧. అహంకారమును త్యజించ దలంచుచో, ఆత్మచింతన చేయుచు, అన్నిజీవులలో ఈశ్వరుని చూడుము.

౧౨. ఎవరినిగురించి నీమనస్సులో చెడు సంకల్పించుదువో, వారి మనస్సులోగూడా, నిన్నుగురించి చెడు స్వతఃసిద్ధముగా పుట్టును. దీనిని మరువకుము. ఇతరుల మాటను, ఇది తప్పని చెప్పకుము. దీనిచే వారి మనస్సు నొచ్చును. వారి మాటలు నీకు విరుద్ధమైన యెడల మౌనము వహించుము.

౧౩. నీకీర్తి, ప్రతిష్ఠలను పొగడబడుచోటికి పోకుము. అక్కడ ఉండకుము.

౧౪. ఈ సంసారమొక సినిమావలె ప్రతీతమగుచుండును. ప్రయోజనమా సున్న. కావున, సమస్త కామములను, కోరికలను త్యజించుము.

౧౫. శరీరము, ఇంద్రియ, మనస్సు, బుద్ధులు, సాధనలకొరకె ప్రాప్తించినవి. వీటినుండి భోగివైనను కావచ్చును. లేక యోగివైనను కావచ్చును. కాన, ప్రతి ఇంద్రియమును పరిశుద్ధముగా నుంచుకొనుము.

౧౬. నీ అజ్ఞాన నాశనమునకే సాధన చేయవలెను. భగవ దర్శనమునకై సాధన అవసరములేదు. ఎందుకన, భగవంతుడు వేరే లేడు. సదా ప్రాప్తుడే. నీ అజ్ఞానమను మైల పోగానే దర్శనమగును. ఎట్లన, అద్దములోని మైలను తీసివేయగానే నీ ప్రతిబింబము ఆ అద్దములో దర్శనమగును. అటులే నీలోనున్న అజ్ఞానమను మైలను తీసివేయగానే నీలోనే దేవుని దర్శింతువు.

౧౭. ఒకేగంట ధ్యానించి శ్రమపడుదువు. కాని, ఇరువై మూడు గంటలు సంసారమునకై శ్రమపడి, చెమటోర్చుచు కూడా అలసటతీర్చు కొనవు. ఇటులెన్నియో ఏండ్లు గడచెను. కాని, నీకు తనివితీరక పోయెను. నీవే విచారించుకొనుము.

౧౮. ధ్యానములో మనస్సు నిలవకపోయినచో, మనస్సులో యింకను విషయ భోగాశక్తి ఉన్నదని తలంచుము.

౧౯. సుఖమే దోషము, కాన వెంటనే సుఖాశక్తిని త్యజించుము. తమంతట తామె వచ్చిన సుఖదుఃఖములను సహించి అనుభవించుము.

౨౦. మనము భగవానునకే కదా ద్రోహము చేయుచున్నది. ఎటులన, వారిచ్చిన సమస్తమును, మన స్వార్థముకొరకు మనవే అనుకొని సంగ్రహము చేసుకొనుటయే ద్రోహము.

౨౧. మొదలు నీ పరివారమును నీ ఇరుగుపొరుగును ప్రేమించితివా, విశ్వప్రేమ కలుగును.

౨౨. నీ శరీరము మోటరులో కూర్చుండును. ఆ మోటరు నీమనస్సులో కూర్చుండును. అటులే, నీ ధనసంపత్తులు నీమనస్సులో నివాసము చేసికొనినవి. వాటిని నావి అని అనుకొనుటయే బంధము. కాన, అన్నిటినుండి మమతను త్యజించుము.

౨౩. నీవాణిని, నీఅదుపులో పెట్టుకొనుము. దీనిచే ఆత్మశక్తి కలుగును. మౌనము వహించుము.

౨౪. వెలుతురును చూడకుము. ఆ వెలుతురులో, నిన్ను నీవు చూచుకొనుము. ప్రకాశములోనే నిన్నునీవు ఉద్ధరించుకొనుము. వివేకమును ఆదరించుము.

౨౫. ఇంద్రియముల దృష్టివలన ప్రపంచవస్తువులు నిజమని తోచును. బుద్ధివలన ఆవస్తువులే అనిత్యమని తేటపడును. కాన ఎచటెచట ఇంద్రియముల దృష్టిపోవునో, అచటచట బుద్ధిని ప్రయోగింపుము. అంతయు అనిత్యమైతోచును. మమత ఉండనేరదు. ఇంద్రియములు నీ ఆధీనమగును.

౨౬. భగవత్సృష్టికిప్రతిసృష్టిచేయుటే మనకు బంధము. మనదని అనుకొనుటయే మనసృష్టి భగవంతుని, సృష్టిలో ప్రతిరోజు ఎందరో మృతినొందుచుందురు కదా! వారికై ఎవరు దుఃఖించుచున్నారు. మన

సృష్టిలో ఒక చిన్నపిల్లవాడు మృతినొందినను, మన దుఃఖము వ్యాకులత ఎంతోమనకు తెలియును.

౨౭. సూర్యునికి మబ్బు అడ్డమువచ్చినందున, సూర్య దర్శనమగుటలేదందుము. ఇది వట్టి భ్రమ. ఎటులనగా, కేవలము మనకంటి ఎదుట ఒక మబ్బు అడ్డమొచ్చినందున, ఆసూర్యుడు మనకండ్లకు కనబడడు. కాని. అదే సమయమములో సూర్యుడు రెండవ ప్రదేశములో లేక, రెండవ గ్రామములో కనబడును కదా, అటులే భగవంతుడు, అంతటనిండియున్నాడు. కాని, మోహమనే, అజ్ఞానమైన మబ్బువల్ల భగవంతుని దర్శనమగుటలేదు. మోహమును త్యజించితివా వెంటనే దర్శనముకాగలదు.

౨౮. ఎటులనిన్ను నీవు మరవకజ్ఞప్తియందుంచు కొనెదవో అటులే, భగవంతుని మరవక జ్ఞప్తియందుంచు కొనుము.

౨౯. తిండికై బంధింపబడకుము. రుచికై తినకుము. తినుచు, తినుచు, ఒకరోజు చనిపోయెదవు. దీనిని మరువకుము. భోగలాలసుడవై మిఠాయీలు మొదలగు రుచిగల పదార్థములను తినుటకిచ్ఛ కలుగుచో, దానికిబదులు ఎండినరొట్టె తునకలనే బాగుగా, నమిలి తినుము.

## ౪౪. శ్రీ మళయాళ స్వామి

౧. ఇతరులతో సేవచేయించుకొనుట మహాపాపము. దీనిచే పూర్వజన్మలో చేసినపుణ్యము పోవును.

౨. అధర్మముచే పంచభక్ష్య పరమాన్నము భుజించుటకంటే, ధర్మమార్గమున అంబలిత్రాగి జీవించుట శ్రేష్ఠము.

౩. సాక్షాత్ పరోక్ష జ్ఞానముకలిగినను, యుక్తాహారము, వివిక్తవాసము, బ్రహ్మచింతనమును ఈ నియమములను శరీర పతన పర్యంతము విడవరాదు.

౪. నీ ప్రవర్తనలో యిసుక రేణువంతపాపమున, కీ దినము నవకాశమిచ్చినచో రేపటి కదియే, మహా మేరువంతగును.

౫. ఇంద్రియ సుఖమునకెంతెంత దగ్గరచేరుదురో, దైవానంద మునకంతంత దూరమగుదురు.

౬. ఓంకారమును జపించినప్పటికి దైవభావ ముండవలెను. లేనిచో వృధాయగును.

౭. వాక్శుద్ధి కలిగినచో చెప్పిన వాక్యముతప్పక ఫలించును. మనస్సిద్ధికలిగిన సంకల్పమెట్టిదైనను ఫలించును.

౮. దుష్ట స్త్రీలకు, పశువధచేయు జీవహింసాపరులకు, ఇచ్చు దానము తామసదానమనబడును. ఇది, నరకము.

౯. జీతగానికి తగిన ఫలమునిచ్చియే పనితీసికోవలెను, లేనిచో పాపమే.

౧౦. ఆకారముతో నిరాకారము కలసినచో సాకారమగును. ఆకారమనగా ప్రకృతి. నిరాకారమనగా ఆత్మ, ఈ రెండు కలసినచో (జీవుడు) చైతన్య స్వరూపుడగును.

౧౧. ఆత్మ సంస్కారమును పొందగోరువారు పుస్తకము లెక్కువ చదవవలసిన అవసరములేదు. హృదయమును, పరిశోధించిన చాలును. పుస్తకములు చదివి మస్తకములు పరిశోధించిన వారికి ఈశ్వర రహస్యము గోచరమగును.

౧౨. ప్రపంచములో నందరను మెప్పించి నీవే కార్యమును చేయజాలవు. కావున, సత్యమునుండి చలింపక నీ అనుష్ఠానమును నిర్విఘ్నముగా సలుపుము. సత్యమునుండి జారి, ప్రజలను మెప్పించి సంతసించ దలచకుము.

౧౩. ధర్మనిష్ఠకు భయపడి దేహపోషణ సుఖమునే చూచుకొను వాడు. శూద్రుడు.

౧౪. ఎవడు దేహాభిమానము గలవాడై అహంబ్రహ్మ అను మహావాక్యమును వాగ్రూపముగ ఎన్నిసార్లు బలుకునో అన్నిసార్లు వాడు గుంతనక్కయై పుట్టునని ఋషులు పలికిరి. ఎవడు యోగ్యత గలగి అహంబ్రహ్మ అని పలుకునో వానితో సమానులు ఈ ముల్లోకములలో లేరు.

౧౫. సృష్టి అయినది మొదలు యిప్పటివరకు భగవంతునకు ముఖ్య భక్తులు అయిదుగురే దొరకినారు. ఆరవ భక్తుడు లేడు. (1) ఆకాశము (2) వాయువు (3) అగ్ని (4) జలము (5) భూమి. ఇవి భగవదాజ్ఞను మీరకుండా ఆచరించుచుండును.

౧౬. ఇతరులు నాకంటె అన్నిటిలోమించి ఉండకూడదని అనుకొనువాడు చాలా నీచుడు, అధముడు.

౧౭. మన హృదయము పరిశుద్ధముగా చేసికొనినచో ప్రపంచమంతయు శుద్ధముగానే గోచరించును.

౧౮. పరమాత్మ దయ కలుగవలెననినచో పరమేశ్వరాజ్ఞను విధిగా ఆచరించవలెను.

౧౯. సందేహములేనివానికి ఒక్క విచారణ వాక్యమే చాలును. హృదయములోనున్న సర్వవాసనలను వృత్తులను సంపూర్ణముగ తీసివేసిననాడే ముక్తి దొరకును.

౨౦. అభ్యాసకుడు తన హృదయమును నాలుగు విధములుగా పరీక్షించి తెలిసికొనవలెను. ప్రవర్తనచేత, భోజనముచేత, సంకల్పములచేత, హృదయమును తెలిసికొనవలెను.

౨౧. మనస్సునుబట్టియే కాలము మారుచుండును. యుగములు మారవు. మనస్సెటులుండునో యుగములటులే యుండును.

౨౨. కల్లుత్రాగు అలవాటు కలవారు తెల్లఉమ్మెంతాకు రసము కల్లులో కలిపి త్రాగిన ఆ త్రాగుడలవాటు తప్పును.

౨౩. నశ్యము పీల్చుట కలవాటు పడినవారు శాంతిపొడి పీల్చినచో ఆ అలవాటు పోవును.

౨౪. బ్రతికి ఉన్నప్పుడు మంచి కార్యములుచేయుచో మరణ సమయమున ధైర్యము కలుగును. పాపకార్యములు చేయుచో భయము కలుగును.

౨౫. మనోఇంద్రియములను ఏకాగ్రము చేయుటకై ఏకాంత స్థలములో మూడు సంవత్సరములు తీవ్రమైన తపస్సు చేసినచో చైతన్యము కలుగును.

౨౬. వృద్ధిపొందు వానికి తనలోనుండు తప్పులన్నియు తనకు గాన్పించును. క్షీణదశకు పోవువానికి ఎదుటివారి తప్పులు కానిపించును తన తప్పు తనకు కానరాదు.

౨౭. జీర్ణించిపోవునదికాన శరీరమని పేరువచ్చినది. దహింప బడుచున్నదికాన, దేహమని పేరువచ్చినది. స్థూలసూక్ష్మములకు ఈ కారణదేహము హేతువగుటవలన కారణదేహమని పేరు వచ్చినది. స్థూలదేహము స్థూలాగ్నిలో దహించి పోవును. సూక్ష్మదేహము వైరాగ్యముచే దహించబడును. కారణదేహము జ్ఞానమయ మగుటచే జ్ఞానముచే దహించిపోవును.

౨౮. శ్రవణముచే అజ్ఞానము మననముచే సంశయము నిధి ధ్యాసముచే, భ్రాంతి నశించును.

౨౯. ఏ పనినైనను అంతరాత్మను విచారించియే చేయుము. విచారణలేనివాడు మృగతుల్యుడు.

౩౦. కష్టములు మానవునకు నీతి, ధర్మములు భోదించుచున్నవి. కావున, అవి దేవునియొక్క అనుగ్రహములుగా దలంచుము,

౩౧. వెనుకచేసిన దోషములకు పరితపించి తిరిగి అట్టి దోషము లను చేయకుండా జాగ్రత్తపడుము.

౩౨. ఎంత తపస్సుగాని, యోగమహిమగాని యుండినను వినయము, భక్తి, శాంతి, ప్రేమలేనిది వ్యర్థమే.

౩౩. వేయి సంవత్సరములు తపస్సుచేసిన దానికంటే నిర్విషయముగ మనస్సు బ్రహ్మలో లీనమై ఒక్కక్షణముండెనా అదియే శ్రేష్ఠము.

౩౪. ఇతరుల వస్తువులను తాకరాదు, అడిగినైనను తీసికోరాదు. అపరిగ్రహము చాలా గొప్పది.

౩౫. భగవంతుడంతట నున్నాడని తెలిసికొని, చాటుననైనను పాపకార్యములు చేయకుము.

౩౬. ఎపుడే సంశయము కలిగినను వెంటనే తీర్చుకొనుము. దురాశ, దురలవాట్లను ఈ క్షణమందే విడువుము.

## ౪౪౭ శ్రీ కరపాత్రస్వామి

౧. ఎవని మనస్సు ఏలాంటి కోరికలు లేక శూన్యమగునో, వాడు పక్షివలె, ఇల్లు, అన్నము, వస్త్రము, లేకున్నను సంతోషముగా నుండును. ఇట్టి వానికి భగవంతుడు అతనికవసరమగు వాటిని స్వయముగా సమకూర్చును. చింతించనవసరము లేదు. ఇటులాచరించు వానికి జన్మరాహిత్యమగును.

౨. ఈ ప్రపంచము ఎందుకు సృష్టింపబడినది? ఇది ముందేమగునోనని ఆలోచించుట వ్యర్థము. కాని దీనినెవరు సృష్టించినారో వారిని వెతికి, తెలిసికొని వారి దర్శనము చేయుచో సృష్టి సంగతి తెలియును.

౩. సమస్తమును త్యజించి భగవంతుని ధ్యానించుము. ఆలసించకుము. ఎన్నియో జన్మలు గడిచెను. లెక్కలేనన్ని శరీరములను ఇంతవరకు త్యజించి యుందువు. ఇంకా ఈ శరీరముపై మమత ఏలా దేహభ్రాంతిని వీడుము. భగవద్దర్శనము కానిదే ఎవడు మరణించునో వాడు మహా పాపి.

## ౪౪౮ శ్రీ నారాయణ స్వామి

౧. ఒకరోజు దుండగులు వీరిపై చెప్పులను విసరివేసి, వెళ్ళి పోయిరి. వీరు ఆ చెప్పులను జాగ్రత పరచి, ఉదయమున, వారి వారి ఇండ్లకు పోయి, వారివారి చెప్పులను వారికిచ్చి, నాయనా, నావలన మీకు ఏమయిన హాని కలుగుచో క్షమించుడని వారిని వేడుకొనిరి.

౨. సమస్త ప్రాణులలో ఈశ్వరుడు గలడని భావించి ప్రేమించి వారికి సేవచేయుచుండుడు. ఇదే నిజమగు పూజ.

## ౪౪౯ స్వామి శ్రీ భజనానంద్‌జీ (సిమ్లా)

౧. నిన్ను నీవు నశింపచేసికొని ఇతరులకు సుఖమునిమ్ము. నీవు మృతినొందినాసరే. కాని, ఇతర జీవులకు మేలుచేయుము.

౨. నీ సంపత్తి పుత్రమిత్రాదులు నీవు కండ్లు మూయగనే మాయమగును. కాన, ప్రాణముండగానే మంచి పనులు చేసికొనుము. ఆలసించకుము.

౩. నీ పిల్లవానిని కష్టములనుండి తప్పించిన వానిపై నీకు ప్రేమ ఎటులకలుగునో అటులనే జీవులకు తండ్రియైన ఈశ్వరుడు దుఃఖితులను సుఖపెట్టిన వానిని ప్రేమించును. ఇది సత్యము.

౪. నీవారు, నీ సంసారమును చక్కబెట్టు కొనెదరు. కాని నీకు ముక్తి నివ్వజాలరు. నీ ప్రాణముండగనే, నీముక్తిని నీవు సంపాదించుకొనుము. జీవముండగనే మంచి కర్మలు చేయుము. నీవారు నీ శరీరమునుకూడా నిర్దయతో దహించుదురు. ఇక నిన్నుద్ధరించు వారెవరు ? దీనిని మరవకుము. అశ్రద్ధ చేయకుము.

౫. ఇతరుల గుణములను చూచి నీలోనున్న అవగుణములను త్యజించుము. నీలో దోషములు కల్మషము లుండెనేని ఇతరులు నిన్న టులే చూతురు.

౬. పుట్టునపుడు ఏడ్చుచు పుట్టితివి. చచ్చునపుడు నవ్వుచు చావుము. ఇందుకై ఏ జీవికిని కష్టము లేకుండా వర్తించుము. అందరు నీకై విలపించునటుల నీ జీవితమును గడుపుము.

## ౪౫౦ స్వామి శ్రీ నాథ్‌జీ మహరాజ్

౧. దేహము రుచిని కోరదు. పంచభూతముల ద్వారా శరీరయాత్ర జరుగును. ప్రాణమునకు ఏలాటి రుచులవసరములేదు. అది కోరదు. కేవలము దేహమను యంత్రము నడుచుటకు తిండికి, ఏదైనను సరే, ఆకో, అలమొ, పండో, కాయొ, మొదలగునవి అవసర ముండును. ఆత్మకు ఇవి ఏమియు అవసరముండవు. అది దేనిని కోరదు. ఇక, రుచిని కోరునదేది, భోగించునదేదని విచారించినచో ఇంద్రియములే భోగములను కోరుచుండును. ప్రతి ఇంద్రియము వాటి వాటి కోరికలను కోరుచు, శరీరమును కృశింపచేయును. మరియు జీవుని సంసార సుఖభోగముల పాలుచేసి, శరీరబద్ధునిచేసి భగవంతునకు దూరముచేయును. కేవలము రుచికై తినుటకు ఇంత ఆవేదపడుచుందురు, దీనివలన వచ్చు లాభమేమి, శరీరమునకు లాభములేదు. జీవునకు అంతకన్న లాభములేదు. కావున సమస్త సుఖ భోగములను త్యజించి, శరీరారోగ్యమును కాపాడుడు. ఆత్మను పరమాత్మతో ఏకీభవింపజేయుడు.

## ౪౫౧ స్వామి శ్రీ ఆత్మానంద్‌జీ మహరాజ్

౧. ఓ మానవుడా! నీ పుట్టుకనుండే ప్రతిక్షణము నీ ఆయువు క్షీణించుచున్నది, జాగ్రత, సంసారమమతలో బడి మరువకుము.

౨. నీ దుఃఖములకు ఇతరులు కారకులని వారిని దూషించ కుము. నీ దుఃఖములకు నీ కర్మలే కారణము.

౩. నీలోనుండి ఎపుడు దోషములు తొలుగునో, అపుడు కేవలము నీకై నీవే మిగులుదువు. పరిశుద్ధుడవగుదువు. దోషములు

బాహ్యమునలేవు. నీలోనే నున్నవి. నిన్ను నీవు మొదలు బాగుపరచు కొనుచో సమస్తము బాగుపడును. నీ ముఖమెటులుండునో అటులే అద్దములో కనిపించును.

౪. కపటము, మోహము, అసత్యము, ఆశ, మొదలగు దోషము లన్నిటిని వెంటనే త్యజించుము.

౫. ఏది నీ ధర్మమునకు అడ్డుపడునో దానిని వెంటనే త్యజించుము. సమస్త విషయ భోగములను విడువుము.

## ౪౫౨ స్వామి శ్రీ శియారాంజీ మహరాజ్

౧. ఒకరి సొత్తు తినుచు, ఇతర పనులు చేయుట న్యాయము కాదు, ద్రోహమే. అటులే భగవంతుడిచ్చిన, శరీరముచే పరిస్థితుల ననుభవించుచు భగవంతుని మరచి సంసార మమతలోబడుట పాపము. ద్రోహము.

౨. కీర్తి ప్రతిష్ఠల కాశించి పాపకార్యములు చేయకుము.

౩. నిరభిమానుడవుకమ్ము నేనే గొప్పవాడనను కొనుము. అందరకు దాసుడవై అందరను సేవించుము.

౪. అందరిని సంతోషపెట్టలేవు, కావున, భగవంతుని యెదుట స్వచ్ఛ హృదయుడవు కమ్ము. ఈర్ష్య ద్వేషములు లేక, ఈశ్వరాజ్ఞను పాలించుము. దీనికై భయపడవలసిన అవసరము లేదు.

౫. ఇతరులతో అధికముగా మాట్లాడకుము. సంసార వ్యవహారములు ఎక్కువ పెట్టుకొనకుము. ఏకాంతములో ఉండి నీ కర్తవ్యమేదో దానిని చేయుచు, జగత్తు యొక్క చిత్రమును చూడుము. దానిలో మగ్నము కాకుము.

౬. ఇతరుల బుద్ధులను మార్చుట నీ వలన కాదు. అది భగవదాధీనమే. నీవు కేవలము, నీ కర్తవ్యమేమో అదే ఆచరించుము. అన్నిటికిని అధికారి భగవంతుడే. చింతించకుము. సంతోషించుము.

౭. పరిశుద్ధమైన మనస్సుగల వానికి, బాహ్యాలక్షణములు స్వయముగా తెలియును. దివ్యదృష్టి లభించును.

౮. ఈ సంసార మొక ధర్మశాల. ఎందరో వచ్చి పోవు చుందురు. ఎవరిపై మమత ద్వేషముండరాదు. అందరిని ప్రేమించి సేవించుము. సంయోగ వియోగమే సృష్టికి కారణము. ఈ సృష్టి యొక్క నాటకమును చూచుచుపో. మళ్లీ రెండవసారి చూచుటకు ఇచ్ఛ ఉండరాదు. అనగా, మళ్లీ జన్మ రాకుండునటు లాచరించుము.

౯. ఏలాటి పరిస్థితి సంభవించినను సంతోషముగా ఉండుము. ఏది దొరకునో దానితోనే సంతోషించుము.

౧౦. అన్ని తపస్సుల కంటే వైరాగ్యమే గొప్పది. సత్యమును స్వీకరించినచో వైరాగ్యము లభించును.

౧౧. దేనిచే నీకు బాధాకర మనిపించునో, దేనిచే నీ ఆత్మకు హానికలదో వాటిని వెంటనే హఠముతో నైనను త్యజించుము. విష యములందలి దోషములను కనిపెట్టి, వాటియందు విరక్తుడవు కమ్ము.

౧౨. సాత్త్విక భోజనము మితముగా తినుము. రుచులకై ఆశపడి నీ పొట్టను పాడు చేయకుము. వుప్పు, పప్పు మిరపకాయలు, మసాలా ద్రవ్యములు, మిఠాయిలు తినరాదు. పాలలో, పంచదార, బెల్లము కలిపి త్రాగరాదు. కేవలము పాలనే త్రాగుము. ఏది తిని నను ఒకే పదార్థమును తినుము. కలిపి తినకుము. వుప్పు అవసర మనిపించుచో మొదలు వుప్పు తిని, తదుపరి, వుప్పులేని భోజనము తినుము. పాలలో చక్కెర అవసరమనిపించుచో మొదలు చక్కెరతిని తదుపరి, వట్టిపాలనే త్రాగుము.

౧౩. ఏది వినుదువో, ఏది చదువుదువో, దాని ప్రకారము నీ జీవయాత్ర నడుపుము. లేనిచో నీ కష్టము వ్యర్థమే.

౧౪. నిజమైన వైరాగ్యముగలవాడు, జిహ్వారుచులులేనివాడు నిజమైన సత్యవాక్కు గలవాడు, పాపభీతికలవాడు, శరీర స్వస్థత

గలవాడు, శరీర మనోధనముల మరియు సమయమును వ్యర్థము చేయనివాడు వ్రతదీక్షను ప్రాణము పోవువరకు పాలించువాడు, ఏ ఆడంబరములు లేనివాడు, తన భారమును ఇతరులపై వేయనివాడు, కీర్తి ప్రతిష్ఠలను కోరనివాడు, తన ప్రతిజ్ఞను వదలనివాడు, ఇన్ని గుణములు గలవాడే నిజమైన భక్తుడు.

౧౫. నీ వస్తువును ఎవరైనను తీసికొనినచో, చింతింపక సంతోషించుము. ఎందుకన, నీ పాపమును అతడు తక్కువ చేసినాడు. ఎంతవరకు ఇది నాది, అనునది నీవద్ద ఉండునో అంతవరకు ముక్తిలేదు. నాది ఉండువరకు అహంకారముండును. అహంకారము న్నంతవరకు పాపనాశనము కాదు. కావున, తీసికొని పోయినవాడు నీ బరువును తగ్గించినందుకు, వానిని స్తుతించి నిన్నుద్ధరించినవాడుగా తలంచుము.

## ౪౫౩ శ్రీ ఆనందస్వామి

౧. నాలుక అన్ని రుచులు చూచుచు సాఫీగా ఉండును. దేనిని అంటుకోదు. నెయ్యి, నూనె, మొదలగు జిగట పదార్థములను తినును కాని ఆ జిగటను అంటుకోదు. అటులే నీవు సంసారములో ఉండినను దానిలో లీనము కాకుము. మమతకు లోబడకుము.

౨. దేనిని విందువో, దేనిని చదివెదవో దానిని తప్పక ఆచరణలో పెట్టుము. లేనిచో చదువుట, వినుట వ్యర్థమే.

౩. భగవంతునికి నిన్ను నీవు అర్పించుకొనుము. అర్పించిన తదుపరి, నీ మనస్సు సంసార విషయచింతన చేయునేని, ద్రోహివగుదువు. ఎందుకన, అర్పించిన తరువాత, సంకల్పించుటకైనను నీకు హక్కులేదు. కాన, జాగ్రత్త. సమస్తమును వదలివేసి నిశ్చింతుడవుగమ్ము.

౪. ఎల్లపుడు శాంతమనస్కుడవై ఉండుము. ఎన్ని దుఃఖములు ప్రాప్తించినను సంతోషముగా అనుభవించుము. నష్టమునకై చింతించకుము.

౫. ఏ ఆసనమైనప్పటికిని మూడున్నర గంటల కాలము ఆయాసము లేకుండా కూర్చునుటకు అభ్యాసము చేయుము. రోజు ఉదయము సాయంత్రము గాయత్రి మంత్రమును జపించుము. సదా ఓం ను శ్వాసతో జపించుచుండుము. యమ నియమములను పాటించుచు ఓం ను భ్రూమధ్యమున చూస్తూ శ్వాసతో జపించుము.

## ౪౫౪ శ్రీ బద్రీనాథ్‌స్వామి

౧. ముందు తనదోషములను పోగొట్టుకొని తదుపరి ఇతరుల దోషములను పోగొట్టుటకై ప్రయత్నించవలెను.

౨. సమభావము కలిగివుండుము. నీకెవరు శత్రువులుండరాదు. నిన్నెవరు కొట్టినను అవమానపరచినను వారిని ద్వేషించక ప్రేమించుము.

౩. ఈశ్వరాజ్ఞను పాలించువానికి ఈశ్వరానుగ్రహము కలుగును.

౪. దోషములను త్యజించి ఆత్మ నుద్ధరించుము. దోషముల వలన ఆత్మకు క్షోభకలుగును.

౫. భగవంతుని కటాక్షము సర్వత్ర ఉండేవున్నది. అహంకారముచే ఆ కటాక్షమును మనమే అడ్డుపరుచుకొను చున్నాము. సంసారముయొక్క మమతను త్యజించినచో వెంటనే భగవద్దర్శనమగును.

## ౪౫౫ శ్రీ స్వామి సీతారాం

౧. అన్నము పరబ్రహ్మ స్వరూపము. భూతములకంటె ముందు అన్నమును ఉత్పత్తిచేసినాడు. అన్నము వలననే భూతములు పుట్టుచున్నవి. అన్నమును దూషించరాదు. ఆకలికొని అన్న మడుగు వారికి లేదనక అన్నము పెట్టవలెను. అన్నమునే ఎక్కువ పండించవలయును. వ్యసనములకు తోడుపడు పంటలను పండించరాదు.

౨. నాదనునదిఉండరాదు. అపుడే మనస్సు శాంతించును. సమస్తము త్యజించి ధ్యానించుము.

౩. అన్నిటిని విడచి తుదకు నీ తిండికి లేదన్నను చింతించకుము. దైవముపై భారమువైచి నిశ్చింతుడ వగుము.

౪. ప్రపంచములో అన్నిటియందు భగవంతుడు కలడని అన్నిటిని ప్రేమించి సేవించుము. సోహమునో, శివోహంనో, ఏదో నొకదానిని సదా జపించుము.

౫. రూపాయీలను వడ్డికివ్వరాదు. వీలున్నచో బదులుయియ్యుము. వడ్డీకిచ్చుటచే వాటితో వారుచేయు పాపమునకు నీవు బాధ్యుడవు కావలసి వచ్చును.

౬. నీయొక్క అధిక జిజ్ఞాస, ప్రేమ, సత్కర్మలవలన ఈశ్వరుడే నీకు గురువును సమకూర్చును. నీ వెతుక పనుండదు.

౭. నీవు అటునిటు తిరుగుట మంచిదికాదు. ఒకేస్థలములో నుండి సాధన చేయుము. దేనిని చూచుట కిచ్ఛ నుండరాదు.

౮. ఏదో నీచే అగునది దేహకష్టమో, లేక ఉపకారమో చేయనిదే తిండి తినకూడదు. సుఖభోగము పనికిరాదు. అది పాపము.

౯. వాద భేదములుడిగినపుడే, సాధుఫుండు సమరసముగ.

## ౪౫౬ స్వామి శ్రీ రామానంద సరస్వతి (బెల్లముకొండ)

౧. మానవుడే కార్యనిమిత్త మిక్కడికి వచ్చెనో దానినిమరచి భోగలాలసుడై పోయినాడు. వచ్చినదెందులకో, తిండికా! భోగమునకా! సంపాదనకా! తిండికే నగుచో, పశువులు తినుచున్నవి, భోగించుచున్నవి. చీమలు మొదలగునవి కూడబెట్టుకొను చున్నవి. సూకరముల వలె తినుటకు రాలేదుకదా. మనము ఇక వచ్చిన దెందులకు ? ఎందులకన, ఆత్మదర్శనమునకు. జీవన్ముక్తికి. దానిని మరచి కేవలము తినుటకే వచ్చితిమని భోగపరాయణులై చెడిపోకుడు. నిజముగ ఈ శరీ

రమునకు తిండిపెట్టి పెంచుట ఏ కార్యమును సాధించుట కొరకో మీరే ఆలోచించుడు.

౨. అధికము తినకుము. అధికము నిద్రించకుము. అధికము మాట్లాడకుము. అనవసరమైన మాట మాట్లాడకుము. ఒకే నాలుకలో రెండు శక్తులున్నవి. ఒకటి రుచి చూడబడు శక్తి, ఒకటి మాట్లాడు నట్టి శక్తి. ఈ నాలుకను నీ వశము చేసికొని మౌనము వహించితివా, ముక్తుడవే.

౩. ఈశ్వరుడు సర్వత్ర గలడు. ఇక పూజచేయుట యెవరికి ? పుష్పాలు వేసినను, నీరు పోసినను, అవి తిరిగి మనలనే చేరునుకదా! అందుకే, ఆలయములు, విగ్రహారాధన, అయిదు భూతములతో కూడుకొని యున్నవి. ఎటులన, విగ్రహము రాతిది. అది భూతత్వము. దానిని నీరుచే శుద్ధి చేయుదురు? అది జలతత్వము. దీపము. అగ్నితత్వము. ధూపము. వాయుతత్వము. గంట. ఆకాశ తత్వము. ముఖ్యముగా పంచభూతములకే పూజ అన్నమాట. వీటి నాధారము చేసికొని, మహాతత్వములో ప్రవేశించవలెనని పెద్దలు దేవాలయములు నిర్ణయించినారు. పంచభూతములకే పూజ చేయు చున్నాము. ఇదే సాకారపూజ. ఎటు చూచినను అయిదు భూతములే కనబడుచున్నవి. వాటినే పూజించుచున్నాము. పంచభూతాత్మక మైన శరీరముతో పంచభూతములను పూజించుచున్నాము.

౪. ప్రతివాడు ప్రాణము తీయుదును, తీసికొనెదనని అను చుండును. జీవిని తీయుదునని అనడు. జీవుడు నిరాకారుడు, వానికి చావులేదు. ప్రాణము పంచభూతములతో కూడుకొనునది. అందులకే నా ప్రాణమునైనను తీసికొనెదనని అనుచుండును.

౫. ఆహారముయొక్క బలముచే పనిచేయుచు, నేను ఇంతపని చేయుచున్నాను, మాట్లాడుచున్నానని అనుచుండును. పరుల ఆధా రముపైన మరి వస్తువాధారముపైననే జీవనము నడుచుచున్నది.

అందుచే పరాధీనుడవే కదా ! అయినచో, నేను చేయుచున్నానని నీకు గర్వమెందులకు ? అహంకారపడనేల ? అందరకు ఋణగ్రస్థుడవై కూడా నేను, నేను అని అహంకారపడుట తప్పు. రెండవ తప్పు అసత్యము పలుకుట.

## ౪౫౭. శ్రీ నారాయణస్వామి, పుర్యూరు

౧. శాశ్వతమగు ఈశ్వర సంబంధమును విడచి మధ్య వచ్చిన శరీర సంబంధము పెట్టుకొనుట ఎంత వెఱ్ఱితనము, అపకారము, విశ్వాసఘాతుకము.

౨. ఎంతజ్ఞానమున్నను చిత్తశుద్ధి, వైరాగ్యము లేనిచో వ్యర్థమే. నిజమునకు ఇవి లేనివి విజ్ఞాన మెటులుండును.

౩. ఇతరులు వారి కర్తవ్యమును వారుచేయకున్నచో వారిపై ఫిర్యాదుచేయక స్వయముగా ఆ పనులను నీవు చేయుచో వారు లజ్జింతురు. ఏ పనినైనను ఇతరులకు పోటిపెట్టక నీవు చేయుచుంటివేని ఇతరులు స్వయముగా చేయుదురు. ఇతరులకు ఉపన్యాసములు చెప్పుటకంటె, స్వయముగా నీవే చేయుచో అందరు దానినే అనుసరింతురు. చెప్పుటకంటే చేయుట శ్రేష్ఠము.

౪. అన్యాయార్జితమగు వారి సొత్తు తినరాదు. ఎవరి యొద్దనైనను ఆహారమును తీసికొనుచో వారికి ఋణగ్రస్థుడవగుదువు. మరియు వారిమాట ననుకూలించవలసి వచ్చును. లేనిచో విశ్వాసఘాతకుడవగుదువు.

౫. పాపకర్మచేయుచు, పుణ్యమును కోరుట ఎంత అన్యాయము. అందులకే మనము కోరుచున్నదంతయు సుఖము. దొరుకుచున్నదంతయు దుఃఖమే. చేయనిదే కోరినచో ఎటుల దొరుకును. దీనికి బదులు వడ్డీతోసహా దుఃఖమే ప్రాప్తించును. చేయుచున్నది పాపమే కాన, పాపమే దొరుకును. చేయక కోరిన అసత్యమునకు, ఆశకు, శిక్ష, అధిక పాపము సంభవించును.

౬. నీవు ప్రయత్నము చేయుము. దానికి ఫలము ఈశ్వరు డిచ్చును. ఫలము నీ స్వాధీనములో లేదు.

౭. మూలమును గ్రహించక, చెట్లకు నీరుపోయక, పండ్లు ఇచ్చునవి కొమ్మలని భావించి కొమ్మలకు, కాయలకు నీళ్లు పోయుచో ఏమి లాభము? చెట్లు ఎండిపోవును. అపుడు కొమ్మలు, కాయలు అన్నియు నాశనమగును. చెట్టుమొదలునకు నీళ్లు పోయుచో అన్నియు సురక్షితముగా ఫలించును. కావున, ఒకే మూలపురుషుడైన ఈశ్వరుని భజించినచో చాలు. కోతి తిరిగినటుల దానిపై దీనిపై ఆశ పడి చెడిపోకుము. నేను కర్మలనుచేయుచు ముక్తిని పొందుదునని అహంకార పడకుము. ఈశ్వరునిపై భారమువైచి, నిన్ను నీవు సమర్పించుకొంటివా ముక్తుడవే, సందేహములేదు. కావున, సంసార మను కొమ్మలను, కాయలను విడచి, మూలవస్తువగు ఈశ్వరుని సేవించుము.

౮. దేనికొరకు నీవు, నాది, నాదనుచు సంగ్రహము చేయు చున్నావో, ఆ శరీరమునే ఒకరోజు జీవుడు ఈ సంసారముననే వదలి పోవును. కాన, ఇక నీవు సంగ్రహముచేయుట లాభమేమి? పాపము తప్ప మరేమియులేదు.

౯. నీవేపని చేయనున్నను ఈశ్వరుని ఆజ్ఞ తీసికొనియే చేయుము.

౧౦. తండ్రి కొడుకును నమ్మడు. ఎందుకన, వానికి యోగ్యత ఉన్నది లేనిది, బాగుగా చూచి ఆ తదుపరి యోగ్యత నుండుచో, నమ్మి ఇంటి పెత్తనము యిచ్చును. అటులే భగవంతుడు భక్తిగల యోగ్యునికే దర్శనభాగ్యమిచ్చును.

౧౧. ప్రపంచముయొక్క పనులలో పడినచో ధ్యానము నిలువదు. జాగ్రత్త.

౧౨. ఇంటికి తండ్రి యజమానుడుండగా, కొడుకులు తండ్రికి ఎదురు తిరిగి ప్రతివారు, నేనుకూడా యజమానుడనే, నేనే, కర్తనను చో, ఎంత వెఱ్ఱితనము. అటులే, సృష్టికర్తయుండగా, ఈ సంసారము నాది, వీరు, నావారు, నా, ఇల్లు, వీటికి నేనే కర్త నని, వేరుచేసి కొనుట, విరుద్ధమే. విభాగించుకొనునటులే, కదా! కావున, సృష్టికి ప్రతి సృష్టి చేయకుడు. నాదని అనుకొనుటయే పాపము.

౧౩. శరీరమును, నేను, కాను. నేను, వేరు. శరీరము, వేరు. నానిజ స్వరూపమెట్టిదని, నీలోనీవు వెతుకుము. బాహ్యా వస్తువులను నీ దృశ్యములోనికి రానీయకుము. నీ శరీరమునుకూడా నీ దృష్టికి రాకుండా అభ్యాసము చేసినచో, కొన్ని నాళ్లకు నీనిజ స్వరూపము నీకు గోచరించును. అపుడు నీకే అంతా తెలియును. కాని, పట్టువీడక అన్నము, నీళ్లు మరచియైనను నీ నిజస్వరూపము గోచరించుదనుక శాంతించకుము. కండ్లుమూసి బాహ్యా వస్తువులను మరచి, నే, నెవడ నని, నీలో నీవు విచారించుచుండుము.

౧౪. నీకున్నదంతయు ఈశ్వరునిదే అని భావించి, రేపటికై ఉంచుకొనక లేనివారికిమ్ము. నీకొరకై చింతించకుము. జరగనున్న దేదో అది తప్పక జరుగును. దానికై విచారపడినచో లాభములేదు. మమత ను వీడుము. అహంకారపడకుము.

౧౫. ఇది నాకు, కావలెను, ఇది వద్దు అని అనకుము. ఉన్న దానితోనే సంతోషించుము. నిశ్చలుడవై ఈశ్వరునిపై విశ్వాసము గలవాడవై శాంతముగా నుండుము. పిలచినచో పలుకుము. అడగినచో చెప్పుము. నీయొద్ద ఉన్నదానిని అడిగిన వారికిమ్ము. నేను, ఇచ్చు చున్నానని భావించకుము. అహంకారముండరాదు. సేవకుడవై సేవ చేయు చుండుము.

౧౬. ఇతరులు నిన్నవమానించినను వారిని ద్వేషించకుము. నీలోగల ఆత్మయే వారిలో గలదు. అందరిలో ఒకడే. వారిలోనున్న

ఆత్మయే తనకు ఇష్టమున్నటు లనుచుండును. ఇక నీవు కోపపడున దెవరిమీద. మత్తెక్కిన వానికి ఎటుల మతిచెడునో, అహంకారమను మత్తుగలవాని కటులే మతి చెడును. కావున, అహంకారమను మత్తుచే, అవమానించిరని, తలంచి సంతోషించుము.

౧౭. తేనె, టీగలను, అజగరమును, నీ గురువులుగా భావించుము.

(1) తేనెటీగలు, ఎచటెచటనో తిరిగి పుష్పములనుండి మకరందమును తెచ్చి, తేనెను కూర్చుకొనును. ఇతరులు వాటిని, వెళ్లగొట్టి ఆ తేనెను. అపహరించుదురు. కాన, నీవు ఇతరులనుండి అపహరించి తెచ్చి కూర్చినచో, ఇతరులు అపహరింతురు. దానిచే నీకు దుఃఖము కలుగును. కావున, ఎవరిని యాచించకుము. సంగ్రహము చేయకుము. సంగ్రహముచే దుఃఖము, పాపము సంభవించును.

(2) అజగరము. ఉన్నచోటునుండి కదలదు. తన ముందర కొచ్చిన దానిని, శ్వాసతోపీల్చి అనుభవించును. దొరికిన దానితోనే తృప్తి పడును. జీవనముకొరకై వెతకుచు ఎచటికి పోదు. అటులే నీవు ఒకే చోట నిశ్చలముగా నుండి దేనిని కోరక ఏది దొరికిన దానితోనే తృప్తిపడి సంతోషించుచుండుము.

౧౮. నీవు కీర్తి, ప్రతిష్ఠలకు ఆశపడకుము. నీకీర్తి పోవునని భయపడకుము. కీర్తి అనునదేది? పేరు నకా? నీవు వేరు, నీ శరీరము వేరు. దేహాభిమానము వీడుము. సమస్త దుఃఖములు సమసిపోవును.

౧౯. ముందు జరుగనున్నదానికై, గడచినదానికై ఆలోచించక, వర్తమానకాలముయొక్క నీ కర్తవ్యమును వెంటనే నెరవేర్చు చుండుము. ఏలాంటి సంకల్పములను చేయకుము.

౨౦. ప్రపంచములో మానవులు, నేను గొప్పపని చేసితిని, చేయుచున్నానని అహంభావపడుచుందురు. కాని, ఎవడును, తన ముసలితనమును, చావును, త్రిప్పుకొనలేడు. నే నను శక్తి అపుడు.

ఎక్కడ పోవునో. కావున నేను, చేయునదేదిలేదు. తోలుబొమ్మలవలె ఆడించువాడు వేరు. చూచువారు వేరు. అటులే, మనను ఆడించు వాడు ఈశ్వరుడు. ఆయన శక్తిచేతనే మనము చేయుచుందుము. అహంకారమును వీడుడు.

౨౧. తెలివియే జ్ఞానము. అదే ఆత్మ, సాక్షిగా వచ్చుపోవు వాటిని జాగ్రతగా చూచుయుండును.

౨౨. పిచ్చుకల గూడును చూచుడు. అవి ఎంత చిత్రముగా అల్లును. వానకు లోన తడియదు. మహామృదువుగా నుండును. ఆ గూడును, అల్లువాడులేడు. అల్లకున్నను, ఆ గూడును చెడకుండా విప్పువాడుకూడ లేడు. అయినచో ఆ పిచ్చుక కంటె నీవు గొప్పవాడ నని అహంకారపడుటేల ? నేను చేసితిని, ఇది నాది, అని ఆ పిచ్చుక అనదు కదా! నీవేల,నేనుచేసితిని,ఇది నాది అనుచు, అహంకారపడుదువు.

౨౩. శాస్త్రములన్నియు రెండింటిలోనే నున్నవి. 1 స్వప్నము 2 సంసారము. ఈ రెండును మిథ్యయే. సుషుప్తిలో ఏదియులేదు. నేను అనునది కూడాఉండదు. అదియే పరబ్రహ్మము.

౨౪. తన్ను తా తెలిసికొనుటయే జన్మరాహిత్యము. ఒకటి విడచుట, రెండవదానిని పట్టుట. అనగా, సంసారమును విడచుట, ఈశ్వరుని పట్టుట. స్వప్నమెటుల మాయయో, సంసారమటులనే మాయ. కాన అంతర్ముఖుడవై విచారించుము.

౨౫. ఏకాంతములో నీవొకడవే ఉండుము. ఎవరి ఆధార ముండరాదు. నిరాశ్రయముగా జీవించుము. భగవంతుని నమ్ముము.

౨౬. నీ పేరెంత, నీవెంత, నీ పేరుతో ఒక చిల్లిగవ్వకూడ చెల్లదు. ఇక నా పేరు, నేను, అను అహంకార మెందులకు ?

## ౪౫౮ శ్రీ ప్రశాంతానంద స్వామి

౧. ఆదిలో తల్లిదండ్రులు చెప్పిన మాటలే వేదములు. ఎట్లన ఆదిలో పురాణపురుషుడైన సమస్త జీవులకు తండ్రియగు ఈశ్వరుని

యొక్క మాటలే పరంపరగా వారి వారి తల్లి దండ్రులద్వారా వచ్చిన మాటలనే ఋషులు మునులు క్రోడీకరించి వేదరూపమునిచ్చిరి.

౨. నీవు ముక్తిని కోరితివా, ఆత్మనియమమును, ఈశ్వర నియమము అవలంబించుము. ఇహము, పరము, రెండు ఒకసారి కుదురవు. ఎటులన, ఇంటిలో వెలుతురు కావలెననిన, ఇంటికప్పు తీసినచో, వెలుతురు ఇంటిలోనికివచ్చును. అటులే, సంసారముపై మమత వీడగానే, జ్ఞాన మను వెలుగు, నీలో కనిపించును. ఒకటి విడచినచో రెండవది దొరుకును. సంసారము విడిచినచో మోక్షము దొరుకును.

౩. సత్యమునే చెప్పుము. వచ్చెద,ఇచ్చెద, చేయుదును మొదలగు నట్టి మాటలు, మాట్లాడకుము. దీని వల్ల, కట్టు పడుదువు. ఒకా నొకసారి అసత్యమునకు పాలుకావలసివచ్చును. అహంకారము వృద్ధి యగును. వ్రతభంగమగును. కావున,ఆలోచించియే వర్తించుచుండుము.

## ౪౩౮ శ్రీ స్వామి కేశవతీర్థ

౧. భగవంతుడు మనము ప్రార్థించుచున్నపుడు మనకర్మలను చూచును. మనముకర్మలను, చేయుచున్నపుడు మనప్రార్థనలను వినును. అనగా, ఆ ప్రార్థన మన కర్మలలో కనపడునపుడే హృత్పూర్వకమైనదిగా దైవ భక్తి యుక్తమైనదిగా నిరూపణమగును. భగవంతుడు భావములను ఆలకించును. ప్రతికర్మ భక్తి, జ్ఞాన, యుక్తముగా నుండుటచే భగవత్పూజ యనబడును.

౨. ప్రాపంచిక వస్తుసంబంధము లన్నియు నిన్ను దుఃఖముల నరకముల పాలుచేయును.

౩. సజీవమైన విగ్రహములనే పూజింపుడు. సేవచేయుడు అదే నిజమగు పూజ. బాహ్యశరీర వ్యామోహములో పడకుడు.

౪. పాపములకు మూలమగు అహంకారమును విజ్ఞాన యోగముచే ఛేదించుము. మానసిక విషయాసక్తిని, వృత్తులను విడచుటచే సర్వసంగ పరిత్యాగము.

౫. తాను మోయగల బరువు, తాను మోయక ఇతర కూలీలతో మోయించుట సిగ్గుచేటు. ప్రతి పనిని, పాపమయము చేయకుడు. నీవు చేయుశక్తిగల పనిని ఇతరులతో చేయించుట పాపము.

౬. ఒకరి కొకరు బంధములకు కారణభూతులు కాకుడు. ఇతరుల స్వతంత్రములను కాపాడుడు. అపుడే మీరు స్వతంత్రులగుదురు. ఇదే దైవధర్మము.

౭. ముక్తిని, శాంతిని, సౌఖ్యమును, పొందదలంచినచో, భేదభావమును నిర్మూలించి సర్వత్ర బ్రహ్మభావము కలగవలెను.

౮. నీవు నీ ఆత్మకు ద్రోహము చేసినచో జగత్తు నీకు ద్రోహముచేయును.

౯. విషయాధీనుడవైనచో, పరాధీనుడవై మృతినొందగలవు. సర్వసంగపరిత్యాగివి కమ్ము.

౧౦. దిక్కులేని వానివిగా దుఃఖించకుము. ఈశ్వరుడు గలడు. అందరికి ఈశ్వరుడే దిక్కు. భయపడకుము.

౧౧. స్వార్థమును, ఈర్ష్యను. రాగ, ద్వేషములను దేహాభిమానమును వెంటనే విడచి, అంతర్ముఖుడవుగమ్ము.

౧౨. ఇతరులమంచి చెడ్డలను విచారించుటచే ఎన్నటికి శాంతి కలుగదు. నిన్నునీవు బాగుపరచుకొనుము. సర్వత్ర సమ దృష్టికలుగనంతవరకు సమాధి సిద్ధించదు. ద్వేషదృష్టిని ఇడువ నంతవరకు ధ్యానము కుదురదు.

౧౩. ప్రకృతి నియమములను, ఈశ్వరాజ్ఞను ఉల్లఘించకుడు. విషయభోగాపేక్ష, విషయలాలసమందు మగ్నత, ఈశ్వరాజ్ఞోల్లంఘనమే. దీనికి, రోగరూపకముగానో, మృత్యురూపకముగానో, దండన తప్పదు.

౧౪. ఏవస్తువునైనను, వాంచించుట భిక్షుకునిలాగ పరుని ప్రీతి కొరకు నోరుదెరచుకొని ఉండుట, ఇది పవిత్ర ప్రేమకాదు. ఇది అధమమైన, నీచమైన మోహము. నీకొరకు నీవు నిన్ను త్యజించు కొనుము. భేదభావముంచకుము.

౧౫. మనస్సు కామ, క్రోధములచే బాధపడు సమయములో, మౌనము వహించి, తక్షణమే చన్నీటితో ముఖము, చేతులు కడగ వలెను. లేదా, చన్నీటితో స్నానము చేయవలెను. తప్పక శాంతి కలుగును.

౧౬. తృణమునందు కూడా ఆపేక్షలేని అకించనుడే నిజమైన ప్రభుభక్తుడు. నాది, పోయినదందువు. నీదేది, పరులెవరు? సర్వము బ్రహ్మమేకదా! ఇక చింత ఎందులకు?

౧౭. కాముడుండుచోట రాముడుండడు సుమా! సర్వము బ్రహ్మార్పణ చేయుము. ముక్తి సిద్ధము.

౧౮. ఈ శరీరము ఎపుడో ఒక తూరి రాలిపోవునదే కదా! ఈ నాటి నుండి యే ఈ శరీరమును లేని దానిగా భావించి, జీవన్మృతుడవై నిస్సందేహముగ బ్రహ్మానంద సాగరములో దూకుము.

౧౯. అంతరంగములో. దేహాభిమానమును విడవక, బాహ్యా ములో "శివోహం" అనుటవ్యర్థమే సుమా. ముందు హృదయములో, శివోహంను స్థాపించుము. దీనికై దేహాలాలసత్వమును వదలుము. గ్రామ, జనసంగములను త్యజించుము.

౨౦. ఏ పని చేసినను, భగవంతుని ఇచ్ఛ నెరవేరుగాక అనుచు చేయుము. నీ ఆశలను వదలుము.

౨౧. నేను, నీ వాడ నను, మాటను మరువకుము. అనగా, భగవంతుని వాడను. దీనిని హృదయపూర్వకముగా ఆచరించితివా ఈశ్వరుని వాడవే అగుదువు.

౨౨. ఏదైనను విషయవ్యామోహము నీలో జనించినపుడు భగవంతుడు సాక్షిగా చూచుచున్నాడని తెలిసికొని ఆ వ్యామోహమును త్యజించుము. నీవు భగవంతుని దృష్టిలో ఉన్నటుల నీ జీవితమును గడుపుము. ప్రతి జీవి నేత్రములలోనుండి, ద్రష్ట చూచు చుండునను జ్ఞాపకమును మరువకుము.

౨౩. ఒకసారి సమర్పింపబడి, నీ వాడనని, తిరిగి నేను, నాది, అనుట మహాపాపము. నరకము తప్పదు.

౨౪. శీలనిర్మాణము, హృదయశుద్ధి ఇవి ముఖ్యముగా అత్యవసరములు.

౨౫. ఎవడు చచ్చినపుడు తాము చచ్చినామని ప్రజలు దుఃఖ పడుదురో అతడే చావనివాడు. అమరమూర్తియే. ఎవడు చచ్చినపుడు తామిక బ్రతికినామని ప్రజలు సంతోషింతురో అతడే నిజముగా చచ్చినవాడు. పాపాత్ముడే.

౨౬. అంతరాత్మ బోధనలే దైవప్రబోధనములు, అంతరాత్మకు విరుద్ధముగా ఏ పనిని చేయకుము.

## ౪౬౦ శ్రీ నరనారాయణ స్వాములు

౧. ఎటుల పవర్ హౌస్ శక్తిచే, ఎన్నియో లైట్లు ప్రకాశించునో, అటులే ప్రతి జీవి భగవంతుని శక్తిచే అన్ని పనులు చేయు చుండును. అజ్ఞానము వలన, సమస్త కర్మలకు నేనే కర్తనని, భావించి అహంకారముచే నాది, నేను, అనుచు నశించుచుండును. కాన, విచారించుకొనుడు.

౨. సమస్త సంపదల యందలి మమతను త్యజించి భగవంతుని శరణు బొందుడు,

## ౪౭౧ స్వామి శ్రీ చిదానంద సరస్వతి

౧. ఇతరులకు సంతాపమును, క్లేశమును కలిగించకుము. నిన్ను నీవు హింసించు కొనకుము.

౨. ఎవరిని, దేనిని యాచించకుము. ఏది దొరికిన దానితోనే సంతసించుము. భోగములను కోరకుము. భోగములే రోగములకు కారణము. భోగములచే సుఖమునకు బదులు దుఃఖమే ప్రాప్తించును.

౩. నీవు మానవుడవు కాన, మానవత్వముతో జీవించుము. దీనికై (1) అహింస (2) సత్యము (3) అస్తేయము (4) శరీర మనస్సులను పవిత్రముగా నుంచుట (5) అపరిగ్రహము మొదలగు పవిత్రగుణములను నీజీవితములో ఆచరించుము.

౪. ప్రకృతిస్వభావము అధోగామి, కావున జాగ్రత. నీ నియమములను తప్పితివా అధోగతి పాలగుదువు.

౫. సరళహృదయుడవుకమ్ము. త్యాగివికమ్ము.విలాసజీవనముచే శరీరము, మనస్సు నాశనమగును.

౬. దానమిచ్చుచుండుము. లోభివి కాకుము.

౭. ఈశ్వరుడు మనల సృష్టించి మన జీవయాత్ర కొరకై మనోహరమైన సృష్టిని రచించినాడు. మనము ఆయనను స్మరించక మరుచుట గొప్పపాపము.

౮. కుక్కలు, పందులు, మొదలగునవి భోగించును. సుఖపడును. అటులే మనుష్యులుకూడ భోగాసక్తులగుచో మానవజన్మ లభించి లాభమేమి?

౯. ప్రతిక్షణము, నిన్ను నీవు పరిశీలించుకొను చుండుము. నీజీవయాత్ర సత్పురుషుల నడవడికి సమానముగా నడుచుచున్నదా లేక పశుతుల్యముగా నడుచుచున్నదా? పరీక్షించుకొను చుండుము,

౧౦. ఎవని చిత్తములో వివేక ముదయించదో వాడు అనేక నరకములలో పడి పశ్చాత్తాప పడవలసి వచ్చును.

౧౧. ప్రారబ్ధములో ఏది ఉండునో అది అనుభవించక తప్పదు. కావున దేనిని కోరక నిశ్చింతగా నుండుము.

## ౪౬౨ శ్రీ సాధు ప్రజ్ఞానాథ్ జీ

౧. మానవుడు ఎన్నియో కోరికలను కోరుచు పరాధీనుడై నశించుచుండును. కోరినవి దొరకవు. కోరనివి దొరకును. కోరినవి దొరకకున్ననూ దుఃఖమే. కోరనివి దొరికిననూ దుఃఖమే కావున దేనిని కోరకుండుటయే సుఖము.

౨. మానవజన్మ చాలా విలక్షణమైనది. మానవుడు దేవతల కంటే గొప్పవాడు. దేవతలు కేవలము వారి గొప్ప పుణ్యమువలన స్వర్గ భోగములనే అనుభవించును. తతిమ్మ జీవులు వాటివాటి ప్రారబ్ధాను సారము ప్రకృతికి బద్ధులై భోగము లనుభవించును. మానవుడు వివేక శక్తిచే పుణ్యపాపముల రెండింటిని త్యజించి ముక్తినొందును. మానవ జన్మ స్వర్గనరకములకు ద్వారము. దీనికి వివేకము, అవివేకము రెండు కారణములు.

౩. మానవజన్మరాగానే జీవుడు ప్రకృతియొక్క దాస్యము నుండి విడుదలగును. కావున, నీ కుండబడు వివేకశక్తిని దురప యోగము చేయకుము. లేనిచో నరకము ప్రాప్తించును.

౪. ఇంద్రియములకు దాసుడవుకాకుము. శ్రద్ధ, వైరాగ్యములు గలిగియుండుము. అహంకార పడకుము.

౫. సజ్జనుల సాంగత్యము, సత్సంగము చేయుచుండుము.

౬. ప్రపంచ వాసనలను పూర్తిగా త్యజించి, శరీర పోషణ యొక్క చింతను విడచి, ధ్యానమగ్నుడవుకమ్ము.

౭. ఎపుడేది దొరికినను ఇతరులకుపెట్టి తరువాత నీవు తినుము. లేనిచో ఎవరిని ఏదియు అడుగకుము,

౮. సుషుప్తిలో అకర్తగా నుండునటుల జాగ్రత్తలో అకర్తగా నుండువాడు జీవన్ముక్తుడనబడును. ఇటువంటివాడే ధన్యుడు. ముక్తపురుషుడు.

## ౪౬౩ శ్రీ తిలకుమహాశయుడు

౧. స్వధర్మమును పరిత్యజించుట కష్టము. అయినను అట్లు చేయగలవారున్నచో, భగవానుని నామస్మరణచేత దేహమును మరచు స్థితి వచ్చునపుడు స్వధర్మములు తమంతట తామే జారును.

౨. భగవంతునిఎడ నెరవేర్చవలసిన ధర్మముల నెరవేర్చుటే సౌశీల్యమనబడును. మనము భగవంతునిఎడల మనఎడల ఎట్లు వర్తింపవలెనో, ఏదేది నెరవేర్చవలెనో తెలుపునదే ధర్మము. ఈ రెండు కలసియే మతమగుచున్నది. ధర్మముకొరకే నీ స్వధర్మము నాచరింపుము. జీవన్ముక్తుడవుకమ్ము.

౩. సదా బీదలకు ఎటుల సాహాయ్యము చేయుదునా అని ఆలోచించుము. నీవుకూడ వారితోపాటు బీదవై వారికి బోధించుము ఎవరికిలేని సౌఖ్యము నీకేలా! సోమరివికాక స్వార్థమును వీడి ఇతరులకై సేవచేసిననాడే భగవంతుడు నిన్ను కనికరించును. మనస్ఫూర్తిగా పాటుబడువారికే భగవత్సాయము లభించును.

౪. పుట్టించినవాడు గిట్టించును. ముందుగానే తల్లిస్థనములలో పాలునింపి పిమ్మట మనలను పుట్టించినాడు మనకు కావలసిన ఏర్పాట్లన్నియు ముందుగానే చేసినాడు. అట్టివాడు నీ జన్మాంతమువరకు కాపాడడా! కాబట్టి ఉదరపోషణార్థమై మనమేల ఇంత తాపత్రయ పడవలెను.

౫. ఇహ సంబంధమైన వాంఛలను విడచి సర్వసంగపరిత్యాగివై ఈ ప్రపంచముతో సంబంధము తొందరగా విసర్జింపుము.

౬. ఇతరులు నిన్ను తిట్టినను, క్రోధపడినను వారిని క్షమించి ప్రేమించుము. దోషరహితుడవుకమ్ము. ఈర్ష్యాద్వేషములను వీడుము.

## ౪౬౪ శ్రీ పండిత్ మదనమోహనమాలవ్య

౧. ధర్మోపదేశమునకై గ్రామ గ్రామములో సంఘములను పాఠశాలలను ఏర్పాటుచేయుము. దానికై నీ ద్రవ్యమును వినియోగించుము.

౨. ఇతరులు ఏదిచేయుచో నీకు అయిష్టమో, దానిని నీవు ఇతరులకుచేయకుము. ఏది నీవుకోరుదువో, దానిని ఇతరులకుకోరుము.

౩. ప్రతిజీవిలో ఈశ్వరుడు కలడు. కాన, ఏ జీవిని ద్వేషించకుము. ప్రతి జీవిని ప్రేమించి సేవించుము.

౪. ఎవడు గీతను పరిశుద్ధ భావముతో చదివి దాని ప్రకారమాచరించునో వాడు ముక్తినొందును.

౫. ఎవరును లజ్జాకరమైన పనిని, అసహ్యాకరమైన పనిని చేయరాదు. ఇతరులకు హానికరమగు పనిని చేయరాదు.

౬. నీ శరీరము ఈశ్వర మందిరము. అందులో ఈశ్వరుడు గలడు. కాన నీ మనస్సును అపవిత్రము చేయకుము.

౭. నియమబద్ధముగా నీ జీవితమును నడుపుము. వాణిని, జిహ్వాను, భోజన నియమమును, నిద్ర మొదలగునవి అన్ని నియమములను పాలించుము.

౮. సంకటములోనున్న వారిని రక్షించుము. నీ కెవరు శత్రువులు లేకుండా చూడుము. ఏ పనిని చేసినను భగవదర్పితము చేయుము. నా దను భావముండరాదు. అహంకారమును వీడుము.

౯. సమస్తమును త్యజించి భగవత్కింకరుడవై సదా భగవద్ధ్యానము చేయుచుండుము.

## ౪౬౫ శ్రీ గోపాలకృష్ణ గోఖలే

౧. ప్రాపంచిక సుఖభోగములను కోరకుము. నివృత్తి మార్గమే ఉత్కృష్టము.

౨. దుష్టభావములను త్యజించుము. బీదలకు సేవచేయుము. దుఃఖములను సహించుము. దీనికై సర్వసంగ పరిత్యాగివి కమ్ము. నిద్రాహారముల సహితము వీడుము.

౩. జగత్తును స్వప్నతుల్యముగా భావించి, నీ విధ్యుక్త ధర్మమును నెరవేర్చుము. దేనికి ఆశపడకుము. నిరంతర పరిశ్రమచే, సేవ చేయుచుండుము.

౪. ఈరోజుండునది రేపుండదు. కాన, ఇపుడే మేలుకొనుము. స్వార్థమును వదలి సర్వమును సమర్పించుకొనుము.

౫. మహారాజ్యములు బుద్బుధ సన్నిభములు. మహా దైశ్వర్యములు తటిచ్ఛల సంకాశములు. స్వార్థజీవులు. క్షణజీవులు. పరార్థ జీవులగు మహా పురుషులు కాల దిగ్వలయమున. నక్షత్రాంతము ప్రకాశించు మార్తాండులు.

## ౪౬౬ శ్రీ చిత్తరంజన్‌దాస్

౧. ధనసంపత్తులను బీదలకు సద్వినియోగము చేయుము. తన కుండు సర్వస్వమును త్యాగము చేసిన నాడే భగవంతుని కృప కలుగును. త్యాగికానిదే మోక్షము దొరకదు.

౨. బీదనైతినని భయపడకుము. శరీరమునైనను ఇచ్చి సేవ చేయుము. చచ్చుటకు జంకకుము.

౩. బాహ్య ప్రతిష్ఠ వట్టిపనికి మాలినది. దీనుల ఆదరించినచో పరమేశ్వరుని ఆదరించినటులే.

౪. ఎన్ని ఆపదలొచ్చినను చలించకుము. దైవమును మరువకుము. నీ కర్తవ్యమును వీడకుము.

౫. ఎవరికేది లోటో దానిని, విచారించి వారికది అందించుము నిష్కామ సేవచేయుము,

౬. ఎవరికి వారు స్వయముగా కష్టించి సంపాదించియే తిన వలెను. ఒకరి సొత్తునకు ఆశపడి పరాధీనులు కారాదు.

౭. సర్వస్వమును త్యజించి పరోపకారివికమ్ము. దేనికిని, జంకకుము.

౮. మానవుని జీవితోద్దేశ్యము ఏమిటి? ఋణమును తీర్చు కొనుటే. దేహము నర్పించియైనను ఋణ విముక్తుడవు కమ్ము.

౯. నీ సంపత్తిని దానము చేయునపుడు, పాత్రాపాత్ర విచ క్షణలో పడితివా, వారి గుణదోషములతో నీమనస్సు లగ్నము కాగలదు. దానివల్ల దానముచేయు అవకాశమే లభించదు. కావున, భగవంతునిపై భారము వైచి, హృదయమును పరిశుద్ధము చేసి. గుప్తముగా దానము చేయుచుండుము. కాని, దాని ఫలమును ఆశించకుము. నాది, అను భావముండరాదు.

౧౦. వీరు తనతోసహా సమస్త సంపదలను భగవంతున కర్పించి తనకొరకు తన పరివారముకొరకు ఏదియు నుంచుకొనక, అంతయు దానము చేసినారు. ఇల్లునుకూడా లేనివారికిచ్చిరి. వీరు మరణించు నపుడొక, వీలునామ నాతదనంతరము నాకుండబడు నాస్తినంతయు బీదలకు దానము చేయవలెను అని వ్రాసిపెట్టిరి.

## ౪౬౭ శ్రీ లాలా లజపత్ రాయ్

౧. లోకుల మెప్పులను బడయగోరువాడు, వారభిప్రాయము ననుసరించి తన నిజచరిత్రను మార్చుకొనవలసి వచ్చును.

౨. కీర్తి ప్రతిష్ఠల, పదవులకోరువాడు, ఉత్తమపురుషుడు కాడు. కీర్తిగాంక్షింపని వారి కీర్తియే కీర్తి.

౩. లోకులొసగు గుణ పత్రములనుగాంచి భగవానుడెవరికిని స్వర్గద్వారమున నాహ్వాన మొసగడు.

౪. దేనిని కోరక తన కర్తవ్యమును ఆచరించువాడేఉత్తముడు. కర్తవ్యమే జీవాత్మ పరమాత్మలనుగలుపు నాధ్యాత్మిక సూత్రము.

౫. తన కీర్తి, ప్రతిష్ఠలకై ఎంతోడబ్బును కర్చుపెట్టును కాని, కూడుగుడ్డలేక దుఃఖించువారికి ఒక్క కాసునైనను ఇవ్వని, వాని జీవితమెందులకో?

౬. నేనుభక్తుడను, త్యాగినని అహంకారపడకుము. ఇదేగొప్ప ప్రమాదము. స్వార్థమును వీడుము.

౭. ఇతరుల అభిప్రాయముల గనుగొనుటకుమున్ను నీఅభిప్రాయ మేమో నీ అంతరంగము నడగి కనుగొనుము.

౮. అన్యుల దూషణ భూషణములకు, అపవాదములకు లొంగి కృంగి, నీకర్తవ్యమును మరవకుము. ఇతరుల అభిప్రాయములకై పెనుగులాడి నీవు చెడిపోకుము. నీవు ఉచ్ఛితమనితలంచిన దానిని, త్యజించకుము. ఎవరేమనినను నీసత్యదృష్టిని మరల్పకుము. ప్రజలజోలి నీకేలా! నిజాదర్శముపై పట్టువీడి యొరుల అభిప్రాయములకై పాటు బడి నీవు చెడిపోకుము.

౯. ధన సంపదలకు ఆశపడకుము. శీలమే అలంకారము. మానమే మాణిక్యమని యెంచుము.

౧౦. ప్రజాసేవచేయుచుండుము. బీదలను దుఃఖార్తులను జూచి జాలిపొంది, నీ యొద్దనున్న దానిని వారికిచ్చి సేవచేయుము.

౧౧. ఎన్నిదుఃఖము లొచ్చినను సహించుము. భగవంతుడేది చేసినను మనమంచికేచేయును. ఉత్సాహమును గోల్పోకుము. మన ప్రయత్నములన్నియు భగవానుడే నడుపుచుండుననియు, ఏమిసంభ వించినను మనశ్రేయస్సు కొరకేనని నూహించి సంతోషించుచుండుము.

౧౨. విశ్రాంతి, మరి సుఖభోగములకు తిలోదకములువదలుడు. వీనికై చింతించకుడు.

౧౩. ఎవరికేది లోటో వారికి నీశక్త్యానుసారము తీర్చుప్రయత్నము చేయుము. సంసార ఋణమును తీర్చుకొనుము. ఇదే నీకర్తవ్యము. దీనిని మరువకుము.

## ౪౬౮ శ్రీ దాదా ధర్మాధికారి

౧. సత్తా సంపత్తివల్లనే భయము కలుగుచుండును. లోభ భయమువల్లనే దుఃఖము కలుగును.

౨. ఒకరినుండి మరొకరికి భయముండరాదు.మరి భయముండె నేని, సంపత్తివల్లనే భయముకలుగును.

౩. జయమునకు పొంగిపోవుట ఎంతతప్పో, అపజయమునకు కృంగిపోవుట అంతేతప్పు.

## ౪౬౯ శ్రీ సతీశ్చంద్రదాస్ గుప్త

౧. భయమనున దొక పాపమే. మన హృదయములోనే ఇట్టి భయ ముత్పన్నమగును. అదియుపాపమే, పాపమువల్లనే భయము కలుగును. కావున, భయమెందులకు వచ్చినదో దానిని గుర్తించి ఆ పాపమును పోగొట్టుటకు ప్రయత్నించుట ముఖ్యము.

## ౪౭౦ శ్రీ రాందాస్ గాంధి

౧. త్రికరణ శుద్ధిగల ఆచరణ గొప్పమేలు చేయును.

౨. మంచినాలోచించి, ఆలోచించినటుల మాట, మాటనినటుల క్రియ ఉండితీరవలయును.

౩. భగవంతుడిచ్చిన బుద్ధిని, శక్తిని, సంపత్తిని, బీదలకు, లేని వారికి, వినియోగించువాడే నిజమైన పండితుడు, భక్తుడు, అతడేజ్ఞాని.

౪. భగవంతుడు, భక్తులకు, దీనులకు మాత్రమే అండగా నిలుచునని తెలిసికొని ప్రవర్తించువానినే, జగన్నాథుడు కరుణించును. కాపాడును.

౫. అద్వైత భావమునే బాగాఅలవరచు కొనుడు. ద్వైత భావము భేదముకలది. మంచిదికాదు.

౬. ఒక క్షణము కూడా వృథాపుచ్చకుడు. ఆచరణశుద్ధియు భక్తియు లేకున్న ఎంతటిపాండిత్యమున్నను వ్యర్థమే.

౭. స్వార్థ రహితముగా అందరికి సేవచేయవలయును.

## ౪౭౧ శ్రీ టాండన్ మహాశయుడు

౧. జిహ్వకు దాసులుకాకుడు. బాగా ఆకలికానిదే తినకుడు. తినినను మితముగా ఆకలి తీరువరకే తినవలెను.

౨. ఉప్పు, పులుసు, చక్కెర, పిండిపదార్థములు, కారము మొదలగువాటిని వర్జింపుడు.

౩. నియమముల పాటింపుడు. ఇంద్రియ నియమము ముఖ్యము. రుచుల కలవాటుపడినవాడు నియమములను పాటించడు. కావున, జాగ్రత్తగా వర్తించుడు.

౪. అన్నిటికంటె ఫలాహారమే చాలామంచిది. ఫలములనే తినుడు. ఫలభక్షణముతోపాటు, పవిత్రవర్తన ముండినచో, అతడు యోగిపుంగవుడే అగును. ఎండిన అంజీరపండ్లు, బాదాము, కొబ్బెర, వేరుశనుగ, ద్రాక్షపండ్లు మంచివే.

౫. ద్రవ్యార్జన కాంక్షను విడువుడు. సమస్త కోరికలను త్యజించుడు.

## ౪౭౨ శ్రీ సర్దార్ వల్లభాయిపటేల్

౧. మనస్సు స్వచ్ఛముగా నుంచుము. త్యాగివికమ్ము నాదను వస్తువు నీకుండరాదు. ప్రేమను సంపాదించుము.

౨. కీర్తి అపకీర్తులును, మానావమానములను లెక్కించకుము.

## ౪౨౩ శ్రీ రాజేంద్రప్రసాద్

౧. ఇతరుల నిమిత్తము తమ భోగములను, భాగ్యములను వదలవలెను.

౨. ఇతరుల దోషములను చూడకుము. పరాధీనుడవు కాకుము. ఇతరులవైపు చూడకుము. స్వార్థమును వీడుము. అధికార వాంఛను వీడుము. ఇతరుల ఆధారముపై సేవచేయు అభిప్రాయమును వీడి, స్వబలముతో నిష్కామ సేవచేయుము. ప్రభుత్వ సాహాయ్యముపై ఆధారపడకుము.

## ౪౨౪ శ్రీ పండిత్ జవాహర్‌లాల్ నెహ్రూ

౧. బీదలను తనకంటె ఎక్కువగా చూచువాడే నేడు, పూజ్యుడు. ఇందుకు భిన్నముగా నుండువాడు, ధనవంతుడైనను, విద్యావంతుడైనను, వట్టి పనికిమాలినవాడే సుమా

౨. స్త్రీలుగాని, పురుషులుగాని, పట్టు వస్త్రములను విలువగల వస్తువులను ధరించుట మంచిపనికాదు.

౩. మనమెప్పుడు మనకుకలిగిన విజయములకు సంతృప్తి జెందరాదు. మనమెపుడు మన బుర్రలను చెట్టుతొర్రలనుగా చేసికొని ఇతరులను అనుకరించరాదు. ఆలోచించియే మరి చేయవలెను.

౪. భగవంతుని ఆదేశానుసారమే నడుచుకొనుడు. మృత్యువునకు భయపడక, భగవంతునకే భయపడుడు.

౫. ధన గౌరవములకొరకు ప్రాకులాడకుడు. సత్య, వివేకములకొరకు ప్రాణములనైనను యివ్వుడు. సత్యమును ధర్మమును తప్పకుడు.

౬. చెడ్డదని తెలిసిన పనిని చేయకుడు. అదిపాపము. సదా ప్రజాసౌఖ్యముకొరకే పనిచేయుడు.

౭. ఈదినముండి రేపు మాయమగు చిల్లర ఇబ్బందులకై కష్టములకై ఏల దుఃఖించెదరు. భగవంతునిపై విశ్వాసముంచుడు.

౮. ఎంతసేపు నీ మనస్సు ఈ జగత్తువైపుండునో అంతసేపు నీ మనస్సు ఈశ్వరునివైపు పోదు. కాన, ఎక్కువకాలము ఈశ్వరుని వైపు నీ మనస్సుండునటుల ప్రయత్నముచేయుచు ధ్యానించుము.

౯. గొప్పతనమునకు ధనము కారణముకాదు. ధనమువల్ల వచ్చు గొప్పతనము, ధనముతోనే పోవును. గొప్పతనమునకు ప్రవర్తన, సచ్ఛీలము ముఖ్యము.

౧౦. 2500 సంవత్సరములనాటి బుద్ధుని మరియు మహాత్మా గాంధిగారి సిద్ధాంతములను అనుసరించవలెను. కాని, వారికిదండములు పెట్టుటచే లాభములేదు.

౧౧. పవిత్రమైన సౌశీల్యము, మనోవాక్కర్మల సమన్వయము, పరులఎడ సహకార స్వావలంబనము ముఖ్యములు.

౧౨. నిత్యపరిణామశీలమైన ఈ జగత్తులో చరించుసర్వమును ఈశావాస్యముగా, శాశ్వతముగా గ్రహించవలయునని తెలిసికొనుము. అందుచేత త్యాగములోనే ఆనందముగలదు.

౧౩. ఇతరుల సొత్తును ఆపేక్షించకుము. అహంకారమును వీడుము. స్వార్థమును వదలుము.

౧౪. మనము సత్యమును విడనాడనంతవరకు, దేనికి భయపడవలసిన అవసరములేదు.

౧౫. మనము వక్రమార్గ మనుసరించుచో ఎన్నిరక్షణలను ఏర్పాటుచేసికొనినను ప్రమాదములు హెచ్చుచునే యుండును.

౧౬. మన మనస్సులు, చేతలు, నిష్కల్మషమైన వైనచో, అవి తుదకు శత్రువునైన జయించగలవని గాంధిగారు అనుచుండిరి.

౧౭. సంకుచితభావమిడనాడుడు. అధికార వ్యామోహములో పడకుడు.

## ౪౭౫ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు

౧. ఆత్మజ్ఞానము సంయమము లేకుండా ఇతరులను శాసించుట శోచనీయము. ఇతరులను శాసించుటకు పూర్వము తన్నుతాను శాసించుకొన వలెను.

౨. నిద్రనుండి మేల్కాంచగానే స్వప్నమెట్లసత్యమో జ్ఞానోదయము కాగానే ఈ ప్రపంచ సంసార మట్లె సత్యమే.

౩. కామముల విడనాడుము. వాదవివాదముల జోలికి పోకుము. రాత్రిందివములు తృష్ణాక్షయమునకై పాటుపడుము. ఈదేహము నశించకముందే పరమాత్మను తెలిసికొనుము.

౪. ఆరోగ్య మహాభాగ్యములు గలవానికంటె శాంత చిత్తము గలవాడ దృష్టవంతుడు.

## ౪౭౬ శ్రీ మురార్‌జీదేశాయి

౧. ప్రతిమానవునిలో అసురసంపత్తి, దైవసంపత్తి అను రెండింటకి సంగ్రామము జరుగుచుండును. మానవుడు అసురసంపత్తి నశించునట్టి పనులను చేయవలెను.

౨. ఎవరిని చెడ్డవారని అనకుము. తిరస్కరించకుము. అందరిలో భగవంతుడు కలడని మరువకుము.

౩. ఎవడు ఈశ్వరవాదిననుచు, ఈశ్వరునిపై విశ్వాసముంచడో వాడు మహాపాపి, ద్రోహి.

౪. ఎవడు లక్ష్మి (డబ్బు) పూజ చేయుచుండునో వాడు ఈశ్వరపూజ చేయలేడు.

౫. ఒకరిని మరొకరు చెడగొట్టలేరు. ఎవరికర్మ ఎటులుండునో వారికి అటులే ఫలము దొరకును.ఇతరులను దోషులని అనుకొనకుము. నీకు నీవే దోషివనుకొనుము.

౮. మొదలు నీవు నీతిపరుడవుకమ్ము. తదుపరి ఇతరులకు బోధించుము. కాని, వారిపై నీ అధికారము చూపకుము. వారు వినినను వినకపోయినను, నీవు చింతపడకుము.

౭. నీవు నీకర్తవ్యములను నెరవేర్చుకొనినచో నీవు చేయవలసిన దేముండదు. అనవసరముగా పనిలేనిదే మాట్లాడకుము.

౮. కీర్తి, ప్రతిష్ఠలకై, మోహ, మమతలలో చిక్కకుము. వీతరాగుడవుకమ్ము.

౯. ముక్తిని గురించి వెలనివ్వవలసియే యుండును. వెల, అనగా నిన్ను నీవు సమర్పించుకొనుటయే. ఆహుతిఅగుట.

౧౦. వినినవి, చదివినవి, అవి వివేకవిరుద్ధము కానిచో, వాటి నాచరించుటే మానవునియొక్క ధర్మము. లేనిచో పశువుకంటే నీచమే.

## ४३३ శ్రీ కిశోరలాల్ మిస్రా

౧. నిరంతరము నీలోని దోషములను ప్రక్షాళన చేసికొను చుండుము. నిన్నటికంటె ఈ రోజు నీలో ఎంత క్రొత్త మార్పు అభివృద్ధి చెందినదో చూచుకొనుచుండుము. అంతరంగమున ఆత్మ పరిశోధన చేయుచుండుము.

౨. మానవుడు ఏదో ఒక సద్గుణమునకు పూర్ణవికాసము కలుగునటుల పాటుపడవలెను. అట్టి పూర్ణ వికాసము కలిగెనా, మిగిలిన గుణములు తమంతట తామే వచ్చి చేరును.

౩. ఇతరుల దుఃఖముల విన్నంతనే దయార్ద్ర హృదయులై వారి దుఃఖములను తీర్పవలయును.

౪. నీటిలో రౌతుపడినపుడు, ఆ నీటికి అశాంతి కలుగును. కాని, కొంతసేపు నిదానించిన, ఆ జలము ఎప్పటివలె, నిశ్చలముగా నుండును. అటులనే, మనకు వచ్చు సుఖ దుఃఖములను నిదానించి చలనము కలుగకుండా అనుభవించవలెను.

౫. మనలో ఏదైనను సద్గుణముండినచో, పరమాత్మునిది ప్రజలది, అది మనది కాదు, నేను చేయుచున్న మంచి ఆచరణకూడ, నాది కాదు. తల్లి, దండ్రి, గురు, జనులు, మిత్రులు, గ్రంథములు మొదలగునవి, నిన్ను మంచిదారిని పెట్టినవని, నావద్ద గల సద్వస్తువు ఈశ్వరుని నుండి లోకమునుండి సంపాదింపబడినదని దానిని లోక కల్యాణమునకు వినియోగము చేయుటయే సార్ధకమని తలంచి అహంకారము వీడవలెను.

౬. ఉత్తమస్థితిని పొందుటకు సాధన చేసికొనవలెను. ఈ శరీరము నిత్యము కాదు. ఆత్మానాత్మ విచారము చేయుము.

౭. మృత్యువునకై సంతోషించవలెను. ఎందుకన, ఈ శరీరము దుఃఖకరమైనది. దీనినుండి విముక్తి పొందుచున్నానని సంతోషించుచు భగవంతుని ప్రార్థించుచుండుము. జీవితలక్ష్యము అహింసావ్రతమే.

౮. నేను, నాది, అను సంకీర్ణ దృష్టిచేతనే, హింస జరుగుచుండును. అన్ని జీవులను ప్రేమించుము. ఆడంబరమును భోగ విలాసాదులను త్యజించుము. సదా ఈశ్వరుని ధ్యానించుము.

## ४౭౮ శ్రీ నిర్మల్ చంద్ జీ

౧. తమోగుణ నివారణోపాయములు

(1) పాచినవి, అపరిశుభ్రమైనవి, మసాలాద్రవ్యములు, గరిష్ఠమగునవి, చేదు, పులుపు, మొదలగు వస్తువులను తినకూడదు. ఆకలికంటె ఎక్కువ తినవలదు. మధ్యమధ్య తినరాదు. చెడు గాలి, చెడు నీరు, సేవించరాదు. చెడ్డ స్నేహితము చేయరాదు. అధిక నిద్ర పోరాదు. సోమరితనము పనికిరాదు. ఆత్మబలమును చంపి శరీర బలమును వృద్ధి చేయు ఏ పనులను చేయరాదు,

౨. రజోగుణ నివారణోపాయములు

(1) సాత్వికాహారమునే తినవలెను. కాని, రుచులను కోర వలదు. ఎక్కువ తీపి తినవలదు. మసాలా పదార్థము లను త్యజించవలె. వెలగల పానీయములు, అత్తరు, సువాసన గల స్నూనెలు, వన్నె చిన్నెలు గల వెలగల, ఆడంబర మగు వస్త్రములు మొదలగువాటిని త్యజించ వలెను. విషయ సుఖములను త్యజించవలెను. ఖర్చులను తగ్గించు కొనవలెను. సంసారములో బద్ధులగువారి స్నేహము చేయరాదు. దుష్టుల సాంగత్యము చేయ రాదు.

౩. సత్వగుణోపార్జనోపాయములు

(1) చిత్ర విచిత్రములైన షడ్రసోపేతమైన, ఆహారముల ఆలోచనయే విడచిపెట్టవలెను. రుచులకై తాపత్రయ పడరాదు. సాత్వికాహారము, లేక, పండ్లు, కూర గాయలు మొదలగునవి తినవలెను. ఆకలికంటె తచ్చు తినవలెను. ఒకసారి లేక రెండుసార్లె తినవలెను. మధ్య మధ్య తినరాదు.

౪. మితభాషివికమ్ము. ఏకాంతమున ఒక్కడవే ఉండుటకు అభ్యసించుము. సత్సంగము చేయుము. నీలో నీవు విచారము చేయు చుండుము. మహాపురుషుల జీవితములను సద్గ్రంథములను చదువుచు వాటి నాచరించుము. సత్యవ్రతుడవు కమ్ము. సుఖదుఃములను సమ ముగా సహించి అనుభవించుము.

౫. ఆత్మకు విరుద్ధమగు ఏ కార్యములను చేయరాదు. విధి ప్రకారము కర్తవ్యమును నెరవేర్చుటలో సంసార సంబంధమగు కార్య ములు అడ్డువచ్చునేని వాటిని తృణీకరించవలెను. ప్రతి సంకల్పము లోను భగవంతుని చూచుచుండవలెను,

 శ్రీ పండిత్ ఫకీర్‌చంద్‌జీ మహరాజ్

౧. సత్సంగము చేయుము. దీనిచే నీ యొక్క కల్యాణమగును.

౨. ద్రోహము, ద్వేషము, కపటము మొదలగువాటిని విడచి వివేకముగలవాడవై వర్తించుము.

౩. హృదయమును పరిశుభ్రముగ చేసికొని ఏ నామమును జపించినను, అది శక్తివంత మగును.

౪. మొదలు నిన్ను నీవు విశ్వసించుకొని, నిన్ను నీవు తెలిసికొనుము. ఎవడు తన ఆత్మను విశ్వసించడో వాడు పతితుడగును. ఎటుల నీ మనస్సుండునో అటులే అగుదువు.

౫. మన పిల్లలు తప్పుచేసినచో ఆ తప్పు పిల్లలది కాదు. మనదే; ఎందుకన, వారికి బాధ్యులము మనమే కదా! కావున మనము తప్పులు లేకుండా వర్తించుట ముఖ్యము.

౬. ఎవడు బ్రహ్మచర్య వ్రతమును పాలించక తన శక్తి నశింప చేసికొనునో వాడు ఈశ్వర ద్రోహియే.

౭. నీకు నీవు ద్రోహము చేసికొనకుము. మొదలు నీకు నీవు సత్యవ్రతుడవుకమ్ము.

౮. పవిత్రము గలవాడవై, సచ్ఛీలుడవై నీయొక్క జీవ యాత్రను గడుపుము.

౯. గురువు ఏది చేయునో అది చేయకుము. గురువు ఏది చెప్పునో అది చేయుము.

౧౦. సుఖమును కోరకుము. దుఃఖమునకు భయపడకుము.

౧౧. ఎవడు తనను తాను చెడగొట్టుకొనునో వాడు పాపి. తనను తాను తెలిసికొనని వాడు ఇతరులవెంట పరాధీనుడై తిరుగుచుండును,

౧౨. నీవు మానవుడవుకమ్ము. సచ్ఛరిత్రుడవుకమ్ము. ఆత్మ ద్రోహివికాకుము.

౧౩. ఆత్మ విశ్వాసివికమ్ము. ఆత్మ చెప్పినటుల ఆచరించుము.

౧౪. నీ నిజస్వరూపమును చూచి తెలిసికొనుము.

౧౫. ఓ మానవుడా, నీలోనే, సమస్త బ్రహ్మాండములు గలవు. ఇక నీకు భయమెందులకు.

౧౬. గురువును వెతకికొని వారిపై పూర్ణ విశ్వాసము గల వాడవై వారు చెప్పినట్లాచరించుము.

౧౭. విషయ వాసనలను త్యజించుము. నీ యొక్క కోరికలను తగ్గించుకొనుము.

౧౮. మొదలు నీవు పవిత్రుడవై, తదుపరి, ఇతరులను పవిత్రులనుగా చేయుటకు ప్రయత్నించుము.

౧౯. ఈశ్వరుని యొక్క దర్బారులో ఒకరు చిన్న మరొకరు పెద్ద అనునది ఉండదు. అందరు సమానులే. కాని, విశ్వాసము ముఖ్యము.

౨౦. తల్లి దండ్రుల ఋణమును, గురువు ఋణమును, దేవ ఋణము మొదలగు ఋణములన్నియు తీర్పుము. ఋణగ్రస్థుడవు కాకుము.

౨౧. అందరను ప్రేమించి, సేవించుము. సేవ నిష్కామముతో గూడి ఉండవలెను.

౨౨. నేను, నీవు, నాది, నీది అని భావించుటే బంధము. ఈ బంధమును వెంటనే త్రెంచుము.

౨౩. సాత్విక ఆహారమును మితముగా తినుము. ఎంత అరిగించుకొనగలవో అంతయే తినుము.

౨౪. నేను ఎవడను, నా కర్తవ్యమేమనుచు సదా విచారించుచుండుము.

## ౪౮౦ శ్రీ శాహచంగ్ (చైనాదేశముమంత్రి)

౧. ఇతరుల అపరాధ మెంతైనను వారిపై క్రోధపడకుము. ఏదికానున్నదో అది అయ్యేతీరును. కావున ఇతరులను దోషులని తలంచకుము. సంతోషముగా నుండుము. సదా భగవద్ధ్యాన పరుడవై నిశ్చింతగా నుండుము.

## ౪౮౧ శ్రీ బర్‌బరి

౧. నిష్కామముగా ఉపకారము చేయువాడే ఉత్తమ పురుషుడు.

౨. మానవుడు పుణ్యకర్మలు చేయుచు రెండుఘడియలు జీవించినను ఉత్తమమే. కాని, విరుద్ధమగు కర్మలుచేయుచు వెయ్యేండ్లు జీవించుట వ్యర్థమే.

౩. ఎవని సమస్త ఇంద్రియములు వానివశములో నుండునో, ఎవడు సంయమము గలవాడో వాడే విజయుడు.

## ౪౮౨ శ్రీ నెపోలియన్‌బోనపార్టి

౧. ఎవరినొద్దనైనను ఋణము తీసుక మరువకుము. ఎవరితోనైనను సేవచేయించుకొని మరువకుము. సమస్త ఋణములనుండి విముక్తుడవుగమ్ము. లేనిచో మళ్లీ జన్మఎత్తి ఋణము తీర్పవలసి వచ్చును.

౨. ఎన్నిదుఃఖములు, కష్టములొచ్చినను, సహించుము. ధైర్యమును వీడకుము. నిర్భయుడవుకమ్ము.

## ౪౮౩ శ్రీ స్టాలిన్ (రష్యాదేశము)

౧. విశ్వప్రజ లందరును తన ఆత్మీయులుగా చూడవలెను. దీనులఎడ ప్రేమగలిగి ఉండవలెను. కార్యదీక్ష, నిస్వార్థత కలిగియుండవలెను,

## ౪౭౪ శ్రీ చక్రపాణిజీ

౧. సుఖదుఃఖములు వేరువేరులేవు. రెండూఒకటే. మనస్సు ఏది తలంచునో, అదే సుఖదుఃఖము. భేదమంతయు మనస్సులోనే యున్నది.

౨. ఈ శరీరరూపముతోనున్న మోటరు భగవానునిదే. దీనిని మూడు దినములకై నీకు యివ్వబడినది. ఆ పరిమితి పూర్తికాగానే, తిరిగి తీసికోబడును. అనగా, బాల్య, యౌవ్వన, వార్ధక్య అవస్థలు మూడే, తదుపరి మృత్యువే కావున, ఈ మూడు దినములలోపలనే ఈ శరీరముతో, జన్మరాహిత్యమగు పనులు చేసికొనుము. సోమరివై మమతలోబడి, నాశనము కాకుము. జాగ్రత్త. పోయినకాలము తిరిగిరాదు. ఆలసించకుము.

## ౪౭౫ శ్రీ మహావాది వెంకటరత్నము

౧. ఇతరులు చేసిన మేలును మరవకుము. ఇతరుల కపకారము చేయకుము. పరుల ధనమును కోరకుము. ఇతరుల సొమ్మును తినకుము.

౨. వేషమువలన గొప్పతనమురాదు. డంబమువద్దు. మోస పుచ్చకుము. ఆత్మహితము ననుసరించి వర్తించువా డెన్నటికి చెడడు.

౩. సుఖము హెచ్చినకొలది కష్టము లెక్కువగును. కాన, భోగములను వీడుము. ధనమున్నపుడే పరులకిమ్ము. స్వార్థపరుడవు కాకుము.

౪. గుటికెడు గంజికై జానెడు బట్టకై ఇంతగా ఆయాస పడనేల. విషయములందు సుఖమున్నదను తలంపు మానుము.

౫. మంచివస్తువని మితముదప్పి తింటివా ప్రాణహాని. కావున గ్రహించుము. మనము తినుచో ఎవరు చూడరు. మనము తినుటకన్న ఇతరులకు పెట్టినదే పుణ్యము. దీనిని మరువకుము,

౬. ఏవస్తువులను కోరకుము. నీకు ప్రాప్తించినచో ఇతరులకు పెట్టుము. నీ నడవడి మంచిదగుచో ఈశ్వరుడు నిన్ను దగ్గర తీయును.

౭. గడచిన కాలము తిరిగిరాదు. ముందున్న కాలము మనది కాదు. వర్తమాన కాలమే నీది. జాగ్రత్త.

## ౪౮౬ శ్రీరాం కిశోర్ శాస్త్రి

౧. సంసారమునందలి మమతను విడచి, భగవంతునిపై విశ్వాసముంచుటే మానవుని ముఖ్య కర్తవ్యము.

౨. శరీరమును నాదని, అనుకొనకుము. దానివల్ల అహంకారము కలిగి దుఃఖముల పాలగుదువు.

౩. సుఖమనునది, మనస్సుయొక్క కల్పనయే. మనస్సు లేనిచో సంసారమేలేదు. మనస్సెటుల సంకల్పించునో సంసారమటులే భాసించును.

౪. తలిదండ్రుల సేవ ఇపుడే చేయుడు. మృతిపొందిన తరువాత ఎవరికి, సేవచేయుదురు. కాన, ఇపుడే వారిని సంతోషపెట్టుడు.

౫. ప్రతి జీవిలో ఒకశక్తి ఉండి అన్నిపనులు చేయుచుండును. త్రాగునపుడు, తినునపుడు ఎపుడేది చేసినను, నాలో ఎవరున్నారు. నేనెవరిని, చేయువారెవరని, విచారించుచుంటివా, ఆరు మాసములలో మనస్సు శాంతించి మోహ మంతరించును.

౬. ఎచట మమత ఉండునో అచట అపవిత్రము చేరగలదు. అదే బంధము.

౭. గంగలో మునిగి స్నానము చేయుచో, పాపనాశనమగు నని వాడుక కలదు. కాని, గంగలో మునిగినవారు వారిమనస్సులో నుండు చెడు గుణములను విడవక, లోన నుంచుకొందురు. కాన, వారు ముక్తులు కారు. ఎటుల గంగలో మునుగగానే ఆ జలము శరీరమును శుభ్రము చేయునో అటులే గంగలో మునుగువారు

మునుగునపుడు లోనున్న చెడుగుణములను ఆ గంగలోనే వదలి, తల యెత్తినచో, ముక్తులగుదురు.

## ౪౮. శ్రీ పండిత్ రాంచందర్ దెహాల్వి

౧. అకాలమృత్యువులేదు. కర్మానుభవము పూర్తికానిదే మృత్యువురాదు.

౨. కష్టములు మన దోషములను పోగొట్టుటకే వచ్చును. వాటికి భయపడకుడు. తల్లి మన శ్రేయస్సుకొరకే పాటుబడి మనకు పథ్యము పెట్టును. అటులే ఈశ్వరుడు మనమంచికొరకే చేయు చుండును.

౩. ఈశ్వరుడు సర్వత్ర కలడు. మన ధ్వనికి ప్రతిధ్వని వచ్చు చుండును కదా? అంతట లేనిది ప్రతిధ్వని ఎటులవచ్చును.

౪. సంగ్రహము చేయకుము. అపరిగ్రహ వ్రతమాచరించుము. దానము చేయుము. లోభమును త్యజించుము.

౫. సంకుచిత భావము. ఈర్ష్య, ఈ రెండింటిని సమూలముగా త్యజించుము.

౬. నీవేది చెప్పదలంచు కొనెదవో దానిని మొదలు నీ వాచ రించుము. అపుడే నీ వాక్కు సత్యమగును. అపుడే నీ ప్రభావము ఇతరులపై పడును.

౭. నీ మనస్సుయొక్క ప్రభావము వాయుమండలములో పోయి ఇతరుల హృదయములో ప్రవేశించును. కావున, ఎల్లప్పుడు నీ మనస్సును పవిత్రముగా నుంచుకొనుము. నీ మనస్సులో మైల లేకుండుచో ఆత్మశుద్ధి అగును. ఆత్మశుద్ధివల్ల ప్రజాసేవ చేయ కలుగుదువు. ఆత్మశుద్ధిచే నీ భావము ప్రజల హృదయములో చేరి వారిని శుద్ధి చేయును,

# ఆలా శ్రీ పండిత్ గోపదేవశాస్త్రి

౧. పితృ ఋణము, ఋషిఋణము. దేవ ఋణము. ఈ మూడు ఋణములను తీర్చుకొనువాడే, ముక్తుడు.

౧. పితృఋణమనగా, తల్లిదండ్రుల సేవించుట. మంచి గుణవంతుల పుత్రులనుగని లోకోపకారులగునటుల చేయుట.

౨. ఋషి ఋణమనగా, ఋషులవల్ల వినినదానిని ఆచరించి ఇతరులకు బోధించుట.

౩. దేవ ఋణమనగా, ఆకాశము, గాలి, అగ్ని, జలము, భూమి వీటిచే మానవులు పోషింపబడుచున్నారు. మంచి వస్తువులను మంచి గాలి మొదలగు వాటిని, సేవించి, వాటిని మలినపరచి లోకమునకు కీడు చేయుచున్నారు. కావున, యజ్ఞములద్వారా, దాన, తపః, పుణ్యకార్యములద్వారా ఈ పాపముల ఋణమును తీర్చుకొనవలయును.

౧. యజ్ఞసమయమున అగ్నిలో నెయ్యి మొదలగు సువాసన ద్రవ్యములు వేసినచో అగ్ని ఉంచుకొనదు. సూక్ష్మరూపముగా గాలి ద్వారా అనేకుల కుపకారముచేయును.

1. బాహ్యదృష్టిగలవారు కొందరు పామరులు తినుట, తినుపించుటే ముఖ్యమని తలంతురు. సూక్ష్మదృష్టితో విచారించినచో ప్రతి ఇంద్రియము, తిని సంతోషించుచుండును. ఎటులన యజ్ఞముల వలన వచ్చు సువాసనను అనేకులు ఆఘ్రాణించి, సుఖమును ఆరోగ్యమును పొందుదురు. ఎటుల జిహ్వ తిని తృప్తిపడునో, అటులే ఆఘ్రాణించి, నాశికేంద్రియము, చూచి, నేత్రేంద్రియము, స్పర్శచే త్వక్కు, వినుటచే శ్రవణేంద్రియము, మొదలగునవి తృప్తి పడును. వస్తువులను తినినచో ఒకడే తినును. వానిని యజ్ఞములో వినియోగించిన అనేకులు తృప్తిపడుదురు. అందరకు నుపకారమగును. ఎటులనగా, అగ్నిలో మిరపకాయలు వేసినచో ఆ అగ్ని

ఉంచుకొనక గాలిద్వారా ఘాటును అందరికి అందజేయునుకదా. ఇది మీ అందరకు అనుభవమే. అదేప్రకారము సువాసన ద్రవ్యములు అగ్నిలో వ్రేల్చినచో, ఆ సువాసన అందరికిచెంది, ఆరోగ్యము కలుగును. లోకోపకారమగును. దీనిచే దేవఋణము తీర్చుకొనిన వారగుదురు. మనము మలమూత్రాదుల మొదలగువాటిచే వాతావరణమునకు హాని కలుగచేయుచున్నాము. యజ్ఞములచే వెడలు సువాసన గాలిద్వారా వేగముగా బయలుదేరి ఆకాశ మార్గమునకు పోవును. దానితో, మనచే మలినము చేయబడినగాలి శుభ్రమగును. అందరకు లాభము చేకూరును.

౨. గీత చెప్పునదేమనగా, అపరిగ్రహణము. కాన, వృథా చదువుట వ్యర్థము. చెప్పినట్లాచరించుటే ముఖ్యము.

౩. ఇచ్చువారిని దేవతలందురు. పుచ్చుకొనువారిని రాక్షసు లందురు.

౪. తినుటకే జీవించకుడు. జీవించుటకే తినుడు. మన మెందులకు పుట్టితిమో ఆలోచించుకొంటిరా, తినుటెందులకో తెలియును.

౫. పేరును చెడగొట్టుకోరాదు. దొంగకూడా తనపేరు చెడునను భయముచే, ఎవరుచూడకుండా దొంగతనము చేయుటకు ప్రయత్నించునుకదా? కాన, పేరును కాపాడుకొన దలంచువారు చెడుపనులు చేయరాదు. చేయునది చెడు, కోరునది మంచి. ఇదెటుల పొసగును.

౬. ఒకసత్యవ్రతమును ఆచరించితివా, మరేవ్రతము లాచరించ నక్కరలేదు. నీవు అసత్యమును ఆచరించితివా పంచభూతములు చూచుచుండును. పగలు సూర్యుడు రాత్రి చంద్రుడు సదా వాయువు నీలోనుండి చూచుచుండును. అంతయు భగవంతునకు తెలియును.

౭. అహింసాపరుడు మొదలు తనలోనున్న హింసను చంపుకొనినచో బహిశ్శత్రువులుండరు.

౮. ప్రకృతిని(జడతత్వమును)తెలిసికొనవలెను. జీవతత్వమును, (నేనెవడనని)తెలిసికొనవలెను. భగవతత్త్వము.(భగవంతుని స్వరూపము తెలిసికొనవలెను.) ఈ మూడింటిని తెలిసికొంటివా ముక్తుడవే.

౯. ఇంద్రియములను జయించి బ్రహ్మనిష్ఠుడగువాడే గురువనబడును. నిద్రను తమోగుణమును జయించినవాడే శిష్యుడనబడును. తమోగుణమువల్ల నిద్రవచ్చును. తమోగుణము నశించి సత్వగుణము వృద్ధికాగానే జ్ఞానోత్పత్తి ప్రారంభమగును. అపుడు గురువు స్వతః ప్రాప్తించును.

## ౪౮. శ్రీ కపీంద్రజీ

౧. ఎవరైనను, దేవమందిరమును, అశుభ్రపరచి నష్టపరచినచో ప్రజలువానిని పాపాత్ముడందురు. అచటినుండి వానిని వెడలగొట్టుదురు. అటులే ఈ శరీరమను మందిరములో ఆత్మరూపుడైన ఈశ్వరుడున్నాడుకదా? ఈ మందిరములో అశుభ్రమను చెడ్డసంకల్పములు, కామ, క్రోధ, ఈర్ష్య, లోభ, మోహములు మొదలగునవి ఉంచుకొనుటే మందిరమును నష్టపరచుటగును. మరియు ఈ శరీరము నాది అనుటే ద్రోహము. దీనివలన ఇహ పరలోకముల రెండింటిలో దోషిగా ఎన్నబడి నరకములో దుఃఖము లనుభవించవలసివచ్చును.

౨. కీర్తి, ప్రతిష్ఠలు, సూకరవిష్ఠతో సమానములు.

౩. వాణిని నీవశములో నుంచుకొనుము. అవసరములేనిదే మాట్లాడకుము. మౌనమే శ్రేష్ఠము.

౪. మానవుడు, మనస్సులో దేనిని విచారించునో, ఆ విచారములు వాయుమండలములో ప్రవేసించి విస్తారమై శక్తివంతమై ఇతరుల మనస్సులలో ప్రవేసించును. కాన, ఎల్లపుడు పవిత్రమగు ఇతరు

లకు హితమగు విచారములనే చేయుచు, సదాభగవంతుని స్మరించు చుండుము.

౫. జిహ్వను నీ స్వాధీనములో నుంచుకొనుము. లేనిచో, నిన్ను నరకకూపములో పడవేయును. రుచికై తినకుము. సాత్వికాహార మునే మితముగా జీవించుటకే తినుము. ఈ సంసారములో ఎందరో తినుచూ తినుచూ, మరణించుటలేదా! అదినీకు తప్పునా,విచారించవేలా!

౬. అభిమానమెంత వరకుండునో, అంతవరకు ముక్తిదొరకదు. ఇతరులను నీకంటెతచ్చుగా, నీచులనుగా, పాపులనుగా, తలంచుటే అన్ని టికంటె గొప్పపాపము.

౭. బాహ్య వేషాడంబరములు ఇతరులను మోసపుచ్చును. కావున, నిరాడంబర జీవితమును గడుపుము.

౮. ఎపుడు బాహ్యదృష్టి నశించునో, అపుడే అంతర్ దృష్టి వికసించును. కాన, సమస్త బాహ్యవస్తువులందలి మమతను వీడుము.

౯. నాకు అంతతెలియునని గర్వించువాడు, మూర్ఖుడు. తన కంటిరెప్పరోజు, క్షణే క్షణే, మూయుచు తెరియుచుండును కదా, తనకంటిరెప్పరోజు ఎన్నిసార్లు మూసి తెరియుచుండునో చెప్పగలడా! చెప్పలేడు. తానెవరో తనకే తెలియనపుడు, నాకు అంతా తెలియు ననుట, అహంకారమే.

౧౦. ముఖమునకు, హృదయమునకు, కేవలము జానెడు అంతరముకలదు. కాని,హృదయ సంకల్పములకు భిన్నముగా, వాక్కు వర్తించును. అనగా, సంకల్పమొకటి, వాక్కుతో చెప్పునదొకటి. నీకు యింత సమీపములోనున్న నీ వాణినే నీవు తెలిసికొనలేక పోవుచో ఇత రులసంగతి, నాకు తెలియుననుట, చాలదోషము. మొదలు ఈ రహస్య మును విచారించి తెలిసికొనుము.

౧౧. నీవు స్వతంత్రుడవు. దేనికైనను పరాధీనుడవు కాకుము. ఒకచిన్న గరికపోచ కావలయునని, కోరికయున్నను దానికి దాసు

